# లెనిన్
## అంతిమ పోరాటం

ఫ్రెంచి మూలం

**మోషే లెవిన్**

ఆంగ్లానువాదం

**ఎ.యం. షెరిడాన్ స్మిత్**

తెలుగు అనువాదం

**రావెల సాంబశివరావు**



# లెనిన్ అంతిమపోరాటం

సమీక్ష ప్రచురణలు

ప్రచురణ సంఖ్య : 6

జులై : 2014

ప్రతులు : 1000

కవర్ డిజైన్ : ఎ. గిరిధర్

ప్రతులకు :
**సమీక్ష ప్రచురణలు**
మొదటి అంతస్తు
కృష్ణాజిల్లా స్వాతంత్ర్య సమర యోధుల సంఘం భవనం
బందరు లాకులు వద్ద
విజయవాడ – 520 002
ఫోన్ : 0866 – 2578454

ముద్రణ :
**శ్రీశ్రీ ప్రింటర్స్**
విజయవాడ – 2
సెల్ : 9490634849

₹ 125

ఉద్యమం ఇంకా పరిపక్వ దశకు చేరకముందే, తాను ఏ వర్గానికి ప్రాతినిధ్యం వహిస్తున్నాడో. ఆ వర్గాధిపత్యానికి సానుకూలత సమకూరక ముందే ప్రభుత్వాన్ని నెలకొల్పి ఆ ఆధిపత్యానికి అనుగుణంగా చర్యలు తీసుకొనవలసి రావటాన్ని మించిన సంకటస్థితి ఒక అతివాద పక్ష నాయకుని విషయంలో వేరొకటి వుండబోదు. . . ఆ విధంగా అతడు విధిగా ఒక పరిష్కారం కుదరని ఊగిసలాటలో పడిపోతాడు. అతడు చేయగలిగింది గత చర్యలకు, సిద్ధాంతాలకు, తన పార్టీ తక్షణ ప్రయోజనాలకు విరుద్ధంగా వుంటుంది. అతడు విధిగా చేయవలసింది చేయజాలడు. . . ఇటువంటి ఇబ్బందికర స్థితిలోకి నెట్టబడిన వానికి పతనం తప్పనిసరి.

**– యఫ్.ఎంగెల్స్**

*"ది పెజెంట్ వార్ ఇన్ జర్మనీ".*

తప్పిదాలు లేకుండా, వెనక్కి తగ్గటాలు లేకుండా, అసంపూర్ణంగా, తప్పుగా నెరవేర్చబడిన వాటిలో అనేకానేక మార్పులు చేసుకోకుండా, సోషలిస్టు ఆర్థిక పునాదుల్ని పూర్తిగా నిర్మించే ఒక శకారంభాన్ని (అదీ ఒక చిన్న కమతాల దేశంలో) పరిపూర్ణం గావించవచ్చని ఊహించే కమ్యూనిస్టులకు పతనం తప్పదు. ఏ కమ్యూనిస్టులయితే భ్రమలకు దూరంగా వుండగలరో, నిరాశకు తావివ్వరో, వాళ్ల శక్తిని, సర్దుబాటు తత్వాన్ని పదిలపరచుకుంటూ, అతి కష్టమైన కార్యనిర్వహణను మాటిమాటికి "ఆరంభం నుండి ప్రారంభించగలరో" వాళ్లు పతనం చెందటం జరగదు. (కనుమరుగవ్వటం అనేది అసలు జరగకపోవచ్చు).

**– వి.ఐ.లెనిన్**

*"నోట్స్ ఆఫ్ ఎ పబ్లిసిస్ట్"*

# విషయ సూచిక

# మా మాట

**అమూర్తతను వాస్తవీకరించడమంటే, వాస్తవికతను ధ్వంసం చేయడమే – హెగెల్ ("లెక్చర్స్ ఆన్ ఫిలాసఫీ ఆఫ్ హిస్టరీ" నుండి).**

**పరిస్థితులలోను, మానవ కార్యాచరణలో ఒకేసారిగా మార్పులు రావడాన్ని కేవలం విప్లవాత్మక కార్యాచరణగా భావించాలి, హేతుబద్ధంగా అవగాహన చేసుకోవడానికి అదే మార్గం – మార్క్స్ ("ఫ్యూయర్‌బాఖ్‌పై మూడవ సూత్రీకరణ" నుండి).**

**రాజకీయ ప్రజాస్వామ్యం కాక వేరే ఏ మార్గంలోనైనా సోషలిజాన్ని చేరుకోవాలని కోరుకునేవారు అనివార్యంగా అర్థ రహితమైన, ప్రగతి నిరోధకమైన ఆర్థిక, రాజకీయ నిర్ధారణలకు రాక తప్పదు – లెనిన్ ("ప్రజాతంత్ర విప్లవంలో సోషల్ డెమోక్రసీ యొక్క రెండు ఎత్తుగడలు" నుండి)**

**ఎప్పుడైనా స్వేచ్ఛ అంటే, దాని సమగ్రార్థంలో, భిన్నంగా ఆలోచించేవారికి స్వేచ్ఛ ఉండడమే. సన్మార్గంలో నడిపించేదీ, ఆరోగ్యకరమైన పరిస్థితులను కల్పించేదీ, పరిశుద్ధ పరిచేదీ ఏదైతే రాజకీయ స్వేచ్ఛలో ఉన్నదో అది ఈ ముఖ్య లక్షణం మీదనే ఆధారపడివుంది. ఇదేదో 'న్యాయం' పట్ల మూఢ భావనతో చెబుతున్నది కాదు. ఎప్పుడైతే స్వేచ్ఛ కొంతమందికి మాత్రమే చెందిన ప్రత్యేక హక్కు అవుతుందో, అప్పుడు దాని సామర్థ్యం, సార్థకత నశించి పోతాయి – రోజా లగ్జంబర్గ్ ("రష్యన్ విప్లవం" నుండి)**

**వర్గాలపై పెట్టుబడిదారీ విధానపు నియంత్రణా పద్ధతులు ఇప్పటికీ శక్తివంతంగానే ఉన్నాయి. ఈ విధానం ఆత్మరక్షణ స్థితికి ఎంతో దూరంగా ఉంది. విప్లవకర జీవశక్తిని సృష్టించడానికొస్తే, చైతన్యాన్ని నిర్మించేందుకు దీర్ఘమైన, సహనంతో కూడిన కృషి అవసరం – జాపాల్ సార్త్ర్ (సోషలిస్ట్ రిజిస్టర్ పత్రికలో 1970లో ప్రచురించబడిన "మాసెస్, స్పాంటెనయిటీ, పార్టీ" అనే వ్యాసం నుండి)**

**ప్రస్తావన :**

ఇది సమీక్ష ప్రచురణల ఆరవ ప్రచురణ. తొలి అయిదు ప్రచురణలు వరుసగా **ఆంటోనియో గ్రాంసీ : జీవితం – కృషి** (రచన : సుశీ తారు), **నూటయాభై సంవత్సరాల కమ్యూనిస్టు ప్రణాళిక** (వ్యాస సంకలనం), **రష్యన్ విప్లవం** (రచన : రోజా లగ్జంబర్గ్),

**నాగరికత – దాని అపశృతులు** (రచన : సిగ్మండ్ ఫ్రాయిడ్), **వినవోయీ! అల్పజీవి!** (రచన : విల్‌హెల్మ్ రైక్). వీటిలో మొదటి మూడు రచనలు మార్క్సిస్టు ఆలోచనా ధోరణికి చెందినవి. తదుపరి రెండు రచనలు ఫ్రాయిడియన్ ఆలోచనా కోవకు చెందినవి. వ్యక్తి – సమాజం మధ్య ఉండే ఐక్యత, ఘర్షణల గతి తర్కాన్ని లోతుగా అవగాహన చేసుకోవడానికి ఈ రెండు ఆలోచనా ధోరణులతోను పరిచయం అవసరమని ఈ ప్రచురణలు తీసుకువచ్చాము. ప్రైవేటు ఆస్తి హక్కుని తప్ప మిగతా వ్యక్తి స్వేచ్ఛలని సామూహిక జీవనానికి భంగకరమైనవిగా మార్క్సిజం పరిగణించ లేదు. అణచివేతకు, దోపిడీకి ఆస్కారమిచ్చే ప్రైవేటు ఆస్తిని రద్దు చేసి, మిగతా స్వేచ్ఛలను విస్తృత జనావళికి అనుభవైకవేద్యం చేయడం ద్వారా సోషలిజం నిజమైన స్వేచ్ఛ సాధిస్తుందనేది మార్క్సిజం అవగాహన. పెట్టుబడిదారీ విధానం ప్రజామోదం పొందడం కోసం, అది సమర్ధవంతంగా పనిచేయడం కోసం ఉదారవాద ప్రజాస్వామ్యం అమలు చేసిన పౌర స్వేచ్ఛలకు వ్యష్టిని, సమష్టిని అనుసంధానపరచే స్వభావం కూడా ఉంది. ఇదే ఆ వ్యవస్థకు సామాజిక ఆమోదాన్ని సంపాదించి పెడుతున్నది. ఈ ఆమోదంలో కార్మిక వర్గంలో అనేకమందిని కూడా కలుపుకోగలిగింది. అయితే ఈ అంశాన్ని సమగ్రంగా అర్ధం చేసుకోవడంలో ప్రధాన స్రవంతి మార్క్సిస్టు సాంప్రదాయంలో నెలకొన్న సైద్ధాంతిక గందరగోళం సోషలిస్టు వ్యవస్థల పతనానికి దోహదం చేసిన అంశాలలో ఒకటి. మరోవైపు ఫ్రాయిడియన్ ధోరణి వ్యక్తి మానసిక నిర్మాణంలో సమాజపు ఆధిపత్యం నిషిద్ధ అంశాలను అంతశ్చేతనంలోకి నెట్టివేసే క్రమాన్ని తేటతెల్లం చేస్తుంది. తద్వారా సామాన్య ప్రజలు అణచివేతను, దోపిడీని, రాజ్య నిరంకుశత్వాన్ని వాటి అసలు రూపంలో చూడలేనితనానికి ఎలా గురవుతున్నారో చూపిస్తుంది. ఇది శ్రామికవర్గ స్వభావాన్ని కూడా ప్రభావితం చేస్తుంది. పాలకవర్గాల భావజాల ఆధిపత్యానికి అంతశ్చేతనం కూడా దోహదం చేస్తుంది. దీనిని అర్ధం చేసుకోవడం శ్రామిక వర్గాలు నూతన సమాజానికి చోదక శక్తులు కావడానికి అడ్డుపడే అంశాల పరిష్కారానికి తోడ్పడవచ్చు. అయితే, అదే ఫ్రాయిడియన్ ధోరణి మనిషి వైయక్తిక మానసిక నిర్మితిలో నిబిడీకృతంగా ఉండే దౌర్జన్యత ప్రైవేటు ఆస్తిని రద్దు చేయడం ద్వారా పరిష్కారం కాదని పేర్కొంటుంది. ఈ దౌర్జన్యత సంపద ద్వారా సాధ్యం కానప్పుడు అధికారాన్ని ఆసరాగా చేసుకుని వ్యక్తీకరించబడుతుందని, కావున అణచివేత కొనసాగుతుందని పేర్కొంటుంది. మానవ స్వభావానికి సోషలిజం విరుద్ధమైనదని చేసే వాదనలకు ఈ ధోరణి బలం చేకూరుస్తుంది. ఈ ప్రశ్నను ఎదుర్కొని సమాధానం చెప్పడం సోషలిజం భవిష్యత్తుకు అవసరం. ఇలా మార్క్సిస్టు, ఫ్రాయిడియన్ ధోరణులలో ఉన్న సమస్యల అవగాహనకు మొదటి అయిదు ప్రచురణలు ఉద్దేశించబడ్డాయి.

ఇపుడు ఆరవ ప్రచురణగా మోషె లెవిన్ (1921–2010) రాసిన **లెనిన్ అంతిమ పోరాటం** (Lenin's Last Struggle) అనే పుస్తకం పాఠకుల

ముందుంచుతున్నాం. లెవిన్ ఫ్రెంచిలో రాసిన ఈ గ్రంథాన్ని ఎ.యం. షెరిడాన్ స్మిత్ ఆంగ్లంలోకి అనువదించారు. మొదటి ప్రచురణ 1968లో రాండమ్ హౌస్ ప్రచురణ సంస్థ తీసుకువచ్చింది. మోషె లెవిన్ అత్యుత్తమ సోవియట్ యూనియన్‌చరిత్రకారులలో ఒకరిగా ప్రసిద్ధి గాంచాడు. సోవియట్ యూనియన్ చరిత్రపై విశేష కృషి చేసిన లెవిన్ ఏడు పుస్తకాలు రాశాడు : రష్యన్ పెజంట్స్ అండ్ సోవియట్ పవర్ (1968), లెనిన్స్ లాస్ట్ స్ట్రగుల్ (1968), పొలిటికల్ అండర్‌కరెంట్స్ ఇన్ సోవియట్ ఎకనమిక్ డిబేట్స్ : ఫ్రం బుఖారిన్ టు మోడర్న్ రిఫార్మర్స్ (1974), ది మేకింగ్ ఆఫ్ ది సోవియట్ సిస్టమ్ (వ్యాసాల సంకలనం – 1985), ది గోర్బచెవ్ ఫినామినన్ : ఎ హిస్టారికల్ ఇంటర్‌ప్రెటేషన్ (1985), రష్యా – యుఎస్ఎస్ఆర్ – రష్యా: ది డ్రైవ్ అండ్ డ్రిఫ్ట్ ఆఫ్ ఎ సూపర్ స్టేట్ (1995), ది సోవియట్ సెంచరీ (2005).

**'లెనిన్ అంతిమ పోరాటం' గురించి :**

ఇప్పుడు మీముందున్న **లెనిన్ అంతిమ పోరాటం** అనే రచన ప్రకారం, డిసెంబర్ 1921లో తీవ్రమైన అనారోగ్యం కారణంగా లెనిన్ క్రమేపి కార్యరంగం నుండి తప్పుకోవడం ప్రారంభమైంది. నాటినుండి, మార్చి 10, 1923న తిరగబెట్టిన తీవ్రమైన పక్షవాతం వల్ల పూర్తిగా కార్యరంగం నుండి తప్పుకునేంత వరకు లెనిన్ రూపొందించిన ప్రణాళికలు, వాటి అమలుకై చేసిన కృషిని సానుకూల విమర్శనాత్మక దృష్టితో లెవిన్ ఈ రచనలో పరిశీలించాడు. తన అంత్యదశలో లెనిన్ చేసిన అంతర్, బహిర్ యుద్ధారావాన్ని ఈ పుస్తకం ఆవిష్కరిస్తుంది. ఈ రచనకు మూలాధారాలు అయిదు : మొదటిది లెనిన్ సమగ్ర రచనల అయిదవ ముద్రణ; రెండవది లెనిన్ కార్యదర్శుల్లో ఒకరైన ఫతియెవా జ్ఞాపకాలతో కూడిన రచన; మూడవది 1922 నవంబరు 21 నుండి 1923 మార్చి 6 వరకు లెనిన్ కార్యకలాపాల లేఖనాలతో కూడిన లెనిన్ కార్యదర్శుల జర్నల్; నాల్గవది లెనిన్ "వీలునామా"గా పరిగణింపబడిన 1922 డిసెంబర్ 23 నుండి 1923 జనవరి 4 మధ్య రూపొందించబడిన 'పార్టీ మహాసభకు లేఖ'; అయిదవది లెనిన్ చివరిలో రాసిన "సహకారం మీద", "కార్మిక – కర్షక తనిఖీని ఎలా పునర్నిర్మించాలి", "తక్కువే మేలు, కాని మేలుగా ఉండాలి" అనే వ్యాసాలు.

లెవిన్ ఈ రచనను సానుకూల విమర్శనాత్మక దృష్టితో చేశాడు. తన జీవితపు చివరి సంవత్సరాలలో లెనిన్ చేసిన కృషిలో సోవియట్ రాజ్యపు నియంతృత్వ స్వభావాన్ని నియంత్రించి, ప్రజాభీష్టానికనుగుణంగా సోషలిస్టు అధునికీకరణ సాధించే దిశగా సంస్కరించడం కీలకాంశమని లెవిన్ అభిప్రాయం. కార్మిక వర్గంపై పార్టీ నియంతృత్వం ఏర్పడడం, స్టాలిన్ కాలంలో రాజకీయాధికార కేంద్రీకరణ ఉచ్ఛస్థాయికి చేరడంలాంటి పరిణామాలకు విప్లవానికి ముందు లెనిన్ ప్రతిపాదించిన భావాలు కారణం కాదని

లెవిన్ అభిప్రాయపడ్డాడు. తదనంతర చరిత్రలో, విప్లవం తరువాత ఘటనల్లో, అవి సిద్ధాంతాన్ని మలిచిన తీరులో వీటి మూలాలను కనుగొనవలసి ఉందని పేర్కొన్నాడు.

అంతర్యుద్ధం, క్రాన్‌స్టట్ తిరుగుబాటు ముగిసిన పిమ్మట 1922లో నూతన ఆర్థిక విధానం ప్రవేశపెట్టబడింది. ఆ దశలో లెనిన్ ఎదుర్కొన్న ప్రధానమైన మూడు ప్రశ్నలను లెవిన్ ఈ క్రింది విధంగా పేర్కొన్నాడు :

1. రాజ్య నిర్దేశిత ఆర్థిక వ్యవస్థకి, ప్రైవేటు ఆస్తి కలిగి ఉండే చిన్న, సన్నకారు ఉత్పత్తిదారులు (రైతులు, చేతివృత్తుల వారు), వ్యాపారస్తులకు మధ్య ఎలాంటి సంబంధం ఉండాలి? అంటే, మార్కెట్, ప్రణాళికల మధ్య ఊగిసలాట.

2. శ్రామికవర్గ నియంతృత్వం బ్యూరోక్రసీకి దారితీయడం. సాధనంగా ఉండవలసిన రాజ్యం లక్ష్యంగా పరిణమించడం. శిష్టవర్గం ఏర్పడడం. దాని అధికారాలను, ప్రత్యేక సౌకర్యాలను నియంత్రించకపోతే, అది వ్యవస్థ ఉనికికే భంగం కలిగించడం.

3. శిష్ట వర్గం అధికారం, ప్రత్యేక సౌకర్యాల ఆకర్షణకు లోనై అవినీతికి పాల్పడకుండా కాపాడేదెలా? శిష్టవర్గాల నైతిక స్థాయికి, రాజకీయ చైతన్యానికి, కొన్ని వ్యవస్థాగత పూచీకత్తులు జోడిస్తే ఈ పతనాన్ని ఆపగలమా?

కొన్ని నిర్దుష్ట పరిణామాల క్రమంలో ఈ ప్రశ్నలు లెనిన్‌కి ఎదురయ్యాయి. ఆ పరిణామాలు : (i) విదేశీ వాణిజ్యంపై ప్రభుత్వ గుత్తాధిపత్యం సమస్య, (ii) సోవియట్ సోషలిస్టు రిపబ్లిక్‌ల యూనియన్ (యుఎస్ఎస్ఆర్) ఏర్పాటు, యూనియన్ పథకాన్ని జార్జియా వ్యతిరేకించడం, తదనంతర పరిణామాలు, (iii) నూతన ఆర్థిక విధానంతో ముడిపడిన సమస్యలు, (iv) రష్యా వెనుకబాటుతనం సోషలిజం నిర్మాణంలో సృష్టించిన అవరోధాలు, వాటి పరిష్కారాలు, (v) పార్టీలో, రాజ్యంలో పెరుగుతున్న ఉద్యోగస్వామ్యం, దానికి లెనిన్ ప్రతిపాదించిన పరిష్కారాలు. ఈ అంశాలను లెవిన్ వివరంగా చర్చించాడు. తన నిర్ధారణలను పాఠకుల ముందుంచాడు.

లెవిన్ నిర్ధారణలలో ప్రధానమైనవి : యు.ఎస్.ఎస్.ఆర్. రూపకల్పనలో లెనిన్ చివరి వరకు ఉండి ఉంటే రిపబ్లిక్‌లకు మరింత స్వతంత్ర ప్రతిపత్తి లభించేది; నూతన ఆర్థిక విధానం దీర్ఘకాలం పాటు కొనసాగించాలనేది లెనిన్ అభిప్రాయం; మరికొన్ని దేశాలు సోషలిజం దిశగా వచ్చేవరకూ సోవియట్ యూనియన్‌ని కాపాడుకుంటూ, ఒకేసారి సోషలిజాన్ని కాక, ఒక పరివర్తనలో ఉన్న సమాజాన్ని నిర్మించడం లెనిన్ విధానం; స్టాలిన్ పరిపాలనా కాలాన్ని కార్మికవర్గ ప్రజాస్వామ్యం స్థానే, ఉద్యోగస్వామ్యాన్ని నెలకొల్పడంగా నిర్వచించవచ్చు; స్టాలిన్ లెనిన్ స్ఫూర్తిని కొనసాగించలేదు; స్టాలిన్ అనుసరించిన పద్ధతులు సోషలిజం సాధారణ భావనకు, ప్రపంచ సోషలిస్టు ఉద్యమ అభివృద్ధికి ఎంతో నష్టదాయకంగా పరిణమించాయి.

పోలిష్ మేధావి స్లావోజ్ జిజెక్ **న్యూ లెఫ్ట్ రివ్యూ** (మే – జూన్ 2009) పత్రికలో రాసిన వ్యాసంలో లెనిన్ అంతిమ పోరాటాన్ని ఇలా అభివర్ణించాడు :

"స్టాలిన్‌కి వ్యతిరేకంగా లెనిన్ చేసిన అంతిమ పోరాటం ఒక సిసలైన విషాద గాధకి చెందిన లక్షణాలన్నింటినీ సంతరించుకుంది : అది చెడ్డవాడితో పోరాడే మంచివాడిని చూపించే మెలో డ్రామా కాదు. అది ఒక ధీరోదాత్తుడికి తాను తన వారసులతోటే పోరాడవలసి వచ్చిందనీ, కాని తన గత నిర్ణయాల అనివార్య పర్యవసానాలకు అడ్డుకట్ట వేయడానికి అప్పటికే కాలాతీతమైందనే ఎరుక కలిగించిన విషాద గాధ."

తాను చర్చించిన అంశాలలో ముఖ్యంగా యుఎస్ఎస్ఆర్ ఏర్పాటు, జార్జియన్ సమస్య తదితర విషయాల గురించి లెవిన్ కొన్ని డాక్యుమెంట్లను అనుబంధాలుగా ఇచ్చాడు. లెనిన్ తన చివరి రచనలలో అత్యంత కీలకమయిందిగా పరిగణించిన "తక్కువే మేలు, కాని మేలుగా ఉండాలి" అనే వ్యాసాన్ని కూడా అనుబంధంగా ఇచ్చాడు. లెనిన్ "వీలునామా"ని లెవిన్ ఆరవ అధ్యాయంలో ప్రత్యేకంగా చర్చించాడు. కాని అనుబంధంగా చేర్చలేదు. అందువల్ల, ఈ "వీలునామా" గా పరిగణింపబడే పార్టీ మహాసభకి రాసిన లేఖలలో మూడింటిని అనుబంధం - X గా మేము జత చేశాము.

సోషలిజం భవిష్యత్తుకి రష్యన్ విప్లవం తీరుతెన్నులను, దాని వైఫల్యానికి గల కారణాలను లోతుగా అర్థం చేసుకోవడం అవసరం. ఇందుకు అవసరమైన పుస్తకాలు తెలుగులో (మూల రచన గాని, అనువాదం కాని) చెప్పుకోదగినంతగా రాలేదు. ఈ అవసరాన్ని కొంతమేరకు తీర్చే ఉద్దేశ్యంతో ఈ పుస్తకాన్ని ప్రచురిస్తున్నాము. సోవియట్ యూనియన్ చరిత్రను, లెనిన్ పాత్రను లోతుగా అర్థం చేసుకునేందుకు ఈ రచన చేసిన విశిష్టమైన అనుదానం (contribution) గురించి ఆచార్య శోభన్‌లాల్ దత్తా గుప్తా రాసిన "పరిచయం" ఒక హృద్యమైన చిత్రణను మనముందుంచుతుంది. నేటి భారతదేశంలో లెనిన్‌ని నూతన కోణంలో అధ్యయనం చేయాల్సిన అవసరం ఉందని పరిచయ కర్త పేర్కొన్నారు. అందుకు ఈ రచన దోహదం చేస్తుందని ఆయన అభిప్రాయం.

ఈ రచన 1968 నాటిదైనప్పటికీ, చరిత్ర క్రమానుగతిని అర్థం చేసుకోవడానికి ఉపయోగపడుతుందని మేము భావిస్తున్నాము. సోవియట్ అధికారిక చరిత్రలో వున్న సమస్యల్ని గుర్తించడానికి కూడా పనికొస్తుందని మేము అనుకున్నాము. అయితే, అప్పటి చరిత్ర సందర్భానికి ఈ పుస్తకం పరిమితం. అయితే, ఇప్పుడు మనం సోవియట్ యూనియన్ లేని ప్రపంచంలో ఉన్నాము. సోవియట్ యూనియన్ పతనానికి అనేక వ్యాఖ్యానాలు వెలువడ్డాయి.

సోషలిస్టు లక్ష్యానికి, అత్యంత ప్రాథమిక స్థాయిలో, వెనుకబాటు స్థితిలో ఉన్న ఆ దేశపు పెట్టుబడిదారీ దశకు మధ్యనున్న వైరుధ్యమే రష్యన్ విప్లవం ఎదుర్కొన్న అతి పెద్ద వైరుధ్యం. ప్రధానమైన ఈ వైరుధ్య పరిష్కార క్రమంలో సోవియట్ యూనియన్ అనుసరించిన కేంద్రీకృత, నిరంకుశ ఆర్థిక, రాజకీయ విధానాలు, అంతిమంగా పారిశ్రామిక, వ్యవసాయక ఉత్పాదకత తిరిగి కోలుకోలేని విధంగా పతనమైనప్పుడు, సోషలిజంగా భావించబడిన వ్యవస్థ పతనానికి దారితీసాయి.

సోవియట్ సోషలిజం పతనాన్ని అర్థం చేసుకోవడానికి లెనిన్ ఆలోచనలను, కృషిని, వారసత్వాన్ని పునః సమీక్ష చేయవలసిన అవసరం ఉంది. భవిష్యత్ సోషలిజం గురించి ఆలోచించే వారికి భావ స్పష్టతకోసం, సృజనాత్మక క్రియాశీలత కోసం కూడా లెనిన్‌ని పునరాలోచించడం అవసరం. నేటి వరకు నడిచిన చరిత్ర వెలుగులో లెనిన్‌ని పరిశీలించాలి. లెనిన్ భావాలు, కృషికి ఉన్న వర్తమాన అనుగుణ్యతను మదింపు వేయాలి. భవిష్యత్ సోషలిజానికి లెనిన్ ప్రాసంగికత ఏ మేరకు అనే అంశంపై కూడా ఆలోచన సాగాలి. ఈ విషయాలపై మాకున్న అభిప్రాయాలను దిగువ పేర్కొంటున్నాము.

**లెనిన్ భావాలు, లెనినిజం, సోవియట్ సోషలిజం :**

19వ శతాబ్దిలోని విభిన్న కార్మికవర్గ సోషలిస్టు సిద్ధాంతాల భావ ఘర్షణలో మార్క్సు ఆలోచనా విధానం అగ్రశ్రేణిలో నిలిచింది. సిండికలిజం, అనార్కిజం కొనసాగినప్పటికీ సోషలిజం దిశగా ప్రపంచాన్ని అత్యధికంగా ప్రభావితం చేసింది మార్క్సిజమే. అదే విధంగా, ఈ సైద్ధాంతిక ప్రాతిపదికపై సాగిన కార్మిక విప్లవోద్యమాలలో 1917 అక్టోబర్ రష్యన్ విప్లవం తక్షణ లక్ష్యమైన రాజ్యాధికారాన్ని సాధించింది.

ఈ విప్లవానికి నాయకత్వం వహించిన లెనిన్, బోల్షివిక్ పార్టీల సిద్ధాంతం, ఆచరణను విప్లవాత్మక మార్క్సిజంగా పరిగణించారు. మొదటి ప్రపంచ యుద్ధం ముగిసిన వెంటనే సంభవించిన జర్మనీ, హంగరీ, బవేరియాలలోని విప్లవాలు విఫలమయ్యాయి. దానితో విప్లవ కార్యాచరణకు నమూనాగా బోల్షివిజం అపారమైన ప్రతిష్టను సంపాదించుకుంది. లెనిన్ ఆలోచనల సారాంశమే బోల్షివిజం కావున, లెనిన్ విప్లవ సిద్ధాంతవేత్తగా ప్రపంచంలో గణుతికెక్కాడు. లెనిన్‌ని పరిపూర్ణ నాయకుడిగా పరిగణించే ధోరణి బలపడింది.

అయితే లెనిన్ తననితాను పార్టీకి, రాజ్యానికి, విప్లవానికి ప్రతీకగా ఎన్నడూ పరిగణించుకోలేదు. అందువల్ల సమానులలో ప్రథముడిగానే పార్టీలో ప్రవర్తించేవాడు. లెనిన్‌ని ఒక ప్రశ్నించరాని ప్రతీకగా పరిగణించడం లెనిన్ మరణానంతరం జరిగింది. ఇందులో భాగంగానే లెనినిజానికి రూపకల్పన జరిగింది. స్టాలిన్ విధానాలకు మద్దతుగా ఇది అవసరమయింది. అందుకే స్టాలిన్‌ని వ్యతిరేకించడం పార్టీని, రాజ్యాన్ని, విప్లవాన్ని వ్యతిరేకించడంగా చిత్రీకరించబడింది. లెనిన్‌ని ప్రతీకగా మార్చడంలో బోల్షివిక్ అగ్రశ్రేణి నాయకులందరూ ఏదో మేరకు భాగస్వాములు కావడంతో, స్టాలిన్ విధానాల పట్ల వారి వ్యతిరేకత విప్లవద్రోహంగా చిత్రీకరించబడినప్పుడు వారికి ఆత్మరక్షణ సాధనం ఏమీ లేకుండా పోయింది. ప్రజాస్వామ్య సాంప్రదాయాలు దాదాపు మృగ్యమయిన విప్లవ పూర్వపు రష్యన్ వాస్తవికత కూడా ఈ క్రమం ఈ రూపం తీసుకోవడానికి దోహదం చేసింది. ఒకే ఒక్క సోషలిస్టు రాజ్యం కావడమనే ప్రతిష్ట ఈ రష్యన్ నిర్దుష్టతని ఒక

సార్వజనీన వ్యవస్థా రూపంగా పరిగణించటానికి దారి తీసింది. విప్లవాన్ని ఒక వ్యక్తితో మమేకం చేయడమనే ఈ క్రమం దాదాపు అన్ని కమ్యూనిస్టు పార్టీల్లో చోటు చేసుకుంది. ఇప్పటికైనా దీనిని నిర్ద్వంద్వంగా తిరస్కరించాల్సిన చారిత్రక అవసరాన్ని అందరూ గుర్తించాలి మేము అభిప్రాయపడుతున్నాము.

లెనినిజాన్ని మార్క్సిజానికి జోడించి మార్క్సిజం – లెనినిజం కమ్యూనిస్టు పార్టీల సిద్ధాంతంగా ప్రతిపాదించబడింది. ఈ మేరకు సామ్రాజ్యవాద, శ్రామికవర్గ విప్లవాల యుగపు మార్క్సిజంగా లెనినిజాన్ని నిర్వచించారు. బహుశా, లెనిన్ దీనిని ఖచ్చితంగా వ్యతిరేకించి ఉండేవాడు. సోవియట్ కమ్యూనిస్టు పార్టీని ప్రపంచంలో అగ్రగామి పార్టీగా పరిగణించారు. పెట్టుబడిదారీ విధానానికి వ్యతిరేకంగా విప్లవ కార్యాచరణకు మరో ప్రత్యామ్నాయం లేదనే అభిప్రాయం బలపడింది. ప్రపంచ వ్యాప్తంగా రష్యన్ కమ్యూనిస్టు పార్టీ స్ఫూర్తితో ఏర్పడిన కమ్యూనిస్టు పార్టీలకు క్రమేపీ మార్క్సిజం – లెనినిజం మార్గదర్శక సిద్ధాంతమైంది. ఈ క్రమానికి కొమింటర్న్ (మూడో ఇంటర్నేషనల్) విధానాలు కూడా దోహదం చేశాయి.

అయితే ఈ సిద్ధాంత రూపాన్ని సమస్యాత్మకమైనదిగా పరిగణించక తప్పదు. లెనిన్ ద్వారా మాత్రమే మార్క్స్‌ని చూడడం దీని సారాంశం. దీంతో కమ్యూనిస్టు పార్టీలలో మార్క్స్‌పట్ల స్వతంత్ర అధ్యయనం దెబ్బతింది. మార్క్సిజానికి మిగతా మార్క్సిస్టు మేధావుల అనుదానాల్ని విస్మరించారు. అలానే ఇతర ఆలోచనా రీతులలోని శాస్త్రీయ, భౌతికవాద అంశాలను కలుపుకునే పద్ధతి కూడా లేకుండా పోయింది. తన పరిశోధనలలో మార్క్స్ అనుసరించిన శాస్త్రీయ పద్ధతిని తరువాత కాలంలో మార్క్సిజంలోని ప్రబల ధోరణి విస్మరించింది. ఫలితంగా వివిధ దృక్పధాలకు చెందిన పరిశోధనను సంకుచిత భావజాల దృష్టినుండే విమర్శించారు. దానితో శాస్త్ర విమర్శకు నిలిచే వైజ్ఞానిక పరిశోధన ఫలితాలను తమ ప్రాపంచిక దృక్పధంలో కలుపుకునే శక్తిని వారు కోల్పోయారు. అలానే శాస్త్రం, భావజాలం మధ్య ఉండవలసిన సంబంధాన్ని హ్రస్వ దృష్టితో చూడడం వలన చివరకు మార్క్సిస్టుల మధ్య ఉండవలసిన భావసంపర్కం కూడా లేకుండా పోయింది. ఫలితంగా, విప్లవకర సిద్ధాంతమైన మార్క్సిజం జీవరహితంగా మారింది. దానికొక ప్రతీకగానే మార్క్సిజం, మార్క్సిజం – లెనినిజంగాను, మార్క్సిజం – లెనినిజం – మావో ఆలోచనా విధానంగాను పరిణామం చెందింది. దీనివల్ల మార్క్స్ మూల స్ఫూర్తి మరుగున పడింది. ఇందువల్ల ఈ పార్టీలు నడిపిన ఉద్యమాలు భావజాలపరమైన వైకల్యానికి గురయ్యాయి. కాబట్టి, 20వ శతాబ్దపు సోషలిజం వైఫల్యం మార్క్సిజానికి చెందదు. లెనినిజానికి చెందుతుంది. మార్క్సిజం – లెనినిజం కాని, మార్క్సిజం – లెనినిజం – మావో ఆలోచనా విధానం కాని హేతుబద్ధమైన రూపాలు కావు. నిజానికి, మార్క్స్ ఆలోచనలు, విశ్లేషణలు కూడా కాలానుగుణంగా పునఃపరిశీలించబడాలి. ప్రతి తరం నూతన విశ్లేషణ ద్వారానే

మార్క్సిజాన్ని సమకాలీన వాస్తవికతకు అన్వయించుకోవాలి. కాలం చెల్లిన వాటిని అధిగమించి ముందుకు వెళ్ళాలి. అందువలన లెనిన్ ఆలోచనలను, కృషిని విడిగా పరిశీలించి విలువైన వాటిని వర్తమాన కార్యాచరణలో కలుపుకోవడం మెరుగైన పద్ధతి.

లెనినిజంగా పరిగణించబడిన సిద్ధాంత రూపంలోని కొన్ని ప్రధాన భావాలు, తదనుగుణమైన ఆచరణపై మా అభిప్రాయాలను దిగువ పొందుపరుస్తున్నాము.

**1. విప్లవాన్ని వాస్తవమైన, ఆచరణ సాధ్యమైన క్రమంగా చూడడం.** లెనిన్ **'ఒకడుగు ముందుకి, రెండడుగులు వెనక్కి'** అనే రచనలో ఇలా అన్నాడు : "విప్లవాత్మక సోషల్ డెమొక్రసీ మౌలిక సూత్రాలు, కార్మికవర్గ సంస్థాగత నిర్మాణం, పార్టీ క్రమశిక్షణల అనివార్యమైన, సంపూర్ణమైన విజయంపట్ల అణుమాత్రపు సందేహమైనా నేరపూరిత పిరికితనమే అవుతుంది." ఈ విప్లవ స్ఫూర్తిని లెనిన్ చేసిన కీలకమైన అనుదానం (contribution) గా పరిగణించేవారున్నారు. సిద్ధాంతం – ఆచరణల దృఢమైన ఐక్యత కూడా లెనిన్ ప్రతిపాదించాడు. అనేక సోషల్ డెమోక్రటిక్ పార్టీలు, వాటి నాయకులు విప్లవాన్ని అమూర్త భావనగా, సుదూర భవిష్యత్తుకి సంబంధించిందిగా చూశారు. తద్భిన్నంగా లెనిన్ దానిని సమీప వాస్తవికతగా చూశాడు. విప్లవ గతి తర్కమే మార్క్సిజం సారాంశం అని పేర్కొనడం ద్వారా విప్లవాత్మక మార్క్సిజాన్ని తన కార్యాచరణకు లెనిన్ ఆలంబన చేసుకొన్నాడు. ఈ అవగాహనలో మార్క్స్ ప్రతిపాదించిన సమాజ పరిణామ సూత్రాలకు విరుద్ధమైన ఇచ్ఛావాద ధోరణి కొంత మేరకు ఇమిడి ఉంది. 1840లలో, 1870లలో మార్క్స్, ఏంగెల్స్‌లు విప్లవాన్ని ఆశించడంలో కూడా ఈ ధోరణి ఉంది. అంతేకాక జర్మనీలో బూర్జువా విప్లవం జరిగిన వెనువెంటనే కార్మికవర్గ విప్లవం కూడా సంభవిస్తుందని మార్క్స్ – ఏంగెల్స్ **కమ్యూనిస్టు మేనిఫెస్టో** (1848) లో పేర్కొన్నారు. బహుశా, ఈ భావన రష్యన్ విప్లవోద్యమాన్ని ప్రభావితం చేసి ఉండవచ్చు. రష్యన్ సమాజంలో బూర్జువా వర్గం స్వాభావికంగా బలహీనమైనది. తన చారిత్రక పాత్రను నెరవేర్చడానికి కావలసిన చొరవ, సమర్ధత దానికి లోపించాయి. ఈ పరిస్థితి, కార్మికవర్గం అధికారాన్ని చేపట్టి ప్రజాస్వామ్య దశను కూడా పూర్తి చేయాలనే అవగాహనకు దారితీసింది. సోషలిజాన్ని 1917 అక్టోబరులో జరిగిన రష్యన్ విప్లవపు మౌలిక లక్ష్యంగా పరిగణించారు. అంతర్గత పరిస్థితులు, ప్రజా చైతన్యం, అంతర్జాతీయ పరిస్థితులలోని పరిమితులవల్ల, ఈ విప్లవానికి సోషలిస్టు విప్లవ లక్ష్యాలు నెరవేర్చగల భౌతిక పునాది ఏర్పడలేదు. ఇది మార్క్సిజాన్ని రాజ్య సిద్ధాంతంగా చేయడంవల్ల కాని, విస్తృత ప్రచారంవల్ల గాని, పార్టీ సభ్యత్వాన్ని ఇబ్బడిముబ్బడిగా పెంచడం వల్ల కాని పూరించబడేది కాదు. చారిత్రక అనుభవం నుండి వెనక్కి తిరిగి చూసినా ఇదే నిర్ధారణ వస్తుంది. ఒకే ఒక్క సానుకూల అంశం : సోషలిజాన్ని లక్ష్యంగా స్వీకరించిన పార్టీ నాయకత్వాన ఈ విప్లవం జరగడం. మిగతా పరిస్థితులు అనుకూలించనప్పుడు పార్టీ లక్ష్యశుద్ధి సోషలిజం నిర్మాణానికి

సరిపోదని చరిత్ర చెపుతున్న వాస్తవం. విప్లవం తన సోషలిస్టు లక్ష్యాన్ని అంతిమంగా సాధించలేకపోవడానికి మూలంలోని ఈ వైరుధ్యపూరిత పరిస్థితులు కూడా తమవంతు పాత్ర నిర్వహించాయి. ఇక్కడ ఇంకో విషయం కూడా గమనించాలి. లెనిన్ నాయకత్వం లేకపోతే రష్యన్ విప్లవం లేదనే విస్తృతాభిప్రాయం ఉంది. కాని రష్యన్ ప్రత్యేక పరిస్థితులు, ప్రపంచ యుద్ధం, బలహీనమైన రష్యన్ బూర్జువా వర్గం కూడా ఈ విప్లవానికి చోదక శక్తులుగా పనిచేశాయి. బూర్జువా వర్గ పరంగా ఒక రాజకీయ శూన్యత ఏర్పడింది. విప్లవ వాస్తవికత పట్ల లెనిన్‌కున్న ప్రగాఢ నిబద్ధత వల్ల బోల్షివిక్ పార్టీ ఈ శూన్యతను భర్తీ చేయడానికి ముందుకొచ్చింది. విప్లవ క్రమంలో వామపక్ష సోషలిస్టు రివల్యూషరీలు, అనార్కిస్టులు కూడా సానుకూల పాత్ర నిర్వహించారు. ఈ స్వీయాత్మక, బాహ్యాత్మక అంశాల సమ్మేళనం విప్లవాన్ని సాధ్యం చేసింది. అంతిమంగా విఫలమైనప్పటికీ, సోషలిజాన్ని ప్రపంచ ఎజెండా పైకి తెచ్చిన మహత్తర చారిత్రక ఘటనగా ఈ విప్లవాన్ని మేము పరిగణిస్తున్నాము.

ఈ విప్లవ క్రమంలో ఆధిపత్యంలో రాజకీయాలు (politics in command) అనే అవగాహన ఒక ప్రధాన ధోరణిగా ముందుకొచ్చింది. ఆర్థిక చలనశక్తుల గతిక్రమం కంటే వర్గపోరాట క్రమం విప్లవానికి కీలకమైనదిగా పరిగణించారు. రాజకీయ విప్లవం, సామాజిక విప్లవాల మధ్య ఉన్న అంతరాన్ని పూర్తిగా గ్రహించలేదు. కమ్యూనిస్టు పార్టీ అధికారం నెరపడం సోషలిజం ప్రధాన సూచికలలో ఒకటిగా భావించారు. ఇవన్నీ ఉద్దేశ్యపూర్వకంగా జరిగాయని కాదు. సంక్లిష్ట చారిత్రక క్రమంలో వస్తుగత వాస్తవికత – చైతన్యపూరిత కార్యాచరణల మధ్య ఉండే ఐక్యత – ఘర్షణల గతి తర్కం ఈ విరుద్ధ ఫలితాలకు దారి తీసింది. ఆధిపత్యంలో రాజకీయాలు చివరికి విస్తృత ప్రజానీకపు రాజకీయ స్తబ్ధతకు దారితీసింది. వారి భాగస్వామ్యం నామమాత్రమైంది. రాజకీయ క్రియాశీలత పార్టీకి పరిమితమైంది. పార్టీ రాజ్యం – ప్రజల మధ్య అగాధం ఏర్పడింది. ఈ క్రమంలో, ప్రజాస్వామ్య భావనని బూర్జువా వర్గ రాజకీయ వ్యవస్థతో మమేకంగా చూశారు. పెట్టుబడిదారీ వ్యవస్థలో రాజకీయ స్వేచ్ఛలను అనుభవించడానికి కార్మిక వర్గానికి కల అవకాశాలు బహు పరిమితమని విమర్శ చేసిన శక్తులు, చట్టబద్ధ హక్కుల చారిత్రక ప్రగతిశీలతను చూడలేకపోయాయి. లెనిన్‌లో కూడా ఈ పరిమితి ఉంది. ఈ అంశాలన్నిటి సమష్టి ఫలితంగా బోల్షివిక్ పార్టీ పాలన నిరంకుశ వ్యవస్థగా పరిణమించింది. క్రింది నుండి జరిగిన ఈ విప్లవ స్వభావం విప్లవానంతర పరిణామాల వల్ల పై నుండి జరిగిన విప్లవంగా పరిణమించింది. పై నుంచి జరిగే విప్లవాలు అతి త్వరగా విప్లవ స్ఫూర్తిని కోల్పోతాయి. విప్లవం టీ పార్టీ కాదనే పేరిట సోవియట్ యూనియన్‌లో సంభవించిన అన్ని ప్రతికూల పరిణామాలని సమర్థించ పూనుకోవడం సమంజసం కాదు. బోల్షివిక్ పార్టీని మిగతా కమ్యూనిస్టు పార్టీలు నమూనాగా తీసుకోవడంతో ప్రపంచవ్యాప్త

కమ్యూనిజం విస్తృత ప్రజాశ్రేణుల నుండి వేరుపడిపోయింది. ఈ పార్టీలు నిర్మించుకున్న భావజాల చట్రం ఒక ఊహా ప్రపంచం (make believe) లో ఉండే స్థితికి దారి తీసింది. ముందస్తు నిర్ధారణల (a priori notions) సర్ప పరిష్వంగం వల్ల ఈ పార్టీలలో వాస్తవిక పరిణామాలకు సృజనాత్మకంగా స్పందించగలిగే శక్తి బాగా సన్నగిల్లింది. వాస్తవ విరుద్ధ సమర్థన (rationalisation) ద్వారా వైరుధ్యాలను దాటవేయడానికి ప్రయత్నం చేశారు. చరిత్ర రచనను -- శాస్త్రీయ ప్రమాణాలను ప్రక్కన పెట్టి -- రాజకీయ సాధనంగా వాడుకున్నారు. అందువల్ల ప్రజామద్దతు కోల్పోయిన సంగతి కూడా ఈ పార్టీలు సరైన సమయంలో గుర్తించలేకపోయాయి. సోవియట్ సోషలిజం అంతిమంగా సోషలిజం ఎలా ఉండాలి అనే దానికి కాకుండా, ఎలా ఉండకూడదు అనే దానికి ప్రతీకగా మారింది. సమాజ పరిణామ దశల క్రమాన్ని ఒక విప్లవాత్మక గెంతు ద్వారా అధిగమించి సోషలిజం నిర్మాణం చేయవచ్చుననే అవగాహన మొత్తంమీద విఫలమైందని భావించాల్సి ఉంటుంది. అభివృద్ధి చెందిన పెట్టుబడిదారీ దేశాల కార్మిక వర్గాలు సోషలిజం కోసం క్రియాశీల పోరాటం చేసే స్ఫూర్తిని కోల్పోవడానికి సోవియట్ సోషలిజంలోని ప్రతికూల అంశాలు కూడా ఒక కారణం. ఈ వాస్తవాల దృష్ట్యా సోషలిజాన్ని పునర్నిర్వచించి, పునర్నిర్మించాల్సిన అవసరం ఉంది.

**2. కార్మిక వర్గానికి విప్లవ చైతన్యాన్ని బయట నుండి అందించాలనే భావన.** కార్మిక వర్గ సజ్జోజనిత చైతన్యం ఆర్థికవాదం దగ్గర (అంటే ఆర్థిక డిమాండ్ల కోసం జరిగే ట్రేడ్ యూనియన్ పోరాటాల దగ్గర) ఆగిపోతుందనేది లెనిన్ అవగాహన. అందువలన విప్లవ చైతన్యం -- అంటే కార్మిక వర్గం సోషలిజం సాధనని చారిత్రక కర్తవ్యంగా గుర్తించడం, దానిని సాధించాలంటే రాజ్యాధికారాన్ని హస్తగతం చేసుకోవాలని గ్రహించడం -- బయట నుండి ప్రవేశపెట్టబడాలని ఆయన ప్రతిపాదించాడు. ఈ భావనని జర్మన్ సోషల్ డెమొక్రటిక్ ఉద్యమ నాయకుడు కౌట్స్కీ నుండి లెనిన్ తీసుకున్నాడు. లెనిన్ ప్రసిద్ధ రచన **'ఏం చేయాలి'** లో ఈ భావన విస్తృతంగా చర్చించబడింది. ఈ భావనని లెనిన్ ఈవిధంగా పేర్కొన్నాడు.

"కార్మికులలో సోషల్ డెమోక్రటిక్ చైతన్యం దానంతటది ఉండే అవకాశం లేదని మనం చెప్పాం. దానిని బయట నుండి వారికి అందించాల్సి ఉంటుంది. కార్మికవర్గం, పూర్తిగా తన స్వంత కృషితో, ట్రేడ్ యూనియన్ చైతన్యాన్ని మాత్రమే సాధించగలదని అన్ని దేశాల చరిత్ర ఋజువు చేసింది. అంటే, యూనియన్లలో సంఘటితం కావడం, యజమానులపై పోరాడడం, అవసరమైన కార్మిక చట్టాలను చేసే దిశగా ప్రభుత్వంపై ఒత్తిడి తీసుకురావడం, ఇత్యాదికి సంబంధించిన చైతన్యం."

ఈ విప్లవ చైతన్యాన్ని సోషల్ డెమోక్రటిక్ పార్టీలు (విప్లవం తరువాత రష్యన్

సోషల్ డెమోక్రటిక్ లేబర్ పార్టీ (బోల్షివిక్) కమ్యూనిస్టు పార్టీగా పేరు మార్చుకుంది) కార్మిక వర్గానికి అందించాలి.

బహుశా, ఈ భావనకి మూలాలు కమ్యూనిస్టులు కార్మికోద్యమాల దశను, దిశను, అంతిమ సాధారణ ఫలితాలను కార్మిక జన సమూహం కంటే స్పష్టంగా అవగాహన చేసుకోగలరని మార్క్స్ – ఏంగెల్స్ కమ్యూనిస్టు మేనిఫెస్టోలో పేర్కొన్న భావనలో ఉండవచ్చు. పెట్టుబడిదారీ విధానం కార్మికులపై విధించే భావజాల పరిమితులు వారిని ఆ సమాజపు పరిధిని దాటి చూడనివ్వవు. అది మానవ చరిత్ర, సమాజం గురించిన క్రమానుగత శాస్త్రీయ, ప్రగతిశీల దృక్పథానికి వారసులైన కమ్యూనిస్టులకు సాధ్యపడుతుంది. అందువల్ల, పెట్టుబడిదారీ సమాజం పతనం అనివార్యమని, దాని స్థానే సమష్టి ఆర్థిక జీవనంపై ఆధారపడిన సోషలిజం ఆవిర్భవిస్తుందనీ, ఈ క్రమాన్ని వాస్తవీకరించే సామాజిక చోదక శక్తి కార్మికవర్గమేననే అవగాహనను కమ్యూనిస్టులు కార్మికవర్గానికి అందిస్తారు. కార్మికవర్గం ఆర్థికవాద పరిమితుల్ని ఛేదించుకుని క్రియాశీల రాజకీయశక్తిగా రూపొంది, రాజ్యాధికార సాధన దిశగా అడుగులేస్తుంది.

పెట్టుబడిదారీ విధానం ప్రచారం చేసే భావజాలపరమైన మాయావాదాన్ని చీల్చుకుని కార్మికవర్గం విప్లవచైతన్యం కలిగిన వర్గంగా రూపుదిద్దుకునేందుకు ఈ భావన అవసరాన్ని మనం గుర్తించవచ్చు. అయితే తొట్టతొలి విప్లవం రష్యాలో జరగడంతో, ఈ అవగాహన విరుద్ధ ఫలితాలకు దారి తీసింది. సోషలిజం అభివృద్ధి చెందిన పెట్టుబడిదారీ విధానపు తదుపరి దశ. పెట్టుబడిదారీ విధానం రష్యాలో అత్యంత ప్రాథమిక దశలో ఉంది. జనాభాలో 80% వ్యవసాయంపై ఆధారపడి జీవించేవారు. అట్టి రష్యా సోషలిజానికి సిద్ధంగా లేదు. పశ్చిమ ఐరోపా నుండి రష్యాకి అందిన సోషలిస్టు భావనలు, ముఖ్యంగా మార్క్సిజం, అనూహ్యంగా బలమైన రాజకీయ ధోరణిగా రూపొందాయి. ఈ ప్రాబల్యానికి ప్రధాన కారణం, బహుశా, బూర్జువా వర్గం జార్ రాచరికంతో చేతులు కలపడం ద్వారా స్వతంత్ర రాజకీయ శక్తిగా రూపొందే అవకాశాన్ని కోల్పోవడం. బూర్జువా వర్గపు ఈ బలహీనత, ఈ వర్గపు పాలన నిలదొక్కుకోలేదనే అవగాహనకు, అందువలన వెంటనే కార్మికవర్గం రాజ్యాధికారాన్ని చేపట్టవచ్చనే అవగాహనకు దారితీసింది. 1905 విప్లవంలోనే లెనిన్ ఈ అభిప్రాయాన్ని వ్యక్తం చేశాడు. 1917 విప్లవంలో ఈ పరిస్థితి వాస్తవ రూపం దాల్చింది. అక్టోబరులో 'సోవియట్లకు రాజ్యాధికారం' అనే నినాదంతో బోల్షివిక్ పార్టీ నాయకత్వాన వామపక్ష సోషలిస్టు రివల్యూషనరీలు, అనార్కిస్టుల మద్దతుతో విప్లవం విజయవంతమయింది. ఈ విప్లవానికి తక్షణ భూమిక శాంతిని నెలకొల్పడం, భూమి సమస్యను పరిష్కరించడం. అందువల్ల ఇక్కడ కార్మికవర్గ చైతన్యానికి విప్లవ స్వభావం ఉన్నప్పటికీ, అది సోషలిస్టు చైతన్యంగా రూపుదిద్దుకోలేదు. కార్మికవర్గ దైనందిన జీవితానుభవాన్ని, పెట్టుబడిదారీ వ్యవస్థలో దాని స్థానం కలిగించే ప్రాపంచిక దృక్పథాన్ని

సమన్వయపరచి విపులీకరించేదిగా విప్లవ చైతన్యం ఉండాలి. అలా కాక, అది బయటి నుండి మాత్రమే వచ్చినట్లయితే, కార్మికవర్గ విప్లవ క్రియాశీలత బాహ్య ప్రేరణకు స్పందనగా ఉంటుందే కాని, అంతర్లీనంగా జ్వలించే భావోద్వేగ శక్తిగా ఉండజాలదు.

యూరోపియన్ విప్లవానికి రష్యన్ విప్లవం నాందీ ప్రస్తావన అవుతుందనే అంతర్జాతీయ దృక్పథం ఈ విప్లవానికి భూమిక అయినందున, ఈ విప్లవాన్ని ఆ షరతు నెరవేర్చబడే వరకు సోషలిస్టు విప్లవంగా పరిగణించడం సమస్యాత్మకం అవుతుంది. అలానే అయింది. రష్యన్ సామాజిక దశ సోషలిజం సాధించే స్థాయిలో లేదని ముందే చెప్పాం. ఈ విషయాన్ని లెనిన్ కూడా అనేకసార్లు పేర్కొన్నాడు. అయినప్పటికీ, విప్లవ అగ్రగామి (పార్టీ) లక్ష్యం సోషలిజం కాబట్టి, అది విప్లవ స్వభావంగా కూడా పరిగణింపబడింది. ఆ దిశగా కృషి సాగింది. ఇది భౌతిక పరిస్థితులు మానవ చైతన్యాన్ని నిర్ణయిస్తాయనే మార్క్సిస్టు భౌతికవాద అవగాహనకు విరుద్ధం. అగ్రగామి పార్టీ చైతన్యానికి, కార్మికవర్గ చైతన్యానికి మధ్య గండి ఏర్పడింది. ఈ అగాధం పార్టీ, కార్మికవర్గం 'పై' నుండి ఆ వర్గం 'తరఫున' పాలించడానికి దారి తీసింది. ఈ పరిస్థితి, మార్క్స్ తాను రాసిన ఫ్యూయర్‌బాఖ్ సూత్రీకరణలలో మూడవ దానిలో శిక్షకులకే శిక్షణ అవసరమన్న విషయాన్ని విస్మరించే భౌతికవాద సిద్ధాంతం సమాజాన్ని రెండు భాగాలుగా విభజిస్తుందనీ, అందులో ఒక భాగం (శిక్షకులు) సమాజానికి అతీతంగా ఉంటుందనీ చేసిన విమర్శకు ప్రతీకగా నిలిచింది. శిక్షకులు – శిక్షణ పొందేవారు (పార్టీ – వర్గం) విడివడిపోయాయి. వర్గపాలన స్థానే పార్టీ పాలన ఏర్పడింది.

అదే సూత్రీకరణలో, పరిస్థితులలోను, మానవ కార్యాచరణలోను ఒకేసారిగా మార్పులు రావడాన్ని విప్లవాత్మక కార్యాచరణగా మార్క్స్ నిర్వచించాడు. అంటే పరిస్థితుల, మానవ కార్యాచరణల గమనం ఒకే దిశలో ఉండాలి. ఈ కోణం నుండి చూస్తే, రష్యన్ విప్లవ క్రమం పరిస్థితులతో సంబంధంలేని కార్యాచరణ చేపట్టవలసి వచ్చింది. ఈ కార్యాచరణ రూపంలో సోషలిస్టు విప్లవ కార్యాచరణగా అనిపించినప్పటికీ, సారంలో అలా పరిగణించడం వాస్తవ విరుద్ధం అవుతుంది. అలానే, పార్టీ, వర్గం మధ్య ఏర్పడిన వైమనస్యత కార్మిక వర్గం విముక్తి కార్మికవర్గమే సాధించుకోవాలన్న మార్క్స్ స్ఫూర్తికి కూడా గండి కొట్టింది. ఈ వైరుధ్యాల అంతిమ పర్యవసానమే సోవియట్ యూనియన్ పతనం. ఈ పతనం కొందరు విశ్లేషించినట్లు రివిజనిజం ఫలితం కాదు. ఈ విప్లవ క్రమంలోని లోతైన అంతర, బాహిర వైరుధ్యాల పర్యవసానం.

బహుశా, విప్లవాన్ని కార్మికవర్గం రాజ్యాధికారాన్ని చేపట్టే రాజకీయ విప్లవంగా మాత్రమే కాక, ముఖ్యమైన సామాజిక వ్యవస్థల (కుటుంబ వ్యవస్థ, విద్యావ్యవస్థ, సమాచార వ్యవస్థ, ఇత్యాదులు) పై పట్టు సాధించడంగా, భావజాల – సాంస్కృతికపరమైన ఆధిపత్యంగా కూడా చూడాలి. అంటే కార్మికవర్గాన్ని భవిష్యత్ పాలకవర్గంగా సమాజంలోని

మెజారిటీ ప్రజలు రాజ్యాధికారాన్ని సాధించకముందే అంగీకరించడంగా చూడాలి. సమాజంలో ఆధిపత్యం సాధించిన తదుపరి రాజ్యాధికారాన్ని చేపట్టడం జరిగితే లక్ష్యాల సాధనకు బలమైన పునాది సిద్ధంగా ఉంటుంది. కార్మికవర్గం తనను తాను జాతి (నేషన్) కి ప్రతిరూపంగా మలచుకోవాలని కమ్యూనిస్టు మేనిఫెస్టోలో మార్క్స్ – ఏంగెల్స్ పేర్కొన్నది ఈ విస్తృతార్థంలోనే. కార్మికవర్గం జాతీయ – ప్రజా సంఘటనకు నాయకత్వం వహించాలని గ్రాంసీ ఈ అర్థంలోనే చెప్పాడు.

**3. అగ్రగామి పార్టీ, పార్టీకి కేంద్రబిందువుగా వృత్తి విప్లవకారుల బృందం, పార్టీ నిర్వహణలో కేంద్రీకృత ప్రజాస్వామ్యం -- ఈ మూడు భావనల సంశ్లేషణ.** కార్మికవర్గానికి సంస్థాగత నిర్మాణం ఆవశ్యకతని **ఒకడుగు ముందుకి, రెండడుగులు వెనక్కి** అనే రచనలో లెనిన్ ఇలా వివరించాడు :

"రాజ్యాధికార సాధన కోసం కార్మికవర్గం జరిపే పోరాటంలో సంస్థాగత నిర్మాణం ఒక్కటే దాని ఆయుధం......లక్షలాదిమంది శ్రామికులను శ్రామికవర్గ సైన్యంగా మలిచే సంస్థలో భౌతిక ఐక్యత ద్వారా భావజాలపరమైన ఏకీకరణ సాధించినప్పుడు మాత్రమే కార్మిక వర్గం అజేయమైన శక్తిగా మారగలదు. ఇది అనివార్యంగా జరుగుతుందని కూడా చెప్పవచ్చు."

అట్టి వర్గ నిర్మాణ సంస్థలు రాజకీయ పార్టీలుగా ఆవిర్భవించడం ఆధునిక బూర్జువా రాజ్య వ్యవస్థలో ఆరంభమయింది. అట్టి కార్మిక వర్గ పార్టీని ఆ వర్గపు అగ్రగామి దళం (వాన్‌గార్డ్) గా లెనిన్ నిర్వచించాడు. రష్యన్ పారిశ్రామిక కార్మిక వర్గపు పార్టీగా ఏర్పడిన రష్యన్ సోషల్ డెమొక్రటిక్ లేబర్ పార్టీ 1902లో జరిగిన రెండవ మహాసభలో రెండు విభిన్నమైన ధోరణులుగా చీలిపోయింది. ముసాయిదా నిబంధనావళిలో ఒకటో నిబంధనలో పార్టీ సభ్యత్వాన్ని నిర్వచించడంలో ఈ చీలిక ఏర్పడింది. పార్టీకి చెందిన ఏ సంస్థలోను పనిచేయకుండా పార్టీకి ఏదో ఒక రీతిలో సహాయపడే వారిని కూడా పార్టీ సభ్యులుగా పరిగణించవచ్చునని మార్టోవ్ చేసిన ప్రతిపాదనకు వ్యతిరేకంగా పార్టీకి చెందిన సంస్థలలో పనిచేసే వారినే పార్టీ సభ్యులుగా పరిగణించాలని లెనిన్ ప్రతిపాదించాడు. లెనిన్ ప్రతిపాదన ఓటింగ్‌లో గెలిచింది. ఈ ఓటింగ్ ఫలితాల ఆధారంగానే ఓడిపోయిన, గెలిచిన ధోరణులను మెన్షివిక్, బోల్షివిక్‌గా పరిగణించడం ప్రారంభమయింది. లెనిన్ తన భావనను మరింత ముందుకు తీసుకువెళ్ళి కార్మికవర్గ పార్టీ వృత్తి విప్లవకారుల పార్టీగా ఉండాలని సూత్రీకరించాడు. ఈ పార్టీ అత్యంత క్రమశిక్షణాయుత సంస్థ కావాలని, అందుకని దాని అంతర్గత పాలనా సూత్రంగా కేంద్రీకృత ప్రజాస్వామ్యం ఉండాలని కూడా ప్రతిపాదించాడు. అంటే, మెజారిటీకి మైనారిటీ లోబడి ఉండడం, పై కమిటీకి కింది కమిటీ లోబడి ఉండడం, మొత్తానికి, విడి భాగం లోబడి ఉండడం. ఇవన్నీ కేంద్రీకృత వ్యవస్థ లక్షణాలు. వివిధ స్థాయిల్లోని కమిటీల్లో అంతర్గత

చర్చలకు అవకాశం ఉండడం, పార్టీ మహాసభకు అత్యున్నత కమిటీలు కూడా లోబడి ఉండడం అనే ప్రజాస్వామ్య లక్షణాల వల్ల ఇది కేంద్రీకృత ప్రజాస్వామ్యంగా పిలవబడింది. ఈ వ్యవస్థ రష్యన్ కమ్యూనిస్టు పార్టీ స్ఫూర్తితో అక్టోబరు 1917 తరువాత ఏర్పడిన కమ్యూనిస్టు పార్టీలకు నిర్మాణ రూపంగా నిలిచింది.

ఇక్కడ గమనించవలసిన ముఖ్యమైన విషయం, బోల్షివిక్ పార్టీ నిర్మాణ రూపం రష్యన్ ప్రత్యేక పరిస్థితుల నుండి ఆవిర్భవించింది. విప్లవ లక్ష్యం ఒక్కటే, విప్లవ మార్గాలు విభిన్నం అన్నది మొదటి ఇంటర్నేషనల్ (అంతర్జాతీయ కార్మిక సంస్థ) సూత్రీకరణ. అందువలన, రష్యన్ విప్లవం విజయవంతం కావడం, అన్ని దేశాలకు బోల్షివిక్ పార్టీ నమూనా కావడానికి మధ్య కార్యకారణ సంబంధం ఏమీ లేదు. లెనిన్‌లో ఈ అంశంపై సందిగ్ధత ఉంది. 1920లో జరిగిన మూడవ ఇంటర్నేషనల్ రెండవ మహాసభలో కమ్యూనిస్టు పార్టీలు బోల్షివిక్ నమూనాని అనుసరించాలని కోరుతూ చేసిన తీర్మానం పట్ల లెనిన్ తరువాతి దశలో విరుద్ధాభిప్రాయం వ్యక్తం చేశాడు. కాని 1924లో లెనిన్ మరణానంతరం సోవియట్ యూనియన్ ఏకాకిగా మిగిలిపోవడంతో, కొమింటర్న్ కమ్యూనిస్టు పార్టీల బోల్షివీకరణను బలంగా నొక్కి చెప్పింది. అప్పుడు చోటు చేసుకున్న ఈ క్రమం ఒడిదుడుకులతో సోవియట్ యూనియన్ పతనం వరకు కొనసాగింది. ఈ సంక్షోభంవల్ల పునాదులకంటా కుదిపివేయబడిన ప్రపంచ కమ్యూనిస్టు ఉద్యమంలో అనేక పార్టీలు పేరు సైతం మార్చుకుని సోషల్ డెమొక్రటిక్ పార్టీలుగా రూపాంతరం చెందాయి. నిబద్ధ మార్క్సిస్టు పార్టీలు సోషలిస్టు లక్ష్యాన్ని విడనాడి పెట్టుబడిదారీ విధానం లోపల సంస్కరణవాద పార్టీలుగా మారడం చరిత్రలో ఇది రెండవసారి. మొదటిసారి 1914లో మొదటి ప్రపంచయుద్ధంలో రెండవ ఇంటర్నేషనల్ పతనమయినప్పుడు ఇలా జరిగింది. రెండవసారి జరగడానికి ఒక ప్రధాన కారణం బోల్షివిక్ నమూనా ఒక విశ్వజనీన నిర్మాణ రూపంగా విఫలం కావడం. చారిత్రక అనుభవం నుండి చూస్తే ఈ పార్టీలో కేంద్రీకృతాన్ని నిర్వచించినంత స్పష్టంగా ప్రజాస్వామ్యాన్ని నిర్వచించలేదు. ఈ ధోరణి లెనిన్‌లో ప్రస్ఫుటంగా కనిపిస్తుంది. ఈ రెండింటిలో కేంద్రీకృతాన్ని సాధించడం, ప్రజాస్వామ్యాన్ని సాధించడం కంటే తేలిక. నిజానికి ఎక్కువ కృషి ప్రజాస్వామ్య అంశాన్ని విశదీకరించి, నెలకొల్పడంలో జరిగి ఉండాల్సింది. కాని ఇందుకు విరుద్ధంగా జరిగింది. అందువల్ల ఈ పార్టీలో నాయకత్వం – కార్యకర్తల మధ్య, పర్యవసానంగా పార్టీ – వర్గం మధ్య పూరించలేనంతటి అగాధం ఏర్పడింది. బోల్షివిక్ పార్టీలో విప్లవానికి ముందు బీజరూపంలో ఉన్న ఈ సమస్య విప్లవానంతరం ఏర్పడిన క్లిష్ట పరిస్థితులలో పార్టీలో, రాజ్య యంత్రాంగంలో బ్యూరోక్రసీ ఒకే ఒక్క క్రియాశీల రాజకీయ వ్యవస్థగా పరిణమించే క్రమంలో పూర్తిస్థాయిలో స్థిరపడింది. లెనిన్ ఈ అంశంలో **ఒకడుగు ముందుకి, రెండడుగులు వెనక్కి** అనే రచనలో ఇలా పేర్కొన్నాడు :

"ఉద్యోగస్వామ్యం (బ్యూరోక్రసీ), ప్రజాస్వామ్యాల మధ్య వైరుధ్యం ఖచ్చితంగా కేంద్రీకృతం (సెంట్రలిజం), యాదృచ్ఛికం (ఆటోమేటిజం)ల మధ్య వైరుధ్యం లాంటిదే. ఇవి విప్లవాత్మక సోషల్ డెమోక్రసీ, అవకాశవాద సోషల్ డెమోక్రసీలకి చెందిన పరస్పర విరుద్ధమైన నిర్మాణ సూత్రాలు. రెండవ నిర్మాణ సూత్రం ప్రకారం క్రింది నుండి పైకి గమనం ఉంటుంది. అందువలన, వీలైన సందర్భాలలో వీలైనంత మేరకు యాదృచ్ఛిక వాదాన్ని, (అత్యుత్సాహం కలిగిన వారిచే) అరాచకవాదం (అనార్కిజం) వరకు నెట్టబడిన "ప్రజాస్వామ్యాన్ని" బలపరుస్తుంది. మొదటి నిర్మాణ సూత్రం ప్రకారం గమనం పై నుండి క్రిందికి ఉంటుంది. ఇది విడి భాగాలకు సంబంధించినంత వరకు కేంద్రం యొక్క హక్కులు, అధికారాలను బలపరుస్తుంది."

పై సూత్రీకరణలో కేంద్రీకృత వ్యవస్థపట్ల స్పష్టమైన మొగ్గు కనిపిస్తుంది. బోల్షివిక్ పార్టీ నిర్మాణంలోని ఈ పార్శ్వం, తదుపరి ఏర్పడిన పార్టీ - రాజ్య వ్యవస్థలోని విపరిణామాలకు గల ప్రధాన కారణాలలో ఒకటి.

విప్లవానికి ముందు బోల్షివిక్ పార్టీలో కేంద్రీకృత ప్రజాస్వామ్యం ఆచరణలో కొంత సమతుల్యత కలిగి ఉండేది. విప్లవానంతరం ఏర్పడిన క్లిష్ట పరిస్థితులలో, ముఖ్యంగా 1921లో పార్టీలో ముఠాలని నిషేధించడంతో, ఈ సమతుల్యత దెబ్బతింది. కేంద్రీకృత వ్యవస్థ పార్టీకి ప్రాణాధారంగా భావించబడింది. మైనారిటీ అభిప్రాయం పెడధోరణిగా, క్రమశిక్షణా రాహిత్యంగా చూసే ధోరణి ప్రబలింది. దీంతో పార్టీలో నూతన భావ సంచయం ఆగిపోయింది. పార్టీలో అంతర్గత ప్రజాస్వామ్యం నామమాత్రంగా మారిపోయింది. ఈ పరిస్థితి తరువాతి దశలో స్టాలిన్ పాలనా వ్యవస్థకి పునాది అయింది. కమ్యూనిస్టులలో భేదాభిప్రాయానికి అవకాశం లేనప్పుడు, సమాజం (కార్మిక, కర్షకులతో సహా) రాజ్యం నుండి విభేదించడానికి అవకాశం కూడా మృగ్యమైంది. ఈ సమస్యాత్మక నిర్మాణ రూపాన్ని కమ్యూనిస్టు పార్టీలు అనుసరించాయి.

అంతేకాక, ఈ పార్టీ వ్యవస్థలో ఏక వ్యక్తి నియంతృత్వాన్ని నిరోధించగలిగే అంతర్గత రక్షణ వ్యవస్థలు లేవు. ప్రతి పదవికి ఎన్నికలు జరగడం, పదవీకాలం కనిష్టంగా ఉండడం, రీకాల్ ఉండడం, రొటేషన్ పద్ధతిలో వివిధ బాధ్యతాయుత స్థానాల్లో వ్యక్తులు తరచుగా మారడం లాంటి కార్మికవర్గ ప్రజాస్వామ్య సూత్రాలు ఈ వ్యవస్థలో అమలు జరగలేదు. అంతర్గత ఎన్నికలు బూర్జువా పార్టీలలో వలె నామినేషన్ సంస్కృతిగా మారిపోయాయి. ఈ మౌలిక సూత్రాలను అమలు చేయలేకపోవడానికి బలమైన వస్తుగత కారణాలు ఉన్నాయి. అయినప్పటికీ, వాటి ఉల్లంఘన అంతిమంగా ప్రతికూల ఫలితాలకు దారితీసిందనే చేదు నిజాన్ని గుర్తించడం ఈనాటి అవసరం. ఈ క్రమాన్ని సమర్థించు కునేందుకు సమాజంపై మార్క్సిస్టు మౌలిక వాదాన్ని విధించడం, కమ్యూనిస్టు పార్టీని కార్మికవర్గానికి, సమాజానికి మారుపేరుగా పరిగణించడం జరిగింది. పార్టీని

దోషరహితమైన, పరిపూర్ణ అంశంగా చూడడం జరిగింది. విడి అంశాలను ప్రశ్నించడం కూడా నిషిద్ధంగా పరిగణించబడింది. కమ్యూనిస్టు పార్టీలో చోటుచేసుకున్న ప్రతికూల ధోరణుల గురించి సార్త్ర్ **సోషలిస్ట్ రిజిస్టర్** (1970) పత్రికలో ముద్రించబడిన తన **మాసెస్, స్పాంటెనయిటీ, పార్టీ** అనే వ్యాసంలో ఇలా పేర్కొన్నాడు:

"వర్గానికి తనదైన రాజకీయ నిర్మాణం తప్పనిసరిగా ఉండాలనే విషయంపై మనం అంగీకారానికి రావడంతోపాటు, కమ్యూనిస్టు పార్టీకి చెందిన "చారిత్రకంగా" ఉనికిలోకి వచ్చిన సంస్థలు మనం వాటికి అప్పచెప్పిన విధులను నెరవేర్చడానికి ఏ మాత్రం తగినవి కావని కూడా గుర్తించాలి......కార్యాచరణను, ఆలోచనలను నిర్మాణం నుండి వేరు చేయలేము. మన నిర్మితి మేరకు మనం ఆలోచిస్తాం. నిర్మాణం ప్రకారం మనిషి కార్యాచరణ ఉంటుంది. అందువల్ల కమ్యూనిస్టు పార్టీలలో ఆలోచన క్రమేపి శిలాజస్థితికి చేరుకుంది."

కమ్యూనిస్టు పార్టీలు అధికారంలో ఉన్న చైనా, వియత్నాం, ఉత్తర కొరియా, క్యూబాలలో ఇదే చారిత్రక వారసత్వం కొనసాగుతున్నది. ఈ పార్టీలు చారిత్రక అనుభవం దృష్ట్యా పునరాలోచన చేసి శ్రామిక జనావళి రాజకీయ భాగస్వామ్యాన్ని పెంపొందించేందుకు ప్రయత్నించడం లేదు. ఏ మార్పు అయినా, సంస్కరణ అయినా వ్యవస్థను మొత్తంగా తలక్రిందులు చేస్తాయనే ఒకే ఒక్క సూత్రం వాటిని ఇప్పటికీ నడిపిస్తోంది.

కమ్యూనిస్టు పార్టీల నిర్మాణం ఒక శిష్ట వర్గాన్ని సృష్టించింది. మార్క్సిస్టు మూల స్ఫూర్తిలో పార్టీ కార్మికవర్గ సంకల్పపు సమష్టి వ్యక్తీకరణ కావాలి. బోల్షివిక్ అగ్రగామి దళ భావన పార్టీని కార్మిక వర్గాన్ని 'పై' నుండి నడిపించే వ్యవస్థగా మార్చింది. బోల్షివిక్ తరహా పార్టీ నాయత్వాన మాత్రమే కార్మికవర్గం సోషలిజాన్ని సాధించగలదని చెప్పడమంటే, ఈ మార్గంలో తప్ప కార్మికవర్గం సోషలిజాన్ని సాధించలేదని చెప్పడమే. లెనిన్ చేసిన కీలకమైన అనుదానంగా చెప్పబడిన పార్టీ భావనలో ఇమిడి ఉన్న ప్రతికూల కోణం ఇది. ఈ నిర్మాణంలో పార్టీ – వర్గం మధ్య సంబంధాలు రూపొందిన తీరు, సోషలిజం సాధనకి దాదాపు అవకాశాలు లేకుండా చేసింది. మార్గం, లక్ష్యం మధ్య సంబంధాన్ని గురించిన హేతుబద్ధ అవగాహన స్థానే, మార్గాన్నే లక్ష్యంగా పరిగణించే ధోరణి చోటు చేసుకుంది. ఇది సైద్ధాంతిక ఛాందస వాదానికి (fanaticism) దారి తీసింది.

బోల్షివిక్ పార్టీనుండి కమ్యూనిస్టు పార్టీలు స్వీకరించిన ఈ నిర్మాణ రూపం సోషలిస్టు లక్ష్య సాధనకు అనువైనది కాదని గుర్తించాలి. దీనిలో అంతర్గత సంస్కరణల ద్వారా మార్పుకున్న అవకాశాలు బహు తక్కువ. ఒక విశాల అంగీకారం పొందిన సమసమాజ వ్యవస్థను నిర్మించడం ఈ పార్టీకి సాధ్యం కాదని చరిత్ర అనుభవం చెబుతోంది. అందువలన నూతన నిర్మాణ రూపాల కోసం అన్వేషించాలి. చట్టబద్ధంగా పనిచేసే పార్టీలే కాక, ప్రత్యేక పరిస్థితులలో చట్టవిరుద్ధమైన పార్టీలుగా ప్రకటించబడినవి

కూడా ఈ కృషిలో పాలుపంచుకోవాలి. కార్మికవర్గం చొరవని, పార్టీలో కార్యకర్తల చొరవని ప్రోత్సహించేదిగా నిర్మాణం ఉండాలి. భావ సంఘర్షణకి అవకాశం ఉండాలి. మైనారిటీ అభిప్రాయాన్ని గౌరవించాలి. సోషలిస్టు లక్ష్యం లోపల విభిన్న దృక్కోణాలు కలిసి పనిచేయాలి. నాయకత్వం వికేంద్రీకరించబడాలి. ఈ దిశగా అన్వేషణ జరగాలి.

**4. శ్రామిక వర్గ నియంతృత్వాన్ని సోషలిస్టు రాజ్య రూపంగా నిర్ద్వంద్వంగా పరిగణించడం.** పారిస్ కమ్యూన్‌ని శ్రామిక వర్గ నియంతృత్వానికి ప్రతిరూపంగా మార్క్స్ – ఏంగెల్స్ పరిగణించారు. అయితే ఖచ్చితమైన నిర్ణాయక చర్యలు తీసుకోకపోవడంవల్ల, పారిస్ బయటనుండి మద్దతు లభించకపోవడంవల్ల అది విఫలమైందని విశ్లేషించారు. శ్రామికవర్గ నియంతృత్వాన్ని కార్మిక రాజ్య వ్యవస్థగా నిర్మించడానికి తదుపరి ప్రయత్నం రష్యన్ విప్లవం చేసింది. విప్లవానంతరం గత పాలకవర్గాల విప్లవ ప్రతీఘాత చర్యలను అణచివేయడానికి, సోషలిజం అమలుకు అవసరమైన అన్ని చర్యలు -- ప్రధానంగా ఉత్పత్తి సాధనాలపై ప్రైవేటు యాజమాన్యం రద్దు -- సమర్థవంతంగా తీసుకోవడానికి కార్మిక రాజ్యం నియంతృత్వంగా ఏర్పడక తప్పదనేది ఈ భావనకున్న పునాది. బూర్జువా పాలన ప్రజాస్వామ్యంగా పేర్కొనబడుతున్నప్పటికీ, వాస్తవంలో అది బూర్జువా వర్గ నియంతృత్వం అనేది మార్క్సిస్టు భావన. దానికి ప్రత్యామ్నాయ రాజ్య రూపంగా శ్రామిక వర్గ నియంతృత్వం ప్రతిపాదించబడింది. అయితే, గత పాలకవర్గాలకు నియంతృత్వం పరిమితమవ్వాలి. కార్మిక జనావళికి అది నిజమైన ప్రజాస్వామ్యం కావాలి.

**కమ్యూనిస్టు మేనిఫెస్టో** విప్లవపు మొదటి అడుగు శ్రామికవర్గాన్ని పాలకవర్గ స్థాయికి పెంచడం, ప్రజాస్వామ్యం కోసం పోరాటంలో విజయం సాధించడం అని పేర్కొంది. బూర్జువా వర్గం నుండి క్రమేపీ మొత్తం పెట్టుబడిని స్వాధీనం చేసుకోవడానికి, అన్ని ఉత్పత్తి సాధనాలను రాజ్యం చేతులలో కేంద్రీకరించడానికి, మొత్తం ఉత్పత్తి శక్తులను వీలైనంత త్వరగా పెంపుదల చేయుడానికి ఈ పాలనాధికారాన్ని శ్రామికవర్గం ఉపయోగించాలని మార్క్స్ – ఏంగెల్స్ పేర్కొన్నారు. అయితే, తొలి దశలో ఆస్తి హక్కుపై, బూర్జువా ఉత్పత్తి విధానాలపై నిరంకుశ చర్యలు చేపట్టకుండా ఈ మార్పులు సాధ్యం కావని కూడా పేర్కొన్నారు. అంటే, కార్మికవర్గ ప్రజాస్వామ్యాన్ని, బూర్జువా ఆస్తి, ఉత్పత్తి విధానంపై నిరంకుశ విధానం చేపట్టడాన్ని ఒకే నాణానికి రెండు ముఖాలుగా చూడడం జరిగింది. వర్గాల ఉనికి ఉత్పత్తి అభివృద్ధిలో నిర్దుష్ట చారిత్రక దశలతో ముడిపడి ఉండడం, వర్గ సంఘర్షణ తప్పనిసరిగా కార్మికవర్గ నియంతృత్వానికి దారితీయడం, ఈ నియంతృత్వం వర్గాల రద్దుకి, వర్గరహిత సమాజ ఆవిర్భావానికి పరిణామ దశగా ఉండడం అనే మూడు ప్రతిపాదనలను ఋజువు చేయడమే తాను కొత్తగా చేసిన అనుదానమని వేడెమేయర్‌కి 1852లో రాసిన లేఖలో మార్క్స్ పేర్కొన్నాడు. పారిస్ కమ్యూన్ గురించి మార్క్స్ – ఏంగెల్స్‌ల అవగాహనను పైన పేర్కొన్నాము. లెనిన్ ఈ అవగాహనను,

చారిత్రక అనుభవాన్ని లోతుగా అధ్యయనం చేశాడు. బోల్షివిక్ పార్టీ విప్లవానంతర రాజ్యాన్ని కార్మిక వర్గ నియంతృత్వంగా స్పష్టంగా ప్రకటించింది. పాత రాజ్య యంత్రాంగాన్ని నిర్మూలించి కొత్త రాజ్య యంత్రాంగాన్ని నిర్మించడం కూడా ప్రతిపాదించింది. లెనిన్ **సోవియట్ ప్రభుత్వపు తక్షణ కర్తవ్యాలు** అనే రచనలో ఇలా పేర్కొన్నాడు :

"సోవియట్ అధికారం కార్మిక వర్గ నియంతృత్వానికి, పురోగామి వర్గ నియంతృత్వానికి నిర్మాణ రూపం మాత్రమే. అది లక్షలాది కార్మికులను, పీడిత ప్రజానీకాన్ని ఒక నూతన ప్రజాస్వామ్య స్థాయికి, రాజ్య పాలనలో స్వతంత్ర భాగస్వామ్యం దిశగా ఎదిగేట్లు చేస్తుంది. ఈ క్రమంలోనే వారు క్రమశిక్షణాయుతమైన, వర్గ చైతన్యపూరితమైన శ్రామికవర్గ అగ్రగామి దళం (పార్టీ) తమ విశ్వసనీయమైన నాయకుడని తెలుసుకుంటారు ..... అయితే, నియంతృత్వం అనేది పెద్దమాట. అటువంటి మాటలను నిర్లక్ష్యంగా వాడకూడదు. నియంతృత్వం అంటే దృఢమైన పాలన. దోపిడీదారులను, అక్రమార్కులను విప్లవాత్మకమైన ధైర్యం, వేగం, నిర్దాక్షిణ్యతలతో అణచివేసే ప్రభుత్వం."

కార్మికవర్గ నియంతృత్వం అనే భావన మార్క్స్ మౌలిక ప్రతిపాదనలలో ఒకటి అనడంలో సందేహం లేదు. బోల్షివిక్ పార్టీ నుంచి ఈ భావనను అన్ని కమ్యూనిస్టు పార్టీలు తమ సైద్ధాంతిక పునాదిలో భాగంగా స్వీకరించాయి. కొమింటర్న్ తన మేనిఫెస్టోలో ప్రపంచ వ్యాప్తంగా కార్మిక వర్గ నియంతృత్వాన్ని, సోవియట్ రిపబ్లిక్‌ని స్థాపించడం లక్ష్యంగా పేర్కొంది. 1970ల నుండి, ముఖ్యంగా సోవియట్ యూనియన్ పతనం పిమ్మట, అనేక యూరోపియన్ కమ్యూనిస్టు పార్టీలు సోషల్ డెమోక్రటిక్ పార్టీలుగా మారే క్రమంలో స్పష్టంగా తోసిపుచ్చిన భావనలలో కార్మికవర్గ నియంతృత్వం ప్రధానమైనది. అదే సమయంలో ఈ భావనను చారిత్రక అనుభవంతో బేరీజు వేయకుండా చెక్కుచెదరని శుద్ధ సైద్ధాంతిక ప్రతిపాదనగా పరిగణించే ధోరణి నేటికీ కొనసాగుతున్నది.

చారిత్రక అనుభవం నుండి చూస్తే సోవియట్ యూనియన్‌లో కార్మిక వర్గ నియంతృత్వం స్థానంలో పార్టీ నియంతృత్వం అమలు జరిగింది. ఇలా జరగడానికి బహుముఖ కారణాలున్నాయి : క్లిష్టమైన చారిత్రక పరిస్థితులు, బోల్షివిక్ పార్టీ అంతర్గత నిర్మాణంలోని సమస్యలు, మిగతా అన్ని కార్మిక వర్గ, రైతాంగ పార్టీలను రద్దు చేయటం, 1917లో 30 లక్షలు (ఇది అప్పటి రష్యన్ జనాభాలో 2.5%) గా ఉన్న కార్మిక వర్గ జనాభా అంతర్యుద్ధ క్రమంలో సగానికి సగం పడిపోవడం, అనేకమంది కార్మికులు గ్రామాలకు తరలి వెళ్ళడం, అధికారాన్ని ఉద్యోగస్వామ్యం చలాయించడం వీటిలో కొన్ని. సోవియట్లచే పార్టీ నియంత్రించబడటానికి బదులుగా పార్టీ సోవియట్లను నియంత్రించడం జరిగింది. పార్టీ నిర్మాణ చట్రంలోని కేంద్రీకృత విధానం ఏక వ్యక్తి నియంతృత్వానికి అవకాశం కల్పించింది. విప్లవానికి ముందు, విప్లవానంతర తొలి సంవత్సరాలలో బోల్షివిక్ పార్టీలో అంతర్గత ప్రజాస్వామ్యం బలంగా ఉండేది. 1921లో పార్టీలో అంతర్గత

ముతాలను రద్దు చేయడంతో ఈ అంతర్గత ప్రజాస్వామ్య ధోరణి క్షీణించసాగింది. లెనిన్ మరణానంతరం స్టాలిన్ ఆధిపత్యాన్ని సాధించే క్రమంలో అధికారిక ధోరణితో భేదాభిప్రాయాన్ని కలిగి ఉండడాన్ని విప్లవ ద్రోహంగా పరిగణించే విపరీత ధోరణి బలపడింది. 1936-38 మాస్కో విచారణలలో తొలితరం బోల్షివిక్ అగ్రనాయకులతో సహా అనేకమందిని స్టాలిన్‌ని, అధికార బృందాన్ని వేర్వేరు సందర్భాలలో ప్రశ్నించి, విభేదించిన నేరానికి చంపివేశారు లేదా ప్రవాసానికి పంపారు. దానితో అంతర్గత ప్రజాస్వామ్యం పూర్తిగా అడుగంటింది. లెనిన్‌లో ప్రగాఢమైన ప్రజాస్వామ్య భావన ఉంది. ఇది **ఒకడుగు ముందుకి, రెండడుగులు వెనక్కి** మరియు **రాజ్యం – విప్లవం** అనే రచనలలో ఆయన వ్యక్తం చేసిన భావాలలో స్పష్టంగా తెలుస్తుంది. అదే సమయంలో, కేంద్రీకృత వ్యవస్థని అన్నింటినీ మించిన ప్రాధాన్యంగా ఆయన పరిగణించేవాడు. ఆయన వేర్వేరు సందర్భాలలో ఈ రెండింటికీ సమాన ప్రాధాన్యత ఇచ్చినట్లు కనిపించినప్పటికీ, ఆచరణలో కేంద్రీకృత విధానానిది పైచేయి అయింది. సోవియట్ రాజ్య వ్యవస్థలో ప్రజాస్వామ్య స్ఫూర్తి మృగ్యం కావడానికి ఒక పార్టీ రాజ్య వ్యవస్థ ఒక ప్రధాన కారణం. అంతేకాక లెనిన్ ఒక సందర్భంలో వ్యక్తుల నియంతృత్వానికి, సోషలిజానికి మధ్య వైరుధ్యం లేదని పేర్కొన్నాడు. ఈ విషమ పరిస్థితికి తాను ప్రతిపాదిస్తున్న భావనలో ఆస్కారం ఉ ందని ఆయన అనుకొని ఉండడు. **సోవియట్ ప్రభుత్వపు తక్షణ కర్తవ్యాలు** అనే రచనలో వ్యక్తుల నియంతృత్వం బూర్జువా ప్రజాస్వామ్యానికి విరుద్ధమైనది కాదు అనే సూత్రీకరణ ఆధారంగా లెనిన్ సోషలిస్టు ప్రజాస్వామ్యానికి, వ్యక్తులు నియంతృత్వ అధికారాలు చలాయించడానికి మధ్య సూత్రరీత్యా ఎటువంటి వైరుధ్యం లేదని పేర్కొన్నాడు. లెనిన్ ఈ విధంగా పేర్కొనడానికి భూమిక ఏమైనప్పటికీ ఈ భావనను సమస్యాత్మకమైనదిగా పరిగణించక తప్పదు. వ్యక్తిగత నియంతృత్వాన్ని పరిమితులలో ఉంచడం సాధ్యం కాదు. అది మౌలిక ప్రజాస్వామ్య వ్యవస్థతో కలిసి పనిచేయలేదు. ఈ అవగాహనను భవిష్యత్ కార్యాచరణకు ప్రాతిపదికగా చేసుకోవాలి. చరిత్ర పునరావృతం కాకుండా జాగ్రత్తపడాలి.

పైన చెప్పినట్లుగా కార్మికవర్గ నియంతృత్వం అంటే కార్మిక వర్గానికి బూర్జువా సమాజపు పరిమితులు తొలగిపోయిన ప్రజాస్వామ్యం. గత పాలకవర్గాలలోని విప్లవ వ్యతిరేక శక్తులను అణచివేయడానికి, ఉత్పత్తి సాధనాల సామాజికీకరణపట్ల వారి వ్యతిరేక చర్యలను అరికట్టడానికి అవసరమైన మేరకు వారి పట్ల నియంతృత్వ పాలన. కాని ఆచరణలో ఈ విరుద్ధ అంశాలు ఒకే వ్యవస్థలో ఇమడటం సాధ్యం కాలేదు. దానితో ప్రజాస్వామ్య స్వేచ్ఛలపై ఆంక్షలు విప్లవ వ్యతిరేక శక్తులతోపాటు, కార్మికవర్గం విషయంలో కూడా అమలు చేశారు. ఇందుకు బహుశా ఒక కారణం, సోవియట్ రాజ్య వ్యవస్థ తొలిదశలో అనుసరించిన తాత్కాలిక విప్లవ ప్రభుత్వపు కఠిన, నిరంకుశ వైఖరి నుండి బయటపడలేదు. ఈ రాజ్య వ్యవస్థ దాని ఉనికి నిరంతరం ప్రమాదంలో ఉన్నట్లుగా

భావించడంతో తొలినాళ్ళ కఠినమైన పాలనా పద్ధతులను దశాబ్దాలపాటు కొనసాగించింది. పార్టీ – వర్గం మధ్య ఏర్పడిన అంతరం, ప్రజాబాహుళ్యపు మద్దతుపై ఉన్న అపనమ్మకం, కార్మికవర్గ ప్రజాస్వామ్యాన్ని నామమాత్రంగా మార్చడానికి దారి తీసింది. అంతేకాక, రాజ్య వ్యవస్థ పార్టీ నియంతృత్వంగా మారడమంటే కార్మికవర్గంపై కూడా నియంతృత్వాన్ని నెరపడం కాక తప్పదు. ఇదే ధోరణి కమ్యూనిస్టు పార్టీలు అధికారం నెరపిన దాదాపు అన్ని దేశాలలో చూడవచ్చు. నిజానికి విప్లవకర కార్మిక వర్గం తన విప్లవ బాధ్యతతో స్వచ్ఛందంగా అంగీకరించిన పరిమితులు తప్ప దాని ప్రజాస్వామ్యంపై వేరే పరిమితులు ఉండరాదు. కాని అలా జరగలేదు. నియంతృత్వం – ప్రజాస్వామ్యం అనే విరుద్ధ భావనల ఈ సమ్మిళిత వ్యవస్థని సోవియట్ రష్యా అమలు చేసిన తీరులోని సమస్యలను రోజా లగ్జంబర్గ్ 1918లో రాసిన తన **రష్యన్ విప్లవం** అనే రచనలో ఇలా పేర్కొన్నారు.

"అనేక శతాబ్దాల బూర్జువా వర్గ పాలనలో దిగజారిపోయిన ప్రజారాసుల నిజ జీవితంలో సంపూర్ణ ఆత్మిక పరివర్తన రావడమే సోషలిజం అవుతుంది. వ్యక్తి అహంకారం స్థానే సామాజిక ప్రవృత్తి, మందకొడితనం స్థానే ప్రజా చొరవ, కష్టాలను లెక్కచేయని ఆదర్శవాదం మొదలైనవి. లెనిన్ కంటే ఈ విషయాన్ని బాగా తెలిసిన వారు, బాగా హత్తుకొనే విధంగా చెప్పగలిగిన వారు, గట్టిగా పదేపదే చెప్పినవారు ఎవరూ లేరు. కాని వాటి సాధనకు ఉపయోగించిన మార్గాలలో లెనిన్ పూర్తిగా పొరబడ్డారు. డిక్రీల పద్ధతి, ఫాక్టరీ నిర్వాహకుని నియంతృత్వ ధోరణి, కఠినమైన శిక్షలను విధించడం, భయోత్పాత పాలన లాంటి పద్ధతులు తాత్కాలిక ఉపశమనాలే కాని అసలు వ్యాధిని మాన్పజాలవు. పునరుజ్జీవనానికున్న ఏకైక మార్గం ప్రజా జీవిత పాఠశాల, పరిమితులులేని ప్రజాస్వామ్యం, ప్రజాభిప్రాయం మాత్రమే. భయోత్పాత పాలన ప్రజల నైతిక స్థైర్యాన్ని క్రుంగదీస్తుంది.... దేశంలో రాజకీయ జీవితం మొత్తంగా అణచివేయబడడంతో సోవియట్లలోని జీవితం కూడా అంతకంతకూ ఎక్కువగా కుంటుపడక తప్పదు. సాధారణ ఎన్నికలు లేకపోతే, అపరిమితమైన పత్రికా స్వేచ్ఛ, సంఘ స్వేచ్ఛ లేకపోతే, అభిప్రాయాల మధ్య స్వేచ్ఛా పోరాటం లేకపోతే ప్రజా సంఘాలు క్రమంగా మృతప్రాయమవుతాయి. అవి కేవలం జీవచ్ఛవాలుగా మిగిలిపోతాయి. అధికార వర్గం మాత్రమే క్రియాశీల అంశంగా మిగిలి ఉంటుంది. క్రమేపి ప్రజా జీవనం నిద్రాణమైపోతుంది. అనంత శక్తి సామర్థ్యాలు, అపార అనుభవం కలిగిన కొద్దిమంది పార్టీ నాయకులే సమాజాన్ని నిర్దేశిస్తారు. పరిపాలిస్తారు. వాస్తవంలో వారిలోనూ ఒక డజనుమంది ప్రముఖ నాయకులు మాత్రమే మొత్తం వ్యవహారాలను నడుపుతారు. శ్రామికవర్గంలోని శిష్టవర్గాన్ని అవసరమొచ్చినపుడల్లా సమావేశాలకు ఆహ్వానిస్తారు. వీరి పనల్లా నాయకుల ఉపన్యాసాలకు చప్పట్లు కొట్టడం, ప్రతిపాదించబడిన తీర్మానాలను ఏకగ్రీవంగా ఆమోదించడం. తరచి చూస్తే ఇదంతా ఒక ముఠా వ్యవహారం మాత్రమే. ఇది నియంతృత్వమే. కాని శ్రామిక వర్గ నియంతృత్వం

మాత్రం కాదు. కేవలం కొద్దిమంది రాజకీయవేత్తల నియంతృత్వం. అంటే బూర్జువా అర్ధంలో నియంతృత్వం......వర్గ నియంతృత్వం అంటే అత్యంత క్రియాశీల ప్రజారాసుల అపరిమిత భాగస్వామ్యం. అంటే అపరిమిత ప్రజాస్వామ్యం ప్రాతిపదికగా ఏర్పడే అత్యంత విశాలమైన ప్రజాజీవన రూపం.... "మేం ఎప్పుడూ నామమాత్ర ప్రజాస్వామ్య ఆరాధకులం కాము" (ట్రాట్స్కీ). దీని అసలు అర్ధం ఇది: బూర్జువా ప్రజాస్వామ్య రాజకీయ రూపం నుండి సామాజిక సారాన్ని మేమెప్పుడూ వేరుచేసి చూస్తాం. నామమాత్ర సమానత్వం, స్వేచ్ఛలాంటి తీపి టెంకెచాటున దాగిఉన్న సామాజిక అసమానత, స్వేచ్ఛా రాహిత్యపు గుజ్జును ఎల్లప్పుడూ బహిర్గతం చేస్తాం. ఇలా చేయడంలో ఉద్దేశ్యం నామమాత్రపు సమానత్వం, స్వేచ్ఛలను తిరస్కరించడం కాక, కార్మిక వర్గం వాటితో సంతృప్తి పడకుండా చేసి, రాజకీయ అధికారాన్ని జయించి బూర్జువా ప్రజాస్వామ్యం స్థానే సోషలిస్టు ప్రజాస్వామ్యాన్ని సృష్టించేందుకు వారిని ప్రోత్సహించడం. అంతేకాని ప్రజాస్వామ్యాన్ని మొత్తంగా నిర్మూలించేందుకు మాత్రం కాదు." ("రష్యన్ విప్లవం" – రచన : రోజా లగ్జంబర్గ్ – సమీక్ష ప్రచురణలు, విజయవాడ – ఆగస్టు 2004 – పేజీలు 46, 47, 50).

కమ్యూనిస్టు దేశాల ప్రస్థానాన్ని నిష్పక్షపాతంగా గమనించిన వారికి రోజా లగ్జంబర్గ్ చేసిన భవిష్యద్దర్శనం ఆశ్చర్యంగొల్పక మానదు. శుద్ధ సిద్ధాంతవాద బందిఖానా నుండి బయటపడి, బూర్జువా ప్రజాస్వామ్యంలో విస్తృత జనావళికి అనుభవైకవేద్యం కాని చట్టబద్ధ హక్కులను వారికి వాస్తవంగా, సంపూర్ణంగా అందించడమే కార్మికవర్గ నియంతృత్వం సారాంశంగా గ్రహించాలి. నియంతృత్వ పాలనను సర్వవ్యాప్తం చేసిన చారిత్రక వారసత్వాన్ని తిరస్కరించాలి.

ఈ అంశంతో ముడిపడి ఉన్నాయని భావిస్తున్న మరో మూడు అంశాలను క్లుప్తంగా దిగువ పేర్కొంటున్నాము.

1) నియంతృత్వం అనే భావనని ప్రధానంగా బలప్రయోగంతో విప్లవ ప్రతీఘాత శక్తులను అణచివేయడంగా చూడడం. దీనిపై అత్యధిక కేంద్రీకరణ మూలంగా ప్రజారాసుల విస్తృత ప్రజాస్వామ్యాన్ని నిర్మించడానికి సమాంతరంగా జరగాల్సిన కృషి కుంటుపడింది. ఈ దిశలో కార్మిక – కర్షక తనిఖీ వ్యవస్థ ద్వారా లెనిన్ చేసిన ప్రయత్నం విజయవంతం కాకపోవడంతో మొత్తం రాజకీయ వ్యవస్థని ప్రజాస్వామ్య రాహిత్యం ఆవహించింది.

2) లెనిన్ సాంస్కృతికపరమైన కృషిని బలంగా నొక్కి చెప్పినప్పటికీ అది నెరవేరలేదు. భావజాలపరమైన ఆధిపత్యం వర్గ ఆధిపత్యానికి నిజమైన పునాది అవుతుందని తరువాత దశలో గ్రాంసీ పేర్కొన్న భావనను సోషలిజం సైద్ధాంతిక పునాదిలో భాగం చేయాలి.

3) మార్క్స్ – ఏంగెల్స్ శ్రామికవర్గ నియంతృత్వ భావనని ప్రతిపాదించే

నాటికి బూర్జువా ప్రజాస్వామ్యం శ్రామిక జనావళికి, స్త్రీలకు ఓటుహక్కు, ఇతర చట్టబద్ధ హక్కులు కల్పించలేదు. ఇంకా 8 గంటల పనిదినం రాలేదు. ఫాక్టరీలలో శ్రామికుల పని స్థితిగతులు దుర్భరంగా ఉండేవి. వారి ఆర్థిక వెనుకబాటుతనం వల్ల, జీవన పోరాటంలో నిరంతర శ్రమ చేయవలసి రావడం వల్ల, నామ మాత్రపు విద్య వల్ల కార్మికవర్గ పాత్ర రాజకీయ వ్యవస్థలో నామమాత్రంగా ఉండేది. ఈ పరిస్థితులలో మార్క్స్ – ఏంగెల్స్ దానిని బూర్జువావర్గ నియంతృత్వంగా పరిగణించి, దాని స్థానే కార్మికవర్గ నియంతృత్వాన్ని ప్రతిపాదించారు. గత 150 సంవత్సరాల కాలంలో, కార్మికవర్గ, స్త్రీ విమోచన పోరాటాల కారణంగా, మార్క్సిజం స్పష్టంగా ఎజెండా పైకి తెచ్చిన పెట్టుబడిదారీ విధాన పతనం నుండి తప్పించుకునేందుకు, బూర్జువా ప్రజాస్వామ్యం ఉదారవాద ప్రజాస్వామ్యం రూపంలో దేశ ప్రజానీకం మొత్తానికి చట్టబద్ధ సమానత, పౌరహక్కులు కల్పించే దిశగా పరిణతి చెందింది. మొత్తం మీద చట్టబద్ధపాలనను అమలు చేస్తోంది. దీని అంతిమ లక్ష్యం పెట్టుబడిదారీ విధాన పరిరక్షణ అయినప్పటికీ, దీని నూతన స్వభావం వెలుగులో కార్మికవర్గ నియంతృత్వ భావనని పునఃపరిశీలించి, దాని తీరుతెన్నులను పునర్నిర్వచించాలి. అది గత పాలకవర్గాలకైనా అతి కొద్ది కాలం అమలులో ఉండేదిగా, ఆ కాలంలో కూడా కార్మిక జనావళికి నిజమైన ప్రజాస్వామ్యంగా ఉండేదిగా, ఆ కొద్ది పరిణామ దశ దాటగానే మొత్తం ప్రజానీకానికి ప్రజాస్వామ్య హక్కులు అన్నీ సంక్రమించే విధంగా ఈ పునఃసమీక్ష ఉండాలి. అభివృద్ధి చెందిన పెట్టుబడిదారీ దేశాలలో సోషలిస్టు పరివర్తన జరిగినప్పుడు, ఆ స్వల్పకాలపు పరిణామ దశలో కూడా యావత్ ప్రజానీకానికి పూర్తి ప్రజాస్వామ్య హక్కులు అన్వయించడం సాధ్యం కావచ్చు. హక్కులపై ఎవరికీ చట్టబద్ధ పరిమితులు విధించకుండా, సోషలిస్టు సమాజ నిర్మాణానికి అవసరమైన చర్యలకు ఏర్పడే అడ్డంకులను ప్రత్యేక చట్టాల ద్వారా ఈ దేశాలలో పరిష్కరించడం సాధ్యమౌతుందని భావించవచ్చు. ఇవన్నీ ప్రధానంగా ఆచరణలో తేలే అంశాలైనప్పటికీ కొంత సైద్ధాంతిక పునఃసమీక్ష కార్యాచరణలో స్పష్టతకు తోడ్పడుతుంది.

**5. ఒక పార్టీ రాజ్య వ్యవస్థ. కమ్యూనిస్టు మేనిఫెస్టో**లో మార్క్స్ – ఏంగెల్స్ ఇలా పేర్కొన్నారు :

“కమ్యూనిస్టులు ఇతర కార్మికవర్గ పార్టీలకు వ్యతిరేకంగా వేరే పార్టీ స్థాపించరు......కమ్యూనిస్టులు ఇతర కార్మిక వర్గ పార్టీల నుండి ఈ విషయాలలో భిన్నంగా ఉంటారు : (1) జాతీయ స్థాయిలో వివిధ దేశాలలో జరిగే కార్మికవర్గ పోరాటాలలో, జాతీయతతో నిమిత్తం లేకుండా యావత్ కార్మికవర్గం సమష్టి ప్రయోజనాలను కమ్యూనిస్టులు ముందుకు తీసుకువస్తారు, (2) బూర్జువా వర్గానికి వ్యతిరేకంగా కార్మికవర్గ పోరాటం సాగే వివిధ అభివృద్ధి దశలలో వారు ఎల్లప్పుడు, అన్ని సందర్భాలలోను యావత్ ఉద్యమపు ప్రయోజనాలకు ప్రాతినిధ్యం వహిస్తారు. అందువలన ఒకవైపు నుండి చూస్తే ప్రతి

దేశంలోని కార్మికవర్గ పార్టీలలో కమ్యూనిస్టులు ఆచరణలో అత్యంత పురోగామియైన, దృఢతరమైన భాగం. మిగతా అందరినీ ముందుకు నెట్టే భాగం. మరోవైపు, విశాల కార్మికవర్గ సమూహంతో పోలిస్తే కార్మికోద్యమపు దిశ, పరిస్థితులు, అంతిమ సాధారణ పర్యవసానాలపట్ల స్పష్టమైన సైద్ధాంతిక అవగాహన వీరు కలిగి ఉంటారు. కమ్యూనిస్టుల తక్షణ కర్తవ్యం ఇతర కార్మికవర్గ పార్టీలలాంటిదే: కార్మికులను ఒక వర్గంగా రూపొందించడం, బూర్జువా ఆధిపత్యాన్ని కూలద్రోయడం, కార్మికవర్గం రాజకీయాధికారాన్ని గెల్చుకోవడం...... క్లుప్తంగా చెప్పాలంటే, కమ్యూనిస్టులు ప్రతిచోట అమలులో ఉన్న సామాజిక, రాజకీయ వ్యవస్థలకు వ్యతిరేకంగా జరిగే ప్రతి విప్లవోద్యమాన్ని సమర్థిస్తారు. ఈ అన్ని ఉద్యమాలలోను, ఆనాటికి దాని అభివృద్ధి స్థాయి ఏదైనప్పటికీ, అత్యంత ప్రధానమైన ప్రశ్నగా ఆస్తి సమస్యను వారు ముందుకు తీసుకు వస్తారు. అంతిమంగా, అన్ని దేశాలలోని ప్రజాస్వామ్య పార్టీల మధ్య ఐక్యత, అంగీకారం కోసం వారు ప్రతిచోట కృషి చేస్తారు." (**మేనిఫెస్టో ఆఫ్ ది కమ్యూనిస్టు పార్టీ**, ప్రోగ్రెస్ పబ్లిషర్స్, మాస్కో, 1973, పేజీలు. 61, 62, 96).

కమ్యూనిస్టులు మిగతా కార్మికవర్గ పార్టీలు, నిబద్ధ ప్రజాస్వామ్య పార్టీలతో కలిసి పని చేయాలని, వారి విప్లవ, అంతర్జాతీయ దృక్పధానికి అనుగుణంగా ఈ కృషి ఉండాలని **కమ్యూనిస్టు మేనిఫెస్టో** చెబుతోంది. అయితే, చారిత్రక క్రమంలో సోషలిస్టు పార్టీల మధ్య అనేక విభేదాలు తలెత్తాయి. మొదటి ఇంటర్నేషనల్‌లో మార్క్స్, బకునిన్ భావాల మధ్య ఘర్షణ జరిగింది. బకునిన్‌ని ఇంటర్నేషనల్ నుండి బహిష్కరించారు. 1875లో గోతాలో జరిగిన రెండు జర్మన్ కార్మిక పార్టీల ఐక్యతా సదస్సులో ఏర్పడిన సోషల్ డెమోక్రటిక్ పార్టీ (మొదట్లో ఈ పార్టీ సోషలిస్టు వర్కర్స్ పార్టీగా పిలవబడేది), 1914లో ప్రారంభమైన మొదటి ప్రపంచ యుద్ధం కారణంగా మూడుగా చీలిపోయింది. రష్యాలోని సోషల్ డెమొక్రటిక్ లేబర్ పార్టీ 1902 కాంగ్రెస్‌లో రెండుగా చీలిపోయింది. కార్మికవర్గ విప్లవోద్యమంలో భిన్న దృక్కోణాలు కల బృందాలు/పార్టీలు కలిసి పనిచేసే ప్రాతిపదిక ఏర్పడలేదు. ఎవరికి వారు తమ ఒక్కరిదే సరైన దృక్పధమని, మిగతావారిది అవకాశవాదం, దుందుడుకువాదం అని భావించడం జరుగుతూ వస్తున్నది. నిజానికి, రష్యన్ విప్లవ క్రమంలో కొన్ని అనార్కిస్టు బృందాలు, వామపక్ష సోషలిస్టు రివల్యూషనరీలు బోల్షివిక్కులకు మద్దతు నిచ్చారు. విప్లవానంతరం ప్రభుత్వంలో కొంతకాలం ముగ్గురు సోషలిస్టు రివల్యూషనరీలు కమిస్సార్లుగా ఉన్నారు. బ్రెస్ట్ – లిటోవ్‌స్క్ ఒప్పందానికి, కార్మిక వర్గ స్వేచ్ఛకు పరిమితులు విధించడానికి నిరసనగా ఈ పార్టీ ప్రభుత్వం నుండి వైదొలిగింది. అంతే కాక ఈ పార్టీ హింసాత్మక ప్రతిఘటనవైపు మళ్ళడంతో కూడా ఈ సంబంధం విచ్ఛిన్నమయింది ఉక్రెయిన్‌లో జరిగిన అంతర్యుద్ధంలో బోల్షివిక్కులతో కలిసి అనార్కిస్టులు కూడా పోరాడినప్పటికీ, అంతర్యుద్ధం ముగిసిన వెంటనే రెడ్ ఆర్మీ అనార్కిస్టుల

సాయుధ దళాలను దేశం నుండి తరిమివేయడంతో ఈ సంబంధం విచ్ఛిన్నమైంది. మరోవైపు మెన్షివిక్కులు, వామపక్ష సోషలిస్టు రివల్యూషనరీలలో అనేకమంది బోల్షివిక్ పార్టీలో చేరారు. మిగిలిన వారు ప్రవాసంలోకి వెళ్ళారు.

మొదట్లో సోవియట్ ప్రభుత్వం లెనిన్ నాయకత్వాన స్వతంత్ర అస్తిత్వంతో పని చేసేది. కాని లెనిన్ స్వయంగా కొన్ని ప్రభుత్వపరమైన సమస్యలను పొలిట్‌బ్యూరోలో చర్చకు తీసుకురావడం ప్రారంభించడంతో ప్రభుత్వంపై పార్టీ అజమాయిషీకి అవకాశం కలిగింది. లెనిన్ అనంతరం ఈ ధోరణి మరింత బలపడి ఒక నూతన తరహా అధికార వ్యవస్థగా రూపొందింది. 1921లో క్రాన్‌స్టట్ తిరుగుబాటు పిమ్మట ఇతర పార్టీలపై, బోల్షివిక్ పార్టీలో అంతర్గత ముఠాలపై నిషేధం విధించారు. ఇతర పార్టీలకు క్రమేపీ సోవియట్ యూనియన్‌లో ఉనికి లేకుండా పోయింది. పార్టీలో ఫాక్షన్లను నిషేధించడంతో పార్టీని ఏకశిలా సదృశంగా చూడడం ప్రారంభమయింది. ఇది మొదట తాత్కాలిక నిర్ణయంగా చూడబడినప్పటికీ, అది బోల్షివిక్ ఉక్కు క్రమశిక్షణ పేరిట కమ్యూనిస్టు పార్టీ ప్రధాన స్వాభావిక లక్షణంగా కొనసాగింది. అప్పటి క్లిష్ట పరిస్థితులలో ఈ చర్య తీసుకోవడానికి గల నేపథ్యం మనం అర్థం చేసుకోవచ్చు. అయితే లెనిన్ మరణానంతరం (1924) కూడా ఫాక్షన్ల మధ్య పోరు కొనసాగింది. స్టాలిన్ అధికారం సుస్థిరం కావడంతో అది ముగిసింది. అప్పటి నుండి అధికారిక సిద్ధాంతాలను, విధానాలను, నిర్ణయాలను విమర్శించడం, వ్యతిరేకించడం ఒక భేదాభిప్రాయంగా కాక పెడధోరణిగా, విప్లవ ద్రోహంగా పరిగణించడం ప్రారంభమైంది. ఈ క్రమం 1936–38 మాస్కో విచారణలలో అనేకమంది తొలితరం బోల్షివిక్ నాయకులను, మేధావులను చంపివేయడంతో పరాకాష్టకు చేరుకుంది. ఇలా రూపుదిద్దుకున్న ఒక పార్టీ రాజ్య వ్యవస్థ, సోషలిజం సాధనకు ఒకే ఒక్క మార్గమని సిద్ధాంతీకరించబడింది. శ్రామికవర్గ నియంతృత్వం అంటే ఒక్క కార్మికవర్గ పరిపాలన (అంటే రైతాంగంతో అలయన్స్ ఉన్నప్పటికీ ఆ వర్గం పాలకవర్గంగా పరిగణింప బడదు) అన్న లెనిన్ భావన నుండి స్టాలిన్ తన "లెనినిజం సమస్యలు" అన్న రచనలో రైతాంగంతో అలయన్స్ ఉన్నప్పటికీ ఒక్క కమ్యూనిస్టు పార్టీ మాత్రమే అధికారాన్ని నిర్వహించడం ద్వారా, ఇతర పార్టీలకు అధికారంలో స్థానంలో లేకుండా చేయడం ద్వారా, శ్రామికవర్గ నియంతృత్వం నెరవేర్చబడుతుందని పేర్కొన్నాడు. ఇతర బోల్షివిక్ నాయకులలో (ఉదా: జినొవీవ్) కూడా ఈ భావన కనిపిస్తుంది. సోషలిస్టు రాజ్య వ్యవస్థలలో ప్రజాస్వామ్య రాహిత్యం చోటుచేసుకోవడానికి ఒక పార్టీ రాజ్య వ్యవస్థ ఒక ప్రధాన కారణం. స్టాలిన్ రచనలో ఈ వ్యవస్థ పార్టీ నియంతృత్వంగా మారకుండా, శ్రామికవర్గ నియంతృత్వానికి ప్రాతినిధ్య వ్యవస్థగా మాత్రమే కొనసాగడానికి అవసరమైన జాగరూకతలు పేర్కొన్నాడు. కాని బోల్షివిక్ పార్టీ అంతర్గత స్వభావంలోని సమస్య, ఒక పార్టీ (అంతర్గత ముఠాలు నిషేధించబడిన పార్టీ) రాజ్య వ్యవస్థకు ఉండిన ప్రజాస్వామ్య వ్యతిరేక స్వభావం

కలిసి ఈ వ్యవస్థను వాస్తవంలో పార్టీ నియంతృత్వంగా, కొన్ని సందర్భాలలో వ్యక్తుల నియంతృత్వంగా మార్చివేశాయి. ఇక్కడ గుర్తించాల్సిన ప్రధాన అంశం రాజ్యం, రాజకీయ పార్టీ పూర్తిగా వేర్వేరు అంశాలు. వాటి నిర్మాణాలు వేర్వేరుగా ఉండాలి. అధికార పార్టీ రాజ్య నిర్ణయాలు తీసుకోవడం పూర్తిగా అసంబద్ధమైన విషయం. ఎందుకంటే పార్టీ నిర్మాణం మరింత అవృతంగా, క్రమశిక్షణాయుతంగా, శ్రేణీ వ్యవస్థలా ఉంటుంది. రాజ్యానికి అవసరమైంది మరింత పట్టువిడుపులతో, ప్రజా రాజకీయ భాగస్వామ్యం సాధ్యమయ్యే, సమాంతర తరహాలో ఉండే నిర్మాణ రూపం. అందువల్లనే, బోల్షివిక్ పార్టీ రాజ్యాన్ని నడిపించడం తప్పనిసరిగా నియంతృత్వ ధోరణులకు దారితీసింది. ఈ వ్యవస్థ సోవియట్ యూనియన్, తదితర దేశాలలో సోషలిజం పతనానికి గల ప్రధాన కారణాలలో ఒకటి. లెనిన్ ఒక సందర్భంలో కామెనెవ్ పార్టీ నిర్ణయంతో విభేదించడాన్ని ప్రస్తావిస్తూ, కామెన్వ్ వాదనలు సమాజంలోని కొన్ని శ్రేణుల దృక్పధానికి సూచికలని, అందువల్ల అవి విలువైనవని, కాబట్టి కామెనెవ్‌కి వ్యతిరేకంగా ఎట్టి చర్యలు అవసరం లేదని అన్నాడు. సరిగ్గా ఈ ప్రయోజనాన్నే ఒక పార్టీ రాజ్య వ్యవస్థ వల్ల కమ్యూనిస్టు పార్టీలు కోల్పోయాయి. వేరే పార్టీల రూపంలో ప్రభుత్వ విధానాలలోని సమస్యల పట్ల విమర్శలకు అవకాశం ఎలాగూ లేదు. పార్టీలో కూడా మైనారిటీ అభిప్రాయానికి కొనసాగే అవకాశం లేకపోవడంతో, ప్రజాభిప్రాయం తెలియడానికి అన్ని దారులు మూసుకు పోయాయి. ఆధునిక పరిభాషలో చెప్పాలంటే సమాచార సంచయం (feed back) లేకుండా పోయింది. కాని నిజానికి అంతర్లీనంగా, గుంభనగా పార్టీ అధికార విధానాలకు వ్యతిరేకత పార్టీలోనే కొనసాగింది. ఇది అనివార్యం. కమ్యూనిస్టు పార్టీలలోని సంప్రదాయవాదులు రివిజనిజంగా భావించే ధోరణులకు ఇక్కడే బీజం ఉంది. పార్టీలో ఆరోగ్యకరమైన భావ సంఘర్షణకు అవకాశం ఉండి ఉంటే డీస్టాలినైజేషన్, మావో తదనంతరం డెంగ్ విధానాలు, గోర్బచెవ్ పెరిస్త్రోయికా లాంటి సంక్షుభిత మార్పుల అవసరం ఉండేది కాదు. చివరికి, ఈ సంస్కరణలు కూడా సోషలిజం పతనాన్ని వేగవంతం చేయడం మాత్రమే సాధించగలిగాయి. ఎందుకంటే, వేరే శ్రామికవర్గ పార్టీలు లేనంతకాలం, ఒక్క పార్టీ లోపల దాని పతనం కూడా ఇమిడి ఉంటుది. ఈ వ్యవస్థ అప్పటికే దాని ఉనికిని నిరవధికంగా కొనసాగించుకునే ధోరణికి లోనయినప్పటికీ, పార్టీలో, రాజ్య వ్యవస్థలో చేపట్టిన అంతర్గత సంస్కరణలు నెరవేర్చలేక కూలిపోయింది. సోషలిజం పతనానికి పెట్టుబడిదారీ వ్యవస్థ నుండి నిరంతర వ్యతిరేకత, ప్రచ్ఛన్న యుద్ధం వల్ల శక్తికి మించి రక్షణపై ఖర్చు పెట్టవలసి రావడం, పెట్టుబడి అంతర్జాతీయ సంచయంలో భాగం కావడానికి వ్యవస్థాపరమైన ఒత్తిడి, తదితర బాహ్య కారణాలు కూడా ప్రబలంగా పనిచేశాయి. అయితే, ఇక్కడ మా ప్రయత్నం సోషలిజం పతనానికి దోహదం చేసిన అంతర్గత అంశాల పరిశీలన. అందువల్ల, చారిత్రక అనుభవాన్ని మదింపు చేసుకుని,

సోషలిజాన్ని పునర్నిర్వచించే క్రమంలో ఒక బహుళత్వ ప్రాతిపదిక భవిష్యత్ సోషలిజానికి కల్పించగలగాలి. ఒక పార్టీ రాజ్య వ్యవస్థ సోషలిజం సాధనకు వాహకం కానేరదని గుర్తించాలి. ప్రతికూల బాహ్య పరిస్థితులలో మార్పు కోసం నిరంతరం కృషి జరగాలి.

**6. ఒక దేశంలో సోషలిజం.** సోషలిజం అంతర్జాతీయంగానే సాధ్యమౌతుందనేది మౌలిక మార్క్సిస్టు అవగాహన. ఎందుకంటే పెట్టుబడిదారీ వ్యవస్థ అంతర్జాతీయ వ్యవస్థ. అయితే, అన్ని పెట్టుబడిదారీ దేశాలలో ఒకేసారి విప్లవం జరగదని, అలాగే ప్రపంచంలో పెట్టుబడిదారీ విధానం అనేక దేశాలలో ఇంకా ప్రాథమిక దశలో ఉన్నదని స్పష్టమైన అవగాహన ఉంది. స్థలకాలాదుల సామీప్యతతో కొన్ని దేశాలలో సోషలిస్టు దశ ఆవిర్భవిస్తుందని, ఇది ఒక సమష్టి వ్యవస్థగా స్థిరపడి, క్రమేపీ మిగతా పెట్టుబడిదారీ దేశాలకు, తదుపరి మిగతా ప్రపంచానికి వ్యాపిస్తుందనే ఒక విశాల అవగాహన తొలి రెండు తరాల సోషలిస్టులకు / కమ్యూనిస్టులకు ప్రధాన స్ఫూర్తిగా ఉండేది. బోల్షివిక్ పార్టీ కూడా ఇదే స్ఫూర్తితో తన విప్లవ కార్యక్రమం చేపట్టింది. రష్యన్ విప్లవం తరువాత జరిగిన జర్మన్, హంగేరియన్, బవేరియన్ విప్లవాలు విఫలం కావడం, యూరోప్‌లో విప్లవావకాశాలు సన్నగిల్లడంతో 1920ల నాటికి సోవియట్ యూనియన్ సుదీర్ఘకాలం పాటు ప్రపంచంలో ఒకే ఒక్క సోషలిస్టు దేశంగా మనుగడ సాగించక తప్పదని రూఢి అయింది. ఈ పరిస్థితి బోల్షివిక్ పార్టీలో తీవ్రమైన అంతస్సంఘర్షణకు దారి తీసింది. పెట్టుబడిదారీ విధానంలో తప్పనిసరిగా ఉండే అసమ అభివృద్ధి కొన్ని దేశాలలో ఒకేసారి లేక ఒక దేశంలోనైనా సోషలిజం విజయాన్ని సాధ్యం చేస్తుందనే అభిప్రాయం లెనిన్ ఒక సందర్భంలో వ్యక్తం చేసినప్పటికీ, తన చివరి రచన **తక్కువే మేలు, కాని మేలుగా ఉండాలి** లో "సోషలిజంలోకి నేరుగా పోవడానికి మనకు రాజకీయంగా అవసరమైనవన్నీ ఉన్నప్పటికీ, తగినంత నాగరికత లేదు" అని పేర్కొన్నాడు. కార్మికవర్గ నాయకత్వంలో కార్మిక – కర్షక కూటమిని కొనసాగించడం, భారీ యంత్ర పరిశ్రమల అభివృద్ధి, బలోపేతమైన కార్మిక – కర్షక తనిఖీ వ్యవస్థ ఆధ్వర్యంలో ప్రభుత్వ యంత్రాంగాన్ని సమగ్రంగా ప్రక్షాళన చేయడం ద్వారా సోవియట్ వ్యవస్థని రక్షించుకోవాలని పేర్కొనడంతో లెనిన్ తన చివరి రచనను ముగించాడు (ప్రస్తుత ప్రచురణకు అనుబంధం – IX). 'ఒక దేశంలో సోషలిజం' అనే సమస్య లెనిన్ మరణానంతరం బోల్షివిక్ పార్టీ అంతర్గత పోరులో అత్యంత కీలకమైన అంశంగా ముందుకు వచ్చింది. లెనిన్ వారసత్వం కోసం పోరాటం ప్రధానంగా ఈ అంశం చుట్టూనే జరిగింది. లెనిన్ సోవియట్ యూనియన్‌లో సోషలిజం నిర్మాణం చేపట్టడం సాధ్యమౌతుందని కాని దానిని పరిపూర్తి చేయడం సాధ్యం కాదని చెప్పాడని జినొవీవ్ తదితరులు అభిప్రాయపడగా, లెనిన్ సోషలిజం నిర్మాణాన్ని పరిపూర్తి చేయడం ఒక దేశం పరిధిలో సాధ్యమౌతుందన్నాడని స్టాలిన్ తదితరులు వాదించారు. లెనిన్ చివరి దశలో గ్రామీణ వ్యవస్థలో సోషలిజాన్ని ప్రవేశపెట్టడానికి

సహకార వ్యవస్థను ప్రతిపాదించాడు. సహకార వ్యవస్థలో భూమిపై వ్యక్తిగత హక్కు ఉంటుంది కావున, ఈ వ్యవస్థ సంపూర్ణ సోషలిజానికి ప్రాతిపదిక కాగలదని లెనిన్ భావించాడని అంగీకరించడం కష్టం. ఒక దేశంలో సోషలిజం సాధ్యమని లెనిన్ భావించాడనేది కమ్యూనిస్టు పార్టీల సాంప్రదాయక అవగాహన. ఇప్పటి ప్రపంచీకరించ బడిన పెట్టుబడిదారీ వ్యవస్థ చట్రం నుండి బయటపడడానికి మరల ఈ భావన వైపు లెనినిజాన్ని అనుసరించే పార్టీలు మరలుతున్నట్లు కనిపిస్తోంది. అయితే, స్వతంత్ర మార్క్సిస్టు మేధావులు అనేకమంది సోషలిజం అంతర్జాతీయంగా మాత్రమే సాధ్యమనే అవగాహనకు లెనిన్ కట్టుబడి ఉన్నాడని అభిప్రాయపడ్డారు. అంటే, లెనిన్ ఒక దేశ పరిధిలో ఒక పరివర్తనా సమాజాన్ని మాత్రమే నెలకొల్పగలమని భావించాడని వీరి వాదన. ఏది ఏమైనా ఒక దేశంలో సోషలిస్టు వ్యవస్థని పూర్తిస్థాయిలో సాధించవచ్చునని, కాని పెట్టుబడిదారీ విధానం పునరుద్ధరణ జరగకుండా అంతిమ విజయం సాధించడం మాత్రం అనేక దేశాలలో సోషలిస్టు విప్లవాలు విజయం సాధించిన పిమ్మట అంతర్జాతీయంగా మాత్రమే సాధ్యమౌతుందని స్టాలిన్ వాదించాడు. ఈ అవగాహన లెనిన్ నుండి తీసుకున్నట్లుగా ఆయన పేర్కొన్నాడు. ఈ ప్రతిపాదనకు చారిత్రక సందర్భం, అంతర్గత పరిస్థితులు బలాన్నిచ్చాయి. మార్క్సిస్టు అంతర్జాతీయ వాదం ప్రాతిపదికగా దీనిని వ్యతిరేకించిన వారు పూర్తిగా ఆత్మ రక్షణలో పడ్డారు. ఆ రోజు ఈ భావన గెలుపొందడం ఒక భావోద్వేగ విజయంగా కూడా చూడబడింది. దీని నుండి వెంటనే జరిగిన పర్యవసానం సమష్టి వ్యవసాయ క్షేత్రాల స్థాపన. నూతన ఆర్థిక విధానం ఈ చర్యతో పరిసమాప్త మయింది. వ్యవసాయ రంగంలో పూర్తిస్థాయి సోషలిస్టు విధానాల అమలు ప్రారంభమయింది. గ్రామీణ వ్యవస్థ నుండి రాజ్యానికి అందవలసిన పన్నుల వసూలులో సమస్యలు, పారిశ్రామిక అభివృద్ధికి అవసరమైన పెట్టుబడికి గ్రామీణ ఆర్థిక వ్యవస్థ ఆధారం కావడం, ఇందుకు వేరే ప్రత్యామ్నాయాలు లేకపోవడం, పట్టణ ప్రాంతాలకు వ్యవసాయ ఉత్పత్తుల సరఫరాలో ఏర్పడిన సమస్యలు, గ్రామీణ ప్రాంతాలలో రాజ్య వ్యవస్థ పట్ల వ్యతిరేకత లాంటి బలమైన కారణాలు ఈ చర్య తీసుకోవడానికి కారణమయ్యాయి. అయితే ఆకస్మికంగా ఎటువంటి హేతుబద్ధ పరిణామ దశ లేకుండా ఈ చర్య తీసుకోవడం వల్ల, దాని అమలులో ఒత్తిడి, బలప్రయోగం పెద్ద ఎత్తున ప్రయోగించారు. ఇది సోవియట్ వ్యవసాయ రంగంపై శాశ్వతమైన ప్రభావాన్ని చూపింది. 1930లలో చోటు చేసుకున్న క్షామ పరిస్థితులకు ఈ విధానపరమైన మార్పు కొంత వరకు కారణం. వ్యవసాయ ఉత్పాదకతలో పెరుగుదల మందకొడిగా ఉండడం ఈ మార్పు పర్యవసానాలలో ఒకటి. అయితే, 1930లలో సోవియట్ యూనియన్ సాధించిన అనూహ్యమైన పారిశ్రామిక ప్రగతికి ఈ మార్పు ద్వారా గ్రామీణ మిగులును రాజ్యం వసూలు చేయగలగడం పెద్దఎత్తున దోహదం చేసింది. అయితే నూతన ఆర్థిక విధానాన్ని

కొనసాగించి, తద్వారా వ్యవసాయ ఉత్పాదకతను పెంచగలిగితే, ఇదే స్థాయిలో మిగులు పారిశ్రామిక అభివృద్ధికి లభించే ప్రత్యామ్నాయం ఉందని, జరిగిన చారిత్రక పరిణామం అనివార్యం కాదనే అభిప్రాయం కూడా బలంగా ఉంది.

ఇవన్నీ జరిగినప్పటికీ ఒక దేశంలో సోషలిజం సాధ్యం కాలేదు. సోవియట్ల స్థానే పార్టీ పరిపాలన సాగడంతో, కార్మిక వర్గం పాలక వర్గంగా ఉండడం సాధ్యం కాలేదు. కార్మిక వర్గం పాలక వర్గంగా ఏర్పడి, నిజమైన కార్మికవర్గ ప్రజాస్వామ్యం పరిఢవిల్లినప్పుడు మాత్రమే ఉత్పత్తి సాధనాలపై రాజ్య నియంత్రణ సామాజికీకరణ అవుతుంది. సోవియట్ రాజ్య వ్యవస్థలో అది మృగ్యమయింది. కార్మికవర్గ ప్రజాస్వామ్యం వాస్తవీకరించబడాలంటే సోవియట్ల ప్రిసీడియం ద్వారా ఏర్పడిన ప్రభుత్వం నిజమైన అధికారాన్ని చలాయించాలి. పార్టీ పొలిట్‌బ్యూరో కాదు. సోవియట్లకు, ఫాక్టరీలకు, వ్యవసాయ క్షేత్రాలకు ఎన్నికల ద్వారా నిర్వహకులు ఎంపిక కావాలి. నియామకాల ద్వారా కాదు. నియామకాల సంస్కృతి ఏర్పడడం, బోల్షివిక్ పార్టీ అంతర్గత పరిస్థితి ప్రతిఫలనం అని చెప్పవచ్చు. సోషలిజం అభివృద్ధి చెందిన పెట్టుబడిదారీ సమాజపు తరువాతి దశ కాబట్టి, ఉత్పాదకత పెట్టుబడిదారీ వ్యవస్థలోని స్థాయిని మించి సాధించడం సోషలిజం సూచికలలో ఒకటి. ఈ అంశం ఆర్థిక వ్యవస్థపై నెరపిన నిరంతర ఒత్తిడి వల్ల సోవియట్ యూనియన్ ప్రాథమిక అభివృద్ధి స్థాయి నుండి వెనువెంటనే అత్యంత అభివృద్ధి చెందిన పెట్టుబడిదారీ దేశాల ఉత్పాదకతను అధిగమించాల్సిన అచారిత్రక, అవాస్తవిక లక్ష్యాన్ని సాధించ పూనుకుంది. సోవియట్ యూనియన్ 1930–60 మధ్య కాలంలో ఉత్పాదకతలో అద్భుతమైన ఫలితాలు సాధించినప్పటికీ, విప్లవంనాటి ఉత్పాదక స్థాయి కంటే అనేక రెట్లు అభివృద్ధి సాధించినప్పటికీ, పెట్టుబడిదారీ దేశాల ఉత్పాదక స్థాయిని అధిగమించడం మొత్తంమీద సాధించలేకపోయింది. 1960ల నాటి నుండి ఆర్థికాభివృద్ధిలో ప్రతిష్టంభన, మందకొడితనం చోటు చేసుకుని సోవియట్ యూనియన్ పతనం వరకు వెన్నాడింది. ఇందుకు ఒక దేశపు పరిధిలో ఉండే పరిమితులు, అంతర్జాతీయంగా అననుకూల పరిస్థితులు, వనరుల లభ్యతలో పరిమితులు, తూర్పు ఐరోపా దేశాలకు, వలస పాలన నుండి బయటపడ్డ దేశాలకు సహాయంగా ఆర్థిక వనరులు తరలించడం, పెట్టుబడిదారీ దేశాలతో ఆయుధ పోటీవల్ల రక్షణపై శక్తికి మించి ఖర్చుచేయడం, తదితర కారణాలున్నాయి. ఈ పరిస్థితిలో ప్రజల కనీసావసరాలు తీర్చడంలో, వస్తువుల ధరలను నియంత్రించడంలో, అందరికీ ఉపాధి కల్పించడంలో, విద్య, వైద్యం అందరికీ అందించడంలో విజయం సాధించినప్పటికీ, ప్రజలందరికీ ఉన్నత జీవన ప్రమాణాలు కల్పించలేకపోయింది. ఈ కారణంగా కూడా సోవియట్ యూనియన్‌లో సోషలిజం నిర్మాణం పూర్తి అయిందని పరిగణించడం సాధ్యం కాదు. సోషలిజం నిర్మాణం పూర్తి కావడమంటే వర్గాలు సమసిపోవడం. అందువల్ల శ్రామికవర్గ నియంతృత్వం, అంటే రాజ్యం, అంతరించి

పోవడం జరగాలి. అంతర్జాతీయ ప్రతికూల పరిస్థితుల వల్ల సోవియట్ యూనియన్ ఈ దశను చేరుకోలేదు. అందువల్ల కూడా సోషలిజం నిర్మాణం పూర్తి కాలేదని చెప్పాల్సి ఉంటుంది. అందువల్ల, సోవియట్ యూనియన్ పరివర్తనా దశలో, పెట్టుబడిదారీయేతర సమాజంగా ఉన్నదే కాని, సోషలిస్టు సమాజంగా రూపొందలేదు. రివిజనిజంగా చెప్పబడేది వ్యవస్థను మనుగడలో ఉంచేందుకు, అంతర్గత సంక్షోభాన్ని పరిష్కరించేందుకు సంస్కరణలు చేపట్టింది. ఈ నాయకుల విధానాలు, చర్యలు ఎక్కువగా పెట్టుబడిదారీ విధానాలకు దగ్గరగా ఉండటానికి కారణం, ఆ మార్పులు చేయనిదే వ్యవస్థను అసలు కాపాడడం సాధ్యం కాదని వారు అభిప్రాయపడడం మాత్రమే. బహుశా, వీరు నిబద్ధ సోషలిస్టులు / కమ్యూనిస్టులు కాకపోవచ్చు. కాని వారి విధానాలు ఎక్కువగా భౌతిక వాస్తవికతను వారు అర్థం చేసుకున్న తీరుపై ఆధారపడ్డాయి. అలా కాక, వీరి విధానాలను కుట్రగా, ద్రోహంగా మాత్రమే చూడడం సమగ్రమైన చారిత్రక అవగాహనకు తోడ్పడదు. ఈ దేశాలలో సోషలిజం పతనం, పెట్టుబడిదారీ విధాన పునరుద్ధరణ మరింత మౌలిక కారణాల మూలంగా సంభవించింది. అందువల్ల ఒక దేశంలో సోషలిజం నిర్మాణం పూర్తి చేయడం సాధ్యం కాదని, అది అంతర్జాతీయ స్థాయిలోనే సాధ్యమౌతుందని చారిత్రక అనుభవం నుండి తీసుకోవలసిన గుణపాఠంగా కనిపిస్తున్నది.

**భవిష్యత్ సోషలిజం :**

రష్యన్ విప్లవాన్ని మహత్తర చారిత్రక ఘటనగా, శ్రామిక మానవాళి నిజమైన చరిత్ర నిర్మాతలనే మరుగున పడిన వాస్తవాన్ని సుప్రతిష్ఠతం చేసిన దృగ్విషయంగా, సోషలిజాన్ని చరిత్ర ఎజెండాపైకి తెచ్చిన చోదక శక్తిగా, ప్రపంచ వ్యాప్తంగా విప్లవోద్యమాలకు, వలస దేశాల స్వతంత్రోద్యమాలకు స్ఫూర్తి ప్రదాతగా మేము పరిగణిస్తున్నాము. ఒక అత్యంత వెనుకబడిన దేశాన్ని ఒక్క తరంలో అభివృద్ధి చెందిన దేశంగా మార్చడం, బాహ్య–అంతర్గత ఒడిదుడుకులున్నప్పటికీ ప్రపంచ వ్యాప్త ప్రగతిశీల ఉద్యమాలకు వెన్నుదన్నుగా నిలబడటం, విశాల ప్రజానీకానికి కనీస అవసరాలు, విద్య, వైద్యం, ఉపాధి పూర్తిగా నెరవేర్చడం, రెండవ ప్రపంచ యుద్ధంలో నాజీ జర్మనీని ఓడించడంలో అత్యంత కీలక పాత్ర పోషించడం సోవియట్ యూనియన్ సాధించిన మహత్తర విజయాలుగా నిలుస్తాయి. అయితే, సోవియట్ యూనియన్ ఇప్పుడు చరిత్ర గర్భంలో కలిసిపోయింది. ఇక ఎంత మాత్రమూ పై విజయాలను మాత్రమే చెప్పి ఊరుకుంటే సరిపోదు. గతించిన సోషలిస్టు వ్యవస్థల పట్ల నిబద్ధత కంటే భవిష్యత్ సోషలిజం పట్ల నిబద్ధత ముఖ్యం. గతకాలపు స్వర్ణయుగాలను పట్టుకు వేళ్ళాడటం వల్ల ప్రయోజనం లేదు. ప్రపంచీకరించబడ్డ పెట్టుబడిదారీ విధానం మరింతగా ప్రశ్నించబడుతున్న ఇప్పటి చరిత్ర సందర్భానికి సోషలిజం పునరుత్థానం అవసరం. ఈ గుర్తింపు ఉన్నంత మాత్రాన సరిపోదు. పెట్టుబడిదారీ విధానపు తీవ్రమైన వైఫల్యాలను

శ్రామిక వర్గాల విజయాలుగా మార్చగలిగిన సామర్థ్యం కలిగిన వామపక్ష, ప్రగతిశీల శక్తులు దాదాపు మృగ్యంగా కనిపిస్తున్న ప్రపంచంలో నేడు మనమున్నాము. ముఖ్యంగా, అభివృద్ధి చెందిన దేశాలలో సంస్కరణయుతమైన కృషి కూడా సాధ్యం కాని పరిస్థితి నెలకొంది. అందువల్ల పెట్టుబడిదారీ విధానం పట్ల విమర్శనాత్మక, రాడికల్ అవగాహన ఎంత అవసరమో, సోవియట్ యూనియన్, తదితర దేశాలలో సోషలిస్టు వ్యవస్థలుగా పరిగణింపబడిన వాటిపట్ల విమర్శనాత్మక అవగాహన అంతే అవసరం. ఈ దేశాలలో నిర్మించబడిన 'సోషలిజం' నమూనాని తిరిగి పునరుద్ధరించడం సాధ్యం కాదు. అది వాంఛనీయం కూడా కాదు. చరిత్ర పాఠాలు సరిగ్గా అర్థం చేసుకుని, విభిన్న నిబద్ధ సోషలిస్టు ధోరణులను ఆకళింపు చేసుకుని, వర్తమాన వాస్తవికతకు అనుగుణమైన సోషలిస్టు దృక్పథాన్ని రూపొందించుకొని, ఆ వెలుగులో కృషి చేయాలి. మార్క్స్ ప్రతిపాదించిన మానవాళి విముక్తి స్ఫూర్తిని తిరిగి అందుకోవాలి. ఈ దిశగా భవిష్యత్ సోషలిజం కోసం జరగవలసిన ఆలోచనలు, కార్యాచరణ పెట్టుబడిదారీ వ్యవస్థ సమకాలీన పరిణామాలపై ఆధారపడి ఉంటాయి.

మార్క్సిజం తొలి దశలో ప్రతిపాదించిన కార్మిక వర్గం మరింతగా పేదరీకరణకు గురి కావడం, సమాజం రెండు వర్గ శిబిరాలుగా చీలిపోవడం, మధ్య తరగతి అంతరించి పోవడం, పెట్టుబడిదారీ విధానం లాభాల రేటు పడిపోయే ధోరణికి గురికావడం లాంటివి వాస్తవంలో సంభవించలేదు. అంతేకాక, పెట్టుబడిదారీ విధానం అభివృద్ధి చెందే క్రమంలో కాంట్రాక్టు, అసంఘటిత కార్మికవర్గం తొలినాటి ప్రొలెటేరియట్‌గా ఉండగా, సంఘటిత కార్మికవర్గం మధ్య తరగతి లక్షణాలను సంతరించుకుంటోంది. అసంఘటిత కార్మికులకు అధికారిక ట్రేడ్ యూనియన్లు తమ కార్యక్రమాలను బలంగా విస్తరించక పోవడం వల్ల పెట్టుబడిదారీ విధానానికి ప్రతిఘటన లేని పరిస్థితి ఈ రోజు ప్రబలమైన వాస్తవంగా ఉంది. ప్రపంచ సోషల్ ఫోరం విఫలమయింది. 'వాల్ స్ట్రీట్ ఆక్రమణ' ఉద్యమం కూడా బలహీనపడింది. సాంప్రదాయ వామపక్ష శక్తులు అనేక దేశాలలో నామమాత్రంగా మారిపోయాయి. మరోవైపు మార్క్స్ – ఏంగెల్స్ కాలంలో లేని, నిజానికి 50 ఏళ్ల క్రితం కూడా ఊహకందని, సాంకేతిక అవిష్కరణలు పెట్టుబడిదారీ విధానం బలోపేతం కావడానికి పెద్ద ఎత్తున దోహదం చేశాయి. మార్క్సిజంలో భావించబడిన దానికి భిన్నంగా ఆర్థిక సంక్షోభాలు పెట్టుబడిదారీ విధానపు పతనానికి దారితీయకపోగా, వాటి నుండి అది పదే పదే బయటపడి, ఇనుమడించిన ఉత్పత్తిని సాధించింది. ప్రపంచీకరణ దాని మరో ఉత్థాన దశ. 2007–08లో ప్రారంభమైన ఆర్థిక మాంద్యం ప్రపంచ వ్యాపితంగా ఈ విధానాన్ని కుదిపివేసినప్పటికీ, దాని నుండి ఈ వ్యవస్థ బయటపడే అవకాశాలే ఎక్కువగా కనిపిస్తున్నాయి. ఇది మన ముందున్న పెట్టుబడిదారీ విధానపు చిత్రణ. అయితే,

ఈ వ్యవస్థ తీవ్రమైన ఆర్థిక అసమానతలకు దారితీసే ప్రైవేటు ఆస్తి వ్యవస్థ పునాదిపై నిలబడింది. మానవ సామూహికతని విచ్ఛిన్నం చేసి, మనుష్యుల మధ్య అవసరార్ధ సంబంధాలను మాత్రమే మిగిల్చింది. మనిషిని వస్తు వ్యామోహానికి బానిస చేసింది. మనిషిలోని ఆత్మికతకు వెలకట్టింది. మనుషులను పరాయీకరణకు గురిచేసి విడి వ్యక్తులుగా మిగిల్చింది. అట్టి పెట్టుబడిదారీ విధానం మానవ సమాజపు అంతిమ రూపం కాదు. దాని స్వాభావిక లక్షణాలైన శ్రమ దోపిడి, నిరంతర సంపద సృష్టి, సామాజీకరించబడిన ఉత్పత్తి ప్రక్రియ సృష్టించిన సామాజిక సంపదను పెట్టుబడిదారులు తమ ప్రైవేటు ఆస్తిగా పోగు వేసుకోవడం, ఈ వ్యవస్థను నిరంతర వైరుధ్యపూరితమైనదిగా మారుస్తున్నాయి. ప్రపంచాన్ని చుట్టబెట్టిన ప్రపంచీకరణ ద్వారా ఈ పెట్టుబడిదారీ ఉత్పత్తి వ్యవస్థ గరిష్టతని సాధించి ఇకపై విస్తరణకు అవకాశంలేని దశకు చేరుకోవడం, ఉత్పత్తి శక్తుల అభివృద్ధికి ఉత్పత్తి సంబంధాలు అవరోధం కావడం, ప్రత్యక్ష ఉత్పత్తిదారుల సమష్టి నిర్వహణ మాత్రమే ఉత్పత్తికి అనువైన నిర్వహణ వ్యవస్థగా పరిణమించడం -- ఈ అంశాలన్నీ కలగలిసి పెట్టుబడిదారీ విధానాన్ని పతనం దిశగా నెట్టడం జరుగుతుంది. అయితే, శాంతికి, పర్యావరణానికి అది కలిగించే విఘాతం మరింత విధ్వంసం సృష్టించే లోపు ఇది జరుగుతుందా లేక మానవాళికి ఈ స్వార్ధపూరిత వ్యక్తివాదం దాని విలయతాండవం ద్వారా మరిన్ని మారణ హోమాల్ని చవిచూపించిన తరువాత జరుగుతుందా అనేది మనం చెప్పలేము. ఈ ప్రతికూల పర్యవసానాన్ని ఆపడానికి సాంప్రదాయ వామపక్ష పార్టీలు, నూతన సోషలిస్టు శక్తులు కలిసి కృషి చేయాలి. పెట్టుబడిదారీ వ్యవస్థ పట్ల మౌలికమైన వ్యతిరేకత, 20వ శతాబ్దపు సోషలిజం పట్ల చారిత్రక, వాస్తవిక విమర్శ ద్వారా దాని పొరపాట్లను పునరావృతం కానివ్వని దృఢ సంకల్పంతో ఈ వామపక్ష పార్టీలు / శక్తులు ఆయా దేశాలలో కృషి చేయాలి. వాటి అంతర్జాతీయ సంఘటన ద్వారా భౌగోళిక సామీప్యత కలిగిన దేశాలలో పరస్పర ప్రభావితమైన ఉద్యమాల ద్వారా అంతర్జాతీయ సోషలిజాన్ని ప్రతిపాదించడం భవిష్యత్తు అవసరం. భవిష్యత్ సోషలిజం పట్ల అవగాహన విషయంలో కొన్ని అభిప్రాయాలను మీముందుంచుతున్నాం.

1. మార్క్స్, ఏంగెల్స్, తదనంతర అన్ని మార్క్సిస్టు ధోరణులలోని విలువైన అనుదానాలను పరిగణనలోనికి తీసుకుంటూ ప్రతి తరం ఒక సమగ్ర మార్క్సిస్టు సిద్ధాంతం ప్రాతిపదికగా తన సైద్ధాంతిక, ఆచరణాత్మక కృషి చేపట్టాలి. మానవ సమాజంలోని విభిన్న కోణాలను, వ్యష్టి-సమష్టి గతితర్కానికి సంబంధించిన సమస్యలను, స్వేచ్ఛ-సమానత్వాల సమతుల్యంలో ఉండే తాత్విక - ఆచరణాత్మక సమస్యలను, మనిషిలోని మానసిక వైకల్యాలను శాస్త్రీయ, భౌతికవాద దృష్టినుండి అధ్యయనం చేసే వేరే ఆలోచనా రీతుల భావాలను కూడా ఆకళింపు చేసుకోవాలి. అయితే, ఈ ఆలోచనలను పైన చెప్పిన

సమగ్ర మార్క్సిస్టు దృక్పథంలో అంతర్భాగం చేసుకోవాలి. ఈ ఆలోచనా విధానం మార్గమే కాని గమ్యంకాదని గుర్తించాలి. మార్క్సిజం పెట్టుబడిదారీ విధానాన్ని విశ్లేషించి, దాని అంతర్గత గతి సూత్రాలను విప్పిచెప్పే శాస్త్రీయ పరిశీలనా పద్ధతి. అదే సమయంలో అది ఈ విధానపు వస్తుగత పరిణామ క్రమం నూతన కమ్యూనిస్టు సమాజానికి దారితీస్తుందని చెప్పే సామాజిక సిద్ధాంతం. అయితే, మార్క్సిజం వర్తమాన చరిత్రను, సామాజిక వాస్తవికతను లోతుగా అధ్యయనం చేయడానికి ప్రత్యామ్నాయం కాదు. ఆయా దేశ కాల పరిస్థితులను గురించి, సామాజిక జీవనంలోని అన్ని కోణాల గురించి చారిత్రక, సమకాలీన దశలకు సంబంధించి క్షుణ్ణమైన అధ్యయనం, అవగాహన సోషలిజం కోసం కృషి చేసే శక్తులు సాధించాలి. ప్రతి తరం అట్టి లోతైన పరిశోధన, అధ్యయనం చేయడం ద్వారానే సమాజాన్ని మార్చగలదు. ఈ అధ్యయనం నుండి శాస్త్రీయ నిర్ధారణలకు రావడానికి మార్క్సిస్టు పరిశీలనా పద్ధతి తోడ్పడుతుంది. ఈ నిర్ధారణల ఆధారంగా ప్రగతిశీల సామాజిక కార్యాచరణ దిశగా పయనించడానికి మార్క్సిస్టు సామాజిక సిద్ధాంతం దోహదం చేస్తుంది. సమకాలీన పరిశోధన ఫలితాలు మార్క్సిస్టు ప్రాపంచిక దృక్పథంలోని ఏదేని భావనను తప్పని ఋజువు చేస్తే ఆ భావనను మార్చుకోవలసి ఉంటుంది. ముఖ్యంగా మార్క్స్ భావాలపై వచ్చిన నిశిత విమర్శలను కూడా పరిగణనలోనికి తీసుకోవాలి. ఈ బౌద్ధిక క్రమం మాత్రమే వర్తమాన సమాజ స్వభావాన్ని అర్థంచేసుకుని, దానిని మానవాళి మహత్తర లక్ష్యమైన కమ్యూనిజం దిశగా మార్చే కృషికి దోహదపడుతుంది.

2. సమాజ పరిణామ క్రమంలో దశల మార్పు రాజ్యవ్యవస్థను కూడా మారుస్తుంది. ఒక ఉత్పత్తి విధానం స్థానే దానికంటే ఉన్నతమైన ఉత్పత్తి విధానం సమాజ రూపంగా ఏర్పడటమే సామాజిక విప్లవం. వర్తమాన దశలో పెట్టుబడిదారీ ఉత్పత్తి విధానం స్థానే సోషలిస్టు ఉత్పత్తి విధానం ఏర్పడి, తదనుగుణంగా సమాజంలోని అన్ని రంగాలు మారడం అట్టి సామాజిక విప్లవం అవుతుంది. ఈ విప్లవం సమాజంలో నిరంతరం జరిగే వర్గపోరాటం ద్వారా, తొలుత రాజకీయ విప్లవంలో ప్రగతిశీల వర్గం రాజ్యాధికారాన్ని చేపట్టి, సామాజిక విప్లవ పరిపూర్తికి కృషిచేయడం ద్వారా నెరవేరుతుందని ప్రధాన మార్క్సిస్టు ధోరణి అవగాహన. ఏ ఉత్పత్తి విధానమైనా దానిలో ఉత్పత్తి సాధనాల అభివృద్ధికి అవకాశం ఉన్నంత వరకు ఉనికిలో నుండి సమసిపోదని, అలాగే వాటికవసరమైన భౌతిక పరిస్థితులు పాత సమాజ గర్భంలో పరిపక్వం కానంతవరకు నూతన ఉత్పత్తి సంబంధాలు పాతవాటి స్థానంలో రావనేది మరో కీలకమైన మార్క్సిస్టు భావన. అయితే, ఈ వస్తుగత క్రమానికి, వర్గాల పొందికలోని ప్రగతిశీల వర్గం/వర్గాలు తమ చైతన్యపూరిత, క్రియాశీల కార్యాచరణను జోడిస్తేనే నూతన సమాజం ఆవిష్కరించ బడుతుంది. ఉత్పత్తి విధానంలోని ఈ మార్పుల దశకి, వర్గపోరాట క్రమానికి మధ్య

అంతరం ఉంటుంది. భౌతిక పరిస్థితులు నూరుశాతం పరిపక్వత చెందటంతో మానవ కార్యాచరణను ముడిపెడితే ఏ సామాజిక మార్పు సాధ్యం కాదు. అలా అని, భౌతిక పరిస్థితులు కనీస స్థాయిలో కూడా లేకపోయినప్పటికీ మానవ సంకల్పం, చైతన్యం, ఆదర్శ భావన ఆధారంగా ప్రగతిశీల మార్పు సాధ్యం అని కూడా భావించరాదు. ఇప్పటి వరకు సోషలిజం లక్ష్యంగా సాగిన విప్లవాలన్నీ, సామాజిక గతి క్రమంలోని ఈ అసమతుల్యతలో పెట్టుబడిదారీ విధానం అభివృద్ధి చెందకముందే, వర్గపోరాటం ప్రత్యేక జాతీయ, అంతర్జాతీయ పరిస్థితులలో తీవ్రతరం కావడంతో, రాజకీయ విప్లవానికి అనుకూల పరిస్థితులు ఏర్పడటంతో జరిగాయి. వాటి వైఫల్యాలకు మూలంలోని ఈ అసమతుల్యత ఒక కారణం. ఒక పరివర్తనా దశ, బహుశా పెట్టుబడిదారీయేతర సమాజం, సాధ్యమయ్యే పరిస్థితులలో దానినే సోషలిజంగా పరిగణించడం ఈ మొత్తం నమూనాని సమస్యాత్మకం చేసింది. స్టాలిన్ ప్రాతినిధ్యం వహించిన ధోరణిలోని అత్యంత నష్టదాయకమైన కోణం ఇదే. అందువలన భవిష్యత్‌లో సోషలిజం కోసం జరిగే ప్రయత్నాలు, ఈ అసమతుల్యత వీలైనంత తక్కువగా ఉన్న పరిస్థితులలో జరగాలి. తక్షణ లక్ష్యం రాజకీయ విప్లవం అనే అవగాహనకు, కార్మిక వర్గం తదితర సోషలిస్టు శక్తులు సమాజంపై భావజాల, సాంస్కృతిక ఆధిపత్యం ద్వారా అత్యధికుల సమ్మతి కలిగిన వర్గాలుగా గుర్తింపు సాధించిన పిదప రాజకీయ విప్లవం సాధించడం అనే భావనను జోడిస్తే, తరువాతి పరిణామ దశ సరళతరం అవుతుంది. సోషలిజం సాధనకు మార్గం సుగమం అవుతుంది.

ఇక్కడ గుర్తించాల్సిన మరో అంశం, సంస్కరణయుత మార్పు స్థానం. మార్క్సిజం పరిధిలో సంస్కరణ అనే అంశానికి తావు లేదనుకోవడం పొరపాటు. క్రమేపి జరిగే పరిణామాత్మక మార్పులే నూతన గుణాత్మక మార్పులకు దారితీస్తాయి. వరుసగా, శీఘ్రగతిన ప్రగతిశీల పరిణామాలు సంభవించే విప్లవ శిఖరస్థాయి కొద్దికాలంపాటు మాత్రమే కొనసాగుతుంది. దీనికి విరుద్ధంగా శాశ్వత నిరంతర విప్లవం జరగాలనే భావన అవాస్తవికం. విప్లవాల, సంస్కరణల సృజనాత్మక కలయిక నూతన సమాజ నిర్మాణానికి అనువైన పద్ధతి. ఇలా సాధ్యమైన మార్పు మరింత స్థిరంగా నిలబడుతుంది. మార్క్సిజం కేంద్ర బిందువుగా, మరింత సమగ్ర ప్రాపంచిక దృక్పధాన్ని రూపొందించు కొనేందుకు ఈ అవగాహన తోడ్పడుతుంది. అదే సమయంలో మార్క్సిస్టు మౌలిక వాదం ఆ సమాజపు ప్రాపంచిక దృక్పధం కావడం కమ్యూనిజానికి నియమంగా చేసే అవాస్తవిక ధోరణిని విడనాడాలి. రాజ్యాధికారాన్ని సాధించడం అనే ఘటనను కూడా తిరుగుబాటు లాంటి ఒకే పద్ధతిలో చూడడం కాక మరిన్ని ప్రత్యామ్నాయాల -- పార్లమెంటరీ వ్యవస్థతో సహా -- సందర్భంలో అవగాహన చేసుకోవాలి. విప్లవం తెచ్చే మార్పు, ముఖ్యంగా గత పాలక వర్గాలలో, వ్యవస్థలలో, నిర్మాణాలలో మార్పు ద్వారా ఆయా వ్యక్తులు నూతన సమాజంలో కలిసిపోవడానికి వీలు కల్పించేదిగా ఉండాలి.

3. సోషలిస్టు ఆర్థిక వ్యవస్థ ప్రణాళిక బద్ధంగా జరగాలనేది ప్రామాణిక మార్క్సిస్టు భావన. మార్కెట్ నిర్దేశిత పెట్టుబడిదారీ విధానం దానికి ఉన్న అనియత, విశృంఖల స్వభావంవల్ల తరచుగా ఉత్పత్తిలో తీవ్రమైన ఒడిదుడుకులకు, తద్వారా ఆర్థిక సంక్షోభాలకు గురవ్వడాన్ని అధిగమించడానికి, సోషలిస్టు వ్యవస్థలో మార్కెట్ ద్వారా కాక కేంద్రీకృత ప్రణాళిక ఆధారంగా ఉత్పత్తి అవసరాలను నిర్ణయించడం ప్రతిపాదించబడింది. అయితే, వాస్తవంలో ఈ రాజ్య నిర్దేశిత ప్రణాళికాబద్ధ అభివృద్ధి ప్రజల అవసరాలను సవ్యంగా అంచనా కట్టి ఉత్పత్తి ద్వారా సహేతుకమైన వినిమయ అవసరాలను తీర్చడంలో విఫలమయింది. ఈ వ్యవస్థల పతనానికి కారణాలలో ఒకటి. ఇది ప్రజలలో ఈ వ్యవస్థ సమర్థత పట్ల అపనమ్మకానికి దారితీసింది. మరోప్రక్క పెట్టుబడిదారీ విధానం సృష్టించిన పంచరంగుల వినిమయ సమాజం బలమైన ఆకర్షణగా పని చేసింది. సోషలిస్టు వ్యవస్థ కల్పించిన విద్య, వైద్యం, ఉపాధికి సంబంధించిన భద్రతలను కూడా ఈ దేశాల ప్రజలు ఈ క్రమంలో కోల్పోయి, ప్రాథమిక పెట్టుబడిదారీ దశలోని క్లేశాన్ని తీవ్రంగా అనుభవించారు. అందువలన, సోషలిస్టు ఆర్థిక వ్యవస్థలో సరాసరి మార్కెట్‌ని రద్దుచేయకుండా, దానిని కొనసాగిస్తూ, విస్తృత ప్రజాసమూహాలు సమష్టి ఉత్పత్తి ప్రక్రియలో అత్యధిక ఫలితాలు సాధించి, అవసరాల కొరకు ఉత్పత్తిని వినియోగించుకునే స్వీయ క్రమశిక్షణ సాధించిన పిమ్మట మార్కెట్‌ని అధిగమించడానికి కృషి జరగాలి. వికేంద్రీకృత పద్ధతిలో వాస్తవిక అంచనాలు లభించిన పిమ్మట, ప్రణాళిక కేంద్రీకృత రూపం తీసుకోవాలి.

4. ప్రపంచీకరణ పెట్టుబడిదారీ వ్యవస్థని ప్రపంచ వ్యాపితం చేస్తోంది. కేంద్రం, అంచుల మధ్య విభజనలో మౌలిక మార్పు సంభవిస్తోంది. ముఖ్యంగా భారతదేశం అన్ని రంగాలలో పెట్టుబడిదారీ వ్యవస్థ అభివృద్ధిని ముందుకు తీసుకు వెళ్ళే క్రమంలో ఉంది. ఇక్కడి పాలకవర్గాలు, పార్టీలు ఈ కార్యక్రమాన్ని వెనుకాడకుండా అమలు చేస్తున్నాయి. సామ్రాజ్యవాద స్వభావంలో వచ్చిన మార్పుని గుర్తించకపోతే ఈ అభివృద్ధి క్రమం భారత సమాజంలో వర్గాల పొందికలో తీసుకువస్తున్న మార్పుల్ని గమనించి, ఆచరణలో కలుపుకోలేని నిస్సహాయత ఏర్పడుతుంది. భారత ఆర్థిక వ్యవస్థ పెట్టుబడిదారీ వ్యవస్థ. ఇంకా కొనసాగుతున్న ఫ్యూడల్, సెమి ఫ్యూడల్ అవశేషాలు ఈ వాస్తవికతను మార్చలేవు. "ఆశ్రిత" పెట్టుబడిదారీ వర్గం నిజానికి ప్రపంచ పెట్టుబడిదారీ వ్యవస్థలో పూర్తి భాగస్వామి. భారత పెట్టుబడిదారీ వర్గం, భాషా, ప్రాంతీయ, సామాజిక వైవిధ్యత ఉన్నప్పటికీ, మరింతగా ఏకీకృతం అవుతోంది. బహుళ జాతి కంపెనీల స్థాయిని అందుకోవడానికి కూడా ప్రయత్నాలు జరుగుతున్నాయి. అందువల్ల బడా/దళారీ, జాతీయ బూర్జువా వర్గం అనే తేడాలు ఈ వర్గంలో ఉన్నాయని మేము భావించడం లేదు. ఈ

వ్యవస్థ లక్ష్యాలు పూర్తిగా నెరవేర్చగల సామర్థ్యం ఈ వర్గానికి ఉందని మేమనకుంటున్నాము. అందువల్ల కార్మిక వర్గం, వామపక్షాలు నెరవేర్చవలసిన ప్రజాస్వామ్య దశ తాలూకా లక్ష్యాలు ఉండే అవకాశం లేదు. అందువల్ల ఈ ఉద్యమాల, శక్తుల లక్ష్యం సోషలిజం కావాలి. ప్రజాస్వామిక విప్లవం ద్వారా సోషలిజం కాదు. సరాసరి సోషలిజం లక్ష్యం అయినప్పటికీ, అనేక మధ్యంతర చర్యలు, సుదీర్ఘ క్రమం తర్వాతే ఇది సాధ్యమని గుర్తించాలి. అంతిమ లక్ష్యం అంతర్జాతీయ సోషలిజం అని స్పష్టమైన అవగాహన ఉండాలి. ఒక దేశంలో సోషలిజం సాధ్యంకాదని, పరివర్తనా సమాజం క్రమేపి అంతర్జాతీయ సోషలిజంలో అంతర్భాగం అవుతుందనే అవగాహన 20 శతాబ్దపు సోషలిజంలోని ప్రతికూలతను అధిగమించడానికి తోడ్పడవచ్చు.

5. సోషలిజం సాధనను సంక్లిష్టంగా మార్చిన అంశాలలో దానిని ఒక ప్రాజక్టుగా, ఒక ఆదర్శంగా చూడడం ఒకటి. తద్విరుద్ధంగా ఫ్యూడలిజం నుండి పెట్టుబడిదారీ విధానానికి పరిణామం ఒక సహజ పరిణామ క్రమంలా జరిగింది. పెట్టుబడిదారీ విధానం వ్యక్తిగత ఆస్తి వ్యవస్థలో అత్యంత అభివృద్ధి చెందిన దశ కాగా, సోషలిజం వ్యక్తిగత ఆస్తి రద్దుని ప్రతిపాదించడం ఇందుకు బహుశా ఒక కారణం. పెట్టుబడిదారీ విధానపు అభివృద్ధి క్రమంలో ఉత్పత్తి సంబంధాలు ఉత్పత్తి శక్తుల అభివృద్ధికి ప్రతిబంధకంగా పరిణమించి, వాటి అభివృద్ధి ఇక ఎంత మాత్రం పెట్టుబడిదారీ యాజమాన్య పద్ధతుల్లో కాక, ఉత్పత్తి శక్తుల సామాజికీకరణ వల్ల మాత్రమే సాధ్యమైనప్పుడు సామాజిక విప్లవం సోషలిజానికి దారితీస్తుందనేది మార్క్సిస్టు అవగాహన. కార్మికవర్గం ఈ విప్లవానికి చోదక శక్తి. అయితే పెట్టుబడిదారీ విధానంలో ఏర్పడిన అనేక ఆర్థిక సంక్షోభాలను అది అధిగమించగలిగింది. ఉత్పత్తి శక్తుల అభివృద్ధిని ఉత్పత్తి సంబంధాలు ఆటంకపరుస్తాయని మార్క్స్ కాలం నుండి అనేక సందర్భాలలో ఊహించినప్పటికీ, శాస్త్ర – సాంకేతిక విప్లవ ఆవిష్కరణలు, మిలిటరిజం, వినిమయ సమాజం, తదితర అంశాల తోడ్పాటుతో ఈ వ్యవస్థ కొనసాగుతున్నది. అందువల్ల, ఈ వైరుధ్యం సృష్టించే విప్లవావకాశాల కోసం వేచి ఉండడం రాజకీయ క్రియాశీలతను కుంటుపరుస్తుంది. అలా కాక, పెట్టుబడిదారీ విధానం సృష్టిస్తున్న తీవ్రమైన ఆర్థిక అసమానతలు, నిరంతర అభివృద్ధి క్రమంలో పర్యావరణానికి అది చేస్తున్న హాని, యుద్ధాల ద్వారా మానవ హననానికి కారణం కావడం, మనిషిని వస్తు వ్యామోహానికి లోను చేసి ఆత్మికతని కోల్పోయేలా చేయడం, అనియతమైన వ్యక్తివాదం, యాంత్రిక దృష్టి ద్వారా మనుషుల మధ్య అది సృష్టించే వైమనస్యత, తదితర ప్రతికూల ధోరణుల పట్ల వ్యతిరేకత కూడా క్రమేపీ ఈ వ్యవస్థలో సమూల మార్పుని కోరుకోవడానికి దారితీస్తే అది ఒక నూతన విప్లవ సందర్భం అవుతుంది. సోషలిస్టు శిబిరంలో ఏర్పడిన సంక్షోభం వల్ల పెట్టుబడిదారీ వ్యవస్థలోని సంక్షోభాలకు

ప్రత్యామ్నాయాలను ప్రతిపాదిస్తూ క్రియాశీలంగా కృషి చేయగలిగిన వామపక్ష శక్తులు కనుచూపు మేరలో లేవు. లాటిన్ అమెరికాలోని వామపక్ష ఉద్యమాల, ప్రభుత్వాల దీర్ఘకాలిక ఫలితాలు ఇంకా స్థిరత్వాన్ని సాధించవలసి ఉంది. అప్పుడు కాని అవి మిగతా ప్రపంచాన్ని ప్రభావితం చేయలేవు. చారిత్రక సోషలిజంలోని సమస్యలు అభివృద్ధి చెందిన పెట్టుబడిదారీ దేశాలలోని కార్మికవర్గాలలో సోషలిజం పట్ల విముఖత పెంచడానికి పెట్టుబడిదారీ వ్యవస్థచేసిన ప్రయత్నాన్ని సులభతరం చేశాయి. ఈ రెండు వ్యవస్థల భవిష్యత్ పరిణామం ఎలా ఉంటుందనేది ఇంకా తెలియరావడం లేదు. 20వ శతాబ్దపు సోషలిజంలోని ఆదర్శవాద – ఇచ్ఛావాద స్వభావాన్ని, ప్రజాస్వామ్య రాహిత్యాన్ని సరిచేసుకొని, పెట్టుబడిదారీ విధానంలోని ప్రతి సంక్షోభానికి, సంక్లిష్టతకు ప్రతిస్పందిస్తూ, సమష్టి జీవన విలువలను ప్రతిపాదిస్తూ, ప్రైవేటు ఆస్తి వ్యవస్థలోని అసమానతలను, అమానవీయ పార్శ్వాన్ని బహిర్గతం చేస్తూ, సోషలిస్టు శక్తులు కార్యాచరణ సాగించాలి. ఒక ప్రత్యామ్నాయ శక్తిగా ఎదగడం ద్వారా సరైన చారిత్రక సందర్భం ఏర్పడినప్పుడు పెట్టుబడిదారీ వ్యవస్థని త్రోసిరాజని సోషలిస్టు నిర్మాణాన్ని చేపట్టే విధంగా సోషలిస్టు శక్తుల కృషి ఉండాలి. అంటే ఒక బృహత్తర విద్యాపరమైన కృషి, భావజాల – సాంస్కృతిక ఆధిపత్యం ద్వారా ఇది సాధ్యం కావాలి. సమాజంలోని మెజారిటీ శ్రేణుల అంగీకారం, వారి స్పష్టమైన సోషలిస్టు చైతన్యం నేపథ్యంలో సోషలిజం నిర్మాణం జరిగితే ఇదివరకటి వైఫల్యాలు, అవాంఛనీయ ఫలితాలను అధిగమించడం సాధ్యం కావచ్చు. సోషలిస్టు ప్రజాస్వామ్యం కొత్త వ్యవస్థకు గీటురాయి కావాలి. ఆస్తి హక్కు మినహా అన్ని రాజకీయ స్వేచ్ఛలను అమలుచేయాలి. చట్టబద్ధ పాలనను రాజ్య మౌలిక స్వభావంగా పరిగణించాలి. అవసరమైన సందర్భాలలో, హక్కులపై చట్టబద్ధ పరిమితులు విధించి, అమలు చేయడం ద్వారా సోషలిస్టు లక్ష్యాల సాధనకు కృషి చేయాలి. ఉత్పత్తి స్థానాలలో కార్మికవర్గ ప్రజాస్వామ్యాన్ని అమలు చేయడం ద్వారా బూర్జువా ప్రజాస్వామ్యం కంటే విశాలమైన సోషలిస్టు ప్రజాస్వామ్యాన్ని సాధించాలి. సోషలిస్టు ప్రజాస్వామ్యానికి పారిస్ కమ్యూన్ నిర్దేశించిన అన్ని సూత్రాలు క్రమేపీ అమలులోకి తీసుకురావాలి. కమ్యూనిస్టు పార్టీలు, ఇతర వర్తమాన వామపక్ష పార్టీలు ఈ కర్తవ్యాల్ని పూర్తి చేయలేకపోతే, నూతన వామపక్ష శక్తులు ముందుకు రావాల్సి ఉంటుంది. గత వైఫల్యాలకు, రాబోయే కాలంలో ఎదురయ్యే ఆటుపోట్లకు నిరుత్సాహానికి గురికాకుండా ముందుకు సాగాలి. కమ్యూనిజం అనేక ప్రయత్నాల అనంతరమే సాధ్యమౌతుందన్న మార్క్స్ హెచ్చరికను ఇక్కడ గుర్తుంచుకోవాలి.

6. వర్గ పోరాటం సామాజిక విప్లవానికి చోదక శక్తి. మొదటి తరం విప్లవకారులు పారిశ్రామిక కార్మిక వర్గం (ప్రొలెటేరియట్), చిన్న రైతాంగం, వ్యవసాయ కార్మికులు, మేధావులలోని కొన్ని శ్రేణుల సహకారంతో ఈ విప్లవాన్ని నెరవేరుస్తుందని భావించారు.

ఈ రోజు ఒక మేరకు పెట్టుబడిదారీ అభివృద్ధి సాధించిన దేశాలలో కూడా పారిశ్రామిక కార్మికుల కంటే సేవల రంగంలోని వృత్తి నిపుణుల, ఉద్యోగుల సంఖ్య అధికంగా ఉన్నది. కార్మికులలో అధిక శాతం అసంఘటిత రంగంలో ఉన్నారు. వీరందరి జీవన స్థితిగతులలో చెప్పుకోతగిన అసమానతలు ఉన్నాయి. సేవల రంగంలో, అసంఘటిత రంగంలో నిపుణులకు, ఉద్యోగులకు, కార్మికులకు సంఘాలు ఏర్పాటు చేసుకోవడానికి, ప్రశ్నించడానికి ఎటువంటి హక్కులు లేవు. సేవా రంగంలో, బడా పరిశ్రమలలో, ప్రభుత్వరంగ పరిశ్రమలలో నిపుణులకు, ఉద్యోగులకు, సంఘటిత కార్మికులకు మెరుగైన జీతాలు రావడంతో వారి మధ్యతరగతి జీవన ప్రమాణాల వల్ల వ్యవస్థలో అంతర్భాగంగా తమని తాము గుర్తించుకుంటున్నారు. వీరు పెట్టుబడిదారీ వ్యవస్థలోని తీవ్రమైన అసమానతలను, అమానవీయతను, వైమనస్యతను, అంతర్ వైరుధ్యాలను గుర్తించి రాడికలైజ్ కావడం జరిగితే మార్పుకోసం కృషిచేసే సామాజిక శక్తులు బలోపేతమవుతాయి. ఈ శ్రేణులు తమ సంస్థల నిర్వహణలో నిర్ణాయక పాత్ర వహించే సంస్కరణలు సాధించడం ప్రత్యామ్నాయ అభివృద్ధికి దోహదం చేస్తుంది. అయితే, ఇట్టి సంస్కరణలు పెట్టుబడిదారీ వ్యవస్థలోకి కలుపుకోవడానికి దారి తీయకుండా చైతన్యపూరిత కృషి జరగాలి. చిన్న రైతాంగం, వ్యవసాయ కార్మికుల సంఘటిత శక్తి బలహీనంగా ఉన్న పరిస్థితుల నుండి వీరు కూడా ప్రత్యామ్నాయ శక్తిలో అంతర్భాగం అయ్యే దిశగా కృషి జరగాలి. ఈ శక్తులు అన్నిటి మధ్య సహకారం, మైత్రి సాధ్యమైనప్పుడే ఒక బలమైన ప్రత్యామ్నాయ శక్తి ఏర్పడుతుంది. అప్పుడే సమాజంలో మెజారిటీ ప్రజలకు ఈ ప్రత్యామ్నాయ శక్తి ప్రాతినిధ్యం వహించగలదు. దానికి పారిశ్రామిక కార్మికవర్గం కేంద్ర బిందువు కావాలి. ఈ సామాజిక శ్రేణులు ట్రేడ్‌యూనియన్లనే కాక తమ సామూహికతను దృఢతరం చేసే కౌన్సిళ్ళను కూడా ఏర్పాటు చేసుకోవాలి. ఈ శ్రేణులు ఆయా దేశ కాల పరిస్థితులలోని వాస్తవిక అవకాశాల మేరకు సోషలిజం కోసం చైతన్యపూరిత కార్యాచరణ చేపట్టే దిశగా వామపక్ష శక్తులు వాటితో కలిసి కృషి చేయాలి.

7. అయితే, ప్రస్తుతం ప్రపంచ వ్యాప్తంగా, భారత దేశంలో కూడా అలాంటి ప్రత్యామ్నాయ శక్తిని ఏర్పాటు చేయగలిగిన పార్టీలు (లాటిన్ అమెరికా మినహా) ఎక్కడా కానరావడం లేదు. అందువల్ల, ప్రస్తుతం ఉనికిలో ఉన్న పార్టీల వైపు చూడకుండా, సోషలిజాన్ని పునరాలోచించి, పునర్నిర్వచించే కొత్త వామపక్ష శక్తులు ముందుకు రావలసి ఉంటుంది. వాటిలో అంతర్గత ప్రజాస్వామ్యం, ఎన్నికల ద్వారా కమిటీల నిర్మాణం, మైనారిటీ అభిప్రాయానికి వ్యక్తీకరణ స్వేచ్ఛ కీలకాంశాలుగా ఉండాలి. బోల్షివిక్ పార్టీ నిర్మాణ రూపానికి ప్రత్యామ్నాయం కోసం అన్వేషణ సాగాలి. పైన పేర్కొన్న విభిన్న సామాజిక శ్రేణులకు ప్రాతినిధ్యం వహించే ఆయా పార్టీల కూటమి, ప్రత్యామ్నాయ

శక్తుల రాజకీయ ప్రతినిధిగా ముందుకు రావలసి ఉంటుంది. ఈ పార్టీలు ఆయా శ్రేణుల సామూహిక కౌన్సిళ్ళ అధికారానికి లోబడి ఉండాలి. ఒక పార్టీ అధికార వ్యవస్థ ద్వారా కాక, అట్టి కూటమి సహకారం – సర్దుబాటు ఆధారంగా పెట్టుబడిదారీ వ్యవస్థని తొలగించి, సోషలిస్టు నిర్మాణం చేపట్టాలి. విశాల మార్క్సిస్టు దృక్పథం ఈ ప్రత్యామ్నాయ శక్తి చేపట్టే సోషలిస్టు నిర్మాణానికి ప్రాతిపదికగా ఉండాలి. ఈ పార్టీలు స్వేచ్ఛగా పోటీపడే ఎన్నికల వ్యవస్థ ద్వారా ప్రభుత్వాలు ఏర్పడాలి. కౌన్సిళ్ళ వ్యవస్థ పిరమిడ్ తరహా నిర్మాణంతో వివిధ స్థాయుల్లో రాజ్య నిర్మాణానికి ఆధారం కావాలి. దానిని పార్లమెంటరీ తరహా వ్యవస్థా నిర్మాణంతో సమ్మిళితం చేయాలి.

8. ఈ ప్రత్యామ్నాయ శక్తి ఏర్పరచే రాజ్యరూపం ఆస్తి హక్కు రద్దు, ఉత్పత్తి శక్తుల సామాజికీకరణ, ఉత్పత్తిపై కార్మికుల నియంత్రణ, ఉత్పత్తిని సామాజిక అవసరాల ప్రాతిపదికగా (మార్కెట్ ప్రాతిపదికగా కాకుండా) నడపడం తదితర మార్పుల అమలు కోసం, వాటిని వ్యతిరేకించే శక్తులను అదుపు చేయడానికి అవసరమైన చట్టబద్ధ చర్యలు అన్నీ తీసుకుంటూ, ప్రజాస్వామ్య హక్కులు అన్ని శ్రేణులకు అన్వయిస్తూ కృషి చేయాలి. నియంతృత్వ భావన అవసరాన్ని పునఃపరిశీలించాలి. మౌలిక సామాజిక కార్యక్రమానికి ప్రతిఘటన తీవ్రంగా ఉన్నట్లయితే అవసరమైన ప్రత్యేక అధికారాలను కూడా చట్టబద్ధంగా చేపట్టాలి. కొన్ని శ్రేణులకు హక్కుల నిరాకరణను చట్టబద్ధం చేయకుండా జాగ్రత్తపడాలి. విస్తృత జన శ్రేణుల క్రియాశీల రాజకీయ భాగస్వామ్యాన్ని ఈ వ్యవస్థకు ప్రాతిపదిక చేయడం దానిని నిజమైన సోషలిస్టు ప్రజాస్వామ్యంగా మారుస్తుంది.

9. సోషలిజం అంతర్జాతీయ వ్యవస్థగానే మనగలుగుతుంది. కావున, వివిధ దేశాలలోని 21వ శతాబ్దపు సోషలిస్టు శక్తులు పరస్పర సహకారం పెంపొందించుకోవాలి. అభివృద్ధి చెందిన పెట్టుబడిదారీ దేశాలు కూడా ఈ క్రమంలో భాగమైతేనే సోషలిజం సాధ్యమౌతుంది. ఒక దేశం పరిధిలో జరిగే నూతన వ్యవస్థ నిర్మాణాన్ని సోషలిజం దిశగా పరివర్తనగా (పెట్టుబడిదారీయేతర సమాజంగా) మాత్రమే భావించాలి. మార్క్స్ ప్రతిపాదించిన రాజ్యం అంతర్ధానం కావడం కూడా అంతర్జాతీయ సోషలిజం భూమికగానే చూడబడింది. అప్పటికీ, దానిని అక్షరార్థంలో తీసుకోనవసరం లేదు. అంతర్జాతీయ సహకారానికి, వ్యవస్థా నిర్వహణకు సంబంధించిన కనీసాధికారాలు నిర్వహించే రాజ్యం కొనసాగడం సమాజపు సమష్టి జీవన సౌందర్యానికి అడ్డురావలసిన అవసరం లేదు. ఎందుకంటే అది ఇక ఎంతమాత్రము పై నుండి సమాజాన్ని నియంత్రించే వ్యవస్థ కాదు. అంతేగాక, రాజ్యం ద్వారా రాజ్యరహిత సమాజాన్ని సాధించడంలోని అంతర్ – వైరుధ్యాన్ని కూడా ఇది పరిష్కరిస్తుంది. ఇలా రాజ్యం అత్యంత పరిమిత రూపం

సంతరించుకోవాలంటే అది ఉద్యోగస్వామ్యాన్ని పూర్తిగా విడనాడి, స్వయం పరిపాలిత సమాజానికి లోబడివుండే ఒక నిర్వహణ వ్యవస్థగా రూపాంతరం చెందాలి.

10. సోషలిజం ఉమ్మడి లక్ష్యం. దేశాలవారీగా సాధన మార్గాలు విభిన్నంగా ఉంటాయి. వర్గాలు ఏకరూప శ్రేణులు కావు. వర్గాలలో జాతి (రేస్), భాష, ప్రాంతం, మతం, కులం, లింగం తదితర విభజనలు వుంటాయి. వీటిని తృణీకరించే వర్గ అఖండవాదం వల్ల సమస్య జటిలమయింది. వర్గాల పొందిక విచ్ఛిన్నతకు గురయింది. వర్గ అవగాహనకు వెలుపల అస్తిత్వ ఉద్యమాలకు ఇది దారి తీసింది. ఈ శ్రేణులలో అనేకం పెట్టుబడిదారీ విధానం లోపల సంస్కరణలు కోరుకోవడంతో సోషలిజం దిశగా కృషి జటిలమయింది. వామపక్ష శక్తులకు, ఈ ఉద్యమాలకు మధ్య వైమనస్యత ఏర్పడి కొనసాగుతున్నది. ఈ రెండింటి మధ్య అవగాహనను నిర్మించాలి. జాతి, కుల, లింగ వివక్షను సోషలిస్టు శక్తులు నిర్ద్వంద్వంగా వ్యతిరేకించి, వాటిని రూపుమాపడానికి ఆయా శక్తులతో కలిసి సోషలిజం ఉమ్మడి లక్ష్యంగా కృషిచేయాలి. సమాజంలో వర్గాలు స్పష్టమైన సమీకరణాలుగా ఏర్పడి, ప్రగతిశీల వర్గాలు క్రియాశీల వర్గపోరాటం సాగించడం ఇందుకు కీలకం అవుతుంది. నూతన సమాజం ఒక ఉన్నత మానవ అస్థిత్వాన్ని ఆవిష్కరించే కృషిలో క్రియాశీల భాగస్వాములు కావడం ద్వారా ఈ శ్రేణులు తమ అస్థిత్వాల సంకుచిత పరిధుల్ని అధిగమించడం సాధ్యం కావాలి. పార్టీల వెలుపల సాగుతున్న ప్రజా ఉద్యమాలను నూతన సమాజం కోసం జరిగే పోరాటంలోకి తీసుకురావాలి. ఆయా దేశాల సామాజిక, సాంస్కృతిక జీవనంలోని సానుకూల అంశాలను ఈ సోషలిస్టు నిర్మాణ కృషిలో కలుపుకోవాలి. అదే సమయంలో వాటిలోని ప్రతికూల అంశాలను నిర్ద్వంద్వంగా వ్యతిరేకించాలి.

**ముగింపు :**

భవిష్యత్ సోషలిజాన్ని మేమెలా చూస్తున్నాం అన్న విషయాన్ని రేఖామాత్రంగా పైన పేర్కొన్నాము. తప్పనిసరిగా దీనిలో అసమగ్రత, అసంపూర్ణత ఉంది. ఇది ప్రస్తుత విశాల అవగాహన. దీనిపై చర్చను, విమర్శను ఆహ్వానిస్తున్నాం. వామపక్ష శ్రేణుల్లో ఎంతో అంతర్మథనం జరుగుతోంది. ఇందులో భాగంగా మా ఆలోచనలను పంచుకున్నాము. నిజానికి ఇవన్నీ ఎంత సిద్ధాంతపర అంశాలో, అంత ఆచరణాత్మక అంశాలు కూడా. ముఖ్యంగా ఆచరణ కొత్త సమస్యల్ని ముందుకుతెచ్చి పరిష్కారాల్ని డిమాండ్ చేస్తుంది. ఈ రెండింటికీ మూలాధారం పెట్టుబడిదారీ వ్యవస్థ పరిణామ క్రమం. దాని అంతర్గత వైరుధ్యాల గతిక్రమం. సోషలిజం దిశగా చరిత్ర గతి మారడం, ప్రపంచీకరణ దాని అవకాశాలనన్నింటినీ పూర్తిగా వాస్తవీకరించి అంత్య దశకు చేరిన పిమ్మట జరుగుతుందా లేక అంతకు ముందే ఈ వ్యవస్థలోని వైరుధ్యాలు దానిని

తిరుగులేని సంక్షోభానికి గురిచేయడం ద్వారా జరుగుతుందా అనేది వేచిచూడాల్సిన అంశం. నేటి సవాళ్ళకు దీటైన నూతన వామపక్ష శక్తులు ఆవిర్భవించాలి. పెట్టుబడిదారీ వ్యవస్థ పరిష్కరించలేని సంక్షోభానికి గురై సామాజిక జీవనం అస్తవ్యస్తం అయినప్పుడు, దానిని సమాజంలో అత్యధికులు వ్యతిరేకిస్తున్నప్పుడు, తదనుగుణమైన కార్యాచరణ ద్వారా సోషలిజాన్ని ప్రత్యామ్నాయంగా ప్రతిపాదించి, రాజ్యాధికారాన్ని సాధించి, ప్రతి ఒక్కరి స్వేచ్ఛాయుత అభివృద్ధి అందరి స్వేచ్ఛాయుత అభివృద్ధికి నియమం అనే అవగాహన ప్రాతిపదికగా సమ సమాజాన్ని ఈ సోషలిస్టు శక్తులు నిర్మించగలగడం -- ఇవన్నీ చరిత్ర గతిలో ఇంకా నిగూఢంగా ఉన్న అంశాలు. పెట్టుబడిదారీ విధానం మానవజాతి అంతిమ సామాజిక రూపం కాదనే స్పష్టమైన అవగాహన, సోషలిజం పట్ల ఆశావహ భవిష్యదృష్టికి ప్రాతిపదిక. అయితే, మానవ కార్యాచరణలో ప్రత్యామ్నాయాలు ఎప్పుడూ ఉంటాయి. వాటిలో ఏదైతే, వస్తుగత – స్వీయాత్మక అంశాల పరస్పర ఘర్షణ – ఐక్యతలో వాస్తవీకరించబడుతుందో అది చారిత్రక ఘటన అవుతుంది. అందువల్ల, ఇక్కడ అనివార్యత ఏమీ లేదు. సోషలిజం కూడా అనివార్యం కాదు. మానవ కార్యాచరణ విఫలమైతే, పెట్టుబడిదారీ వ్యవస్థ పతనం సోషలిజానికి కాక, అనాగరికతవైపు పయనించవచ్చు. అందుకే ఇది సుదీర్ఘ ప్రస్థానం. రేమండ్ విలియమ్స్ తన **ది ఇయర్ 2000** అనే రచనలో ఈ పరిస్థితిని ఇలా పేర్కొన్నాడు :

"ఆచరణాత్మక ప్రత్యామ్నాయాలు ఉన్నాయన్న విశ్వాసాన్ని కలిసి పంచుకోవడం, నొక్కి చెప్పడం చేసినప్పుడే బలాబలాలు, మార్పుల మొగ్గలో మార్పు రానారంభిస్తుంది. అనివార్యతలను సవాలు చేసిన తదుపరి, మనం ఆశావహ ప్రస్థానానికి మన శక్తియుక్తుల్ని కూడకట్టుకోవడం ఆరంభిస్తాం. సులభమైన సమాధానాలు లేనప్పటికీ, కనుక్కోగలిగిన కఠినమైన సమాధానాలు ఇంకా అందుబాటులోనే ఉన్నాయి. వాటినే ఇప్పుడు మనం చేయడం, పంచుకోవడం నేర్చుకోగలగాలి. మొదటినుంచీ ఇదే దీర్ఘ విప్లవపు అర్థం, స్ఫూర్తి."

ఇక్కడ కమ్యూనిస్టు భావనని పునశ్చరణ చేసుకోవలసిన అవసరం ఉంది. ప్రైవేటు ఆస్తి రద్దు కమ్యూనిజం సారాంశం. అది వర్గరహిత శ్రామిక మానవాళి సమాజం. కమ్యూనిస్టు సమాజ నిర్మాణ క్రమంలో ఒకరి శ్రమపై మరొకరికి ఉండే అదుపు తొలగిపోతుంది. శ్రమ విభజన స్వభావంలో మౌలికమైన మార్పు వస్తుంది. శ్రమ జీవనోపాధికి మార్గం కాక జీవిత లక్ష్యంగా మారుతుంది. ఈ క్రమంలోనే వ్యష్టి, సమష్టి మధ్య ఉన్న వైరుధ్యాన్ని అధిగమించడం సాధ్యమౌతుంది. ఉత్పత్తి సాధనాలపై సామాజిక యాజమాన్యం ప్రాతిపదికగా నిర్మితమయ్యే కమ్యూనిస్టు సమాజంలో వ్యక్తి వికాసానికి గల అవకాశాలు నిరంతరం పెరుగుతాయి. శ్రమకి వెచ్చించే సమయం తగ్గి, ఇతర

ఆత్మిక లక్ష్యాలకు వెచ్చించే సమయం పెరుగుతుంది. సహజాతాల, భావోద్వేగాల అణచివేత సమసిపోయి స్త్రీ, పురుషుల ఆనందమయ సహజీవనం సాకారమౌతుంది. పుట్టుకతో ఆపాదించే సామాజిక వ్యత్యాసాలు, స్త్రీ పురుష అసమానతలు నిర్మూలించబడతాయి. సమష్టి అవసరాలకోసం వ్యక్తిగత ఆకాంక్షలను అదుపు చేసుకోవలసిన పరిస్థితి క్రమేపి తొలగిపోతుంది. అందుకోసం, అన్ని రకాల కొరతలను అధిగమించిన పుష్కల ఉత్పాదకత ఈ వ్యవస్థకు పునాది కావాలి. అపుడే శక్తి మేరకు శ్రమ, అవసరం మేరకు వినిమయం అనే కమ్యూనిస్టు సూత్రం అమలు సాధ్యమౌతుంది. స్వేచ్ఛా, సమానత్వాల మధ్య అన్ని సమాజాల్లో వున్న వైరుధ్యం సమసిపోయి సమతుల్యత ఏర్పడుతుంది. ఆధునిక యుగారంభంలో ఐరోపాలో రూపుదిద్దుకొని ఫ్రెంచి విప్లవంతో ముందుకొచ్చిన ప్రజాస్వామ్యం, స్వేచ్ఛ వైయక్తికమన్న భావనలకు మార్క్సిజం వ్యతిరేకం కాదు. పైగా వాటికి బూర్జువా వర్గం దిద్దిన పై మెరుగులను తొలగించి, వాటి సారాంశాన్ని వాస్తవీకరించడం మార్క్స్ ప్రతిపాదించిన కమ్యూనిస్టు సమాజానికి నిజమైన అర్థం. వ్యక్తిగా మనిషి సర్వతోముఖాభివృద్ధి కమ్యూనిజం సాధిస్తుంది. మనిషి నిజమైన సృజనాత్మక, క్రియాశీల కర్త (subject) గా మారతాడు. ఒక్క మాటలో చెప్పాలంటే స్వేచ్ఛాజీవుల స్వేచ్ఛా సంసర్గమే కమ్యూనిజం.

లక్ష్యాన్ని, స్ఫూర్తిని కోల్పోయిన ప్రస్తుత వామపక్ష శక్తులు తమ చారిత్రక వారసత్వాన్ని, అనుభవాల్ని, మార్క్సియన్ సోషలిస్టు సిద్ధాంతపు మూల స్ఫూర్తితో బేరీజు వేసుకుని తమని తాము సమూలంగా మార్చుకోగలిగితేనే వర్తమాన చరిత్రపై ప్రభావం చూపగలుగుతాయి. కమ్యూనిస్టు సమాజ ఆవిష్కరణలో తమవంతు పాత్ర నిర్వహించ గలుగుతాయి. నూతన వామపక్ష శక్తులు తమ ఆలోచనలు కలబోసుకుని విశాలమైన అవగాహన పరిధి లోపల భిన్నత్వాన్ని గౌరవిస్తూ కలిసి పని చేయగలగాలి. జాతీయ, అంతర్జాతీయ కృషి సమ్మేళనం జరగాలి. ఈ శక్తులు ఒక సోషలిస్టు బహుళత్వంలో కలిసి కృషి చేయగలగాలి. అలా వర్తమాన సవాళ్ళను వామపక్ష శక్తులు దీటుగా ఎదుర్కొని పరిష్కారాలు సాధించగలవా అన్నది మనందరి ఉమ్మడి అన్వేషణ.

**లెనిన్ అంతిమ పోరాటం** పేరిట మోషె లెవిన్ రాసిన ఈ గ్రంథాన్ని రావెల సాంబశివరావు గారు ఆంగ్లంలోంచి తెలుగులోకి అనువదించారు. క్లిష్టమైన పరిపాలనా బాధ్యతలతో సాహితీ వ్యాసంగాన్ని మేళవించిన విశిష్ట వ్యక్తిత్వం అయనది. పదిహేనుదాకా స్వతంత్ర రచనలు, మరో పదిహేను అనువాదాలు ఇప్పటి వరకు చేశారు. త్రిపురనేని రామస్వామి, సంజీవ్‌దేవ్‌ల జీవిత చరిత్రలు స్వతంత్ర రచనలలో చెప్పుకోదగినవి. ఈ రచనలలో కవితా సాహిత్యం కూడా ఉంది. “భారత స్వతంత్ర పోరాటం”, “నాజీ హిట్లర్ : ఫాసిజం పుట్టుక, పెరుగుదల, పతనం”, “అర్ధరాత్రి స్వతంత్రం”, “వివేక విస్ఫోటనం”

(జర్మన్ తత్త్వవేత్త నీషే రచనకు అనువాదం), "రాజకీయాల మధ్య తీరిక వేళలు" (రామ్ మనోహర్ లోహియా రచనకు అనువాదం), "ఉదారవాదం", "రాజ్యం – పౌర సమాజం" తదితరమైనవి వారి అనువాద రచనలలో ఉన్నాయి. కోరిన వెంటనే అంగీకరించి, ప్రస్తుత రచనను అనువదించి ఇచ్చినందుకు రావెల సాంబశివరావుగారికి మా ధన్యవాదాలు. కలకత్తా విశ్వవిద్యాలయం రాజకీయ శాస్త్ర విభాగంలో విశ్రాంత ఆచార్యులు శోభన్‌లాల్ దత్తా గుప్తా గారు ఈ రచనకు 'పరిచయం' రాశారు. ఆచార్య దత్తా గుప్తా భారతీయ మార్క్సిస్టు మేధావులలో అగ్రగణ్యులలో ఒకరు. సాంప్రదాయేతర మార్క్సిస్టు ఆలోచనా ధోరణులను శ్రద్ధగా అధ్యయనం చేసి అవగతం చేసుకున్నారు. వర్తమాన ప్రపంచాన్ని ఈ బహుముఖ మార్క్సిస్టు అవగాహన నుండి వ్యాఖ్యానించ గలిగినవారు. అడిగిన వెంటనే లెనిన్‌ని సందర్భోచితం చేస్తూ, లెనిన్ పట్ల నూతన అధ్యయనం చేపట్టవలసిన అవసరాన్ని నొక్కి చెపుతూ ఆలోచింపచేసే పరిచయాన్ని వారు రాసి ఇచ్చారు. వారికి మా ధన్యవాదాలు.

ఈ రచనను అందంగా ముద్రించి ఇచ్చిన శ్రీశ్రీ ప్రింటర్స్, విజయవాడ వారికి మా కృతజ్ఞతలు.

**– సమీక్ష**

# పరిచయం

మోషే లెవిన్ రాసిన **లెనిన్ అంతిమ పోరాటం** (ఫ్రెంచి నుండి అనువాదమై) మొదటిసారిగా 1968లో ఆంగ్లంలో ప్రచురితమైంది. వెనువెంటనే ఆ రచనను సప్రమాణ గ్రంథం (classic) గా పరిగణించారు. సోవియట్ యూనియన్ చరిత్రను సరైన రీతిలో, సంయమనంతో అర్థం చేసుకోవడానికి కృషి చేసిన గొప్ప చరిత్రకారులలో ఒకరుగా లెవిన్ గుర్తింపు పొందాడు. స్టాలిన్ అనంతర సోవియట్ మార్క్సిజం దశలో మొదటిసారిగా ప్రచురితమైన రష్యన్ నూతన మూల సమాచారాన్ని తన రచనకు లెవిన్ ఆధారం చేసుకొన్నాడు. ఈ సమాచారంలో ప్రత్యేకించి పేర్కొనదగినది లెనిన్ సంగ్రహ (collected) రచనల ఐదవ ముద్రణ. లెనిన్ జీవితపు అంత్యదశలో అతని ఆలోచనా క్రమాన్ని లెవిన్ గ్రంథం విశ్లేషించింది. మృత్యువు తనను త్వరలోనే కబళించి వేయనున్నదని లెనిన్‌కు తెలుసు. లెనిన్‌కు సంబంధించినంతవరకు తాను చేసిన పోరాటం మరణానికి వ్యతిరేకంగానో, బ్రతకడానికో చేసినది కాదు. అది వ్యర్థ ప్రయత్నమనీ తెలుసు. 1917 తరువాత తీవ్ర సంక్షోభంలో కూరుకుపోయిన విప్లవాన్ని, పార్టీని, కొత్తగా ఏర్పడిన సోవియట్ రాజ్యాన్ని కాపాడుకోవడానికి చేసే పోరాటమే లెనిన్‌కు అన్నిటికంటె ముఖ్యం. తనని తాను లెనిన్ శిష్యునిగా పరిగణించుకొన్న ఆంటోనియో గ్రాంసీ జైలుజీవితాన్ని -- శారీరక, మేధోరంగాలలో లెనిన్ చేసిన పోరాటం జ్ఞప్తికి తెస్తుంది. తాను ఎదుర్కొంటున్న సంక్షోభాన్ని లెనిన్ ఎలా సిద్ధాంతీకరించాడో లెవిన్ అధ్యయనం పరిశీలించింది. మొదటిసారిగా ప్రచురితమైన అనేక పత్రాలను నిశితంగా అధ్యయనం చేయడం ద్వారా లెనిన్ మేధస్సు ఎలా పనిచేసిందో లెవిన్ తేటతెల్లం చేశాడు. లెనిన్ మరణాన్ని క్రమేపి సమీపిస్తున్న కొలది, ప్రత్యేకించి 1922 తరువాత ఆరోగ్యం వేగంగా దిగజారుతున్న తరుణంలో అతని సహాయకులు భద్రపరచిన లెనిన్ నోట్స్, వ్యాఖ్యానాలు, దినచర్య రాతప్రతులను లెవిన్ అధ్యయనం ప్రస్తావించింది. లెనిన్ ఎదుర్కొన్న మూడు ప్రధాన సమస్యలను ఈ పత్రాలు ప్రస్తావించాయి. మొదటిది, సజ్జోజనిత శక్తులకు (అంటే మార్కెట్, వాణిజ్యం, రైతాంగం), యుద్ధ కమ్యూనిజం వారసత్వంగా వచ్చిన కేంద్రీకృత శక్తులకు ప్రతీకగా నిలిచిన నియంత్రిత ఆర్థిక వ్యవస్థ (command economy) కు మధ్య సాగుతున్న ఉద్రిక్తత.

రెండవది, జాతుల సమస్య, జార్జియా సంక్షోభం, రష్యన్ జాతి దురహంకారం పట్ల ఆందోళన. మూడవది, రాజ్యాంగ యంత్రం మరింతగా ఉద్యోగస్వామ్యంగా మారడంతో విప్లవ వాగ్దానాలకు, ఆచరణకు మధ్య అగాధమేర్పడడం. దానితో నూతనంగా ఏర్పడిన సోవియట్ రాజ్యం సర్వ సామాజిక నిర్మాణాలను అణచివేసే వ్యవస్థగా పరిణమించడం.

ఈ ప్రశ్నలే లెనిన్‌ను తీవ్రంగా కలిచివేశాయి. నోట్స్, డిక్టేషన్, లేఖలు ఇంకా ఇతర రూపాలలో -- అవి ఎంత అవ్యవస్థంగాను, శకల రూపంలోను ఉన్నప్పటికి -- ప్రత్యామ్నాయాలను పేర్కొన్నాడు. లెనిన్ తన జీవితపు చివరిదశలో దాదాపు ప్రక్కన పెట్టబడడంతో ఈ ప్రత్యామ్నాయాలను ఎవరూ పట్టించుకోలేదు. ఈ పరిస్థితి -- (2000 సంవత్సరంలో) -- అలెగ్జాండర్ సొకురొవ్ తన తారస్ (Taurus) అనే చిత్రంలో లెనిన్ జీవిత చరమాంకంలో ఆవహించిన విషాదాన్ని అద్భుతంగా చిత్రించి, ప్రశంసలందుకొన్న అంశాన్ని జ్ఞప్తికి తెస్తుంది. మార్కెట్ (సజ్జోజనితం), కేంద్రీకృత విధానాల మధ్య ఉన్న ఘర్షణకు పరిష్కారంగా లెనిన్ నూతన ఆర్థిక విధానం (New Economic Policy - NEP) రూపొందించాడు. జాతుల సమస్యకు సంబంధించి, ప్రత్యేకించి జార్జియా సమస్య పరిష్కారంలో ఆచితూచి వ్యవహరించాలని లెనిన్ కోరాడు. విశాల రష్యన్ జాతీయ వాదం పేరుతో ఎలాంటి ఆధిపత్య ధోరణి ప్రదర్శించవద్దని హెచ్చరించాడు. ఈ విషయంలో స్టాలిన్, ఆర్జోనికిడ్జ్‌లతో లెనిన్ తీవ్రంగా విభేదించాడు. చివరగా రాజ్య యంత్రాంగం ఉద్యోగస్వామ్యం కాకుండా నిలువరించడమెలా అనే విషయంలో లెనిన్ ఆలోచన మూడు విధాలుగా సాగింది. ఒకటి: సోషలిస్టు రాజ్యానికి అనువైన సంస్కృతి విప్లవానంతర రష్యాలో లేదని లెనిన్ భయపడ్డాడు. ఆంటోనియో గ్రాంసీకి గల ప్రాసంగికతను ఇది జ్ఞప్తికి తెస్తుంది. రెండు: వర్గ వ్యతిరేకతతో వున్న పూర్వ అధికారులతో కూడిన అప్పటి సోవియట్ పౌరసేవా రంగంపట్ల లెనిన్‌కు తీవ్ర విమర్శ వుంది. అందుచేత పెద్ద నగరాలలో ఉన్న పౌర అధికారుల వర్గ నేపథ్యం తెలుసుకొనేందుకు సర్వే నిర్వహించవలసిందిగా లెనిన్ ఆదేశించాడు. అయితే సర్వే ఫలితాలు లెనిన్‌కు చేరలేదు. లెనిన్ ఆరోగ్య స్థితి రీత్యా ఇలాంటి "రాజకీయ సమాచారం" ఆయన అందుకోకూడదని పార్టీ సెంట్రల్ కమిటి భావించింది. మూడు : ప్రసిద్ధి చెందిన అతని "వీలునామా" ("మహాసభకు ఉత్తరాలు"). ఉద్యోగస్వామ్యం నుండి రాజ్య యంత్రాంగాన్ని విడగొట్టడం ద్వారా యంత్రాంగాన్ని పునఃవ్యవస్థీకరించాలన్న లెనిన్ రహస్య ప్రణాళిక -- ఎక్కువ మంది కార్మికులను సభ్యులుగా తీసుకోవడం ద్వారా పార్టీ సెంట్రల్ కమిటీని విస్తరించాలని పేర్కొంది. అలానే పార్టీ కేంద్ర కంట్రోల్ కమీషన్ (కేంద్ర నియంత్రణ సంఘం)ను, కార్మిక – కర్షక తనిఖీ వ్యవస్థను కలిపి వేయాలని ప్రణాళిక స్పష్టం చేసింది. చివరిగా

అధికారాన్ని దుర్వినియోగం చేసే ధోరణి స్టాలిన్‌లో వుంది కనుక, అతనిని పార్టీ ప్రధాన కార్యదర్శి పదవి నుండి తొలగించడాన్ని ప్రణాళిక ప్రతిపాదించింది. మరొక మాటలో చెప్పాలంటే, రాజ్య యంత్రాన్ని ప్రజాస్వామీకరించే ఎజెండాయే లెనిన్ మదిలో వుంది.

విప్లవానంతర రష్యా ఎదుర్కొంటున్న క్లిష్ట పరిస్థితులకు సంబంధించి లెనిన్ అవగాహనను అర్థం చేసుకొనేందుకు పాఠకుల దృష్టిని రెండు అంశాల మీదకు మరలించి లెవిన్ చేసిన కృషిని నొక్కి చెప్పవలసి వుంది. ఒకటి – విప్లవ రంగం ఐరోపా నుండి ఐరోపాయేతర ప్రపంచానికి మారిందన్న లెనిన్ అవగాహనలోని మార్పు. ఐరోపాలోని ఇతర దేశాలలో అక్టోబర్ విప్లవం తరహా విప్లవాలు వచ్చే సూచనలు లేవు కనుక, జర్మన్ విప్లవాన్ని  తీవ్రంగా అణచివేశారు కనుక, విజయవంతమైన రష్యా విప్లవాన్ని అనుసరించి ఐరోపాలో ఉవ్వెత్తున సాగుతున్న విప్లవ పోరాటాలు నేపథ్యంగా ప్రపంచాన్ని నూతనంగా నిర్మించవచ్చున్న లెనిన్ పథకాన్ని సమీప భవిష్యత్‌లో సాధించడం సాధ్యం కాదని నిరూపణైంది. ఐరోపాలో విప్లవ శక్తులు ఓటమి చెందడం, ఫాసిజం రంగం మీదకు రావడంతో ఆసియా, ఆఫ్రికా ప్రజల మీద లెనిన్ ఇప్పుడు ఆశలు పెట్టుకున్నాడు. రెండవ సమస్య ఎంతో సంక్లిష్టమైనది. చర్చనీయాంశమైనది. సోవియట్ రాజ్య యంత్రాంగాన్ని ప్రజాస్వామీకరించే విషయంలో లెనిన్ సందిగ్ధంలో చిక్కుకొన్నాడని లెవిన్ వాదన. ఈ విషయంలో లెనిన్ వైఖరి అస్పష్టంగా వుంది. ఒకవైపు రాజ్య యంత్రాంగాన్ని ఉద్యోగస్వామ్యం కాకుండా నిలువరించాలంటే రాజ్యాన్ని శ్రామిక వర్గపరం చేయాలని అంటాడు. మరొకవైపు సోషలిస్టు నిర్మాణానికి అవసరమైన సంస్కృతి రష్యన్ ప్రజావళికి లేదు కనుక సోషలిజంలో పాలనా శాస్త్రంపై ప్రభుత సాధించలేని ఆ ప్రజానీకం అశక్తత పట్ల విచారం వ్యక్తం చేస్తాడు. తప్పిదాలతో కూడిన ప్రజాస్వామికీకరణ క్రమం రాజ్య యంత్రాంగంపై పార్టీకున్న పట్టును బలహీనపరచి, సోషలిజం నిర్మాణాన్ని బలహీనపరుస్తుందన్న భయంతో లెనిన్ అంతిమంగా తన ఆశలను పార్టీ శ్రేణులలోని 'శిష్టుల' పై పెట్టుకొన్నాడు. ఇది మరో ప్రశ్నను లేవనెత్తింది. చరిత్రలో ఈ ప్రశ్నకు ఇప్పటికీ సమాధానం లేకుండా పోయింది. ఐరోపాలో కెల్లా వెనుకబడిన ప్రాంతంలో ప్రపంచంలో మొదటి సోషలిస్టు విప్లవం విజయవంతం కావడానికి సంబంధించిందే ఈ ప్రశ్న. విప్లవం ఫ్రాన్స్‌లోను, జర్మనీలోను విజయవంతమై వుంటే చరిత్ర, బహుశా, భిన్నంగా రాయబడేది. అందుకే, విప్లవకర రష్యాకు అండగా నిలుస్తారని జర్మనీ వైపు, జర్మన్ శ్రామిక వర్గం వైపు లెనిన్ నిరంతరం చూడడంలో ఆశ్చర్యం లేదు.

ఈ వాస్తవాలలో అనేకం ఇప్పుడు తెలిసినవే. కాని నలభై ఏళ్ళ క్రితం చారిత్రక పత్రాల ఆధారంగా జాగ్రత్తగా విశ్లేషిస్తూ మోషే లెవిన్ చేసిన అధ్యయనాన్ని ఈ రోజు

కూడా నిశితంగా చదవవలసి ఉంది. తరువాత కాలంలో జరిగిన ఘటనలను మోషే లెవిన్ అధ్యయనం ఊహించింది. వీటిలో ప్రత్యేకించి పేర్కొనదగినది సోవియట్ యూనియన్, ఇతర సోషలిస్టు రాజ్య కూటమి పతనం. లెనిన్ చర్చించిన సమస్యలను అతని వారసులు పట్టించుకోలేదు. లెనిన్ తన చివరి దశలో లేవనెత్తిన అనేక అంశాలు సోషలిజం సంక్షోభానికి, సోషలిస్టు రాజ్య కూటమి పతనానికి దారితీశాయని ఖచ్చితంగా చెప్పవచ్చు. అనేక సంవత్సరాల తరువాత కూడా ఈ పుస్తకానికున్న కొనసాగుతున్న ప్రాముఖ్యతకు ఇదే కారణం.

భారతదేశంలోని వామపక్ష ఉద్యమం తీవ్ర సంక్షుభిత స్థితిలో ఉన్న తరుణంలో ఈ సప్రమాణిక గ్రంథపు తెలుగు అనువాదానికి ముందుమాట రాయడానికి వాస్తవానికి నేనెంతో సంతోషపడుతున్నాను. నేటి ప్రపంచంలో నిర్మించడం సాధ్యంకాని ఒక తరహా సోషలిజాన్ని లెనిన్ ప్రతిపాదించాడు కనుక అతనికి ఏ మాత్రం ప్రాసంగికత లేదన్న భావన భారతదేశంలోని రాడికల్ మేధావి వర్గంలోని కొన్ని శ్రేణులలో నెలకొని వుంది. లెనిన్‌ని అర్థం చేసుకోవడంలో మోషే లెవిన్ పుస్తకం ఒక ప్రత్యామ్నాయాన్ని అందిస్తుంది. లెనిన్‌కి సంబంధించి వున్న సాంప్రదాయిక భాష్యంతో మోషే లెవిన్ భాష్యం పొసగదు. లెనిన్‌ని ఒక పార్టీ నాయకునిగానే గాక, సోషలిజాన్ని, ప్రజా రాసులను కలపాలన్న తాపత్రయం కలిగిన ఒక నిఖార్సైన విప్లవకారునిగా ఈ గ్రంథం సూచించింది. లెనిన్‌ని ఒక నూతన కోణంలో అధ్యయనం చేసేందుకు ఈ తెలుగు అనువాదం మార్గాన్ని తెరుస్తుందని నేను పూర్తిగా విశ్వసిస్తున్నాను. నేటి భారతదేశంలో లెనిన్‌కి సంబంధించిన ఇలాంటి నూతన అధ్యయనం అవసరం ఎంతో వుంది. ఇలాంటి సప్రామాణిక గ్రంథపు అనువాదాన్ని అందించే మంచి పనికి పూనుకున్న ప్రచురణ కర్తలు, అనువాదకుడు అభినందనీయులు.

కోల్‌కతా

**శోభనలాల్ దత్తా గుప్తా**

*విశ్రాంత ఆచార్యులు, రాజకీయశాస్త్ర విభాగం*

*కలకత్తా విశ్వవిద్యాలయం*

# ముందుమాట

రెండవ ప్రపంచ యుద్ధం నాటి నుండి అంతర్జాతీయ రాజకీయ రంగంపై గణింపదగిన సంఖ్యలో వామపక్ష నియంతృత్వ రాజ్యాలు తెరపైకి వచ్చాయి. వాటన్నింటికి మూలం సోవియట్ యూనియన్. అది ఇప్పుడు తన యాభయ్యవ జయంత్యుత్సవాలు జరుపుకుంటున్నది. ఈ కొత్త రాజ్యాలు తమ జ్ఞాన పరిధిని విస్తృతపరుచుకుని, తొలి కార్మికవర్గ నియంతృత్వపు ఒడిదుడుకులపై పర్యాలోచన చేసి వుంటే, ఈ యాభై సంవత్సరాల సోషలిస్టు అనుభవం కొత్త రాజ్యాలకు ఎంతో ప్రయోజనకరంగా ఉండేదని నిస్సందేహంగా చెప్పవచ్చు. ఆ విధంగా చూస్తే, సోవియట్ యూనియన్‌లో 1929 –30 ల మధ్య ఏర్పాటైన "వ్యవసాయిక – పారిశ్రామిక సముదాయాల" వైఫల్యం జనచైనాలో కమ్యూన్ల వైఫల్యాన్ని ముందస్తుగా సూచించింది. నికితా కృశ్చేవ్ 1950లో తన వ్యవసాయిక నగరాల పథకాన్ని ప్రారంభింపజూచిన తరుణంలో అదే విధమైన మితిమీరిన అధికార ధోరణితో ప్రవర్తించాడు. కొద్దిమంది సోవియట్ రచయితల్ని మినహాయిస్తే, నూతన ఆర్థిక విధానపు కాలం నుండి నేర్వదగిన గొప్ప ఆర్థిక, సామాజిక పాఠాలను ఎక్కువగా విశదం చేసింది ఆంగ్లేయ నిపుణులు. కాని దాని వల్ల వాళ్ళకు అంతగా ఒనగూడిందేమీ కన్పించదు. సోవియట్ చరిత్రకు చెందిన అనేక దశలు, అంశాలు కొద్దిమంది పండితుల పరిశోధనల కారణంగా కొంత మేరకు వెలుగులోకి వచ్చాయి. కాని ఎక్కువ భాగం నిగూఢంగా ఉండిపోయాయి. ప్రతి ఒక్కరూ తమ స్వానుభవంతో గ్రహించింది కాక సోవియట్ యూనియన్‌ని పాలించే శిష్ట వర్గానికి తమ దేశ చరిత్ర అంతగా తెలిసుండకపోవచ్చు. సామ్యవాద దేశాలు, విచిత్రంగా, తమ దేశ చరిత్రను రాజ్య రహస్యంగా భావించడమే ఇందుకు కారణం. భవిష్యత్తును నిర్మించదలచిన వారికి, తరచుగా బాధాకరంగా ఉండిన గత చరిత్ర గురించిన పరిజ్ఞానం వాళ్ళ కర్తవ్య దీక్షలో నిరుత్సాహాన్ని కలిగించగలదని ఈ దేశాల నాయకులు విశ్వసిస్తున్నట్లుగా కనిపించేవారు. అయితే వాస్తవానికి చరిత్రను తెలుసుకుని, సమీక్షించటం కంటే చరిత్ర పట్ల అవగాహనా లేమిని కలిగి వుండటం వల్లే ప్రగతిశీల దృక్పథానికి మరింతగా ముప్పు వాటిల్లుతుంది. చరిత్ర ప్రభుత్వ అనుమతితోనే ప్రకటించబడవలసి వచ్చినంత కాలం అస్పష్టంగానే ఉండిపోతుంది. ఎందువల్లనంటే అదొక శాస్త్రీయ అధ్యయనం. అది ప్రభుత్వ గుత్తాధిపత్యం కారణంగా భ్రష్టమౌతుంది.

లెనిన్ జీవితపు చివరి సంవత్సరానికి, అప్పటి ఆయన ఆలోచనలకు సంబంధించిన ఈ అధ్యయనం పూర్తిగా కొత్తదేమీ కాదు. దీనికి సంబంధించి గణనీయమైన సమాచారం 1920లలో ట్రాట్స్కీ బహిరంగపరచిన విషయాల నుండి, మరల లెనిన్ "వీలునామా"కు సంబంధించి సోవియట్ యూనియన్ కమ్యూనిస్టుపార్టీ 20వ మహాసభతో ప్రారంభమై సంభవించిన పరిణామాల నుండి తెలియవచ్చింది. అయితే ఇటీవలి సోవియట్ ప్రచురణలు లెనిన్ అనారోగ్యంతో ఉన్న రోజుల్లో పార్టీ ఉన్నతశ్రేణి నాయకుల మధ్య నెలకొన్న సంబంధాలను మరింత ఖచ్చితంగాను, మరింత వివరంగాను పునర్నిర్మించి వెల్లడించే అవకాశాన్నిచ్చాయి. అదే సమయంలో లెనిన్ "వీలునామా" -- అంటే చరమాంకంలో లెనిన్ రాజకీయ ఆలోచనా ధోరణి -- పై విశ్లేషణను విస్తృతపరచి, వీలైన మేరకు దానికొక నూతన వ్యాఖ్యను సమకూర్చాలని ఆశిస్తున్నాను.

ఈ రచనకు అతి ముఖ్యమైన మూలాధారాలు మూడు : మొదటిది లెనిన్ సమగ్ర రచనల తాజా ప్రచురణ అయిన అయిదో ముద్రణ. ఇది అంతకు ముందు వాటికంటే సమగ్రమైనదే కాక అదనపు సమాచారం, వ్యాఖ్యలతో నిండి ఉన్నది; రెండవది లెనిన్ కార్యదర్శుల్లో ఒకరైన ఫతియెవా జ్ఞాపకాలతో కూడిన రచన; మూడవది 1922 నవంబర్ 21 నుండి 1923 మార్చి 6 వరకు కార్యకలాపాల లేఖనాలతో కూడిన "లెనిన్ కార్యదర్శుల జర్నల్". అది సోవియట్ చారిత్రక పత్రిక "వోప్రాసీ ఇస్తోరీ" లో తొలిసారిగా 1963లో ప్రచురింపబడింది. (ఈ 'జర్నల్" లెనిన్ రచనల అయిదవ ప్రచురణలో కూడా చేర్చబడింది - సంపుటి : XLV - పుటలు : 455-86). ఈ లేఖనాలు ఎంతటి విషయ ప్రధానమైనవో అంతగా విలక్షణమైన రూపాన్ని కూడా కలిగి వున్నాయి. అవి నోట్సు రాసుకునే పుస్తకంలో నాలుగు గళ్ళుగా విభజించి రాయబడ్డాయి. మొదటి గడిలో తేది, రెండవ గడిలో కార్యదర్శి పేరు, మూడవ గడిలో లెనిన్ ఇచ్చిన ఆదేశాలు, నాల్గవ గడిలో అవి ఎలా నెరవేర్చబడ్డాయనే సమాచారం పేర్కొనబడ్డాయి. చివరి గడిలో సోవ్నర్కోమ్ (ప్రజా కమిసార్ల మండలి) అధ్యక్షుని కలుసుకున్న వారి వివరాలు, ఆయన ఉత్తర ప్రత్యుత్తరాలు, చిన్నా చితకా పనులు, హావభావాలు, కొన్ని సార్లు రోజువారీగా కూడా, అందులో పొందుపర్చబడ్డాయి. ఈ సమాచారం లెనిన్ పని తీరుపై అవగాహన కల్పించేదిగా ఉంది కాని, అంతకు మించి, ఆశ్చర్య చకితుల్ని చేసే విషయాలేమీ వెల్లడి చేయలేదు. లెనిన్ పనిలో వేగం మందగించిందని, క్రమం తప్పకుండా కార్యాలయానికి రావడం లేదని, తన ఇంటికి ఎవరో ఒక కార్యదర్శిని పిలిపించుకుని వారికి తాననుకున్నది చెప్పి రాయిస్తున్నాడని తెలియవస్తుంది. ఆయన ఆరోగ్యం ఇంకా క్షీణిస్తూనే ఉంది. వైద్యులు పని భారాన్ని తగ్గించుకోవాలని, తరచుగా గ్రామీణ ప్రాంతాల్లో

విశ్రాంతి తీసుకుంటూ ఉండాలని, కమిసార్ల మండలి (మంత్రివర్గం) లేదా పొలిట్‌బ్యూరో సమావేశాలకు కొన్నింటికి గైర్హాజరు కావాలని గట్టిగా చెపుతూనే ఉన్నారు. 1922 డిసెంబరు 13న జెర్జిన్‌స్కీతో ఒక ముఖ్యమైన సమావేశం ముగిసిన మరుసటి రోజు లెనిన్ రెండుసార్లు తీవ్రమైన పక్షవాతానికి గురి కావడం వల్ల వైద్యుల సలహాలను పాటించి తన పనులను వాయిదా వేసుకుని విశ్రాంతి తీసుకోవలసి వచ్చింది. ఈ దశకు చేరుకునేప్పటికి "జర్నల్"లోని అంశాలు ఎంతో ఉత్సుకతను రేకెత్తిస్తాయి. లెనిన్ తన కార్యదర్శి నెవరినైనా, వాళ్ళకు ఆదేశాలిచ్చేందుకు లేదా తాను చెప్పింది రాసుకునేందుకు రమ్మని కబురు పంపేవాడు. ఆ సందర్భంలో వాళ్ళు ఆయన్ని ఎంతో శ్రద్ధతో గమనించేవారు. ఆయన ప్రతిమాటను, చర్యను వదిలిపెట్టకుండా పరిశీలించేవారు. వాటిని "జర్నల్" లో రాసేవారు. లెనిన్ క్రెమ్లిన్‌లోని ఓ చిన్న గదిలో తన మంచానికి పరిమితమై పోయాడు. కుడికాలు, కుడిచేయి చచ్చు పడిపోయాయి. బయట ప్రపంచం నుండి దాదాపు పూర్తిగా విడివడిపోయాడు. ప్రభుత్వ కార్యకలాపాలకు పూర్తిగా దూరమయ్యాడు. ఈ విషయంలో వైద్యుల ఆదేశాలు కఠినంగా ఉన్నాయి. అవి పొలిట్‌బ్యూరో నిర్ణయం ద్వారా మరింత కట్టుదిట్టం చేయబడ్డాయి.

"జర్నల్" లో రాయబడ్డ అంశాలు ఎంతగా శకలాలుగా ఉన్నప్పటికీ అవి, లెనిన్ పక్షవాతంతో బాధపడుతూ, తన చరమదశ సమీపిస్తున్నదనే స్పృహ కలిగివుండి కూడా, తన శారీరక క్షీణత పైనే గాక, తన పార్టీ నాయకత్వానికి వ్యతిరేకంగా కూడా తీవ్రమైన, ఉద్వేగపూరితమైన పోరాటాన్ని ఎలా నెరపిందీ తెలియజేసేందుకు ఉపయోగపడ్డాయి. అతి కష్టంమీద ఆయన దేశ స్థితిగతులపై ఒక సంపూర్ణ సమీక్ష నిర్వహించి, కార్యాచరణ ప్రణాళికను రూపొందించి, పొలిట్‌బ్యూరో, సెంట్రల్ కమిటీలలోని తన సహచరులకు నచ్చ చెప్పడానికి గట్టి ప్రయత్నం చేశాడు. పొలిట్‌బ్యూరో సభ్యులు తమకు తాముగా కోరని ఈ కార్యాచరణ ప్రణాళిక ఉద్యోగస్వామ్యంలో గణనీయమైన మేరకు, లక్ష్యాలలో కొంత మేరకు మార్పులు చేయడాన్ని ప్రతిపాదించింది. పొలిట్‌బ్యూరోలోని అధిక సంఖ్యాకులకు అది ఉత్సాహం కలిగించ లేదు.

కొద్దిమంది మహిళల - - తన భార్య క్రూప్‌స్కయా, సోదరి మరియా ఇల్లినిచ్నా, ముగ్గురు లేదా నలుగురు కార్యదర్శులు ముఖ్యంగా ఫతియెవా, ఓలడిచేవాలు -- సాయంతో లెనిన్ తాను కోరుకున్న సమాచారాన్ని పొందేందుకు మొండిగా పోరాడాడు. ప్రభావం చూపగల సభ్యులతో మాట్లాడాడు. తమ చర్యలు ఏ దిశగా సాగవలసి వుందో సూచించాడు. మద్దతు కూడగట్టడానికి ప్రయత్నించాడు. అవసరమైన సందర్భాలలో పరోక్ష మార్గాల ద్వారా వివిధ నాయకుల అభిప్రాయాలను సేకరించేవాడు. రానున్న పార్టీ

సమావేశానికై సుదీర్ఘ నివేదికను రూపొందించాడు. వ్యాసాలను ప్రచురించాడు. ఎలాగైతేనేం చివరకు వైద్యుల నుండి కాని లేదా పొలిట్‌బ్యూరో నుండి కాని తన కార్యక్రమాలు కొన్నింటిని కొనసాగించేందుకు అనుమతి పొందాడు. అయితే ఆయన సదుద్దేశంతో రహస్యంగా కొనసాగించిన కార్యక్రమాలు కూడా ఉన్నాయి. తన అత్యంత ఆప్తమిత్రుల సాయంతో తన జీవిత కృషి భవిష్యత్ సాఫల్యతను ఖాయపర్చుకునేందుకుగాను ఒక కుట్రకు ఏమీ తీసిపోని ప్రయత్నంలో లెనిన్ నిమగ్నమయ్యాడు. ఈ "కుట్ర"లో -- ఈ పదం స్వయంగా లెనిన్ వాడిందే -- కీలకమైన అంశం పార్టీ ప్రముఖులు ఆరోపణలకు గురైన జార్జియాలో జరిగిన ఘటనలపై విచారణ కోసం ఒక ప్రభుత్వేతర కమిషన్‌ను లెనిన్ రహస్యంగా నియమించటం. ''జర్నల్'' ఆధారంగా ఈ వ్యవహారానికి సంబంధించిన పరిస్థితులను, లెనిన్, ట్రాట్స్కీ, స్టాలిన్‌ల మధ్య ఉన్న రాజకీయ సంబంధాలను మనం సవివరంగా పునర్నిర్మించుకునే అవకాశం ఏర్పడింది. ఈ సమాచారం అంత తీవ్రంగా జబ్బుపడి కూడ లెనిన్ ప్రదర్శించిన శారీరక, మానసిక స్థైర్యాన్ని గురించి మనకు కొంత అవగాహనను కలిగిస్తుంది. లెనిన్ ఉనికిని, భావోద్వేగాన్ని, వ్యక్తిత్వ ప్రభావాన్ని, మందహాసంలోని ఆకర్షణను అనుభూతి చెందేందుకు అది సాయపడుతుంది.

ఇదిగో ఇక్కడే ఆత్మకథకు చెందిన అప్రధాన విషయాలకు మించిన ఒక అంశం మన ముందు నిల్చింది. లెనిన్ తన జీవనయానపు అంత్యదశలో "మేధో సంక్షోభాని"కి గురికావడం, తాను రూపొందిస్తున్న తిరుగుబాటు తన జీవిత కృషి ఫలితాలకు వ్యతిరేకంగానే ఉద్దేశించబడడం, ఈ గొప్ప విప్లవకారుడు ప్రజా విముక్తి అనే తన ఆదర్శం తన కనులముందే అంతర్ధానం కావడాన్ని గమనించాల్సి రావడంలోని విషాదం తదితర అంశాలను చరిత్రకారులు తరచు ప్రస్తావిస్తుంటారు. అంతేకాక, తన శారీరక క్లేశం, మార్చునలవికాని రాజకీయ వాస్తవాల దురదృష్టకరమైన కాకతాళీయత వల్ల తాను ఘటనల క్రమంపై పట్టు కోల్పోతున్నట్లు ఆయన భావించడాన్ని కూడా వారు ప్రస్తావిస్తుంటారు. ఈ అధ్యయనంలో అటువంటి ప్రతిపాదనలను తిరిగి పరిశీలించే అవకాశం మనకు కలుగుతుంది.

అయితే లెనిన్ అనారోగ్యానికి గురయిన సమయంలో సోవియట్ ప్రభుత్వంలో నెలకొన్న స్థితి, ఆయన అంతిమదశలో ఎదుర్కొన్న సమస్యలు నేటి ప్రపంచానికి కూడా అన్వయించేవే. ఇందువలన జీవిత చరిత్రకు మించిన అంశాలను ఎదుర్కోవలసిన స్థితి మనకు తటస్థిస్తుంది. లెనిన్ ఏ రాజ్య స్థాపనకైతే తాను దోహదం చేశాడో, దానికి తగిన సామాజిక, ఆర్థిక నిర్మాణాన్ని సమకూర్చాలనుకున్నాడు. ఈ నిర్మాణానికి, విప్లవ అంతిమ

లక్ష్యాల సాధనకు రెండింటికీ సరిపోయే నిర్వహణా పద్ధతుల్ని సృష్టించాలనుకున్నాడు. దాని ఫలితమే నూతన ఆర్థిక విధానం. నియంతృత్వ రాజ్య యంత్రానికి సరికొత్త రూపును, శక్తిని, సాఫల్యాన్ని అందించే ప్రయత్నం చేశాడు. సోషలిజాన్ని లక్ష్యంగా ప్రకటించిన నియంతృత్వ రాజ్య వ్యవస్థకి చెందిన నాయకుల విధులు, బాధ్యతలు ఏమిటి అనే సమస్యను లెనిన్ ప్రవర్తన ముందుకు తీసుకువచ్చింది. సోవియట్ తరహా పాలనా వ్యవస్థతో వెనుకబడిన దేశాన్ని అభివృద్ధి పథంలోకి నడిపించాలనుకునే నియంతృత్వ వ్యవస్థ తొలి దశలో ఈ మూడు కీలక ప్రశ్నలు ఎల్లప్పుడు పరస్పరాశ్రితాలై వుంటాయి.

లెనిన్ ఎదుర్కొన్న మొదటి ప్రశ్న : ఒకవైపున ఆర్థిక వ్యవస్థ ప్రారంభానికి అవసరమైన సజ్జోజనిత శక్తులు (spontaneous forces) అయిన చిన్న కమతాల రైతులు, చేతివృత్తులవారు, వ్యాపారస్తులకు, మరోవైపున కేంద్రీకృతమైన, ప్రభుత్వ ఆధీనంలో వున్న, ఇంచుమించుగా ప్రణాళికాబద్ధం కావించబడిన, మొత్తం ఆర్థిక వ్యవస్థకి దిశా నిర్దేశం చేయవలసిన రంగానికి మధ్య సమతౌల్యాన్ని నెలకొల్పటం. ఇది నూతన ఆర్థిక విధానంలో "మార్కెట్", "ప్రణాళిక"ల మధ్య ఊగిసలాటగా ప్రస్ఫుటమయింది. చిన్న కమతాలు రద్దయిపోయి, పెట్టుబడిదారీ తరహా మధ్యతరగతి వర్గాలు కనుమరుగైపోయిన నేటి దశలో కూడా సోవియట్ నాయకులు ఎదుర్కొంటున్న ప్రధాన సమస్యలలో ఇది ఒకటి. ఈ రెండు పరస్పర విరుద్ధాలు కావని, వాటిని ఏకకాలంలో సమన్వయంతో అమలు పర్చగలిగితే పరస్పర ఆశ్రితాలవుతాయని వారు తెలుసుకోసాగారు.

రెండవ ప్రశ్న : నియంతృత్వ రాజ్యం పనిచేసే తీరుకు సంబంధించి నటువంటిది. ఈ విషయం పట్ల మన నుంచి శ్రద్ధతో కూడిన గమనిక అవసరం. విప్లవ లక్ష్యాలైన దేశాభివృద్ధి, సామాజిక న్యాయం సాధన కోసం తొలుత నియంతృత్వ విధానం అవలంబించబడుతుంది. అయితే నియంతృత్వ రాజ్యం తనకు తాను రూపొందించుకున్న చట్టాలు, ప్రయోజనాలతో ఒక బిగుసుకుపోయిన వ్యవస్థగా మారుతుంది. దాని మూల లక్ష్యానికి వక్రీకరణగా అది పరిణమించే అవకాశం ఉంది. అది దాని వ్యవస్థాపకుల నియంత్రణ నుండి తప్పించుకుంటుంది. దీర్ఘకాలం పాటు ప్రజల ఆశలను అది వమ్ము చేస్తుంది. ఈ క్రమంలో సాధనమే అంతిమ లక్ష్యంగా తయారవుతుంది. స్వేచ్ఛను పెంపొందించేందుకు నెలకొల్పిన నిర్బంధ పాలనా విధానం ప్రభుత్వ యంత్రాంగానికి ఆవలనున్న సామాజిక శక్తులకు అధికారాన్ని మరింతగా దఖలు చేయకపోగా, అణచివేత యంత్రాంగంగా మారుతుంది. తరచుగా ప్రజల అభీష్టాలకు విరుద్ధంగా ఉండే కష్టతరమైన పనులను సమర్థవంతంగా నిర్వహింపజూచే ప్రతి రాజ్యం విధిగా ప్రత్యేక సౌకర్యాలు అనుభవించే ఉన్నత శ్రేణిని సృష్టిస్తుంది. ఈ శ్రేణి ప్రతిష్టను, భౌతిక, రాజకీయ

ప్రయోజనాలను పొందుతుంది. సామాజిక, ఆర్థిక వాస్తవాల ఆధారంగా ఈ ప్రత్యేక సౌకర్యాలను గట్టి పరిమితులలోపు నియంత్రించనట్లైతే అవి ప్రమాదభరితాలై అభివృద్ధికి ఆటంకంగా నిలుస్తాయి.

ఇక మూడవ ప్రశ్న : అధికారం, ప్రత్యేక సౌకర్యాలు మనుష్యుల్ని అవినీతి పరులుగా మార్చే ప్రమాదం ఎప్పుడూ ఉంది. విప్లవంలో నుండి ఆవిర్భవించిన రాజ్య వ్యవస్థను నడిపించే నాయకులు, పరిపాలనావేత్తలు, వారు విప్లవాన్ని విజయవంతం చేసిన సాహసవంతులైన, ఆదర్శప్రాయులైన, అంకితభావం కలిగిన శిష్టవర్గానికి చెందిన వారైనప్పటికీ, క్రమేపి వాళ్ళు నిర్వహించాల్సిన కర్తవ్యానికి కాక, వాళ్ళకు లభించే ప్రత్యేక సౌకర్యాలకు విలువనిచ్చి ఆవైపుకు మొగ్గటం జరుగుతుంది. విప్లవ వ్యవస్థాపకులు వారి స్థాయి, సామర్థ్యం లేని నూతన అధికార గణ సమూహాల మధ్య ఒంటరిగా అయినప్పుడు ఈ ధోరణి మరింత ప్రస్ఫుటమవుతుంది. అయితే ఇటువంటి పతనాన్ని అరికట్టి విప్లవ పవిత్రతను కాపాడేదెలా? ఈ ప్రశ్నకు సమాధానం అంత సులభం కాదు. ఏతావాతా చెప్పగలిగేదేమంటే శిష్టవర్గాల నైతికస్థాయి, రాజకీయ చైతన్యం, కొన్ని వ్యవస్థాపరమైన పూచీకత్తులతో జోడించబడితే, అవి సకారాత్మక అంశాలుగా నిలుస్తాయి. ఇటువంటి పరిస్థితుల్లో లెనిన్ -- "శక్తిని, సరళత్వాన్ని" నిలుపుకోండి; "మూలాలకు మళ్ళేందుకు" ఎల్లప్పుడు సంసిద్ధులై ఉండండి -- అని కమ్యూనిస్టులకు ఇచ్చిన పిలుపు ఎంతో విలువైనది. వారు తమ విమర్శనాత్మక పటిమను కోల్పోరాదు. తాము ప్రయత్నిస్తున్న దాన్ని మొత్తంగా కాని, చాలా మేరకు కాని తిరిగి నిర్మించడానికి వారు సంసిద్ధులై ఉండాలి.

ఈ ప్రశ్నలలో వర్తమాన సమాజానికి అన్వయించే అంశాల గురించి ఇంతకంటే ఎక్కువగా చెప్పనవసరం లేదు. ఇక్కడ వాటి ప్రస్తావనకు కొనసాగింపుగా వాటిపై లోతైన పరిశీలన జరగాలి. లెనిన్ అంతిమ పోరాటం నుండి లభ్యమైన అట్టి పరిశీలన కవసరమైన సమాచారాన్ని వీలైనంత నిష్పాక్షికంగా సమకూర్చడానికి నేను ప్రయత్నిస్తాను.

# కాలగమనంలో ముఖ్య ఘట్టాలు

| | | |
|---|---|---|
| 1918 వేసవి ప్రారంభం నుండి డిసెంబరు 1920 వరకు | - | అంతర్యుద్ధం (యుద్ధ కమ్యూనిజం కాలం) |

**1921**

| | | |
|---|---|---|
| మార్చి | - | నూతన ఆర్థిక విధానం ప్రకటించబడింది (ధాన్య సేకరణ స్థానే శిస్తు చెల్లింపు - తొలిగా ధాన్యం రూపంలో, తరువాత ధనం రూపంలో). |
| డిసెంబరు | - | లెనిన్‌కు అస్వస్థత. |

**1922**

| | | |
|---|---|---|
| జనవరి, ఫిబ్రవరి | - | అస్వస్థత కారణంగా లెనిన్‌కు పొలిట్ బ్యూరో నుండి మరో ఆరు వారాల పాటు సెలవు లభించింది. |
| మార్చి, 3 | - | విదేశీ వాణిజ్యం విషయంలో ప్రభుత్వ గుత్తాధిపత్యం చెక్కుచెదరరాదంటూ కామెనెవ్‌కు తొలి లేఖ. |
| మార్చి 6-25 | - | ఆరోగ్యం క్షీణించిన కారణంగా కొత్తగా దీర్ఘకాలిక సెలవు. |
| మార్చి 27-ఏప్రిల్ 2 | - | పార్టీ పదకొండవ మహాసభ. |
| ఏప్రిల్ 23 | - | 1918 ఆగస్టులో సోషలిస్టు రివల్యూషనరీ పార్టీకి చెందిన ఫాన్ని కాప్లన్ పేల్చిన రెండు తుపాకీ గుండ్లలో ఒక దానిని లెనిన్ శరీరం నుండి తొలగించేందుకు శస్త్ర చికిత్స. |
| మే 15 | - | విదేశీ వాణిజ్యం విషయంలో ప్రభుత్వ గుత్తాధిపత్యాన్ని మార్చరాదన్న సూత్రాన్ని మరొకసారి ధృవీకరిస్తూ పొలిట్‌బ్యూరో నిర్ణయించాలని సూచిస్తూ స్టాలిన్‌కు లేఖ రాయటం. స్టాలిన్ ప్రతిఘటించాడు. |

| | | |
|---|---|---|
| మే 22 | – | పొలిట్‌బ్యూరో విదేశీవాణిజ్య గుత్తాధిపత్యం విషయంలో లెనిన్ డిమాండ్లను అంగీకరించింది. |
| మే 25 | – | లెనిన్‌కు పాక్షిక పక్షవాతం – మాట పడిపోయింది. |
| జూన్ మధ్యలో | – | లెనిన్ ఆరోగ్యం మెరుగయ్యింది. |
| ఆగస్టు 10 | – | సోవియట్ రిపబ్లిక్‌ల మధ్య సత్సంబంధాలు నెలకొనేట్లు చూసేందుకు ఒక కమిషన్ ఏర్పాటుకు యోచన. |
| ఆగస్టు 11 | – | కమిషన్ పని ప్రారంభించి స్టాలిన్ "ఆటానమైజేషన్" (స్వయం ప్రతిపత్తి) పథకాన్ని అమలు పరచసాగింది. |
| ఆగస్టు 21 | – | లెనిన్ స్టాలిన్‌తో ఆర్‌కెఐ ( కార్మిక – కర్షక తనిఖీ) విషయం మాట్లాడి మరుసటి రోజు ఆ సంస్థ నాయకులకు దాని కార్యసరళిని విమర్శిస్తూ లేఖ రాశాడు. |
| సెప్టెంబర్ 15 | – | స్టాలిన్ పథకాన్ని జార్జియన్ సెంట్రల్ కమిటీ నిర్మొహమాటంగా తిరస్కరించింది. |
| సెప్టెంబర్ 22 | – | రిపబ్లిక్‌ల మధ్య సంబంధాల విషయంలో తీసుకునే నిర్ణయాలను తనకు ఎప్పటికప్పుడు తెలియజేయవలసిందిగా లెనిన్ స్టాలిన్‌ను కోరాడు. |
| సెప్టెంబర్ 24–25 | – | రిపబ్లిక్‌ల కమిషన్ తిరిగి సమావేశమై స్టాలిన్ "ఆటానమైజేషన్" (స్వయం ప్రతిపత్తి) పథకాన్ని మరింత కట్టుదిట్టంగా అమలు పరచాలని నిర్ణయించింది. |
| సెప్టెంబర్ 25 | – | కమిషన్ పనికి సంబంధించిన సమగ్ర సమాచారాన్ని స్టాలిన్ లెనిన్‌కు అందించాడు. |
| సెప్టెంబర్ 26 | – | రిపబ్లిక్‌ల ఏకీకరణ విషయమై చర్చకు స్టాలిన్‌కు లెనిన్ ఆహ్వానం. లెనిన్ కామనెవ్‌కు తన అభిప్రాయాన్ని తెలియచేశాడు. అదే సోవియట్ సోషలిస్టు రిపబ్లిక్‌ల యూనియన్ (యుఎస్ఎస్ఆర్). |
| సెప్టెంబర్ 27 | – | ఏకీకరణ పథకంపై చర్చలకు లెనిన్ ఎందివనిని కలిశాడు. స్టాలిన్ పొలిట్ బ్యూరో సభ్యులకు లేఖ వ్రాస్తూ లెనిన్ "జాతీయ ఉదారవాదాన్ని" తప్పు పట్టాడు. |

| | | |
|---|---|---|
| సెప్టెంబర్ 28-30 | - | లెనిన్ ఆర్జోనికిజ్‌ను, జార్జియా సెంట్రల్ కమిటీలోని ముగ్గురు సభ్యులను, అజర్‌బైజాన్‌కు చెందిన మియాస్నికోవ్‌ని ఏకీకరణ సమస్యలపై చర్చించేందుకు విడివిడిగా కలుసుకున్నాడు. |
| అక్టోబర్ 2 | - | లెనిన్ గోర్కీ నుండి తిరిగి వచ్చి క్రెమ్లిన్‌లో పనిలో నిమగ్నమయ్యాడు. |
| అక్టోబర్ 6 | - | పొలిట్‌బ్యూరో సమావేశంలో (లెనిన్ హాజరు కాలేదు) ప్రభుత్వ విదేశీ వాణిజ్య గుత్తాధిపత్యాన్ని పరిమితం చేయాలని నిర్ణయించారు. లెనిన్ యు.యస్.యస్.ఆర్ పథకం ఆమోదించబడింది. విశాల రష్యన్ జాతి దురహంకారానికి వ్యతిరేకంగా తాను ఉద్యమించనున్నట్లు లెనిన్ కామెనెవ్‌కు రాశాడు. |
| అక్టోబర్ 11 | - | లెనిన్ ట్రాట్స్కీని కలుసుకున్నాడు. వాళ్లు గుత్తాధిపత్యం సమస్య గురించి, ఉద్యోగస్వామ్యానికి వ్యతిరేకంగా ఉమ్మడి పోరాటం గురించి చర్చించారు. |
| అక్టోబర్ 13 | - | విదేశీ వాణిజ్యం విషయంలో తీసుకొన్న నిర్ణయాన్ని ఖండిస్తూ స్టాలిన్‌కు లేఖ రాశాడు. పునఃపరిశీలించ వలసిందిగా కోరాడు. |
| అక్టోబర్ 21 | - | జార్జియా వాసులు ట్రాన్స్‌కాకేసియన్ ఫెడరేషన్‌ను అంగీకరించేందుకు విముఖత చూపటంపై లెనిన్ నిశిత విమర్శ. |
| అక్టోబర్ 22 | - | జార్జియన్ కేంద్ర కమిటీ మూకుమ్మడి రాజీనామా. |
| నవంబరు (తొలిదశ) | - | ఆర్జోనికిజ్‌కు వ్యతిరేకంగా జార్జియా నుండి మాస్కోకు పలు ఫిర్యాదులు. సింసజే లేఖను లెనిన్ అందుకొన్నాడు. దాని వల్ల జార్జియాలో స్టాలిన్ - ఆర్జొనికిజ్ వ్యూహం పై లెనిన్‌కి అనుమానాలు పొడసూపాయి. |
| నవంబరు 5 నుండి డిసెంబరు 5 | - | మాస్కోలో కొమింటర్న్ నాల్గవ మహాసభ. |
| నవంబరు 13 | - | కొమింటర్న్ నాల్గవ మహాసభలో లెనిన్ ప్రసంగం. |

| | | |
|---|---|---|
| నవంబరు 20 | - | లెనిన్ చివరి బహిరంగ ప్రసంగం ( మాస్కో సోవియెట్ సభలో). |
| నవంబరు 24 | - | జార్జియన్ వ్యవహారంపై నిజ నిర్ధారణ కమిషన్‌లోని సభ్యుల ఎంపిక విషయంలో తన అనుమానాల కారణంగా లెనిన్ ఓటు వేయకుండా దూరంగా వున్నాడు. |
| నవంబరు 25 | - | అయితే పొలిట్‌బ్యూరో జెర్జిన్‌స్కీ నాయకత్వంలో కమిషన్‌ను ఖరారు చేసింది. కమిషన్ తిబిలిసికి పయనమయింది. |
| నవంబరు చివరన | - | "సంఘటన" : ఆర్జోనికిజ్ కాబానిజ్ అనే ఎందివని మద్దతుదారుణ్ణి కొట్టడం. |
| డిసెంబరు 7-12 | - | లెనిన్ సెలవుపై గోర్కీలో వున్నాడు. |
| డిసెంబరు 9 | - | రైకోవ్ జార్జియా నుండి తిరిగి వచ్చి లెనిన్‌ను కలిశాడు. |
| డిసెంబరు 12 | - | రాబోయే సెంట్రల్ కమిటీ సమావేశంలో విదేశీ వాణిజ్య గుత్తాధిపత్యం విషయంలో తమ ఉమ్మడి అభిప్రాయాలకు మద్దతు పలకాలని ట్రాట్స్కీకి ప్రతిపాదించాడు. |
| డిసెంబరు 12-15 | - | లెనిన్, ట్రాట్స్కీల మధ్య లెనిన్ ప్రతిపాదనలు, ట్రాట్స్కీ సలహాల విషయంలో ఉత్తర ప్రత్యుత్తరాలు. |
| డిసెంబరు 13 | - | లెనిన్ రెండు సార్లు తీవ్రమైన పక్షవాతానికి గురయ్యాడు. |
| డిసెంబరు 15 | - | లెనిన్ స్టాలిన్‌కు "తాను పదవీ విరమణకు అవసరమైన చర్యలు తీసుకున్నట్లు", ట్రాట్స్కీతో తానొక ఒడంబడికకు వచ్చినట్లు, విదేశీ వాణిజ్య గుత్తాధిపత్యం విషయంలో తమ మధ్య కుదిరిన ఉమ్మడి అభిప్రాయానికి ఆయన మద్దతు పలుకుతాడని తెలియచేస్తూ లేఖ రాశాడు. |
| డిసెంబరు 18 | - | సెంట్రల్ కమిటీ సమావేశంలో ఇంతకు పూర్వపు నిర్ణయాన్ని త్రోసిపుచ్చి లెనిన్ - ట్రాట్స్కీలు కలిసి విదేశీ వాణిజ్యం విషయంలో చెప్పిన దానిని ఆమోదించటం జరిగింది. లెనిన్ వైద్యం విషయంలో జాగ్రత్తలు తీసుకునే బాధ్యత సెంట్రల్ కమిటీ స్టాలిన్‌కు అప్పగించింది. |
| డిసెంబరు 21 | - | సెంట్రల్ కమిటీ సమావేశంలో సాధించిన విజయానికి ట్రాట్స్కీని అభినందిస్తూ లెనిన్ ఒక లఘు లేఖ రాశాడు. |

| | | |
|---|---|---|
| డిసెంబరు 22 | - | లెనిన్ చెప్పిన లేఖను రాసినందుకుగాను క్రూప్‌స్కయా పట్ల స్టాలిన్ దురుసుగా ప్రవర్తించాడు. |
| 22-23 రాత్రి | - | లెనిన్‌కు పక్షవాతం. |
| డిసెంబరు 23 | - | తాను చెప్పింది ఇతరులు రాసేందుకు అనుమతి ఇవ్వవలసిందిగా లెనిన్ డాక్టర్లను కోరాడు. |
| డిసెంబరు 24 | - | తన ఆలోచనలను తాను చెప్పగా ఇతరులు రాసేటట్లుగా అనుమతించకపోతే వైద్యుల చికిత్సను అంగీకరించనని లెనిన్ చెప్పాడు. లెనిన్ కోరిన దానికి పొలిట్ బ్యూరో అనుమతి లభించింది. |
| డిసెంబరు 23-31 | - | లెనిన్ ''టెస్టమెంట్'' (వీలునామా) గా పిలువబడే లేఖనాలను ఆయన చెప్పగా ఇతరులు రాశారు. జాతుల సమస్యపై, జార్జియా పరిస్థితిపై మెమోరాండం ఈయన చెప్పగా డిసెంబరు 30 - 31 తేదీలలో అన్నిటిలోకి చివరిగా రాయబడింది. దానికి స్టాలిన్‌పై తన అభిప్రాయాలను తరువాత లెనిన్ జోడించాడు. |
| డిసెంబరు 30 | - | అన్ని రిపబ్లిక్‌ల సోవియట్ల ప్రధమ మహాసభలో సోవియట్ సోషలిస్ట్ రిపబ్లిక్‌ల యూనియన్ ఆవిర్భవించినట్లు ప్రకటన. |

**1923**

| | | |
|---|---|---|
| జనవరి-ఫిబ్రవరి | - | లెనిన్ ఐదు వ్యాసాలను చెప్పి రాయించాడు. "పేజెస్ ఫ్రమ్ ఏ జర్నల్''; ''ఆన్ కోఆపరేషన్''; ''అవర్ రివల్యూషన్''; ''ఆన్ ది వర్కర్స్ అండ్ పెజెంట్స్ ఇన్‌స్పెక్షన్"; "బెటర్ ఫ్యూయర్ బట్ బెటర్". |
| జనవరి 4 | - | లెనిన్ తన "టెస్టమెంట్"కు స్టాలిన్ అధికార స్థానాన్ని ఒక మెట్టు క్రిందకు దించాలనే ప్రతిపాదనను జోడించాడు. |
| జనవరి 24 | - | జెర్జిన్‌స్కీ కమిషన్ నివేదిక కోసం లెనిన్ అడిగాడు. దానికి పొలిట్‌బ్యూరో సుముఖత చూపలేదు. |
| జనవరి 25 | - | జెర్జిన్‌స్కీ కమిషన్ జార్జియన్ పరిస్థితులపై సమర్పించిన సిఫార్సులకు పొలిట్‌బ్యూరో ఆమోదాన్ని తెలియజేసింది. |

| | | |
|---|---|---|
| | | ఆర్జోనికిజ్ తప్పులను కప్పిపుచ్చి, ఎందివనిని, జార్జియన్ సెంట్రల్ కమిటీలను ఖండించటం జరిగింది. |
| ఫిబ్రవరి 1 | – | లెనిన్ డిమాండ్లకు పొలిట్‌బ్యూరో తలవొగ్గి కమిషన్ నివేదికను ఆయన ముందుంచింది. లెనిన్ దానిని ఎలా అధ్యయనం చేయాలో తన కార్యదర్శులకు మెళకువలు చెప్పి ఆ విధంగా అధ్యయనం చేయమన్నాడు. |
| మార్చి 3 | – | జార్జియా వ్యవహారంలో లెనిన్ వ్యక్తిగతంగా నియమించిన విచారణ సంఘం తన నివేదికను సమర్పించింది. |
| మార్చి 5 | – | సెంట్రల్ కమిటీ సమావేశాల్లో జార్జియా సెంట్రల్ కమిటీకి మద్దతుగా తమ యిరువురి తరఫున సమర్థింపుగా మాట్లాడమని ట్రాట్‌స్కీని కోరుతూ లేఖ రాశాడు. ట్రాట్‌స్కీ అదే రోజున సమాధానం రాశాడు. లెనిన్ స్టాలిన్‌కు రాసే లేఖను తయారు చేయించాడు. |
| మార్చి 6 | – | క్రూప్‌స్కయా పట్ల దురుసుగా ప్రవర్తించినందుకు స్టాలిన్‌ను క్షమాపణ చెప్పమని కోరుతూ రాసిన ఉత్తరం పూర్తయింది. జార్జియా వాసులకు, ఎందివనికి, అతని మిత్రులకు లెనిన్ వారి పక్షానే వున్నాడని, స్టాలిన్‌ను, ఆర్జోనికిజ్‌లను వ్యతిరేకిస్తున్నాడని మరో లేఖ రాశాడు.<br>క్రూప్‌స్కయా ద్వారా కామనెవ్‌కు రాజకీయంగా లెనిన్ స్టాలిన్‌ను అణగద్రొక్కదలచాడని సమాచారం అందింది. లెనిన్ ఆరోగ్యం దారుణంగా క్షీణించింది. |
| మార్చి 10 | – | మరోసారి విరుచుకుపడ్డ పక్షవాతం వల్ల లెనిన్ శరీరంలో సగభాగం దెబ్బ తిన్నది. మాట పడిపోయింది. లెనిన్ రాజకీయజీవితానికి అది చరమ గీతం. |

**1924**

| | | |
|---|---|---|
| జనవరి 21 | – | లెనిన్ మరణం. |

# లెనిన్ - స్టాలిన్ మధ్య కలతలు
# కొత్త ప్రతికి ఉపోద్ఘాతం

గత శతాబ్దిని దాని బృహత్తర వైఫల్యాలైన ఆర్థిక సంక్షోభం, రెండు ప్రపంచ యుద్ధాలు, ప్రపంచవ్యాప్తంగా విస్తరించిన పేదరికాన్ని ఎదుర్కోవడంలోని అశక్తత వంటి వాటితో నిమిత్తం లేకుండా అవగాహన చేసుకోలేము. ఈ శతాబ్ది గమన క్రమంలో తలెత్తిన పరిస్థితులలో జారిస్టు పాలన పతనం, సోవియట్ సోషలిస్టు రిపబ్లిక్కుల యూనియన్ (సోవియట్ యూనియన్) లాంటి సరికొత్త, వివరణలకు అందని రాజ్య ఆవిర్భావం, దాని అనూహ్యమైన, అంచనాకందని ఎదుగుదల, తరువాతి కాలంలో - ముందుగానే ఊహించబడిన - దాని పతనం లాంటివి ఇమిడి వున్నాయి. రష్యన్ పురాతన పత్రాల భాండాగారం నుండి వెలుగు చూసిన సమాచారం గతంలో సోవియట్ ప్రభుత్వం నిషేధించిన మెన్షివిక్కులు, సోషలిస్టు - రివల్యూషనరీలు, ఉదారవాదుల వంటి పార్టీలకు "చరిత్రలోకి తిరిగి రావడానికి" అవకాశం కల్పించింది. కాని, బోల్షివిక్కుల చరిత్ర అరకొరగానే తెలియవచ్చినప్పటికీ, వారి నాయకుడు లెనిన్ విమర్శకుల వక్రీకరణలకు గురి కావడంలోని వైచిత్రి అంతగా గ్రహించబడలేదు. ఈ విమర్శకుల ధ్యాసంతా భావజాలపరమైన అంశాలపైనే గాని, సంక్లిష్టమైన ఘటనలను అర్థం చేసుకోవలసిన మన అవసరంపై ఉండేది కాదు. లెనిన్ వ్యక్తిగత లక్షణాలను -- ఆయన ఆగ్రహావేశాలు ప్రదర్శించడం, ఇతర సంఘటనలలాంటివి -- ఎత్తి చూపే ఆసక్తిదాయకమైన ధోరణి కూడా ఉండేది. పెరిగిపోతూ వున్న కర్తవ్యాల పట్ల అత్యంత ఏకాగ్రతను చూపవలసిన పరిస్థితులు, ఘటనలు చుట్టుముట్టినపుడు ఒత్తిడికి, అప్పుడప్పుడు కోపావేశాలకు లోనైన లెనిన్ ఆగ్రహావేశాలు ప్రదర్శించడం జరిగి ఉండవచ్చు. ఇక ఆయన శరీరంలో ఉండిపోయిన రాజకీయ ప్రత్యర్థి పేల్చిన రెండు తూటాల దుష్ప్రభావం గురించి ప్రత్యేకించి చెప్పనవసరం లేదు.

అత్యంత గందరగోళమైన, నాటకీయమైన పరిస్థితుల్లో రాజకీయ వ్యూహకర్తగా లెనిన్ నిర్వహించిన ప్రధానపాత్రను అర్థం చేసుకోవడం ఆయన మూర్తిమత్వానికి,

సిద్ధాంతసారానికి కీలకం. ఆయన మునిగితేలిన చారిత్రక నేపథ్యాన్ని పునర్నిర్మించుకోవడం ద్వారా మాత్రమే ఆయన వ్యూహాలను అర్థం చేసుకోవడం సాధ్యమౌతుంది. అంతస్సంబంధం కలిగిన సంక్షోభాలు చరిత్రకారుడు దృష్టి నిలపవలసిన ప్రధాన అంశం. వీటిలో ఒకటి పాశ్చాత్య ప్రపంచాన్ని (లెనిన్ మరెందరో బోల్షివిక్ నాయకులు పాశ్చాత్య ప్రపంచంలో నివసించినవారే) సంకట స్థితిలోకి నెట్టిన సంక్షోభం. మరో సంక్షోభం తత్సంబంధమైనదేగాని భిన్నమైనది : అది జారిస్టు సామ్రాజ్యాన్ని బలహీనపరచింది; ఈ సామ్రాజ్యంలోనే అత్యధిక సంఖ్యలో రష్యన్ సోషల్ డెమోక్రాట్లు కుట్రపూరిత పరిస్థితుల్లో పనిచేస్తూ, నిరంతరం పోలీసులతో ఘర్షిస్తూ నివసించేవారు; ఈ పోలీసుల రహస్య ఏజంట్లు విదేశాలలోని సోషల్ డెమొక్రాట్ల సంస్థలోకి చొరబడేవారు. రెండవ ఇంటర్నేషనల్ కుప్పకూలటం వల్ల కలిగిన దుష్పరిణామాలను పాశ్చాత్య ప్రపంచం చవిచూసింది. రష్యాలో ప్రజలు కుప్పకూలిపోతున్న రాజకీయ వ్యవస్థ వల్ల యాతనలకు గురయ్యారు. ఈ వ్యవస్థ యుద్ధ తంత్రాన్ని నిర్వహించలేక ఓటమి పాలవడం వల్ల అపార ప్రాణనష్టం సంభవించింది. ఇవన్నీ అప్పటికే బలహీనపడివున్న సామాజిక – రాజకీయ వ్యవస్థను మరింత క్షీణతకు గురిచేశాయి. 1917 వ సంవత్సరం రాజకీయ వ్యూహం ఎదుర్కొనవలసిన మరొక అధ్యాయం -- దేశం విచ్ఛిన్నత దిశగా పయనించడం, ప్రతి రెండు మాసాలకొకసారి ప్రభుత్వాలు మారడం, ఘటనలపై ప్రభుత్వపు పట్టు క్షీణించడం, జాతీయ సంక్షోభ స్థితి ఆవహించడం ప్రధాన సవాళ్ళు. ఇటువంటి పరిస్థితుల్లో ముఖ్య పాత్రధారులు ఎదుర్కొనవలసింది ఒక్క "సంక్షోభాన్ని" కాదు. అంతస్సంబంధం కల గొలుసుకట్టు సంక్షోభాలను. అవి పాక్షికంగా విదేశాల నుండి "దిగుమతి" గావించుకున్నవి కావచ్చు, పాక్షికంగా అల్లకల్లోలంగా వున్న అంతర్గత పరిస్థితుల నుండి ఏర్పడినవి కావచ్చు. వేరే వాళ్ళెవ్వరు ఎదుర్కొనే సాహసం చేయని ఊబిలోకి బోల్షివిక్కులు అడుగుపెట్టారు. దేశాన్ని సజీవంగా నిలబెట్టిన నూతన వ్యవస్థ ఆవిర్భవించింది. ఈ ఘటనలను గురించిన చర్చ ఎన్నడూ ఆగింది లేదు.

లెనిన్ మరణానంతరం ఆయన స్థానం స్టాలిన్‌కి దక్కింది. వెంటనే లెనిన్, బోల్షివిజాలే స్టాలిన్, స్టాలినిజంల ఆవిర్భావానికి కారణమని ఎడతెగని ప్రచార హోరు ఆరంభమయింది. పలు శ్రేణుల్లో అది బలమైన విశ్వాసంగా మారింది. ఇది అంతటినీ విశదీకరించే, తేలికగా గుర్తుండే క్లుప్తీకరణ. అయితే నిజానికి ఎంతో సంక్లిష్టమైన, ఆసక్తిదాయకమైన వాస్తవికతతో దానికి ఏ మాత్రం సంబంధం లేదు. ఒకవేళ ఈ వాదన నిజమైతే, అసంఖ్యాక బోల్షివిక్ శ్రేణుల్ని భౌతికంగా నాశనం చేసేందుకు స్టాలిన్ అంతగా ఎందుకు కృషి చేయవలసి వచ్చింది? అంతగా తెలియని, అరుదుగా ప్రస్తావించబడే

విషయం ఏమిటంటే, లెనిన్, స్టాలిన్ మధ్య సంబంధాలు లెనిన్ జీవితపు చివరి రెండు సంవత్సరాలలో ఉద్విగ్నభరితంగానే కాక, లోతైన వైరభావంతో కూడుకుని ఉండేవి. లెనిన్ శారీరక క్షీణత స్టాలిన్‌ని, పార్టీ నుండి బహిష్కరించడం కాకపోయినా, జనరల్ సెక్రటరీ పదవి నుండి క్రింది స్థాయికి మార్చడాన్ని ఆపింది. వాళ్ళిరువురూ దాదాపు బహిరంగంగానే రాజకీయ విరోధులుగా మారిపోయారు. అందువల్లనే ఈ విషయం తెలిసిన ఎవరినైనా -- వాస్తవంలో మొత్తం బోల్షివిక్ వ్యవస్థ -- సమూలంగా నాశనం చేయడం జరిగింది. రాజకీయ పార్టీ గురించి ఒక ప్రధాన విషయంగా ఇక మాట్లాడవలసిన పని లేదు. వ్యక్తిగత నియంతృత్వం నెలకొన్న స్థితిలో, నిర్ణయాలు ఒకే వ్యక్తి తీసుకుని, యంత్రాంగం వాటిని అమలుపరుస్తున్నప్పుడు, రాజకీయ పార్టీ అనేది ఒక అవరోధంగా చూడబడుతుంది.

తన అధికారానికి ఆమోదయోగ్యత సాధించేందుకు స్టాలిన్ మొదట్లో "బోల్షివిజం", "లెనినిజం" వంటి పదాలను వాడటం వాస్తవం. మనం గనుక మరికొంత లోతుగా పరిశీలిస్తే ఇది మభ్యపరిచే వ్యూహాత్మక ఎత్తుగడ అని తెలుస్తుంది. వాస్తవానికి స్టాలిన్ ఒక రాజకీయ పార్టీగా బోల్షివిజాన్ని, దానికి మార్గదర్శకమైన వ్యూహాత్మక అవగాహనగా నిలిచిన లెనినిజాన్ని భావజాలపరంగా, భౌతికంగా నామరూపాలు లేకుండా చేయాలనుకున్నాడు. లెనిన్ "వీలునామా" గా గుర్తింపబడినదాని నుండి ఒక్క భావనను కూడా స్టాలిన్ అనుసరించలేదు. తద్భిన్నంగా తన మార్గాన్ని తానే ఎంచుకుని తొలి నుండీ అంటే విప్లవకాలానికి ముందు నుండే అనుసరించసాగాడు. ఈ క్రమం, అంతిమంగా, పూర్వపు రష్యన్ నిరంకుశ రాచరికపు పాలనా పద్ధతులను, ప్రాచీన చారిత్రక సాంప్రదాయం నుండి సరాసరి తీసుకోబడిన జాతీయవాద భావజాలంతో కలగలిపి అమలు చేసే దిశగా స్టాలిన్‌ని తీసుకువెళ్ళింది.

దీనర్థం "లెనిన్"కి కొనసాగింపు కాకపోగా, స్టాలినిజం మూలాలు ఆర్థికంగా, సాంస్కృతికంగా, సామాజికంగా నగరీకరణ పూర్వ దశలో కొట్టుమిట్టాడుతున్న ఆ దేశపు సాంప్రదాయంలో వున్నాయి. అటువంటి సమాజాన్ని ఒక నిరంకుశ రాజ్యము, ఆరాధ్యనీయుడైన పాలకుడు మాత్రమే నియంత్రించగలరని పలువురు విశ్వసించారు. అందువల్ల మనం రష్యాలో వున్న ఆనాటి పరిస్థితిలో స్టాలిన్ ఆవిర్భావం యాదృచ్ఛికం కాదని, బోల్షివిజానికి, స్టాలిన్‌కి, విప్లవానికి ముందు నుండే ఎటువంటి సాపత్యం లేదనే నిర్ధారణకు నిర్భయంగా రావచ్చు.

బోల్షివిక్కులు (రాజకీయ పక్షం), లెనినిజం (రాజకీయ వ్యూహం) కూడ యాదృచ్ఛికాలు కావు. అవి తొలినాళ్ళలో దేశం ఎదుర్కొన్న సంక్షోభాల స్వభావాన్ని

ఖచ్చితంగా అంచనా వేయగలిగిన శక్తి వల్ల, అధికారాన్ని హస్తగతం చేసుకుని, దానిని రక్తపాతపూరిత అంతర్యుద్ధం నుండి కాపాడుకోవడంలో చూపిన చాకచక్యం, సాహసం వల్ల గెలుపొందాయి. ఈ విజయానికి కారణం పెల్లుబికిన రైతాంగ తిరుగుబాటుని వాళ్ళు ప్రజా విప్లవంగా మార్చగలగడం. ఎందరో రైతులు ఎర్రసైన్యంలో చేరారు. మరెందరో రైతులు బోల్షివిక్కులను సమర్థించనప్పటికీ – కొందరు వారితో పోరాటం సల్పినప్పటికీ – మూకుమ్మడిగా విప్లవ ప్రతీఘాత శక్తులకు మద్దతు నిరాకరించారు. ఉవ్వెత్తున పెల్లుబికిన గ్రామీణ హింసను విడుదల చేయడంలోను, నియంత్రించడంలోను వారు చూపిన సామర్థ్యం వల్ల, బోల్షివిక్కులు అపారమైన, అనూహ్యమైన రాజ్య నిర్మాణ ప్రతిభను కలిగి వున్నారని పూర్వపు రాచరిక వ్యవస్థలో పనిచేసిన సైనికాధికారులు, వారి దిగువశ్రేణిలోని సైనికోద్యోగులు విశ్వసించారు. బోల్షివిక్కులు ఇతర పోటీదారులందరికంటే నిబద్ధత, అంకితభావం కలవారని, దేశాన్ని కాపాడగలరని భావించారు.

ఎంతో వివరణ అవసరమయిన ఈ విషయాన్ని పొడిగించకుండా మనం క్లుప్తంగా పునరుద్ఘాటించగలిగిందేమిటంటే అప్పుడే రూపుదిద్దుకుంటున్న స్టాలినిజం, తొలినాళ్ళలో విజయం సాధించిన బోల్షివిక్కులు వేర్వేరు రాజకీయ దృగ్విషయాలు. ఇరు ధోరణుల మూలాలు రష్యన్ రాజకీయ క్షేత్రంలోనే వున్నాయి. ఎవరు గెలిచారు, తదుపరి ఏం జరిగింది మనకు తెలుసు.

అయితే ఇప్పుడు మనం లెనిన్ ప్రాతినిధ్యం వహించిన “బోల్షివిజం” సారాంశం ఏమిటో చెప్పుకుందాం. లెనిన్, స్టాలిన్ మధ్య ఘర్షణ తీవ్రరూపం దాల్చిన తరుణంలో, మరీ ముఖ్యంగా, యు.యస్.యస్.ఆర్. (అది అప్పుడు రూపకల్పన దశలో వుంది) లో రష్యనేతర జాతీయుల హోదా విషయంలో పోరాటం సాగుతున్నప్పుడు, లెనిన్ అప్పటికే జబ్బున పడినప్పటికీ, మేధోపరంగా ఎంతో చురుకుదనాన్ని కనబరుస్తూ రాజ్య నిర్మాణానికి సంబంధించిన తన కార్యక్రమాన్ని ఈ క్రింది ప్రతిపాదనలతో రూపొందించాడు.

(1) వాస్తవదూరమైన సోషలిస్టు దృక్పథాన్ని విడనాడి, దాని స్థానే దేశానికి అప్పటి దశలో అత్యంతావశ్యకమైన “రాజ్య పెట్టుబడిదారీ విధానం” మరియు మార్కెట్ ఆర్థిక వ్యవస్థలను నెలకొల్పడం; (2) జనాభాలో అధిక సంఖ్యాకులైన రైతాంగంతో ఒక రాజకీయ ఒప్పందాన్ని కుదుర్చుకోవడం. ఒక స్వేచ్ఛాయుత గ్రామీణ సహకార వ్యవస్థ అభివృద్ధిని ప్రోత్సహించడం. దానిపై ఎటువంటి ఒత్తిడి తీసుకురావడం గాని, “కమ్యూనిజం” విధించడం గాని చేయకపోవడం; (3) పార్టీ విధి విధానాల్లో సభ్యులు -- వాళ్ళలో అధిక సంఖ్యాకులు కార్మికులు -- కీలకపాత్ర పోషించే విధంగా పార్టీ

కార్యకలాపాలు నిర్వహించడం. పార్టీ రాజకీయాల్లో వారి మాటకు విలువనివ్వడం. అధినాయకత్వాన్ని – ముఖ్యంగా సెక్రటరీ జనరల్‌ను – నియంత్రించగలిగే శక్తి వారికి కల్పించడం. పార్టీ మహాసభ, ఇతర సంస్థలు శక్తివంతంగా పనిచేయడం; (4) రష్యనేతర జాతీయులకు (వీరిలో అధిక సంఖ్యాకులు గ్రామీణులు) తమని తాము పరిపాలించు కునేందుకు, మెజారిటీ రష్యన్లతో సమాన హక్కులు కలిగి వుండేందుకు అవకాశం కల్పించడం. ఇంకా శక్తివంతంగా ఉన్న రష్యన్ జాతీయవాదానికి మొత్తం నిర్మాణాన్ని కూలదోయగల స్వభావం ఉన్న దృష్ట్యా, దానికి వ్యతిరేకంగా పోరాడాల్సిన ఆవశ్యకతను లెనిన్ నొక్కి చెప్పాడు.

ఇవేవీ స్టాలిన్ పట్టించుకోలేదనే అంశాన్ని పరిగణనలోకి తీసుకుని, మనం వ్యర్థమైన మూస వాదనలను విడనాడి, లెనిన్ రూపొందించిన పథకాలు, ఇతర సోవియట్ పరిణామాలు, అసమర్థ, నిరంకుశ ప్రభుత్వాల క్రింద దైన్యంతో మ్రగ్గే వెనుకబడిన గ్రామీణ వ్యవస్థల దేశాలతో కూడిన ప్రపంచానికి ఏ మేరకు ఉపయోగపడగలవో పరిశీలిద్దాం.

# 1

# శూన్యంలో ఓ నియంతృత్వం

అక్టోబరు విప్లవ ప్రారంభకుల దృష్టిలో ఆ విప్లవానికి, అంతర్జాతీయంగా ఒక ఉత్ప్రేరకంగా, విస్ఫోటనంగా పనిచేయటానికి మించిన అర్థం కాని, భవిష్యత్తు గాని వేరే లేదు. ఏ దేశాలలో అయితే, రష్యాలో వలె గాక, తగినంత ఆర్థిక నిర్మాణం, సాంస్కృతిక పునాది ఏర్పడి ఉన్నాయో అక్కడ సోషలిస్టు రాజ్య స్థాపనకు ఈ విప్లవం తొలి అగ్నికణంగా పని చేస్తుందనుకున్నారు. ఈ విధమైన బాధ్యతను నిర్వర్తించకపోతే సోవియట్ వ్యవస్థ మనుగడ కూడా అనుమానాస్పదమే. లెనిన్ తరచు ఈ విశ్వాసాన్ని ఉద్ఘాటిస్తూ ఉండేవాడు. ఎన్నో సంవత్సరాలు తన ఆశాభావానికి ధృవీకరణ లేకుండా సాగినప్పటికీ, లెనిన్ ఇదే అవగాహనతో కొనసాగాడు. పెట్టుబడిదారీ చక్రబంధంలో సోషలిస్టు రిపబ్లిక్ మనగలదని “కాని దీర్ఘకాలం కాకపోవచ్చు” అని లెనిన్ జూన్ 1921లో ప్రకటించాడు. ఫిబ్రవరి 1922లో మరల విస్పష్టంగా ఇలా చెప్పాడు: “సోషలిజం విజయం సాధించాలంటే అభివృద్ధి చెందిన అనేక దేశాల కార్మికుల సంయుక్త కృషి అవసరమనే మార్క్సిజపు ప్రాథమిక సత్యాన్ని మనం నిరంతరం ప్రకటిస్తున్నాం. పదే పదే చెప్తున్నాం.” (వి.ఐ. లెనిన్ సమగ్ర రచనలు, ఐదవ రష్యన్ ముద్రణ (ఇనిస్టిట్యూట్ ఆఫ్ మార్క్సిజం – లెనినిజం, మాస్కో, 1958–65) సంపుటం : XLIV – పుటలు : 9; 418).

విప్లవ పయనాన్ని రష్యా ఒంటరిగా ప్రారంభించింది. మొదటి నుండి అది ఒంటరి చేయబడింది. రెండు అంశాలు ఈ పరిస్థితిలోని వాస్తవాన్ని గుర్తించేందుకు అడ్డుగా నిల్చాయి. మొదటిది నాయకుల అంతర్జాతీయ దృక్పథం. రెండవది ఐరోపాలో కొంతకాలం పాటు సామాజిక ప్రతిఘటన కొనసాగటం. అంతర్యుద్ధ కాలంలో రష్యా తన మనుగడ కోసం అంతర్జాతీయ పెట్టుబడిదారీ కూటమిని ఎదుర్కొనక తప్పని స్థితి ఏర్పడినప్పుడు కూడా సోవియట్ నాయకులు తమ దేశం ఏకాకి అయిందనే విషయం గ్రహించలేదు. యుద్ధం ముగింపుకి వచ్చే సమయానికి వారిలో పరిమిత మేథోశక్తి, పరిమిత అంతర్జాతీయ భావన కలవారిలో భ్రమలు తొలగిపోవడం ప్రారంభమయింది. చివరకు అందరూ ఈ వాస్తవాన్ని అంగీకరించక తప్పలేదు. తన రాజకీయ జీవితపు చివరి ప్రసంగంలో లెనిన్ ఇలా ప్రకటించాడు :

"మనం ఒంటరివాళ్ళమయ్యాము – అని మనకు మనం చెప్పుకున్నాం. మీరు ఒంటరివాళ్ళయ్యారు అని మనతో ఒప్పందం కుదుర్చుకున్న, సంబంధాలు ఏర్పరచుకున్న, సంప్రదింపులు ప్రారంభించిన ప్రతి పెట్టుబడిదారీ దేశం చెప్పింది. ఇదిగో ఇక్కడే ప్రత్యేకమైన ప్రతిబంధకం వుంది. ఈ ప్రతిబంధకాన్ని మనం గుర్తించాలి." (1922 నవంబరు 20 నాటి ప్రసంగం – సమగ్ర రచనలు – సంపుటం : XLV – పుట: 304).

ఈ వాస్తవం, లెక్కకు మించిన దీర్ఘకాలిక పర్యవసనాలతో కూడిన ఈ ఒంటరితనం, అనూహ్యమైన కొన్ని పరిస్థితులకు, కొన్ని సిద్ధాంతాల పునః పరిశీలనకు దారి తీసింది. మార్క్సిస్టు సిద్ధాంతానికి అత్యంత విస్తృతంగా అంగీకరించబడిన వ్యాఖ్యానం ప్రకారం తొలిగా విజయవంతమైన విప్లవపు రాజ్య రూపమైన కార్మికవర్గ నియంతృత్వం జనాభాలో అత్యధికులు కార్మికులుగా ఉన్న దేశంలో స్థాపించబడాలి. అలా జరిగితే, అతి కొద్ది మందిపై మాత్రమే శ్రామిక వర్గ నియంతృత్వాన్ని అమలు జరిపితే సరిపోయేది. ఇది రష్యాలో సాధ్యపడలేదు. దీనిని అంగీకరించేందుకు మెన్షివిక్కుల[1] కంటే బోల్షివిక్కులే తక్కువగా ఇబ్బంది పడ్డారు. మార్క్స్ 1850వ దశకం నాటి వెనుకబడిన జర్మనీ విషయంలో, ''కార్మిక విప్లవానికి రైతాంగ యుద్ధం సహ పార్శ్వం''గా వుంటే సోషలిజం విజయవంతమయ్యే అవకాశం వుందని చేసిన వ్యాఖ్యానాన్ని బోల్షివిక్కులు అంగీకరించారు. ఈ సందర్భంలో రష్యన్ ప్రాథమిక సదుపాయాల స్థాయి గురించి ఆందోళన చెందవలసిన అగత్యం లేదు. ఎందుకంటే, రష్యన్ వెనుకబాటు పరిస్థితులలో సులువుగా ప్రారంభించబడే విప్లవం, వెనువెంటనే ఇతర దేశాలకు విస్తరించి, ఉద్యమానికి దిశా నిర్దేశం చేసే బాధ్యతను మరింత అర్హత కలిగిన సహ రాజకీయ పార్టీలకు అప్పచెపుతుంది.

అయితే రెండవ ప్రతిపాదన వాస్తవరూపం దాల్చనప్పటికీ, దాని ఫలితంగా మొదటి ప్రతిపాదన క్రొత్త వెలుగులో కనపడసాగింది. బోల్షివిక్కులు అధికారాన్ని చేజిక్కించుకోవడంలో కార్మికులు ప్రముఖపాత్ర పోషించారని నిస్సందేహంగా చెప్పవచ్చు. అంతర్యుద్ధం[2] కొనసాగినంతకాలం వాళ్ళు సోవియట్ సైన్యానికి, ప్రభుత్వానికి వారిలో నుండి అత్యంత అంకితభావం కలవారిని అందిస్తూ వచ్చారు. అయితే ఈ యుద్ధం ప్రాణాలకు, సంపదకు లెక్కకందనంతటి నష్టాన్ని కలగజేసింది. అనేక కర్మాగారాలు ధ్వంసం చేయబడినాయి. ఉత్పత్తులు నిలిచిపోయాయి. పోరాటాన్ని ప్రతి రంగంలోను ముందుండి నడిపించిన కార్మికులు అత్యధికంగా ప్రాణ నష్టానికి గురయ్యారు. మరణించకుండా మిగిలినవారు చెల్లాచెదురై గ్రామీణ ప్రాంతాల్లో తలదాచుకున్నారు. అదే సమయంలో వారిలో అత్యంత అంకితభావం, అత్యంత ప్రతిభ కలవారు స్థానిక, కేంద్ర ప్రభుత్వ ఉద్యోగాలలోకి తీసుకోబడ్డారు. ఇలా చేయడం వల్ల కార్మికుల సంఖ్య

పడిపోయింది. ఎక్కువమంది అత్యుత్తమమైన కార్మికులు ప్రభుత్వంలోకి తీసుకోబడిన రంగాలైన లోహ కార్మికులు, రైల్వే కార్మికులు, గని కార్మికుల విషయంలో ఇది మరింత జరిగింది. పాలనా యంత్రాంగంలోకి కార్మికుల్ని తీసుకోవటం, అంతా కలిపి 30 లక్షలకి మించి లేని పారిశ్రామిక కార్మికులతో కూడిన రష్యన్ కార్మికవర్గంపై ఎనలేని భారాన్ని మోపింది. అన్ని అంశాల కంటే, ప్రభుత్వ యంత్రాంగం ఏర్పాటు వల్లనే కార్మిక వర్గపు సంఖ్యాబలం ఎక్కువగా క్షీణించిందని లెనిన్ స్వయంగా చెప్పాడు. (సమగ్ర రచనలు – సంపుటం : XLIV – పుట : 106). అంతేగాకుండా శ్రామికవర్గం ఒక వర్గంగా పట్టాలు తప్పిందని తన వర్గ స్వభావాన్ని కోల్పోయిందని కూడా అన్నాడు. కార్మికులు యుద్ధంలో చంపబడినా, పాలనా యంత్రాంగంలోకి తీసుకోబడినా లేదా జీవనావసరాల కొరత వల్ల కాని, బ్రతుకు తెరువు కోసం నల్లబజారు కార్యకలాపాలకు నెట్టబడటం వల్ల కాని వీరు నైతిక స్థైర్యం కోల్పోయినా, ప్రతి సందర్భంలోను ఫలితం దుఃఖమయమే. (సమగ్ర రచనలు – సంపుటం : XLIV – పుటలు : 103,106; సంపుటం : XLIII – పుట : 310). కార్మికవర్గం అధికారాన్ని కైవసం చేసుకోవడం కోసం జరిగినట్లుగా పేర్కొనబడిన -- వాస్తవంలో ఎంతో మేరకు ఈ లక్ష్యం కోసమే జరిగిన -- ఈ విప్లవం, అంతర్యుద్ధంలో విప్లవ అగ్రగాముల్లో అత్యధికులు మరణించటం వల్ల, ఎంతో భిన్నమైన రూపాన్ని సంతరించుకుంది. అక్టోబరు విప్లవం తర్వాత రెండేళ్ళకు సోవియట్లు సరాసరి అధికారాన్ని చలాయించే శక్తిని కోల్పోయాయి. 1919 మార్చిలో ఎంతో వ్యాకులతతో, ఎలాంటి దాపరికం లేకుండా లెనిన్ ఇలా పేర్కొన్నాడు : జన బాహుళ్యంలో విద్య హీన స్థాయిలో ఉండటం వల్ల "ప్రభుత్వం కార్మికుల చేత నడపబడడానికి సాధనాలు కావలసిన సోవియట్లు, వాస్తవంలో కార్మిక జనబాహుళ్యానికి బదులు, కార్మిక వర్గంలోని అగ్రగామి శ్రేణులు ఆ వర్గం తరఫున ప్రభుత్వాన్ని నడపడానికి పనికొచ్చే సాధనాలుగా మారిపోయాయి" (సమగ్ర రచనలు – సంపుటం : XXXVIII – పుట : 170).

కార్మికవర్గం సంఖ్య గణనీయంగా తగ్గిపోయిందనే వాస్తవాన్ని అంగీకరించగానే, శ్రామికవర్గ నియంతృత్వం దానికి ఆపాదించబడిన లక్షణాలను ఒక్కొక్కటిగా అనివార్యంగా కోల్పోయింది. అధికార నిర్వహణలో ఈ నియంతృత్వం "కార్మికవర్గంలో అతి కొద్దిమందిగా ఉన్న అగ్రగామి శ్రేణి" పై ఆధారపడింది. ఈ ప్రాతిపదికపై అది ఎక్కువ కాలం మనజాలదు; కార్మికవర్గం మహా అయితే పెద్ద మైనారిటీగా ఉన్న పార్టీ, కార్మికవర్గ స్థానాన్ని ఆక్రమించింది. విప్లవ రాజ్యానికి కరము, కరవాలము రెండూ అదే అయ్యింది. "వాస్తవంలో 'కార్మిక వర్గపు బలగాలు' ఈ రోజు ఆ వర్గపు శక్తివంతమైన అగ్రగామి దళమైన రష్యన్ కమ్యూనిస్టు పార్టీ రూపంలో ఉన్నాయని బూర్జువా వర్గానికి బాగా

తెలుసు" అని లెనిన్ చెప్పాడు. (సమగ్ర రచనలు - సంపుటం XXXIX - పుట : 412; సంపుటం : XLIV - పుట :107). మరో సందర్భంలో నియంతృత్వానికి పార్టీనే అత్యంత శక్తివంతమైన మూలం అని లెనిన్ పేర్కొన్నాడు. ఈ స్థితి మార్క్సిస్టు సిద్ధాంతపు దృష్టి నుండి చూస్తే అపసవ్యత తప్ప మరొకటి కాదు. వివిధ రంగాలలో సాగుతున్న పోరాటాలకు, ప్రతి పరిపాలనాపరమైన, ఆర్థికపరమైన కర్తవ్య సాధనకు అవసరమైన నాయకులను, కార్యనిర్వాహకులను పటిష్టమైన నిర్వహణ వ్యవస్థ, నాయకత్వం, క్రమశిక్షణ కలిగిన స్థానిక శాఖలు, శ్రేణులు అందించాయి. ఏ రకంగా చూసినా కమ్యూనిస్టు సానుభూతి పరుడు కాని ఒక అమెరికన్ చరిత్రకారుడు ఇలా రాశాడు : "ఫిరాయింపులు, అవినీతి, అవిధేయతలవల్ల కొన్ని ఇబ్బందులు ఎదుర్కొంటున్నప్పటికీ, క్రమశిక్షణ కలిగిన, సుశిక్షితమైన దళాలు దేశవ్యాప్తంగా ఉన్న కమ్యూనిస్టు పార్టీ అనే శత్రువుతో విప్లవ ప్రతీఘాత శక్తులు పోరాడవలసి వచ్చింది" ('ట్వంటీయత్ సెంచరీ రష్యా' - రచయిత : డొనాల్డ్ డబ్ల్యు. ట్రెడ్‌గోల్డ్ - సం॥ : 1959 - పుట : 181). ఇది లెనిన్ రూపొందించిన శక్తివంతమైన సాధనానికి చెప్పుకోదగిన ప్రశంసే. కాని ప్రస్తుతం ఈ పార్టీ బహుశా లెనిన్ ఊహించని దిశలో పరిణామం చెందుతోంది. పార్టీనే అసలైన అధికారాన్ని కలిగి వుంది. అధికారాన్ని నెరపే బాధ్యత కూడా దానిదే. విప్లవం తొలి దశలోనే, ఇంకా చెప్పాలంటే అంతర్యుద్ధం తెచ్చిన విధ్వంసానికి ముందే, శ్రామికవర్గం తనంత తాను రాజ్యపాలనను గాని, తాము పనిచేసే పరిశ్రమల నిర్వహణను గాని నెరవేర్చలేదని స్పష్టంగా తెలిసింది. అధికారం చేపట్టిన వెంటనే , రాజ్యరహిత కార్మిక పాలన (అనార్కో - సిండికలిస్టు[3]) వాదపు స్ఫూర్తితో ముందుకొచ్చిన స్వేచ్ఛావాద వెల్లువ ఫలితంగా పెల్లుబికిన విప్లవోత్సాహం నుండి పని నిర్వహణ సంఘాలు, శ్రామిక కౌన్సిళ్ళు, కార్మిక నియంత్రణ వ్యవస్థ స్వీయ ప్రేరితంగా, ప్రామాణికంగా ఏర్పడ్డాయి. లెనిన్ విప్లవానికి ముందు తాను రాసిన "రాజ్యం -విప్లవం" గ్రంథంలో వాటిని పూర్తిగా సమర్థించాడు. అయితే ఆచరణలో ఈ వ్యవస్థలు ఒక మేరకు గందరగోళానికి, అసమర్థతకు లోను కావడం వల్ల, దేశ ఉత్పాదక రంగం కుంటుపడే ప్రమాదం ఏర్పడింది. కనుక ఈ పద్ధతి స్థానే మరో పద్ధతిని చేపట్టవలసిన అవసరం ఏర్పడింది. అనేకమందికి ఇందులో సోషలిస్టు ఆదర్శాలకు తిలోదకాలు ఇవ్వడం కన్పించింది. అయితే లెనిన్ తన ప్రతిపాదనలను అత్యంత శక్తివంతంగా సమర్థించుకున్నాడు. ఈ ప్రతిపాదనల లక్ష్యం మేనేజర్ల పాలన ద్వారా, శక్తివంతమైన పాలనా వ్యవస్థల ద్వారా క్రమశిక్షణ నెలకొల్పడం. అంతర్యుద్ధంలో అనేకమంది కార్మికులు నరమేధానికి గురి కాకముందే కార్మికవర్గ నియంతృత్వపు సిద్ధాంతం - ఆచరణల మధ్య అగాధం ఏర్పడింది. అయితే మిగతావి ఇంకా జరగవలసి వుంది.

ముందు ఉటంకించిన వాటిలో ఒక దానిలో లెనిన్ “కార్మిక వర్గపు బలగాలు” అనే పదాలను ఉటంకింపు కామాల మధ్య పెట్టాడు. అగ్రగామి పార్టీ శ్రామిక జన బాహుళ్యపు మద్దతు కోల్పోయింది. దాని సామాజిక పునాది ఇప్పుడు ఉటంకింపు కామాల మధ్య వుంది. పార్టీలో సరళరీతిలో ఆలోచించేవారికి తామొక విధంగా శూన్యంలో వేళ్ళాడుతున్నట్లుగా అర్థమయింది. అయితే ఈ స్థితి ఎక్కువకాలం కొనసాగుతుందనే భ్రమలో సిద్ధాంతవేత్తలు ఉండేవాళ్ళు. ఈ సామాజిక శూన్యాన్ని మొదట అనుకున్న శక్తులకు భిన్నమైన శక్తులు పూరించడం త్వరలో జరగబోతోంది.

పారిశ్రామిక రంగం ఇంకా బలహీనంగానే ఉన్నప్పటికీ, పారిశ్రామిక యాజమాన్యాలు వాటి ఉనికిని గుర్తించక తప్పని విధంగా ప్రవర్తిస్తున్నాయి. అంతేగాక, లెనిన్ అభిప్రాయంలో కేంద్ర ప్రభుత్వ ఉద్యోగాలలో ఇదివరకటి జార్ ప్రభుత్వపు ఉద్యోగులు పెద్ద సంఖ్యలో ప్రవేశించారు. వాళ్ళు దేశ రాజకీయ జీవనంలో మరింత ప్రముఖ స్థానాలను ఆక్రమించసాగారు. అటువంటి పాలనా యంత్రాంగం లేకుండా పాలన సాధ్యమయ్యేది కాదు. అయితే లెనిన్ చెప్పినట్లుగా అది సోవియట్ పాలనా యంత్రాంగం కాదు. అదొక అవమానకరమైన వైపరీత్యం. ఈ జారిస్టు కార్యనిర్వాహకులకు రష్యన్ భాషలో వాడే చినోవ్నికీ (బ్యూరోక్రాట్) అనే పదం వారి స్వభావానికి అద్దం పడుతుంది. వాళ్ళు కొత్త పరిపాలనను మొదట వ్యతిరేకించి తరువాత దానికి మద్దతు పలకాలని నిర్ణయించారు. “వాళ్ళు తిరిగి వచ్చారు కాని జరగకూడనిది జరగటం మొదలయ్యింది” అన్నాడు లెనిన్ (సమగ్ర రచనలు – సంపుటం : XLV – పుట : 290). వాళ్ళు తిరిగి రాకుంటే ఏమయ్యుండేదో మనకు తెలియదు కాని, జరిగింది మాత్రం ఇది : “అధికార శిఖరాగ్రంపైన, ఎందరున్నారనేది ఖచ్చితంగా తెలియనప్పటికీ, కనీసం కొన్ని వేల మంది, గరిష్టంగా కొన్ని పదుల వేలమంది మన ప్రజలు ఉన్నారు. కాని అధికార శ్రేణి దిగువన మనకు జారిస్టు, బూర్జువా సమాజాల నుండి సంక్రమించిన లక్షలాదిమంది పూర్వపు కార్యనిర్వాహకులు కొంత చేతనంగానూ, కొంత అచేతనంగాను మనకు వ్యతిరేకంగా పనిచేస్తున్నారు. (సమగ్ర రచనలు – సంపుటం : XLV - పుట : 290). సోవియట్ ప్రభావానికి ఏమాత్రం లోనుకాని ఇటువంటి యంత్రాంగంతో చుట్టుముట్టబడిన లెనిన్ విభ్రాంతికి, నిస్సహాయతకు గురయ్యాడు. అంతేకాక ఆయన చేసిన విశ్లేషణ పూర్తిగా సరైనది కాదు. ఎందుకంటే, ఈ యంత్రాంగం దాని లోని కార్యనిర్వాహకుల అభీష్టానికి కూడా విరుద్ధంగా రాజ్యానికి నిజమైన సామాజిక మద్దతుగా నిలిచింది. దానికి రాజ్యం అప్పగించిన విధులను అది దాదాపుగా సమర్థవంతంగానే నిర్వర్తించింది. ఇదంతా ఎలా వున్నా, కొత్త పాలనకు విధేయత కలిగిన శ్రేణులు కొంత మేరకైనా దీనిలో ఉండడం

వల్ల, ఈ యంత్రాంగం రాజ్యానికి అనుసంధానించబడింది. ఈ విషయంలో మరో విలువైన అభిప్రాయాన్ని ట్రాట్స్కీ ఇలా పేర్కొన్నాడు :

"యాభై లక్షల మంది సైనికులు కల ఎర్ర సైన్యాన్ని యుద్ధ సన్నద్ధత నుండి విడుదల చేయడం ఉద్యోగస్వామ్యాన్ని ఏర్పరచడంలో ప్రముఖ పాత్ర నిర్వహించింది. విజయం సాధించిన సైనికాధికారులు స్థానిక సోవియట్లలో, ఆర్థిక రంగంలో, విద్యా రంగంలో ప్రముఖమైన పదవుల్ని పొందారు. అంతర్యుద్ధంలో విజయాన్ని చేకూర్చిన పద్ధతులనే వాళ్ళు పరిపాలనలో కూడ కొనసాగించారు. ఆ విధంగా సామాన్య ప్రజలు అన్ని వైపుల నుండి దేశ నాయకత్వంలో సరాసరి భాగస్వాములు కాకుండా నెట్టివేయబడ్డారు." ('రివల్యూషన్ బిట్రేయిడ్' – రచయిత : లియోన్ ట్రాట్స్కీ – సం॥ : 1937 – పుటలు : 89–90).

పరిపాలనలో పూర్వపు ఎర్ర సైన్యం శ్రేణుల సంఖ్య పరిపాలన శిఖరాగ్రాన పదుల వేల సంఖ్యలో కమ్యూనిస్టులున్నారని లెనిన్ చెప్పిన దానికంటే గణనీయంగా ఎక్కువ. ఎందుకంటే వాళ్ళు ప్రతి స్థాయిలో జారిస్టు కార్యనిర్వాహకుల సమూహాలతో కలగలిసిపోయి వున్నారు.

పరిపాలనా యంత్రాంగంలో ఎవరు ఏ నిష్పత్తిలో ఉన్నా, అది మొత్తం మీద అధికారాన్ని నెరపుతున్న తీరు పట్ల, రోజువారీ కార్యక్రమాలను నిర్వహిస్తున్న తీరు పట్ల లెనిన్ ఎంతో ఆందోళనతో, అసంతృప్తితో ఉన్నాడు. శాంతి సమయంలో పరిపాలనా విధుల్ని సక్రమంగా నిర్వహించలేని అంతర్యుద్ధపు నాయకుల్ని ఆయన ఎప్పుడూ విమర్శిస్తూనే ఉండేవాడు: పర్యవసానాలను లెక్క చేయకుండా అలా విమర్శించిన ఏకైక రాజకీయ నాయకుడీయన. వేలాదిమంది ఉత్తమ కమ్యూనిస్టు శ్రేణులు మోహరించిన మాస్కోలో కూడా సామర్థ్యలేమిని, అలసత్వాన్ని ఈయన పసికట్టి అంతమొందించాడు. (సమగ్ర రచనలు – సంపుటం : XLIII – పుట: 234). కమ్యూనిస్టులు కొత్తవాళ్ళకి తమని అణగదొక్కేందుకు అవకాశం ఇచ్చారు. వ్యవహారాలపై నియంత్రణను కోల్పోతున్నారు.

"ఇంతకూ కొరవడిందేమిటి? కమ్యూనిస్టు నాయకుల్లో కొరవడిందేమిటో సుస్పష్టమే: అది సంస్కృతి. మనం మాస్కో విషయం పరిశీలిద్దాం : 4,700 మంది కమ్యూనిస్టు నాయకులు, పెద్ద సంఖ్యలో ఉద్యోగులు. ఎవరు నాయకత్వం వహిస్తున్నారు? ఎవర్నెవరు నడిపిస్తున్నారు? కమ్యూనిస్టులు నడిపిస్తున్నారని చెప్పేందుకు ఎంతగానో సందేహించవలసి వస్తున్నది. వాళ్ళనెవరో నడిపిస్తున్నారని చెప్పటం సబబుగా వుంటుంది." (సమగ్ర రచనలు – సంపుటం : XLV – పుట : 95).

ఈ ఘటనలన్నీ అధికార యంత్రాంగంపై ప్రగాఢమైన ప్రభావాన్ని చూపాయి : ఆచరణలో ఇప్పుడు అధికారం అంతా పార్టీనే చలాయిస్తున్నది. ఏ సామాజిక శక్తి నియంత్రణలోను అది లేదు. శ్రామికవర్గం బలహీనపడిన కొద్దీ, పార్టీ సభ్యత్వం విస్తరించింది. కొత్త సభ్యుల్లో ఎక్కువమంది శ్రామికులే. కాని గణనీయమైన సంఖ్యలో రైతులు కూడా ఉన్నారు. వీళ్ళందర్నీ మించి విభిన్న రాజకీయ నేపథ్యాల నుండి వచ్చిన మేధావులు, కార్యనిర్వాహకులు కూడా వీరిలో ఉన్నారు. వ్యవస్థాపకుల సిద్ధాంతంతో ఉన్న బంధనాలు సడలిపోయాయి. అధికారంలో ఉన్న పార్టీకుండే ప్రయోజనాలకు ఆకర్షితులై దాని శ్రేణుల్లోకి చొరబడ్డ నికృష్ట పదవీలోలుర వల్ల అప్పుడప్పుడు ఆ బంధనాలు పూర్తిగా విస్మరించబడేవి. కొద్ది సంవత్సరాల వ్యవధిలోనే పార్టీ రాజకీయ, సాంస్కృతిక స్థాయి మొత్తం మీద గణనీయంగా దిగజారిపోయింది. పార్టీ సభ్యుల్లోని అత్యధిక సంఖ్యాకులు "రాజకీయ పరిజ్ఞానం తగినంతగా పొందిన వాళ్ళు కానందువల్ల..... ఇప్పటి క్లిష్ట పరిస్థితుల్లో, ముఖ్యంగా దేశంలో రైతాంగానికున్న సంఖ్యాపరమైన ప్రాబల్యాన్ని, వాళ్ళలో పెల్లుబుకుతున్న స్వతంత్ర వర్గ చైతన్యాన్ని పరిగణనలోకి తీసుకున్నట్లయితే, సమర్థవంతమైన కార్మికవర్గ నాయకత్వాన్ని నిర్మించడం కష్టతరమౌతున్నది." (సమగ్ర రచనలు - సంపుటం : XLV - పుట : 19).

వాస్తవానికి పార్టీలో శ్రామికుల సంఖ్య అధికంగా ఉన్నా దాని వల్ల తేడా ఏమీ వుండేది కాదు. దాని పెట్టీ బూర్జువా పతనాన్ని వాళ్ళు ఆపగలిగే వాళ్ళు కాదు. లెనిన్‌కి ఇదంతా తెలుసు (పై గ్రంథం - పుటలు : 18-19). అత్యంత శక్తివంతమైన రష్యన్ పెట్టీ బూర్జువా వర్గపు వరద ఉరవడి పార్టీని ముంచివేస్తుందేమోనని ఆయన భయపడేవాడు. మరో దిశగా ముంచుకొస్తున్న ప్రమాదాన్ని ఆయన గమనించలేకపోయాడు.

తన సంస్థాగత నిర్మాణం వెలుపల వున్న కార్మికుల్ని పాలించవలసి వున్న పార్టీ, పార్టీ సభ్యులుగా ఉన్న కార్మికుల పట్ల కూడ అదే వైఖరి అవలంబించింది. ఇతర సామాజిక వర్గాల నుండి వచ్చి చేరిన వారి విషయంలో ఈ ఆధిపత్య ధోరణి మరింత ప్రస్ఫుటంగా ఉండేది. చాలామంది కార్మికులు, సిద్ధాంతం ప్రకారం రాజ్యానికి బలమైన ఆధారం కావలసిన కీలకమైన పరిశ్రమల్లో పనిచేస్తున్న వారితో సహా, తమ అజ్ఞానం వల్ల విధాన నిర్ణయాల్లో కాని, ప్రభుత్వ కార్యనిర్వహణలో కాని సమర్థవంతంగా పాలు పంచుకొనలేకపోయేవారు. ఈ అంచనా శ్రామికుల సమూహం మొత్తం మీద అన్వయిస్తుంది. ఎందుకంటే వ్యక్తులుగా వాళ్ళలో పార్టీలో అత్యున్నత స్థానాలకు చెందిన వారు ఉన్నారు. ఈ విషయంలో పార్టీ తన సిద్ధాంతాలకు కట్టుబడి తన కార్యకర్తల్ని శ్రామిక వర్గం నుండి తీసుకుంది; కొన్నిసార్లయితే అర్హత కలవారు ఒక్కరు కూడా

మిగలనంతవరకు అలా తీసుకుంది. పార్టీలోని ఒకే అంతర్గత శిష్ట వర్గం, కార్యక్రమాలకు దిశా నిర్దేశం చేయడం, కార్మికుల నుండి  లేదా ఇతర సామాజిక వర్గాల నుండి చేర్చుకొనబడిన పార్టీ సభ్యులకు తగిన అవగాహన అందించడం చేస్తుంది.

కార్మికవర్గ నియంతృత్వం పరిస్థితుల ఒత్తిడి వల్ల మొదట సమాజంలోని భిన్న శ్రేణులతో కూడిన మైనారిటీ నియంతృత్వంగా రూపాంతరం చెందిన పిమ్మట, అనతి కాలంలోనే పార్టీ నియంతృత్వంగా రూపు దాల్చింది. అయితే ఈ దశలో అధికారపు కేంద్ర స్థానం క్రమేపీ కుంచించుకు పోవడం ఇంకా అంతిమ దశకు చేరుకోలేదు. 1922 మార్చిలో పార్టీ సెంట్రల్ కమిటీ  సభ్యులకు రాసిన లేఖలో లెనిన్ అంగీకరించిన మరో అంశం : "తప్పనిసరిగా గుర్తించాల్సిందేమిటంటే, పార్టీ కార్మిక వర్గ దృక్పథాన్ని అమలు చేసే విధానం ప్రస్తుతం దానిలోని సాధారణ సభ్యులచే కాక, పార్టీలో అత్యల్ప సంఖ్యలో వున్న మొదటి తరం యొక్క తిరుగులేని, అవిభాజ్య అధికారంచే నిర్ణయించబడుతున్నది." (సమగ్ర రచనలు – సంపుటం : XLV – పుట : 20). అయితే ఆ ప్రక్రియ ఇంకా పూర్తి కాలేదు. మరింత తక్కువమంది చేతుల్లో మరింత అధికారం కేంద్రీకరించబడే దిశగా రాజ్యాన్ని నెట్టిన విచిత్ర చోదక శక్తి ఇంకా పని చేస్తూనే వుంది. చూడగానే అనిపించేదేమిటంటే సోవియట్ పాలనను దురదృష్టం వెన్నాడిందని, కాని ఈ క్రమానికి కారణాలను బహు క్లిష్టమైన పరిస్థితుల కలయికలో చూడడం వాస్తవానికి దగ్గరగా వుంటుంది. అందరు విశ్వసించేదాని కంటే అధికంగా అంతర్యుద్ధం ఈ పాలనపై నిర్ణయాత్మకమైన, దీర్ఘకాలికమైన ప్రభావాన్ని చూపింది. అప్పుడప్పుడే స్థాపించబడి, దాని పద్ధతులు, నిర్మాణం ఇంకా  కుదురుకోకుండానే, ఈ వ్యవస్థ తనను తాను కాపాడుకునే ఏకైక లక్ష్యం దిశగా శక్తినంతటినీ కేంద్రీకరించవలసి వచ్చింది. ఇప్పుడు చర్చింపబడుతున్న కాలం నాటికి ఈ పాలనా వ్యవస్థ అంతర్యుద్ధంలో నుండి బయటపడుతోంది. దాని రూపు రేఖలు, పార్టీ సిద్ధాంతాలతోపాటు అంతకు సమానంగా ఆ యుద్ధం వల్ల కూడా నిర్ణయించబడ్డాయి. లేక పార్టీ నిర్మాణ సిద్ధాంతం ప్రభావం కూడా పనిచేసి ఉండవచ్చు. దానిని లెనిన్ "తొలి పాపం" (ఒరిజినల్ సిన్) గా అనేకమంది చరిత్రకారులు పరిగణించారు.

అనేక పాశ్చాత్య దేశాల మద్దతు కలిగిన, విస్తృతమైన సాయుధ సంపత్తి కలిగిన "విప్లవ ప్రతీఘాత"  సైన్యాలను ఎదుర్కొనేందుకు గట్టి కేంద్రీకృత విధానం, నిరంకుశత్వం అనివార్యమయ్యాయి. అయినా ఆ కాలంలో పార్టీలో అంతర్గత చర్చలు ఆగలేదు. దాని పరిమితులన్నీ శత్రువుకు వ్యతిరేకంగా సంఘీభావం చూపవలసిన అవసరం విధించినవి. ముఠాలను (factions), మౌలిక సమస్యలపై చర్చలను నిషేధించింది యుద్ధం తరువాతనే.

నిరంతరం ఆందోళన కలిగించే వర్తమాన స్థితి, ఆత్యయిక స్థితి పొడిగింపు వల్ల శ్రేణులను యుద్ధ సన్నద్ధంగా ఉంచడం, వారిని ఒక యుద్ధరంగం నుండి మరో దానికి, మిలిటరీ కార్యకలాపాల నుండి ఆర్థిక కార్యకలాపాలకు, ఆర్థిక కార్యకలాపాల నుండి మిలిటరీ కార్యకలాపాలకు మార్చడం అవసరమయ్యాయి. ఇటువంటి చర్యలు నియంతృత్వ పద్ధతుల్లో తప్ప ప్రజాస్వామ్య పద్ధతిలో సాధ్యమై ఉండేవి కావు : ఉత్తర్వులు, నియామకాలు, ఉద్వాసనలు వీటిని సాధ్యం చేశాయి. సిద్ధాంతపరంగా గాని, చట్టపరంగా గాని అనుమతి లేని ఈ పద్ధతులు మూడేళ్ళపాటు అమలులో ఉన్నాయి. అవి పార్టీ మనుగడలో అంతర్భాగమయ్యాయి. స్థానిక పార్టీ సెక్రటరీని పై నుండి నియమించడం ఒక సహజమైన, సాధారణమైన ఘటనగా మారిపోయింది. సమర్థులైన అధికారుల కొరత ఏర్పడిన కొన్ని సందర్భాల్లో స్థానిక శాఖలు వాటంతటవి ఆ సంస్థల నిర్వహణకు తగిన నాయకుల్ని పంపమని పై నాయకత్వాన్ని కోరటం జరిగేది. అప్పటికే దేశంలోని ప్రధానమైన రాజకీయేతర పదవులన్నింటికీ నియామకాలు జరిపేది పార్టీ నాయకత్వమే. శాంతి ఏర్పడిన పిమ్మట కూడా ఈ పద్ధతులు కొనసాగాయి. రాజ్యావసరాలకు అనుగుణంగా పార్టీ శ్రేణుల్ని పంపిణీ చేసే సెంట్రల్ కమిటీకి చెందిన ప్రత్యేక బ్యూరో (ఆర్గ్ బ్యూరో) పని చేయటం కొనసాగించింది. ఈ పద్ధతి సమర్థవంతంగానే ఉంది కాని పెద్ద ఎత్తున నిరసనలకు దారి తీసింది. ఎందుకంటే, సెంట్రల్ కమిటీకి చెందిన కార్యదర్శివర్గానికి రాజకీయంగా ఇబ్బందికరమైన వ్యక్తిని -- బహుశా అతడు పార్టీ చేపట్టిన ఒక విధానానికి గాని, లేదా నాయకత్వంలో ఒకరికి గాని వ్యతిరేకంగా ఉన్నందుకుగాను -- ఒక హోదా నుండి మరొక హోదాకు మార్చడం లేదా ప్రాముఖ్యం లేని పదవులకుగాని, దూర ప్రాంతాలకుగాని పంపడం ఇప్పుడు సులభసాధ్యమయింది. నూతన ఆర్థిక విధానం[4] ప్రవేశపెట్టిన పిమ్మట, ప్రజాస్వామ్య విరుద్ధమైనదిగా, పార్టీ నియమావళిలో పొందుపరచిన ఎన్నికల విధానానికి వ్యతిరేకమైనదిగా భావించబడిన పై పద్ధతికి వ్యతిరేకంగా గళమెత్తిన నిరసన నిష్ఫలమైంది. ఆర్గ్‌బ్యూరో (ఆర్గనైజేషన్ బ్యూరో)కి పార్టీలో గణనీయమైన అధికారాన్ని కట్టబెట్టిన ఈ పరిస్థితిని అంతమొందించాలంటే, దాదాపు విప్లవాన్ని సరిపోలిన స్థాయిలో పార్టీ దిశా నిర్దేశాన్ని సమూలంగా పునర్వ్యవస్థీకరించడం అవసరం. ('సోషలిజం ఇన్ వన్ కంట్రీ' – రచయిత: ఇ.హెచ్.కార్ – సంపుటి : 2 – అధ్యాయం : 19 – పుటలు : 201–4). అయితే కరువు కాటకాల మధ్య, రైతుల ఆందోళనల మధ్య నూతన ఆర్థిక విధానాన్ని ప్రవేశపెట్టడం, క్రాన్‌స్టట్ తిరుగుబాటు[5] ఒక భూతంలా నేపథ్యంలో నిల్చి వుండడం లాంటి అప్పటి పరిస్థితులు నియంత్రణను సడలించడానికి అనువుగా లేవు. 1921 మార్చి – ఏప్రిల్ నాటికి పరిస్థితి మరింత దిగజారడంతో, అందుబాటులో ఉన్న

ఒకే ఒక విశ్వసనీయ శక్తి అయిన పార్టీని క్రియా శూన్యత ఆవరించకుండా కాపాడే ఆతృతలో లెనిన్ పార్టీలో అంతర్గత ముఠాల్ని నిషేధించి, వాటిలో సభ్యులను పార్టీ నుండి బహిష్కరించే అధికారాన్ని సెంట్రల్ కమిటీకి అప్పగించాడు. ఈ నిర్ణయం ఒక అత్యయిక పరిస్థితికి తొందరపాటు ప్రతిస్పందన అనుకున్నా, కేవలం ఓ తాత్కాలిక ఏర్పాటు అనుకున్నా, తప్పుడు అంచనా ఫలితం అనుకున్నా, ఆలోచనా రాహిత్యం అనుకున్నా, అది మాత్రం ఇటు పార్టీ, అటు దేశ భవిష్యత్తుకి గుది బండగా మారింది. ('ది ఇంటెరగ్నమ్ 1923-24' - రచయిత: ఇ.హెచ్.కార్ - అనుబంధం; 'ది రివల్యూషన్ బిట్రేయిడ్' అనే తన రచనలో ట్రాట్స్కీ ఇలా పేర్కొన్నాడు: "ఈ ముఠాల రద్దు అనే నిర్ణయం ఒక అసాధారణ చర్యగా, పరిస్థితులు మెరుగుపడగానే వదలివేయవలసిన విధానంగా చూడబడింది"). అది పొలిట్‌బ్యూరోను, దాని కార్యదర్శి వర్గాన్ని, ఆర్గ్‌బ్యూరోను బలోపేతం గావించింది. కేంద్ర కమిటీ స్థాయి కూడా బలహీనపడసాగింది. ప్రతిదీ పొలిట్‌బ్యూరో ద్వారా వెళ్ళవలసిన పరిస్థితి ఏర్పడింది. అనుభవజ్ఞులైన అధికారులు, ప్రజా కమిసార్లు సైతం వాళ్ళు నిర్ణయించడానికి వెనకాడే విషయాలను ఆ అత్యున్నత సాధికారిక వ్యవస్థ ముందుంచేవారు. ఈ పరిస్థితి పట్ల లెనిన్ తీవ్ర అభ్యంతరాన్ని పార్టీ పదకొండవ మహాసభలో వ్యక్తం చేశాడు.

సోవ్నర్కోమ్[6] లో లెనిన్ ఉన్నంత కాలం, తన పదవీ బాధ్యతల్ని నెరవేర్చినంత కాలం ఈ పరిస్థితి కనీసం పాక్షికంగా కప్పి వుంచబడింది. జాతీయ విధానాలను రూపొందించడం, సిద్ధాంతపరమైన సమస్యలను పరిష్కరించడంపై పొలిట్‌బ్యూరో ప్రధానంగా పనిచేసేది. అయితే లెనిన్ స్వయంగా సోవ్నర్కోమ్ పరిధికి చెందిన అనేక రోజువారీ సమస్యలను పొలిట్‌బ్యూరో సమావేశాల్లో చర్చించేవాడు. ఆయన తీవ్ర అనారోగ్యానికి గురైన పిమ్మట దేశంలో పొలిట్‌బ్యూరో కీలకమైన సంస్థగా మారింది. పొలిట్‌బ్యూరో, సెంట్రల్ కమిటీల పాలనాపరమైన, నిర్వాహణాపరమైన రోజువారీ పనులను పర్యవేక్షించే కార్యదర్శివర్గం ఒక ద్వితీయ శ్రేణి యంత్రాంగంగా పరిగణించబడేది. అయితే పార్టీలోకి, ముఖ్యంగా అంతర్యుద్ధ కాలంలో, ప్రవేశించిన కొత్త పద్ధతుల వల్ల దాని అధినేత ఎంత విస్తృత అధికారాన్ని చెలాయించగలడో స్పష్టమయింది.

1922 ఏప్రిల్‌లో స్టాలిన్ పార్టీ జనరల్ సెక్రటరీగా నియమించబడ్డాడు. పార్టీ పరిభాషలో చెప్పాలంటే "జెన్‌సెక్" అయ్యాడు. అదే సమయంలో ఆయన జాతుల మంత్రిత్వశాఖ కమిస్సార్‌గా, కొంతకాలం పాటు కార్మిక - కర్షక తనిఖీకి కమిస్సార్‌గా ఉన్నాడు. అలా అధికారాలు, బాధ్యతలు అన్నీ ఒక్కచోట చెప్పుకోదగినంతగా పోగుపడ్డాయి. వివేచనాయుతుడైన ప్రియోబ్రజన్‌స్కీ మాత్రమే ఈ క్రమాన్ని బలంగా వ్యతిరేకించాడు.

ఈ దశలో, 1903–04 ప్రాంతాల్లో పార్టీ నిర్వహణ విషయంలో లెనిన్ దృక్కోణాన్ని విమర్శిస్తూ ట్రాట్స్కీ దూరదృష్టితో పేర్కొన్న పరిస్థితికి మనమెంతో దూరంలో లేము : “పార్టీ నిర్మాణం పార్టీ స్థానాన్ని ఆక్రమిస్తుంది; సెంట్రల్ కమిటీ పార్టీ నిర్మాణం స్థానాన్ని ఆక్రమిస్తుంది; చివరకు నియంత సెంట్రల్ కమిటీ స్థానాన్ని ఆక్రమిస్తాడు....” (‘త్రీ హుమేడ్ ఎ రివల్యూషన్’ – రచయిత : బెర్ట్రామ్ డి. ఉల్ఫ్ – సం॥ : 1955 – పుట : 253). ట్రాట్స్కీ పొరపాటు పడిందెక్కడంటే లెనిన్ కేంద్రీకృత విధానాన్ని “అహం కేంద్రకత” (ఇగో సెంట్రలిజం) గా పరిగణించటం : లెనిన్ భావనల్లో వ్యక్తిగత అధికార తృష్ణ దాగిలేదు. వాస్తవానికి లెనిన్, ట్రాట్స్కీల కృషితో రూపొందిన పార్టీ యంత్రాంగం వారిరువురికి వ్యతిరేకంగా పనిచేసింది.

తన జీవిత చరమాంకంలో లెనిన్ అనుసరించిన రాజకీయ ఆలోచనా సరళిని సంపూర్ణంగా అవగాహన చేసుకోవాలంటే, అధికార కేంద్రీకరణకు సంబంధించిన మరో పార్శ్వాన్ని మనం పరిశీలించవలసి వుంటుంది. కార్మిక వర్గ నియంతృత్వ సిద్ధాంతాన్ని బోల్షివిక్కులు చిత్తశుద్ధితో విశ్వసించారు. కార్మిక వర్గం స్థానాన్ని పార్టీ ఆక్రమించడం, మొదట వాస్తవంగా జరిగిన విషయం మాత్రమే అయినప్పటికీ, దానిని సిద్ధాంతంలోకి, కొంత సందిగ్ధతతోనైనా, ప్రవేశపెట్టవలసి వచ్చింది. అయితే అది తాత్కాలిక చర్యగానే పరిగణింపబడింది. కార్మికులు పెద్ద కర్మాగారాలలో తిరిగి నిర్వహణలో భాగం పంచుకోవటం జరిగినప్పుడు, భవిష్యత్తులో సాధించే ఫలితాల వల్ల పారిశ్రామిక రంగం శక్తి సంపన్నమైనప్పుడు, ఈ తాత్కాలిక చర్య కనుమరుగు కాగలదనుకున్నారు. అయితే వాస్తవంలో ఈ పరిస్థితి ఫాక్టరీలలోను, దేశవ్యాప్తంగాను మేనేజర్ల పాలనకు దారి తీసింది. ఉద్యోగస్వామ్యం దాని సుదీర్ఘ పాలనా కాలాన్ని ఆరంభించింది. ఇదంతా తగినంతగా ఆర్థిక పునాదులు లేనందువల్ల జరిగిందని లెనిన్ వివరించాడు. ఈ ప్రతిపాదన ఐరోపాలో విప్లవ అవకాశాలు ఉన్నంతకాలం అంత ఇబ్బంది కలిగించలేదు. కాని ఈ ప్రతిబంధకం తరువాత కాలంలో ఒక విషాదంగా పరిణమించింది. రష్యాకు ప్రపంచంలో అత్యంత పురోగామి పథంలో పయనించే రాజకీయ పాలనా పద్ధతి ఉన్నప్పటికీ కనీసం జాతీయ ఆర్థిక వ్యవస్థ పునాదుల ఏర్పాటులో ఇంకా విజయం సాధించలేకపోయిందని లెనిన్ చెప్పాడు; సోషలిజం పునాదులు మృగ్యం కావటంతో ఇదమిద్ధంగా ఏదీ సాధించబడలేదు: “మరణోన్ముఖ పెట్టుబడిదారీ విధానపు ప్రతికూల శక్తులు ఇప్పటికీ మన నుండి అధికారాన్ని తిరిగి చేజిక్కించుకోగలవు.” (సమగ్ర రచనలు – సంపుటం : XLIV – పుట : 418). ఆ విధంగా చారిత్రక భౌతికవాదపు మౌలిక నియమాలను దాని అత్యంత విధేయులైన శిష్యులే తలక్రిందులు చేశారు. రాజ్యానికి చెందిన సాధికారిక లక్ష్యాల సాధనలో

అత్యంతావశ్యకాలైన సామాజికార్థిక పునాదులు పూర్తిగా లోపించాయి. కొత్త రాజ్యం "రెండంతస్తుల శూన్యం"లో వేళ్లాడుతోంది: మొదటిది కార్మికుల సంఖ్య గణనీయంగా పడిపోవడం; రెండవది ఆర్థిక పునాది లోపించటం. ఇ.హెచ్.కార్ వ్యాఖ్యానించినట్లుగా కార్మికవర్గ నియంతృత్వం వాస్తవ ఉనికిగా కంటే *సంభావ్యతగా* అధికంగా ఉంది. ('సోషలిజం ఇన్ వన్ కంట్రీ' – రచయిత : ఇ.హెచ్.కార్ – సంపుటం : I - పుటలు : 103–4). ఈ పరిస్థితి 1917లో లెనిన్ రాసిన గ్రంథం "రాజ్యం– విప్లవం"లో వెల్లడించిన ఆశావహ, ఆదర్శవాద, సరళీకృత భావనలకు చాలా దూరంలో వుంది. సమస్యలన్నిటికీ పారిస్ కమ్యూన్[7] పరిష్కారం చూపినట్లుగా ఈ రచనలో లెనిన్ భావించాడని అనిపిస్తుంది. సామాజిక, ఆర్థిక అంశాల ఆధారంగా రాజకీయాంశాలను నిర్ధారణ చేసే అలవాటు కల అతివాదులు ఒక చికాకు కలిగించే పరిస్థితిలో చిక్కుకున్నారు. నూతన ఆర్థిక విధానం (NEP) ద్వారా పార్టీ మూల లక్ష్యాలకు విరుద్ధమైన లక్ష్యాల దిశగా సమాజపు స్వాభావిక చోదక శక్తులు దానిని నడిపించడం ఈ పరిస్థితిలో ఒక కోణం. ఎటువంటి సామాజిక పునాది లేని ఒక శిష్ట పాలక వర్గం ఒక విధమైన "శుద్ధ రాజకీయ శక్తి"గా రూపొంది తన సంకల్పాన్ని సమాజంపై విధించడం ఈ పరిస్థితిలో మరో కోణం.

లెనిన్, లెనినిస్టు సిద్ధాంతం రెండూ ఈ నూతన స్థితికి అనుగుణంగా ఉండవలసి వచ్చింది. ఇందుకు రెండు అంశాలు తోడ్పడ్డాయి. మొదటిది, సజ్జోజనితం (spontaneous) కాని రాజకీయ చైతన్యానికి ఆపాదించబడిన పాత్రకున్న ప్రాముఖ్యత; రెండవది ఈ చైతన్యాన్ని మేల్కొలిపే కర్తవ్యాన్ని పార్టీకి ఆపాదించే సిద్ధాంతం. లెనినిస్టు వ్యూహంలో పార్టీకి కేంద్ర స్థానం కల్పించబడడం, లెనినిజం మార్క్సిజానికి ఒక విధమైన ఇచ్ఛావాద (voluntarist) వ్యాఖ్యానాన్ని ప్రతిపాదించడం అనే అంశాలు మనల్ని, కొన్ని సందర్భాలలో జరిగినట్లుగా, రాజకీయాధికారం క్రమంగా కుంచించుకుపోయి అంతిమంగా ఏక వ్యక్తి పాలనలో పరాకాష్టకు చేరడం అనే మొత్తం క్రమాన్ని లెనినిజానికి ఆపాదించే దిశగా నెట్టగూడదు. లెనినిస్టు సిద్ధాంతపు మూలాల్లోకెళితే అది ఒక ఏకశిలాసదృశమైన రాజ్యాన్ని కాని, పార్టీని కాని ఊహ చేయలేదు; కార్మిక వర్గంపై పార్టీ నియంతృత్వం లెనిన్ ప్రణాళికల్లో ఎప్పుడూ భాగం కాదు. వరుసగా తటస్థించిన అనుకోని పరిస్థితులు పూర్తిగా అనుకోని విధంగా పరాకాష్టకు చేరడం వల్ల ఈ పరిస్థితి ఏర్పడింది. ట్రాట్స్కీ భవిష్యద్దర్శనాన్ని అలా వుంచేట్లయితే, స్టాలినిస్టు పాలనా వ్యవస్థలో ఉచ్ఛ స్థాయిని చేరిన రాజకీయాధికార కేంద్రీకరణ క్రమానికి 1903–04 కాలంలోని భావాలు, చీలికలు కారణమన్నది వాస్తవం కాదు. తదనంతర చరిత్రలో, విప్లవం తరువాత ఘటనల్లో, అవి

సిద్ధాంతాన్ని మలిచిన తీరులో దీని మూలాలను కనుగొనవలసి వుంది. "యుద్ధ కమ్యూనిజం"[8] సిద్ధాంతానికి గాని, దానికి పూర్తిగా విరుద్ధమైన భావనలపై ఆధారపడి రూపొందిన నూతన ఆర్థిక విధానానికి గాని విప్లవ పూర్వ భావాలతో, సిద్ధాంతాలతో ఎటువంటి సంబంధం లేదు. అంతర్గత విజయ సాధనతో శాంతి తిరిగి నెలకొన్న తరువాత, ఆర్థిక నిర్మాణాన్ని సమకూర్చుకోవడం, నిరక్షరాస్యత సమస్యతో ప్రారంభించి పార్టీ శ్రేణుల్లోను, ప్రజల్లోను సాంస్కృతిక స్థాయిని పెంపొందించడం ద్వారా రాజకీయాధికారపు పునాదిని బలోపేతం చేయడానికి లెనిన్ కృషి ప్రారంభించాడు. తమ పాలనా వ్యవస్థ ప్రస్తుతం ఉన్న పరిస్థితుల్లో ఆర్థిక అంశాల కంటే రాజకీయ అంశాలదే పై చేయి అని లెనిన్‌కి తెలుసు. అయితే అటువంటి ప్రాబల్యం కాల పరిమితి లేకుండా కొనసాగగలదనే ఆలోచన ఆయనకు భరోసా ఇవ్వలేదు. మన కాలంలో అనేకమంది అత్యంత శక్తివంతమైన, నిర్ణయాత్మకమైన సాధనంగా పరిగణించే రాజకీయాధికారం అనే తులాదండాన్ని ఎక్కువ కాలం వాడేందుకు లెనిన్ సిద్ధంగా లేడు. ("మన విప్లవం" – సమగ్ర రచనలు – సంపుటం : XLV– పుటలు : 378 – 382. "మన విప్లవం" అనే రచనలో ప్రామాణిక మార్క్సిస్టు అవగాహనకు భిన్నమైన ఆర్థికత కన్నా రాజకీయాలు ప్రాథమికమనే భావనను లెనిన్ స్పష్టంగా వ్యక్తీకరించాడు).

ఇదే అంశంలో మరో వంచనను, అప్పుడే "యుద్ధ కమ్యూనిజం" పట్ల వారి భ్రమల నుండి బయటపడిన పార్టీలోని సమరశీలురు ఎదుర్కొనవలసి వచ్చింది. సామాజిక నిర్మాణంలో లోపించిన పునాదులను నిర్మించవలసిన అవసరం, కమ్యూనిజాన్ని అలా ఉంచితే, కనీసం సోషలిజాన్ని సరాసరి ప్రవేశపెట్టే అవకాశాన్ని ఆటంక పరచింది. ఇది ఒక పరిణామ దశకు ప్రారంభమేనని, ఈ దశలో నూతన ఆర్థిక విధానాన్ని పొడిగించడం అవసరమని వివరించడం ద్వారా అసహనంతో ఉన్న వాళ్ళను లెనిన్ శాంతపరిచాడు. అయితే ఆయన మాత్రం ఈ క్రమం పాలనా వ్యవస్థను ఎంత ప్రమాదకర పరిస్థితులలోకి నెట్టిందో స్పష్టంగా గమనించాడు : బయటనుండి బెదిరింపులు, అంతర్గత అనిశ్చితి (మరీ ముఖ్యంగా రైతులది) మాత్రమే గాక నీతిబాహ్యతకు ప్రేరేపించే వాతావరణపు ఒత్తిడి వల్ల కమ్యూనిస్టులే దిగజారిపోయే ప్రమాదం ఏర్పడింది. కమ్యూనిస్టులు నడిపించే నేతలుగా గాక నడిపించబడే వారుగా మారిపోయారనే తన భావన కనుగుణంగా పార్టీ పదకొండవ మహాసభలో లెనిన్ ఇలా పేర్కొన్నాడు :

"చిన్నప్పుడు మనం చరిత్రకు సంబంధించిన పాఠాల్లో నేర్చుకున్నట్లుగా ఒక ప్రజ మరో ప్రజను అణచివేయడం లాంటిది ఇప్పుడు మనకు జరిగింది. జయించిన ప్రజలు అణచివేతదారుని రూపు దాలుస్తారు. పరాజయం పాలయినవాళ్ళు అణచివేతకు

గురవుతారు. ఇది నిజమే గాని ఈ రెండు విధాలైన ప్రజల సంస్కృతి మాటేమిటి? సమాధానం చెప్పటం అంత తేలికేం కాదు. జయించిన వాళ్ళు పరాజయంపాలైన వాళ్ళకంటే అధికంగా సంస్కృతీపరులైతే శక్తి సంపన్నులు శక్తి హీనులపై తమ సంస్కృతిని విధిస్తారు. దీనికి విరుద్ధమైన సందర్భాలలో పరాజయం పాలైన వాళ్ళు జయించిన వారిపై తమ సంస్కృతిని విధించవచ్చు. రష్యన్ సోవియట్ సోషలిస్ట్ రిపబ్లిక్ రాజధానిలో జరిగింది ఇది కాదా : 4700 మంది (ఒక డివిజన్ సంఖ్యకి దాదాపు సమానం) అత్యుత్తమ కమ్యూనిస్టులు పరాయి సంస్కృతితో ముంచి వేయబడలేదా? పరాజితుల సంస్కృతి ఉన్నతమైనదనే అభిప్రాయాన్ని ఈ పరిస్థితి కలగజేస్తుందనే వాదన సరైనదేనా? అలా జరగదు : ఎందుకంటే ఈ సంస్కృతి అల్పమైనది, అప్రధానమైనది. అయినా అది మన సంస్కృతి కంటే అధికమైనదే." (సమగ్ర రచనలు - సంపుటం : XLV - పుటలు : 95-96).

ఈ ప్రసంగాన్ని బట్టి చూస్తే లెనిన్ తన పాలనా వ్యవస్థను చుట్టుముట్టిన ప్రమాదాలను స్పష్టంగా అర్థం చేసుకున్నాడు. ఒకవేళ తదనంతర చారిత్రక పరిణామాలు తాను ఊహించిన దానికంటే భిన్నంగా ఉన్నప్పటికీ, మనం ఒక విషయాన్ని గుర్తించాల్సి వుంది. లెనిన్ ఈ పరిస్థితిని అందరికంటే ముందుగా విశ్లేషించి పిమ్మట పార్టీకి, మొత్తం దేశానికి తాను చూసిన వాస్తవ స్థితిని స్పష్టంగా తెలియపరిచాడు.

# 2

# నూతన ఆర్థిక విధానం - ఒక చిక్కుముడి

అంతర్యుద్ధం పరిసమాప్తమయ్యే నాటికి నెలకొన్న పరిస్థితుల్లో పరిష్కరించవలసిన ఎన్నో సమస్యలు సోవియట్ నాయకుల ముందు నిలిచాయి. ఐరోపాలో లేదా ఆసియాలో కొత్త విప్లవాలు జరగబోయే ముందు కాలంలో పాశ్చాత్య శక్తులతో ఘర్షణను ఏ విధంగా నివారించాలి ? క్షీణిస్తున్న రాజ్య వ్యవస్థను కాపాడుకోవటం ఎలా లేదా మరో విధంగా చెప్పాలంటే, ప్రస్తుతం అధికారంలో వున్న పార్టీ తన సైద్ధాంతిక, నైతిక స్వచ్ఛతను కాపాడుకోవటం ఎలా? ఉద్యోగస్వామ్యం కబంధ హస్తాల నుండి తప్పించుకోవడం ఎలా? తెలియని అనేక అంశాలతో కూడిన ఈ సమస్యలకు వెనువెంటనే లభించే సమాధానాలు ఉండవు. 'నూతన ఆర్థిక విధానం" గా పిలవబడిన మౌలికంగా భిన్నమైన, అనూహ్యమైన ఆర్థిక వ్యవస్థను ప్రవేశపెట్టినందువల్ల సమస్యలు మరింత జటిలమయ్యాయి. దేశం మొత్తంగా, మరీ ముఖ్యంగా వ్యవసాయ రంగం, ఎదుర్కొంటున్న ఆర్థిక స్తబ్ధతను వెంటనే పరిష్కరించే లక్ష్యంతో ఈ విధానాన్ని ప్రవేశపెట్టడం జరిగింది. రెండేళ్ళు అమలు చేసిన పిమ్మట అది సానుకూల ఫలితాలనిచ్చినప్పటికీ, బోల్షివిక్కులకు మాత్రం అది పెనుభూతంతో సహజీవనంలా పరిణమించింది.

దేశాన్ని సంక్షోభం నుండి కాపాడే చర్యగా దానిని లెనిన్ అభివర్ణించాడు. తద్వారా రైతాంగం అవసరమైన రాయితీలు పొంది ఆ ప్రోత్సాహంతో ఉత్పత్తిని తిరిగి ప్రారంభించి దేశ ప్రజలకు ఆహారాన్ని అందించగలరని లెనిన్ భావించాడు. ఈ రాయితీలను ఒక మేరకు పెట్టుబడిదారీ విధానాన్ని ప్రవేశపెట్టడంగా చూడాల్సి వుంటుంది -- "ఇది మనం తప్పనిసరిగా అంగీకరించదగిన, అంగీకరించవలసిన పెట్టుబడిదారీ విధానం. అయితే దానికి తప్పనిసరిగా మనం కొన్ని పరిమితులు విధించవలసి వుంటుంది. ఈ విధానం విస్తృత రైతాంగ బాహుళ్యానికి, రైతాంగపు అవసరాలను సంతృప్తిపరచే వాణిజ్యానికి అవసరం. ఆర్థిక వ్యవస్థ క్రమ నిర్వహణను, పెట్టుబడిదారీ మారకపు వ్యవస్థను సాధ్యం చేసే దిశగా మనం చర్యలు గైకొనవలసి వుంది. ఈ విధానం అంతా ప్రజలకొరకే. అలా చేయకుంటే మన జీవనం సాగదు.... వాళ్ళకు, అంటే రైతాంగ శిబిరానికి, ఇది తప్ప వేరే మార్గం లేదు. దీని నుండి వీలైనంత లబ్ధిని పొందడమే మిగతా ప్రజానీకం చేయగలిగింది." (సమగ్ర రచనలు - సంపుటం : XLV - పుట : 85-86)

లెనిన్ చేస్తున్నదంతా చారిత్రకంగా చాలా అరుదుగా కన్పించే వ్యవహారం. బోల్షివిక్కుల అధికారాన్ని అంగీకరించే షరతుకు లోబడి అధిక మోతాదులో పెట్టుబడిదారీ విధానాన్ని అనుసరించేందుకు లెనిన్ రైతాంగానికి అవకాశం కల్పించాడు. ఖచ్చితంగా అది ప్రయోజనకరమే కాని ప్రమాదభరితం కూడ. పలువురు వామపక్ష అతివాదులు భయపడినట్లుగా అటువంటి రోగనిదానం రోగివైపు నుండి ఆహ్వానించదగినదే కాని వైద్యునికి ప్రాణాంతకం కాగలదు. ఈ నిర్ణయం ప్రపంచ వ్యాప్తంగా గణనీయ స్థాయిలో చర్చని రేకెత్తించింది. పెట్టుబడిదారీ విధానాన్ని తిరిగి ప్రవేశపెట్టడం బోల్షివిజాన్ని అంతమొందించగలదనే ఆశను ఈ వ్యవస్థను వ్యతిరేకించే వారిలో కలిగించింది. తొలుత పార్టీలోని అన్ని వర్గాలకు ఇది ఏకైక పరిష్కార మార్గంగా కనిపించింది; అయితే త్వరలోనే చాలామంది దానిని నమ్మకద్రోహంగా, కమ్యూనిస్టు స్వభావానికి విరుద్ధమైన పొత్తుగా భావించారు. ఏది ఏమయినా పార్టీ ఆందోళనకు గురయ్యింది. అందుకు కారణాలు లేకపోలేదు. "యుద్ధ కమ్యూనిజం" సృష్టించిన భ్రమలు చెల్లా చెదరయ్యాయి. వ్యవసాయ విపణి, సొంత వ్యాపారాలను పునర్నిర్మించాల్సి వుంది; అయితే సోవియట్ జీవన విధానపు ప్రతి రంగంలోకి పెట్టుబడిదారీ అంశ చొచ్చుకొని వచ్చి, అవినీతికి , పతనానికి దారి తీసి ప్రభుత్వాన్ని, పార్టీని కూడ ప్రభావితం చేయగలదు. 1918లో రోజా లగ్జంబర్గ్ వ్యక్తం చేసిన ఈ అభిప్రాయంతో పలువురు ఏకీభవించి ఉండేవారు : "లెనినిస్టు వ్యవసాయిక సంస్కరణ గ్రామీణ ప్రాంతంలో సోషలిజానికి కొత్తదైన, శక్తివంతమైన ప్రజాశత్రు శ్రేణిని సృష్టించింది. వారి ప్రతిఘటన కులీన భూస్వాముల దానికంటే మరింత ప్రమాదకరమైనది, మొండి స్వభావం కలిగినది" ('రష్యన్ విప్లవం' – రచయిత : రోజా లగ్జంబర్గ్ – సమీక్ష ప్రచురణలు, విజయవాడ – సం॥ : 2004 – పుట : 34).

సంస్కరణ అవసరాన్ని ప్రశ్నించకుండానే, లెనిన్ రైతుల గురించి ఎప్పుడూ ఒకే విషయాన్ని చెప్పడాన్ని మనం గమనించవచ్చు. రష్యన్ రైతాంగానికి సోషలిస్టు ప్రయోగం పట్ల ఆసక్తి లేదు. వారిలో అత్యధికులు నిరక్షరాస్యులు. పైగా అతి తక్కువ ఉత్పాదక శక్తి కలిగిన వారు. దాదాపు పది కోట్ల మంది వరకు వుండే వీళ్ళలో ఎల్లప్పుడూ ఒక విధమైన తిరుగుబాటు జ్వాల రగులుతూ ఉండేది. అది తరచుగా జార్ చక్రవర్తుల ప్రశాంతతకు భంగం కలగజేస్తూ ఉండేది. నూతన ఆర్థిక విధానం వాణిజ్య స్వేచ్ఛను కల్పించిన మాట నిజమే కాని, సంస్కరణల వల్ల జరిగిన భూ పంపిణీ అంతకు మించిన రాజకీయ ఇబ్బందుల్ని తెచ్చిపెట్టింది. పెట్టుబడిదారీ ఆర్థిక విధానం రైతాంగానికి మరింతగా ఆకర్షణీయమై, పార్టీ సాముదాయిక సిద్ధాంతాల నుండి వారిని మరింత దూరంగా నెట్టివేసింది.

అయితే అంతకంటే ఎక్కువ చెరుపు జరగబోతున్నది. నూతన ఆర్థిక విధానం

పాత, కొత్త పెట్టుబడిదారీ వర్గాన్ని, వాణిజ్యవేత్తల్ని, వ్యాపారుల్ని,పారిశ్రామికవేత్తల్ని పునరుజ్జీవింప చేయటంలో సఫలీకృతం అయింది. ఆ విధంగా విప్లవం కార్మికుల్ని నిరాశకు గురి చేయటమే గాకుండా (విప్లవ క్రమంలో అమితమైన భారాన్ని మోసిన కార్మికులకు బదులుగా రైతాంగం విప్లవం వల్ల అత్యంతంగా లాభపడిందని లెనిన్ 1921లో బహిరంగంగా పేర్కొన్నాడు. ఇది తదుపరి సంవత్సరంలో మరింత వాస్తవంగా రుజువయింది), రైతాంగానికి బోల్షివిక్ వ్యతిరేకతకు ఒక కేంద్ర స్థానాన్ని అందించింది. వాళ్ళకి రాజ్యంతో వున్న ఏ ఘర్షణలోనైనా రైతాంగానికి ప్రతికూల పరిస్థితి ఏర్పడితే జరగబోయే ప్రతిఘటనకు అవసరమైన నాయకులను కూడా సమకూర్చి పెట్టింది. నయా బూర్జువా వర్గంతో, నూతన పాలనా వ్యవస్థ పట్ల ఇంకా శత్రుభావంతో ఉన్న సాంప్రదాయక బూర్జువా శ్రేణులతో రైతాంగం జత కడితే వచ్చే ప్రమాదాన్ని ఎవరూ తక్కువ చేసి చూడలేదు. సాంప్రదాయక బూర్జువా వర్గానికి, బహుశా, ఆ నాటికి తిరుగులేని ఆర్థిక, సైనిక ఆధిక్యత కలిగిన పెట్టుబడిదారీ దేశాల మద్దతు ఉంది. నూతన ఆర్థిక విధానం ఇంకా పూర్తిగా దృఢత్వం చేకూరని పాలనా వ్యవస్థ అడుగున అమర్చిన మందు పాతర లాంటిది. లెనిన్ దానిని బహిరంగంగా అంగీకరించినా లేక తిరస్కరించినా అటువంటి ప్రమాదం సంభవించే అవకాశం గురించి మిగతా అతివాదుల కంటే ఈయన తక్కువ పట్టించుకున్నదేమీ లేదు. నూతన ఆర్థిక విధానం ముందుగానే గెలుచుకున్న పందెం కాదు, ప్రజలు వాళ్ళని వాళ్ళు "గెలుపెవరిది" అని ప్రశ్నించుకోసాగారు; లెనిన్ కూడా అదే ప్రశ్న వేశాడు. అయితే ఈసారి ఈ ప్రశ్న దేశ అంతర్గత పరిస్థితికి సంబంధించింది.

ఈలోగా, ఎట్టకేలకు శాంతియుత నిర్మాణ కాలాన్ని సాధించే ఆశతో బోల్షివిక్కులు గణనీయమైన కృషి చేశారు. 1921 మార్చి నుండి, అంటే నూతన ఆర్థిక విధానం ప్రవేశపెట్టిన నాటి నుండి 1922లో పంటలు బాగా పండటం వల్ల ఆశావహమైన పరిస్థితి ఏర్పడటం, రైతులను కొంత మేరకు సంతృప్తి పరచటం వరకు, పరిపాలనలో గతంలోని వైఫల్యాలకు పరిష్కారాలను, నూతన పరిపాలనా పద్ధతులను కనుగొనేందుకు గట్టి కృషి జరిగింది. అయితే అదే కాలం అతివాదుల్లో గొప్ప సైద్ధాంతిక గందరగోళానికి అలవాలమయ్యింది. గతంలోని అనేక భావనలు, సిద్ధాంతాలు వాస్తవ పరిస్థితుల ఒత్తిడి మూలంగా పటాపంచలయ్యాయి. అక్టోబరు విప్లవపు అసలైన స్వరూప స్వభావాలు ఏమిటనే ప్రధాన ప్రశ్నను పునఃపరిశీలించవలసిన అవసరం ఏర్పడింది. ఆ గందరగోళం నుండి లెనిన్ కూడా తప్పించుకోలేక పోయాడు; దాని బాధితునిగా వుంటూనే ఈయన దానిని గుర్తించగలిగాడు. నవంబరు 1917 నుండి 1918 జనవరి 5 (రాజ్యాంగ సభ)[9] మధ్య కాలంలో విప్లవం బూర్జువా - ప్రజాస్వామికంగా సాగిందని, అప్పుడు కార్మిక ప్రజాస్వామ్యాన్ని నెలకొల్పటంతో సోషలిస్టు దశ ప్రారంభమైందని లెనిన్ ఆగస్టు

1921లో రాశాడు. అయితే 1918 శిశిర ఋతువులో ప్రస్తావించిన కాలక్రమాన్ని పోలిన మరో కాలక్రమాన్ని అదే వ్యాసంలో పొందుపరిచాడు : దాని ప్రకారం గ్రామీణ ప్రాంతంలో కులక్కులపై[10] పేదల కమిటీ లేదా "కాంబెడీ"[11] ఉద్యమపు వర్గ పోరాటం విజయం సాధించడంతో సోషలిస్టు దశ ఆరంభమైంది. అయితే 1918 ముగిసేప్పటికి "కాంబెడీ" రద్దు చేయబడిందనే విషయాన్ని మనం మర్చిపోకూడదు. (సమగ్ర రచనలు – సంపుటం : XLIV లో ఆగస్టు 1921లో ఈ వ్యాసం ముద్రించబడింది–పుటలు : 101–102). 1918 నవంబరు 6న సోవియట్ల కాంగ్రెస్‌లో లెనిన్ ఇలా ప్రకటించాడు. "పట్టణాలలోని అక్టోబరు విప్లవం, 1918 ఆకులు రాలే కాలానికి గ్రామీణ ప్రాంతాల నిజమైన అక్టోబరు విప్లవం అయింది. (సమగ్ర రచనలు – సంపుటం : XXXVII – పుట : 144). పై వ్యాసం రాసిన రెండు మాసాలకు, అక్టోబరు 1921 లో మరో కాలక్రమణిక వెలుగులోకొచ్చింది. ఈసారి విప్లవంలోని బూర్జువా – ప్రజాస్వామ్య దశ 1921లో మాత్రమే పూర్తయినట్లు చూడబడింది. ఆ తరువాత కొద్ది కాలానికి కొంచెం భిన్నమైన మరో కథనం : అక్టోబరు విప్లవం సంపూర్ణం శ్రామిక విప్లవమే ; అయితే అది బూర్జువా – ప్రజాస్వామిక విప్లవపు కర్తవ్యాలను యాదృచ్ఛికంగా సాధించింది. (సమగ్ర రచనలు – సంపుటం : XLIV – పుటలు : 102, 145,147). ఈ సందిగ్ధతలను గురించి నిజానికి ఆశ్చర్యపోవలసిందేమీ లేదు; అక్టోబరు విప్లవపు దీర్ఘకాలిక ఫలితాలు మాత్రమే దాని వాస్తవ స్వభావాన్ని నిర్ధారించగలవు. మరో అంశం : సిద్ధాంతపరంగా నూతన ఆర్థిక విధానాన్ని సమర్థించేదెలా? దానికి ఎటువంటి వ్యూహాత్మకమైన నిర్వచనం ఇవ్వగలం ? పూర్వ దశతో పోలిస్తే అది "తిరోగమనం" అవుతుందా – ఇది వాస్తవమైతే, అప్పట్లో మహా అయితే అపరిమితమైనవిగా భావించబడిన 'యుద్ధ కమ్యూనిజం" లక్ష్యాలను, పద్ధతులను పార్టీ వదులుకున్నట్లు కాదు. లేదా, దానికి విరుద్ధంగా, 1918వ సంవత్సరం వసంత ఋతువులో పార్టీ అనుసరించిన మరింత సరైన పంథాకి తిరిగి వచ్చేట్లయితే, అది "యుద్ధ కమ్యూనిజం"ను అప్పటి తక్షణ పరిస్థితులలో అనుసరించిన తాత్కాలిక విధానంగా పరిగణించినట్లవుతుంది. అయితే ఆ విధానం అధిక భాగం తప్పని ఋజువయింది. ('ది బోల్షివిక్ రివల్యూషన్ : 1917–1923' – రచయిత : ఇ.హెచ్.కార్ – సంపుటం: II – పుటలు : 273–278). ఈ రెండు భావాల విషయంలో లెనిన్ ఏమీ స్పష్టంగా తేల్చి చెప్పలేదు ; అయితే ఆయన చివరి ప్రసంగంలో మాత్రం "తిరోగమనం" వాదనను తిరిగి ప్రస్తావించాడు. (సమగ్ర రచనలు – సంపుటం : XLV - పుట : 302).

ఇదంతా నూతన ఆర్థిక విధానాన్ని తగినంతగా వివరించజాలదు. సుదీర్ఘ కాలం పట్టే ఈ పరిణామ క్రమం తొలి దశలో వ్యూహాత్మక తిరోగమనం తదుపరి దశలో జరిగే ఒక పురోగమనానికి పూర్వరంగంగా అవసరమవుతుంది. అయితే లెనిన్

"రాజ్య పెట్టుబడిదారీ విధానం (స్టేట్ కాపిటలిజం)" సిద్ధాంతాన్ని ముందుకు తీసుకురావటం ద్వారా ఆ గందరగోళంలో కొంత క్రమబద్ధతను ప్రవేశపెట్టే ప్రయత్నం చేశాడు. దానిని ఆయన నూతన ఆర్థిక విధానాన్ని ఆరంభించే సమయంలో రాసిన "ఆన్ టాక్సేషన్ ఇన్ కైండ్" అనే కరపత్రంలో పొందుపరిచాడు. దీనర్థం "సోషలిస్టు ప్రారంభ దశ" సిద్ధాంతం పరిత్యజింపబడిందని కాదు. "రాజ్య పెట్టుబడిదారీ విధానం" అనే సిద్ధాంతాన్ని అంతకు పూర్వమే ఫిబ్రవరి విప్లవం (జారు రాచరికాన్ని కూలద్రోసి బూర్జువా వర్గ పాలనకు దారి తీసిన ఫిబ్రవరి 1917 లో జరిగిన విప్లవం-ప్రచురణ కర్తలు) తరువాత, తిరిగి 1918 ప్రారంభంలోను వాడుకలోకి తీసుకురావటం జరిగింది. దానికి స్ఫూర్తి విస్తృతంగాను, నిక్కచ్చిగాను ప్రభుత్వ అజమాయిషీలో కొనసాగిన జర్మన్ యుద్ధ ఆర్థిక వ్యవస్థ. సోవియట్ ఆర్థిక వ్యవస్థ విషయానికొస్తే చాలా తేడా ఉంది : రాజ్యం పెట్టుబడిదారీ స్వభావాన్ని కాక కార్మిక వర్గ స్వభావాన్ని కలిగి వుంది. అది ప్రధాన ఆర్థిక స్థానాలన్నింటిని ప్రత్యక్షంగా తన ఆధీనంలో వుంచుకుంది.

రష్యన్ పెట్టుబడిదారుల నుండి, అంతకు మించి విదేశీ బడా పెట్టుబడిదారుల నుండి సహకారం ఆశిస్తున్నందున లెనిన్ "రాజ్య పెట్టుబడిదారీ విధానం" అనే పదం వాడాడు. అంత వరకు కార్మిక రాజ్యం సాధించలేకపోయిన మేధోపరమైన సామర్థ్యాలను, పెట్టుబడిని సమకూర్చుకొనేందుకు, సాంకేతిక నైపుణ్యాలను, నిర్వహణాపరమైన పద్ధతులను ఇముడ్చుకునేందుకు దీర్ఘకాలపు పెట్టుబడిదారీ తరహా అభివృద్ధి రష్యాకు అవసరమని లెనిన్ భావించాడు. అయితే సుస్పష్టమైనదేమంటే, రాజ్యం నిరంతరం అప్రమత్తంగా వుంటూ పర్యవేక్షణకు, నియంత్రణకు అవసరమయ్యే పద్ధతులను రూపొందించుకొని తీరాలి. ఆ విధంగా లెనిన్ "విదేశీ సాయం"తో సోషలిజాన్ని నిర్మించాలనుకున్నాడు. ఇందుకుగాను ప్రతిపాదనలను వాళ్ళకు ఆమోదయోగ్యంగా ఉండేట్లు చేస్తే వాళ్ళు త్రోసిపుచ్చరని భావించాడు. ఈ సిద్ధాంతంలో వున్న మరో ప్రత్యేకమైన అంశం వల్ల దానిని అంగీకరించే విషయంలో ప్రియోబ్రజన్‌స్కీ, బుఖారిన్, ట్రాట్‌స్కీ, ఇంకా ఇతర నాయకులు విమర్శనాపూర్వకంగా లేదా అంటీ ముట్టనట్లుగా ఉన్నారు. రాజ్యానికి ప్రధాన శత్రువులుగా బడా పెట్టుబడిదారులను కాక రాజ్యపు ప్రణాళికకు, నియంత్రణకు లోబడక అనియంత్రితంగా, చీలికలు పేలికలుగా ఉండే పెట్టీ బూర్జువా శ్రేణులను లెనిన్ పరిగణించాడు. పెద్ద స్థాయిలో నిర్వహించగల సామర్థ్యం, ప్రణాళికాబద్ధత పట్ల సానుకూల దృష్టి, క్రమశిక్షణ పట్ల స్పృహ లాంటి బడా పెట్టుబడి లక్షణాలు ప్రగతికి ఉపయుక్తమౌతాయి. అందువల్ల శ్రామిక రాజ్యం దానితో సంధి కుదుర్చుకుని అప్పటికే అస్థిరత్వానికి లోనైన పెట్టీ బూర్జువాల ప్రమాదకరమైన ప్రభావంపై పోరాటం సలపాలి. లెనిన్ ఇలా అన్నాడు : "పెట్టీ బూర్జువా వర్గానికి వ్యతిరేకంగా కార్మిక రాజ్యం 'రాజ్య

పెట్టుబడిదారీ విధానం'తో కూటమి లేదా కలయికను రూపొందించాలి.'' అదే సంవత్సరంలో ఇంతకు మునుపు 1918లో వ్యక్తీకరించిన అభిప్రాయాన్ని లెనిన్ ఉటంకించాడు; "మన దేశంలో సోషలిజానికి ప్రధాన శత్రువు పెట్టీ బూర్జువా వర్గమే" (సమగ్ర రచనలు – సంపుటం : XLIV– పుట : 108 మరియు సంపుటం : XLIII – పుట :206).

ఇక్కడ మనం ప్రధానంగా గమనించవలసిన అంశమేమిటంటే పెట్టీ బూర్జువాలుగా పేర్కొనబడిన వాళ్ళు రైతాంగం తప్ప వేరొకళ్ళు కాదు. మౌలికమైనదిగా పరిగణింపబడిన, పదే పదే నినాదాలలో నొక్కి చెప్పబడిన, వ్యూహాత్మక అవసరంగా భావించబడిన రైతాంగంతో మైత్రి ఇప్పుడు ఏమయింది? చరిత్ర గతిలో తన ధోరణికి అనువైన పద్ధతులలో స్టాలిన్ ఈ గహరమైన వైరుధ్యాన్ని పరిష్కరించాడు. లెనిన్ వేరే పరిష్కారాలు ప్రతిపాదించాడు కాని, వాటిని అమలులోకి తేలేకపోయాడు.

సమీప భవిష్యత్తులో "రాజ్య పెట్టుబడిదారీ విధానం" అనే సందేహాత్మక సిద్ధాంతం ఒక విచిత్రమైన పరిణామానికి లోను కావలసి వచ్చింది. అది ఏక కాలంలో అనేక విధులను నెరవేర్చడానికి ఉద్దేశించబడింది : మొదటిది సోవియట్ సమాజానికి ఉన్నట్లు చెప్పబడిన సోషలిస్టు స్వభావం పట్ల భ్రమల్ని తొలగించడం; రెండవది అప్పట్లో రష్యాలో జరుగుతూ వున్న పరిణామ దశ స్వభావాన్ని మార్క్సిస్టు పరిభాషలో వివరించి, సోషలిజానికి అనువైన పరిస్థితులు లేని ప్రస్తుత దశ నుండి అది రష్యాను ఏవిధంగా సోషలిజం అనే గమ్యానికి  చేర్చగలదో నిర్వచించడం. పెట్టుబడిదారీ విధానపు అత్యంత పురోగామి రాజకీయ, సామాజిక రూపంగా, ఆ కారణంగా సోషలిజానికి ముందు వచ్చే తక్షణ దశగా, రాజ్య పెట్టుబడిదారీ విధానం అనే భావన వివరణను, సుస్పష్టతను చేకూర్చే పై విధులను నెరవేరుస్తుంది. అలా జరగాలంటే ఆ సిద్ధాంతం రష్యా ప్రత్యేక స్థితిగతులలో ఋజువు కావాలి. కాని రెండు సంవత్సరాల తర్వాత, వాస్తవాలు విరుద్ధంగా ఉండడంతో, దానిని రద్దు చేయవలసి వచ్చింది. బడా పెట్టుబడి సహకారం పొందటంలో వైఫల్యం చెంది, లెనిన్ రైతాంగం సహకారం పొందడం కోసం కృషి ప్రారంభించాడు. ఈ విషయం వద్దకు మనం మళ్ళీ వద్దాం ; ప్రస్తుతానికి మనం నూతన ఆర్థిక విధానం దేశ ఆర్థిక జీవనానికి ప్రయోజనకరంగా నిలిచిందనే వ్యాఖ్యతో సరిపెడదాం; శాంతియుత నిర్మాణ దశ ప్రారంభమయినట్లుగా కనిపించింది కాని అది ఎంత కాలం మనగలదనేది ఎవరికీ ఖచ్చితంగా తెలియదు. ఈ విషయంపై గట్టిగా ఏమీ చెప్పకుండానే, పెట్టుబడిదారీ దిగ్బంధం ఉన్న పరిస్థితులలో శాంతియుత నిర్మాణ దశ "ఎంతో కాలం కొనసాగదనేది సుస్పష్టం" అని లెనిన్ పేర్కొన్నాడు. (సమగ్ర రచనలు – సంపుటం : XLIV – పుట : 9. అయితే మరికొన్ని రచనా భాగాల్లో లెనిన్ ఆశావాదిగా కన్పించాడు).

ఈ ప్రయత్నంలో విజయవంతం అయ్యేందుకు అన్నింటికీ మించి ఆచరణాత్మక విషయాలలో పునఃవ్యవస్థీకరణ అవసరం. అలాంటి సంపూర్ణ నూతన స్థితిలో అనుభవం, మార్గ సూచికలు మరియు కార్యాచరణ ప్రణాళికలను రూపొందించేందుకు అవసరమైన శాస్త్రీయ పునాది కొరవడ్డాయి. రూపు మాపవలసిన తొలి దౌష్ట్యం, అనేక పర్యాయాలు నిరసించబడిన ఉద్యోగస్వామ్యం. "దాన్నెలా సాధించాలో మనకు తెలియదు" అని లెనిన్ అంగీకరించాడు. (సమగ్ర రచనలు – సంపుటం : XLIII - పుట : 234). ఇందుకు కావలసిన చొరవ రాష్ట్రాల నుండి లభిస్తుందని లెనిన్ కొంతకాలం పాటు విశ్వసించాడు. చిన్న పాలనా యూనిట్లలో మంచి పరిపాలనా పద్ధతులు అమలు చేయటం, నేర్చుకోవటం సులువని ఆయనకు అనిపించింది. ఇందుకు కారణం, "ఉద్యోగస్వామ్యంలోని చెడు అంతా సహజంగా కేంద్రంలో గూడు కట్టుకుంటుంద" నే ఆయన అవగాహన. అయితే వాస్తవాలు ఇందుకు విరుద్ధంగా ఉండటంతో లెనిన్ దృక్పథంలో త్వరితగతిన మార్పు వచ్చింది. ఒకవైపున వినాశకర ఉద్యోగస్వామ్య జాగుకు కేంద్ర బిందువైన మాస్కోలోని కార్యకలాపాలను నిరసిస్తూనే, తిరోగమనకారక, అవినీతిమయ స్థానిక ప్రభావాలను, వాటిల్లోని అంతర్గత తగవులను తీవ్రంగా విమర్శించాడు. (సమగ్ర రచనలు – సంపుటం : XLV - పుట : 199). కనుక అగ్రగామి శ్రామికులపై, శ్రామిక మేధావులపై లేదా పార్టీపై ఆధారపడవలసిన అవసరం ఏర్పడింది. కొంతమంది శ్రామికులు, పేద రైతాంగం నుండి నూతన వ్యవస్థకున్న మద్దతు ఆధారంగా, నూతన ఆర్థిక విధానం ద్వారా రైతాంగం నుండి లభించిన తాటస్థ్యాన్ని ఆసరా చేసుకుని సరికొత్త పునాదులపై కొత్త ప్రారంభాన్ని చేపట్టడం సాధ్యం. మేధావి వర్గానికి స్పష్టమైన సైద్ధాంతిక భావాలను అందించి, విస్తృతమైన ప్రభుత్వ బాధ్యతల్ని అప్పగించాల్సి ఉంది. "కార్మికుల శ్రేయస్సు కోసం బల ప్రయోగాన్ని అమలు చేసేందుకు" అవసరమైతే భయోత్పాతాన్ని ఉపయోగించి తీరాలి (సమగ్ర రచనలు – సంపుటం : XXXV – పుట : 110). ఇది 1917లోనే అమలులో ఉన్న పాత సూత్రమే (ఇది 1917 నవంబరు 21న వాడబడింది).

ప్రస్తుతానికి, మేధావుల తొలి ఆయుధమైన సుస్పష్ట ఆచరణాత్మక ప్రణాళిక సిద్ధంగా లేదు. లెనిన్ తన చిట్ట చివరి ప్రసంగంలో "మనం ఎలా పునః వ్యవస్థీకరించు కోగలం?" అని ప్రశ్నించి "మనకింకా తెలియదు" అని సమాధానం కూడా తానే చెప్పాడు. ఎప్పుడైనా అందుబాటులో ఉండే మరో ఆయుధాన్ని, శాంతియుత నిర్మాణం, విపణి ఆర్థిక వ్యవస్థల ఆ కాలానికి అనువుగా మలచుకోవలసి వుంది. లెనిన్ చెకా[12]ను పునర్వ్యవస్థీకరించి, దాని అధికారాలను తగ్గించే పనిని ప్రారంభించాడు. అయితే అత్యంత పెద్ద సమస్య పరిష్కారం కోసం ఇంకా ఎదురు చూస్తూనే ఉంది : అపరిమిత అధికారాన్ని కలిగి వున్న శిష్ట వర్గపు పరిశుద్ధతను కాపాడడం ఎలా ? దాని పతన సంభావ్యతకు వ్యతిరేకంగా హామీలను ఎక్కడ నుండి పొందగలం?

# 3

# గ్రహణం పట్టిన లెనిన్

అంతర్యుద్ధం సమయంలో ఏమీలేని స్థితి నుండి నిర్మింపబడిన శక్తివంతమైన పాలనా యంత్రాంగం బోల్షివిక్ విజయంలో నిర్ణాయక అంశమై నిలిచింది. ఎంత తరచుగా ఎంత తీవ్రంగా దానిని విమర్శించినా దానికదే ఒక విజయమని లెనిన్ అంగీకరించక తప్పలేదు. 1917-1921 మధ్య కాలంలో రాజ్య యుద్ధ యంత్రాంగ నిర్మాణం జరగకుండా విజయం సాధించటం సాధ్యపడేది కాదని ఆయన ప్రకటించాడు. "అదెంతో గొప్ప, ఉన్నతస్థితిని సమకూర్చే కృషి" అని కూడా ఆయన చెప్పాడు. (సమగ్ర రచనలు – సంపుటం : XLIV – పుట : 106). అయితే ఆనాటి రష్యాలో త్వరితగతిన చరిత్ర సృష్టించబడేది; సంక్షోభాలు ఒకదాని తరువాత ఒకటిగా తరుముకు వచ్చేవి. అనుకూల అంశం వెంటనే శాపంగా మారి దుష్ఫలితాలకు దారి తీసేది. యుద్ధ పర్యవసానాలు పార్టీ నాయకత్వ శ్రేణులపై కూడా తీవ్ర ప్రభావం చూపాయి. పార్టీ యంత్రాంగంలో ఉన్నతస్థాయికి ఎదిగిన వారిలో నుండి ఒక ప్రత్యేక తరహాకి చెందిన నాయకులు ప్రాబల్యం సాధిస్తున్నారని అనతి కాలంలోనే స్పష్టమయింది. వాళ్ళు కఠినంగా వ్యవహరించటం తెలుసుకోవలసి వుంది. వాళ్ళు నిర్వహణాకుశలురు కావలసి వుంది. నైతిక గందరగోళానికి గురి కాకుండా యుద్ధ సమయపు నియంతృత్వం వాళ్ళకు అందించిన పలు అధికారాలను చలాయించగలమని చూపవలసి వుంది. ఎందుకంటే, విచక్షణ, తటపటాయింపులకు తావివ్వకుండా ఎట్టి పరిస్థితులలోను విజయం సాధించగల సామర్థ్యం వారి నుండి కోరబడింది. యుద్ధ పరిసమాప్తి అది ముగిసిందన్న ఊరడింపును కలగచేయలేదు. తదుపరి రెండు సంవత్సరాలలో మాత్రమే ఒక నూతన దశ ఆరంభమయిందన్న భావన ఏర్పడింది. సంక్షోభాన్ని నివారించే అత్యవసర చర్యగా నూతన ఆర్థిక విధానం ప్రవేశపెట్టబడింది. కనుక ప్రభుత్వ యంత్రాంగం కొంతకాలం పాటు పూర్వం మాదిరిగా పనిచేయటం సహజమే. అంతర్యుద్ధం తరువాతనే పార్టీలో ముఠాలు నిషేధించబడ్డాయన్న వాస్తవం అప్పటి మానసిక స్థితి మనుగడ కోసం పోరాటాన్ని సూచిస్తోందని స్పష్టంగా తెలియచేస్తుంది. అనేకమందిని సెక్రటేరియట్, సెంట్రల్ కమిటీల నుండి తొలగించటం కాని, వాళ్ళకై వాళ్ళు వదిలి వెళ్ళటం గాని జరిగింది. వాళ్ళలో ముగ్గురు సెంట్రల్ కమిటీ

కార్యదర్శులు – క్రెస్టిన్‌స్కీ, ప్రియోబ్రజన్‌స్కీ, సెరెబ్రియాకోవ్ – ఉన్నారు. వాళ్ళు ముగ్గురు భవిష్యత్తులో ఏర్పడబోయే అతివాద ప్రతిపక్ష బృందం (లెఫ్ట్ అపోజిషన్) లో సభ్యులు. తదుపరి స్టాలిన్ ప్రక్షాళనకు గురయిన వాళ్ళు. కగనోవిచ్, ఉగ్లనోవ్, యూరోస్లావ్‌స్కీ, మాలటోవ్‌లు పై స్థానాలకు ఎదగడం గమనార్హం. వీళ్ళంతా భవిష్యత్ స్టాలినిస్టులు. వాస్తవవాద, ఆచరణాత్మక కార్యశూరులు. (ఉగ్లనోవ్ అతివాద ప్రతిపక్ష బృందాన్ని అణచివేయడంలో తొలుత స్టాలిన్‌కి బాగా తోడ్పడినా 1928లో బుఖారిన్ అనుయాయుడిగా మారాడు).

పార్టీ కాక, రాజ్య పాలనా యంత్రాంగం మాత్రమే దేశానికి భద్రతా వ్యవస్థగా మిగిలిన పరిస్థితిని అంతర్యుద్ధం కల్పించింది. మిగతావన్నీ పునర్నిర్మించవలసిందే, పునరాలోచించవలసిందే. అయితే పాలనా యంత్రాంగం, పూర్వం కంటె ఎక్కువగా పార్టీ యంత్రాంగం మరింతగా నియంతృత్వపు కాఠిన్యం దిశగా సాగిపోతున్నాయి. మొదట్లో ఈ విధానం లెనిన్ కోరుకున్న దానికి అనుగుణంగానే ఉంది. రాను రాను, అప్పుడప్పుడు లెనిన్‌కి తెలియకుండాను, కొన్ని పర్యాయాలు ఆయన అభీష్టానికి వ్యతిరేకంగాను పార్టీలో నియంతృత్వ ధోరణులు ప్రబలుతూ వచ్చాయి. అయితే వీటిని ఎదుర్కొనేందుకు లెనిన్ పూర్తిగా సన్నద్ధుడై లేడు; ఎందుకంటే మూడు భయానక సంవత్సరాల పాటు సాగిన యుద్ధం, పోరాటం, పని ఒత్తిడి, ఆందోళనల వల్ల లెనిన్ అనారోగ్యం పాలయ్యాడు.

1921వ సంవత్సరాంతానికి అనారోగ్యం తీవ్రమయింది. ఫలితంగా ఎన్నో వారాలు విశ్రాంతి తీసుకోవలసి వచ్చింది. తరువాత సంవత్సరం పూర్వార్థంలో ఈయనలో పని చేసే శక్తి సన్నగిల్లింది. అది నిరంతరాయంగా దిగజారసాగింది. 1922 మే 25న ఆకస్మిక విపత్తు సంభవించింది. లెనిన్ కుడి చేయి, కుడి కాలు చచ్చుబడ్డాయి. మాట దాదాపు పడిపోయింది. ఈయన కోలుకోవటం నిదానంగా, మందకొడిగా సాగింది. లెనిన్ ట్రాట్‌స్కీతో తరువాత ఇలా అన్నాడు –– "నీకు అర్థమయ్యే వుంటుంది; నేను మాట్లాడటంగాని, వ్రాయటం గాని  చేయలేని స్థితి వచ్చింది. నేను తిరిగి అంతా నేర్చుకోవలసి వచ్చింది." ('మై లైఫ్' – రచయిత : ట్రాట్‌స్కీ – సం॥ : 1930 – పుట : 475). దృఢమైన శరీరతత్వం ఆయన్ని మరోమారు రక్షించింది. అయితే ఈయన అక్టోబరు 2 వరకు తిరిగి పనిలోకి ప్రవేశించలేదు. తిరిగి పరిపూర్ణ ఆరోగ్యం ఎన్నటికీ చేకూరలేదు. నిస్త్రాణత, శారీరక అసౌకర్యం వంటి లక్షణాలు, తరచుగా సమావేశాలకు హాజరు కాలేకపోవటం, చివరిసారి వచ్చిన పక్షవాతపు తీవ్రత సోవ్నర్కోమ్, పొలిట్‌బ్యూరో సభ్యులు గమనించకపోలేదు. లెనిన్ వారసుడెవరన్నది ఉన్నత నాయకత్వం బృందంలో బహిరంగంగా చర్చించబడింది. అనారోగ్యం తరువాత లెనిన్ మొదటిసారి ప్రజల

ముందుకు వచ్చి కనిపించటం ఆయన్ని ఎంతో ప్రయాసకు గురి చేసింది. ఆల్‌ఫ్రెడ్ రోజ్‌మర్ ఈయన్ని 1922 నవంబరు 13న ఇంటర్నేషనల్[13] నాల్గవ మహాసభలో వేదికపై చూచిన తరువాత ఇలా అన్నాడు :

"తొలిసారిగా ఆయన్ని చూస్తున్న వాళ్ళు 'ఈయన ఎప్పటి లెనినే' అన్నారు. ఇతరులు అటువంటి భ్రమకు లోను కాలేదు. వాళ్ళకు తెలిసిన చురుకైన లెనిన్ స్థానంలో వాళ్ళొక పక్షవాతపు రోగిని చూస్తున్నారు; ఆకృతిలో కదలికలు లేవు; సాధారణ రూపురేఖలు యాంత్రికంగా ఉన్నాయి; మామూలుగా నిరాడంబరంగా, వేగంగా, ఆత్మ విశ్వాసంతో సాగే ప్రసంగానికి బదులుగా తటపటాయింపుతో కూడిన, కుంటుపడుతున్న ధోరణిలో ఆయన ప్రసంగం సాగింది. ఆయనకు సహాయపడే బాధ్యత అప్పగించబడిన కామ్రేడ్ సరిగా చేయలేకపోవడం వల్ల రాడెక్ ఆయన్ని ప్రక్కన పెట్టి తానా బాధ్యతను స్వీకరించాడు."

ప్రజా జీవితంలోకి ఈయన పునరాగమనం ఎక్కువ కాలం కొనసాగలేదు. డిసెంబరు 13 న తిరిగి ఆయన అస్వస్థతకు గురయ్యాడు. ఈసారి ఖచ్చితంగా ఆయన రాజకీయాల నుండి విరమించవలసి వచ్చింది. దీనిని బట్టి ఈయన 1922వ సంవత్సరంలో పోషించిన పాత్ర చాలా పరిమితమైనదన్న విషయం స్పష్టం. సోవియట్ యూనియన్ చరిత్రలోని ఆ కీలక దశను అర్థం చేసుకునే ఏ ప్రయత్నానికైనా ఈ వాస్తవాన్ని గుర్తించటం అవసరం. పూర్వాలోచన కంటే ఎక్కువగా పరిస్థితుల ప్రాబల్యం వల్ల లెనిన్ ఆధ్వర్యంలో రూపు దిద్దుకున్న ప్రభుత్వ యంత్రాంగం ఇప్పుడు ఆయన ప్రమేయం లేకుండా పనిచేయడం కొనసాగించింది. పొలిట్‌బ్యూరోలోని లెనిన్ సహచరులు స్వంత నిర్ణయాలు చేయడానికి అలవాటు పడ్డారు. ఈ స్వాతంత్ర్యాన్ని వాళ్ళు ఆస్వాదించసాగారు. ఇది వాళ్ళకు "పెద్దాయన" లేనందువల్ల లభించింది. అయితే వాళ్ళ ప్రవర్తన, పని తీరు అంతా కూడా పూర్వపు అనుభవం, ఆచరణల ఆధారంగానే కొనసాగింది.

1922వ సంవత్సరపు ప్రారంభంలో జనరల్ సెక్రటరీ పదవికి స్టాలిన్ అభ్యర్థిత్వాన్ని అంగీకరించటమే గాక బహుశా లెనినే స్టాలిన్ పేరును సూచించి కూడా ఉండవచ్చు. అయితే అప్పటికి ఈ పదవి తరువాత కాలంలో పొందిన ప్రాముఖ్యాన్ని ఇంకా పొందలేదు. ఆ సంవత్సరం గడుస్తున్న కొద్దీ ప్రాముఖ్యాన్ని సంతరింపజేసుకో సాగింది. అది లెనిన్‌ను కూడా ఆశ్చర్యపరచింది. లెనిన్ కార్యరంగంలో లేకపోవడం ఇందుకు ప్రధానంగా దోహదం చేసింది. లెనిన్ పని విషయంలో తన సామర్థ్యాన్ని కోల్పోతున్న కొలదీ, రాజ్య వ్యవహారాల నిర్వహణపై అధికాధికంగా ఆయన పట్టు సడలిన కొద్దీ, స్టాలిన్ స్వేచ్ఛ, ఆత్మ విశ్వాసం పెంపొందసాగాయి. ఈ పరిస్థితి తరచుగా లెనిన్‌ని కూడా వ్యతిరేకించడానికి దారి తీసింది. స్టాలిన్ తన చుట్టూ తనకి కావలసిన వాళ్ళని

చేర్చుకోసాగాడు. వాళ్ళు అంతర్యుద్ధ కాలంలో ఏర్పడిన ఒక తరహా కుట్రపూరిత ముఠాకి చెందిన వాళ్ళు. పొలిట్‌బ్యూరోలోని కొందరు సభ్యులకు ఈ సంగతి తెలియనే తెలియదు. అయితే ఎవరయినా "విదేశీ వాణిజ్యం" వ్యవహారాన్ని పరిశీలించినా లేదా అంతకంటె చిక్కు సమస్య అయిన జార్జియన్ ఘర్షణను పరిశీలించినా ఈ విషయం తేటతెల్లమవుతుంది. ఈ రెండు సందర్భాల్లో కూడ తన విధానాలను రక్షించుకోవటానికి లెనిన్ తన సహచరులతో పోరాటం చేయవలసి వచ్చింది. సోవియట్ ప్రభుత్వ అధినేత ప్రాభవం కోల్పోతున్న తరుణంలో పాలనా వ్యవస్థ ఎదుర్కొన్న సమస్యలకు ఈ రెండు ఘటనలు దర్పణం పడుతున్నాయి.

1921 సంవత్సరాంతానికి విదేశీ వాణిజ్య గుత్తాధిపత్యపు సమస్య మరింత తీవ్రమయ్యింది. రీగా సంప్రదింపుల్లో సోవియట్ ప్రతినిధి మిల్యుటిన్ ఈ గుత్తాధిపత్యం రద్దు చేయబడుతుందని వాగ్దానం చేయడం ఇందుకు కారణమయింది. (సమగ్ర రచనలు – సంపుటం : XLIV – పుటలు : 562–563). ఆ విధంగా చెప్పమని ఆయన్ని ఎవరు ఆదేశించారో తెలియదు. అయితే పార్టీ నాయకుల్లో అత్యధికులు బహుశ ఈ సమస్యకు నూతన ఆర్థిక విధానపు సాధారణ స్ఫూర్తితో పరిష్కారాన్ని కనుగొనదలిచారు. బుఖారిన్, సోకోల్నికోవ్, ఫ్రంకిన్, మరికొందరు విదేశీ వాణిజ్య కమిస్సారియెట్‌కి అంతర్జాతీయ ఆర్థిక మార్పిడులను విజయవంతంగా నిర్వహించగల సామర్థ్యం వున్నదా అన్న విషయంలో అనుమానాలు వ్యక్తం చేశారు. అటువంటి లావాదేవీలు వెనువెంటనే ప్రారంభం కావాలని ఆతృత పడ్డారు. దాని కోసం గుత్తాధిపత్యం విషయంలో కొన్ని రాయితీలు ఇవ్వటమో లేదా దానిని పూర్తిగా రద్దు చేయటమో జరగాలని ప్రతిపాదించారు. ఈ రెండింటిలో ఏదో ఒకటి చేయాలనే విషయంలో స్టాలిన్ కూడ సుముఖంగానే ఉన్నాడు. అయితే లెనిన్ దానిని పెద్ద తప్పిదంగా, దేశ ప్రయోజనాలకు భంగకరమైన ఆమోదయోగ్యం కాని ప్రతిపాదనగా పరిగణించాడు. ఆయన అభిప్రాయంలో విదేశీ ఎగుమతిదారులకు దేశంలోని ప్రైవేటు వ్యాపారులతో ప్రత్యక్ష సంబంధాన్ని కలిగివుండే అవకాశం కల్పించడం అవివేకమే కాక ప్రమాదభరితం కూడ. ఎందువల్లనంటే "విదేశీయులు దేన్నైనా కొనుగోలు చేసి తమ దేశానికి తరలించవచ్చు." అయితే ప్రస్ఫుటంగా కన్పించే వాదన రష్యాకు సిసలైన సామాజిక పునాది అయిన రైతాంగానికి సంబంధించింది. దొంగ రవాణాదారులెలాగూ వాణిజ్య గుత్తాధిపత్యాన్ని భగ్నం కావిస్తారనే అంశాన్ని గుత్తాధిపత్యం విషయంలో రాయితీ కోరుకునేవారు నొక్కి చెప్పారు. అలా కోరుకునేది కొద్దిమంది నిపుణులు మాత్రమేనని, అయితే "తమ ప్రయోజనాలకు భంగం కలిగించే ప్రభుత్వానికి వ్యతిరేకంగా ఏకత్రాటిపై నిలిచి పోరాడే రైతాంగంతో వ్యవహరించడం" పూర్తిగా భిన్నమైన

విషయమని లెనిన్ పేర్కొన్నాడు. (కామెనెవ్‌కు రహస్య లేఖ – మార్చి 3, 1922 – తొలిసారిగా 1959లో ప్రచురించబడింది. సమగ్ర రచనలు – సంపుటం: XLIV – పుట : 427. అక్టోబరు 13, 1922న స్టాలిన్‌కి రాసిన లేఖ కూడ చూడండి – 1950లో ప్రచురించబడింది. సమగ్ర రచనలు – సంపుటం: XLV – పుట: 221).

తన అభిప్రాయాలు సరైనవేనని సెంట్రల్ కమిటీని ఒప్పించే ప్రయత్నంలో లెనిన్ ఋజువుపై ఋజువు చూపాడు. గుత్తాధిపత్యాన్ని సడలింపు లేకుండా నిర్వహించగలిగితే అది దేశ ఆర్థిక వెనుకబాటుతనానికి పరిష్కారం కాగలదు. అంతర్జాతీయ విపణిలో పరిస్థితులు రష్యన్ వ్యవసాయ ఉత్పత్తిదారులకు అనుకూలంగా ఉన్న విషయం ప్రత్యేకించి చెప్పనవసరం లేదు. విదేశీయులకు కల ప్రత్యేక ధరలు చెల్లించి కొనే శక్తిని పరిగణనలోకి తీసుకోవాలి. గుత్తాధిపత్యాన్ని ఏ మాత్రం సడలించినా ఇప్పటికే బలహీనంగా ఉన్న జాతీయ పరిశ్రమలు నాశనమవుతాయి. ఈ పరిస్థితి సోవియట్ అధికారానికి వ్యతిరేకంగా ఒక ప్రక్క అంతర్జాతీయ పెట్టుబడిదారీ శక్తులు మరియు రష్యన్ వాణిజ్యవేత్తలకు, మరోప్రక్క రష్యన్ రైతాంగ బాహుళ్యానికి మధ్య కూటమి ఏర్పడడానికి దారి తీస్తుంది.

మార్చిలో లెనిన్ వాదన విజయం సాధించినట్లు కనిపించింది. అనేక ఉత్తర్వుల ద్వారా విదేశీ వాణిజ్యంపై ప్రభుత్వ గుత్తాధిపత్యం ధృవీకరించబడింది. వాస్తవానికి అది సంధి కంటే మరింకేమీ కాదు. లెనిన్ కొంత మేరకు ఆందోళన చెందుతూనే గ్రహించాడు: ప్రభుత్వ వర్గాలు, పార్టీ సెంట్రల్ కమిటీ ఈ విషయాన్ని విడవకుండా చర్చిస్తూనే ఉన్నారు; చేసిన నిర్ణయాలను ప్రశ్నిస్తూ చట్టపరమైన మార్పులు తెచ్చేందుకు నిరంతరం నూతన పథకాలను రూపొందిస్తూనే ఉన్నారు. ఈ విధమైన ఎడతెగని సందిగ్ధతల కారణంగా విదేశీ వాణిజ్య వేత్తలతో చర్చల సందర్భంగా సోవియట్ వాణిజ్య ప్రతినిధుల ప్రతిష్ట బాగా దెబ్బ తిన్నది. అప్పట్లో బెర్లిన్‌లో సోవియట్ వాణిజ్య ప్రతినిధిగా ఉన్న క్రిస్టిన్‌స్కీ ఈ విషయాన్ని లెనిన్‌కి చెప్పాడు. ఒకవేళ విదేశీ వాణిజ్య గుత్తాధిపత్యం కనుక రద్దు చేయటం జరిగితే సోవియట్ ప్రభుత్వంతో కాక సోవియట్ వ్యాపారవేత్తలతో మాట్లాడుకోవచ్చని విదేశీయులు వేచి చూడదలిచారు. ఎందుకంటే ఈ రంగంలో సోవియట్ ప్రభుత్వం వాళ్ళకి పూర్తిగా అపరిచితమైనది. లెనిన్ ఎంతో కోపంతో స్టాలిన్‌కి లేఖ రాశాడు. గుత్తాధిపత్య సూత్రాన్ని పునరుద్ఘాటించమన్నాడు. దానికి విరుద్ధంగా ఉండే పథకాలనన్నింటినీ వెంటనే రద్దు పరచమన్నాడు. (స్టాలిన్‌కి 1922 మే 15న రాసిన లేఖ. 1959లో ప్రచురితమైంది. సమగ్ర రచనలు – సంపుటం : XLV – పుట : 188). బహుశా ఈ సందర్భంలోనే స్టాలిన్ తన అభిప్రాయాలతో ఏ మాత్రం ఏకీభవించకుండా, తన వైఖరిని ఇనుమడించిన

ఆత్మ విశ్వాసంతో నొక్కి చెపుతున్నాడని లెనిన్ గుర్తించాడు. లెనిన్ రాసిన లేఖపైనే స్టాలిన్ తన అభిప్రాయాన్ని ఇలా రాశాడు. "ఈ దశలో విదేశీ వాణిజ్య గుత్తాధిపత్యాన్ని బలహీనపరిచే చర్యల్ని గట్టిగా నిరోధించటానికి నేను వ్యతిరేకిని కాను. అయితే గుత్తాధిపత్యం బలహీనపడటం అనివార్యమౌతున్నదని నా అభిప్రాయం." మే 22న పొలిట్‌బ్యూరో లెనిన్ సూత్రీకరణలను ఆమోదించింది. అయితే లెనిన్ తొలిసారి పక్షవాతానికి గురై విధులకు చాలా కాలం దూరంగా ఉన్న సమయంలో గుత్తాధిపత్యానికి వ్యతిరేకంగా ఉన్న వారినే చివరకు విజయం వరించింది. లెనిన్ తిరిగి విధులకు హాజరైన కొద్ది రోజుల తరువాత అంటే అక్టోబరు 6 న సెంట్రల్ కమిటీ విస్తృత సమావేశం ప్రభుత్వ వాణిజ్య గుత్తాధిపత్యాన్ని బాగా కుదిస్తూ సోకోల్నికోవ్ చేసిన ప్రతిపాదనలను ఆమోదించింది. లెనిన్ అస్వస్థత కారణంగా ఈ సమావేశానికి హాజరు కాలేదు. ఈ సమావేశ నిర్ణయాన్ని తన వ్యక్తిగత ఓటమిగా భావించాడు. ఎప్పటి మాదిరిగానే సెంట్రల్ కమిటీ నిర్ణయాన్ని తిరగదోడేందుకు లెనిన్ పోరాట పంథా చేపట్టాడు. వచ్చే ప్లీనరీ సమావేశానికి రంగం సిద్ధం చేయసాగాడు.

తొలిగా ఈ విషయం తరువాత సమావేశంలో తిరిగి చర్చకు వచ్చేందుకు లెనిన్ సెంట్రల్ కమిటీ ఆమోదాన్ని పొందవలసి వుంది. తన లక్ష్యాల సాధనకు పొలిట్‌బ్యూరో సభ్యులకు, సెంట్రల్ కమిటీ సభ్యులకు, సీనియర్ ఉన్నతాధికారులకు ఒకదాని తరువాత ఒకటిగా లేఖలు రాశాడు. స్టాలిన్‌ను, ఇతర నాయకులను కలుసుకున్నాడు. ఎంతో గుంభనగా ప్రభుత్వంలోని ప్రముఖ సభ్యుల మద్దతు కోసం ప్రయత్నించాడు. ఈయన తిరిగి విధులను చేపట్టిన తరువాత ఈ కార్యకలాపాలలోనే అధిక సమయం గడిచిపోయింది. గమనార్హంగా అక్టోబరు 11న ఈయన ట్రాట్స్కీని తన వద్దకు వచ్చి ప్రత్యేకించి ఈ విషయం మాట్లాడి వెళ్ళమని కోరాడు. ఆ తరువాత రెండు రోజులకు అంతకు ముందు తీసుకున్న నిర్ణయాన్ని రద్దు పరచవలసిందిగా స్పష్టంగా కోరుతూ పొలిట్‌బ్యూరో సభ్యులకు జరూరు లేఖ రాశాడు. పొలిట్‌బ్యూరోకు లెనిన్ కోరింది అంగీకరించక తప్పలేదు. లెనిన్ ప్రతిపాదనను సెంట్రల్ కమిటీలో ఓటింగ్‌కి పెట్టడానికి నిర్ణయించింది. మరోసారి లెనిన్ తాజా లేఖపై స్టాలిన్ తన అభిప్రాయాన్ని ఇలా రాశాడు : "విదేశీ వాణిజ్యం గురించి కేంద్ర కమిటీ విస్తృత సమావేశం తీసుకున్న నిర్ణయం సరైనదనే నా అభిప్రాయాన్ని కామ్రేడ్ లెనిన్ లేఖ మార్చలేకపోయింది." (స్టాలిన్ అభిప్రాయం అనుబంధం – IV వద్ద ఇవ్వబడింది). ఎలాగయితేనేం చివరకు సెంట్రల్ కమిటీలోని ఎక్కువమంది సభ్యుల మాదిరిగానే ఆయన కూడ తలవొగ్గి ఈ విషయాన్ని "కామ్రేడ్ లెనిన్ నిర్ణయం మార్పుకు పట్టు పడుతున్న కారణంగా" పునఃపరిశీలించడానికి

అంగీకరించాడు. ఈ విధంగా సెంట్రల్ కమిటీలోని అధిక సంఖ్యాకులు లెనిన్ చేసిన "మనఃపూర్వక విజ్ఞాపన"కు అంగీకారాన్ని తెలియచేయడంతో, జరగబోయే సమావేశానికి ముందుగా మద్దతుదారులను కూడగట్టుకుని సెంట్రల్ కమిటీ సభ్యులను ఒప్పించే ప్రయత్నం చేయడానికి ఆయనకు అవకాశం లభించింది. అయితే ఆయన ఆరోగ్యం క్షీణించసాగింది. ప్లీనంకు హాజరు కాలేననే విషయం ఆయనకు అర్థమైంది. ట్రాట్స్కీ కూడా గుత్తాధిపత్యానికి మద్దతు పలుకుతున్నాడని తెలుసుకుని, తామిద్దరు కలిసి పని చేయాలని డిసెంబరు 12న ట్రాట్స్కీకి ప్రతిపాదించాడు. ట్రాట్స్కీ తన సమ్మతిని వెంటనే తెలియజేశాడు గాని, ఈ అవకాశాన్ని విదేశీ వాణిజ్య క్రమబద్ధీకరణ విషయంలో సోవియట్ ప్రణాళికా సంఘం పాత్రను బలోపేతం కావించాలనే తన గత అభిప్రాయాన్ని మరల ముదుకు తీసుకురావడానికి ఉపయోగించుకున్నాడు. లెనిన్ ప్రణాళికా సంఘం అంశాన్ని ప్రక్కన పెట్టదలుచుకున్నాడు. అందువలన సర్దుబాటు చేసుకునేందుకు సిద్ధంగా ఉన్నట్లు సంకేతాలు పంపి ఊరుకున్నాడు. ట్రాట్స్కీతో సూత్రప్రాయమైన అంగీకారానికి వచ్చిన పిమ్మట, ప్రణాళికా సంఘం పాత్రకు సంబంధించిన అభిప్రాయ భేదాలను ప్రక్కన పెట్టి, విదేశీ వాణిజ్యం విషయంలో ట్రాట్స్కీ తమ ఉమ్మడి అవగాహనను సమర్థించే కర్తవ్యం నెరవేర్చాలని లెనిన్ గట్టిగా అభిప్రాయపడ్డాడు. "ఏది ఏమయినా సరే రానున్న ప్లీనరీ సమావేశంలో మన ఉమ్మడి అభిప్రాయ సమర్ధనకు నువ్వు శ్రద్ధ వహించి కృషి చేయవలసిందిగా నేను మనస్ఫూర్తిగా కోరుతున్నాను." (విదేశీ వాణిజ్యంపై గుత్తాధిపత్యానికి సంబంధించి ట్రాట్స్కీకి లెనిన్ డిసెంబరు 12న మొదటి ఉత్తరం రాశాడు. అదే రోజున ట్రాట్స్కీ సమాధానమిచ్చాడు. మరుసటి రోజు ఈ అంశంపై తమ మధ్య ఉన్న అంగీకారాన్ని ధృవీకరిస్తూ లెనిన్ మరో ఉత్తరం రాశాడు. కాని ప్రణాళికా సంఘం సమస్యపై అనాసక్తత ప్రకటించాడు. ఈ ఇరువురు నాయకుల మధ్య ఉత్తర ప్రత్యుత్తరాలు ట్రాట్స్కీ రాసిన "ద స్టాలిన్ స్కూల్ ఆఫ్ ఫాల్సిఫికేషన్" అనే గ్రంథంలో పొందుపరచటం జరిగింది.) డిసెంబరు 12, 15 తేదీల మధ్య వారిరువురి మధ్య, అలాగే లెనిన్ సిద్ధాంతానికి అనుకూలంగా ఉన్న పలువురు ప్రభుత్వ ఉన్నతాధికారులతో సుదీర్ఘమైన ఉత్తర ప్రత్యుత్తరాలు సాగాయి. (ఈలోగా లెనిన్ ప్రభుత్వ బాధ్యతలనుండి విరమించుకునే ప్రయత్నాలు చేస్తున్నాడనే విషయాన్ని మనం గుర్తుంచుకోవాలి). ఒకవేళ తమ ప్రయత్నం విఫలమైతే తమ వాదనను రాబోయే సోవియట్ల మహాసభ (కాంగ్రెస్) లో కమ్యూనిస్టు బృందం ముందు, అలాగే పార్టీ మహాసభ ముందుంచాలనుకున్నారు.

డిసెంబరు 15 నాటి లేఖని లెనిన్ ఇలా ముగించాడు : "కామ్రేడ్ ట్రాట్స్కీ! మనం సంపూర్ణ అవగాహనకు వచ్చినట్లుగా భావిస్తున్నాను. మన సంఘీభావాన్ని ప్లీనరీ

సమావేశంలో ప్రకటించమని కోరుతున్నాను." తన అనారోగ్యాన్ని, తాను చర్చలో పాల్గొన గలిగేంతవరకు వేచి వుండాల్సిన అవసరాన్ని సాకుగా చూపి ఈ అంశంపై చర్చను ప్రక్కదారి పట్టించడానికి, వాయిదా వేయడానికి మరోసారి ప్రయత్నించడాన్ని పూర్తిగా తిరస్కరిస్తూ తన అభిప్రాయాన్ని పై లేఖలో చివర రాశాడు. "మౌలిక ప్రశ్నలలో ఒకటైన ఈ అంశంపై విధానపరమైన సంపూర్ణ అనిశ్చితికి దారితీసే జాప్యం ఏదైనా పది వేల రెట్లు ఎక్కువగా నన్ను చింతాక్రాంతుడ్ని చేస్తుంది." (సమగ్ర రచనలు - సంపుటం : LIV - పుటలు : 325-326). అదే రోజు స్టాలిన్‌కి, సెంట్రల్ కమిటీలోని మిగతా సభ్యులకు లేఖ రాస్తూ తన పదవీ విరమణకు అవసరమైన చర్యలు గైకొన్నానని ప్రకటించాడు. ఈ లేఖ కమిటీ సభ్యుల్లో సంచలనం కలిగించి ఉండవచ్చు. ఆ లేఖలో లెనిన్ ఇలా రాశాడు. "విదేశీ వాణిజ్య గుత్తాధిపత్యంపై నా అభిప్రాయాలను సమర్థించేందుకు ట్రాట్స్కీతో ఒక అవగాహనకు వచ్చాను." (సమగ్ర రచనలు - సంపుటం : XLV - పుట : 338).

సెంట్రల్ కమిటీలోను, పొలిట్‌బ్యూరోలోను నాయకుల ధ్యాస అంతా రహస్యంగా వారసత్వ సమస్యపై కేంద్రీకృతమయింది. లెనిన్ మద్దతు వల్ల ట్రాట్స్కీకి పరిస్థితి అనుకూలంగా ఉన్నట్లు కనిపించినప్పటికీ, ప్రవాస జీవితంలో లెనిన్ సహచరులలో, రష్యాలో రహస్య జీవితం గడిపిన అతివాదులలో మరింత శతృత్వాన్ని రేకెత్తించడం మాత్రమే ఆయన చేయగలిగాడు. "పాత బోల్షివిక్కుల" దృష్టిలో ట్రాట్స్కీ కేవలం ఒక పొగరుబోతు. భరించనలవిగాని చొరబాటుదారుడు. కనుక లెనిన్ లేఖ తరువాత ఆయనకు వ్యతిరేకంగా మిగతా వాళ్ళు తమ శక్తులను కూడగట్టుకున్నారు. ట్రాట్స్కీ పట్ల ద్వేషం, అతనిని అధికారంలోకి రాకుండా నిరోధించాలనే పట్టుదల పునాదిగా భవిష్యత్తులో ఏర్పడిన స్టాలిన్ - కామెనెవ్ - జినొవీవ్‌ల అధికార త్రయం సరిగ్గా ఈ రోజులలోనే రూపు దిద్దుకోవడం ప్రారంభమైంది. ('ది ప్రాఫెట్ అన్‌ఆర్మ్‌డ్ : ట్రాట్స్కీ 1921-1929' - రచయిత : ఐజక్ డాయిశ్చర్ - ఆక్స్‌ఫర్డ్ యూనివర్శిటీ ప్రెస్ - 1959). వాస్తవానికి లెనిన్ తన లేఖలో రాసిన మరో తుది మాటలో మరింత ముందుకు వెళ్ళి, ఈ అంశంపై చర్చను వాయిదా వేయడం పట్ల తన వ్యతిరేకత మరోసారి నొక్కి చెపుతూ "ట్రాట్స్కీ నా అభిప్రాయాలను నా అంత బాగా సమర్థిస్తాడు" అనే ధీమాని వెలిబుచ్చాడు. (సమగ్ర రచనలు - సంపుటం : XLIV - పుట : 339). అటువంటి ప్రకటనలు పొలిట్‌బ్యూరోలో ఆందోళనను పెంచటమే కాక అపనమ్మకాన్నీ, ఈర్ష్యనీ వ్యాపింపచేశాయి.

డిసెంబరు 18న సెంట్రల్ కమిటీ తన ప్లీనరీ సమావేశంలో లెనిన్‌ని ఎంతగానో ఆందోళనకు గురి చేసిన తన గత నిర్ణయాన్ని రద్దు చేసింది. స్టాలిన్ పూర్తిగా తగ్గి

ఉన్నట్లు ప్రవర్తించాడు. తాను బలహీన స్థితిలో ఉన్నాననుకున్నప్పుడు సాధారణ ఎత్తుగడగా స్టాలిన్ అప్పటికే అనుసరిస్తున్న పద్ధతి ఇది. లెనిన్ పక్కమీది నుండి కదల్లేకపోతున్నా తన విజయంతో మహదానందం పొంది ట్రాట్స్కీని అభినందనలతో ముంచెత్తాడు : "మనం బల ప్రయోగమేమీ చేయకుండానే వ్యూహాత్మకంగా మసలుకోవటం ద్వారా పట్టు సాధించగలిగాం. మనం ఇంతటితో ఆగిపోకుండా దాడిని కొనసాగించాల్సిందే." (సమగ్ర రచనలు – సంపుటం : LIV – పుటలు : 327 – 328). ఈ లేఖ పర్యవసానాలు స్టాలిన్‌ని ఎంతగా ఇబ్బంది పెట్టిందీ తరువాత అవగతమవుతుంది. ప్రస్తుతానికి మనం ఈ "గుత్తాధిపత్యపు సమరం"నుండి కొన్ని నిర్ధారణలకు రావటంతో సరిపెడదాం.

మొదటగా ఏమని చెప్పవచ్చునంటే నూతన ఆర్థికవిధానం అమలుకు చాలా కాలం పట్టగలదని లెనిన్ ఊహించినా అదే సమయంలో అది పాలనకు తెచ్చిపెట్టగల ప్రమాదాలను కూడా గ్రహించాడు. రైతాంగంతో కూటమి రాయితీలు కల్పించకుండా సాధ్యం కాదు. అయితే వేరే కొన్ని జాగ్రత్త చర్యలు తీసుకోకుండా రాయితీలు కల్పించడం కుదరని పని. కనుక విదేశీ వాణిజ్యం విషయంలో స్వేచ్ఛ పనికి రాదు. అటువంటి స్వేచ్ఛ వలన ప్రభుత్వానికి ధరల్ని నియంత్రించేందుకు గాని, వ్యవసాయ ఉత్పత్తిదారులను నియంత్రించేందుకు గాని అవకాశం ఉండదు. అలాగే రైతాంగానికి రాజకీయ స్వేచ్ఛను కల్పించే పరిస్థితి లేదు. "ప్రస్తుత దశలో పెట్టుబడిదారీ విధానం లేకుండా రైతాంగం జీవించలేదు. ఉత్పత్తి సాగించలేదు. అయితే, సోషల్ రివల్యూషనరీల[14], మెన్షివిక్కుల ప్రచారం వినకుండా రైతాంగం జీవించగలదని మా విశ్వాసం." ఈ విషయంలో ఎవరినైనా ప్రలోభపెట్టాలని కాని, మాటల గారడీ చేయాలని కాని లెనిన్‌కి లేదు. "మేము స్వేచ్ఛను గాని, ప్రజాస్వామ్యాన్ని గాని వాగ్దానం చేయటం లేదు." (సమగ్ర రచనలు – సంపుటం : XLV – పుట : 120). ఈ నిరాకరణ తాత్కాలికమైనదిగా ఉద్దేశించబడింది. యుద్ధ భయం ఉన్నంతకాలం, రాజ్య వ్యవస్థ దాడుల నుండి ఇంకా సురక్షితం కానంతకాలం మాత్రమే ఇది అన్వయిస్తుంది. (సమగ్ర రచనలు – సంపుటం : XLV – పుటలు : 53–54).

విదేశీ వాణిజ్య వ్యవహారాన్ని అధ్యయనం చేయడం మనకి తెలియచేసే రెండవ అంశం లెనిన్ నాయకత్వ స్వభావం. లెనిన్ అభిప్రాయాలు కాని, ప్రతిపాదనలు గాని వెనువెంటనే ఆమోదించబడలేదు. ఆ దశలో ఇంకా సిసలైన సమష్టి తత్వం కలిగిన నాయకత్వ శ్రేణిలో తరచు ఇతర సభ్యుల వాదనలకు ప్రతిగా తన అభిప్రాయాలను సమర్థించుకోవలసి వచ్చేది. పార్టీలో లెనిన్ స్థానం తిరుగులేనిదైనప్పటికీ, ముఖ్యంగా పొలిట్‌బ్యూరోలోని ఇతర సభ్యులకు, కొంత మేరకు సెంట్రల్ కమిటీ సభ్యులకు వారి

అభిప్రాయాలను ప్రకటించి, వాటికి మెజారిటీ సభ్యుల ఆమోదం పొందేందుకు ప్రయత్నం చేసే స్వేచ్ఛ ఉండేది. లెనిన్ కూడా, ఇతరుల వలెనే, అంతిమ విజయం సాధించాలంటే, తన ప్రతిపాదనలకు మద్దతు కూడగట్టుకోవలసి వచ్చేది. వ్యూహాల్ని రూపొందించవలసి వచ్చేది. తన ప్రతిపాదనలను వివరించి ఒప్పుదలకోసం కృషి చేయవలసి వచ్చేది. లెనిన్‌కున్న అపారమైన ప్రతిష్ట వల్ల, ఎత్తుగడలలో ఉన్న నైపుణ్యం వల్ల, నచ్చ చెప్పి ఒప్పించే సామర్థ్యం వల్ల, సిద్ధాంతపరమైన సమస్య ఇమిడి వున్నప్పుడు ఎక్కువ సందర్భాలలో లెనిన్ గెలుపొందిన మాట నిజమే. తన ప్రతిపాదనలకు మద్దతుదారులను కూడగట్టుకోవడంలో లెనిన్ ఎంత దూరం వెళ్ళేవాడంటే ఆయన ప్రవర్తించిన తీరు -- ఎవరైనా లెనిన్‌ని ఆ మాట అనే సాహసం చేస్తే -- ముఠాదారు తరహాలో ఉండేది. అయితే పార్టీలో ముఠాలు నిషేధించబడి వుండకపోతే, ఈ పద్ధతులు పూర్తిగా సాధారణమైనవిగా పరిగణించబడి వుండేవి. లెనిన్ తరచు "రష్యా యజమాని (Master of Russia) అని పేర్కొనబడేవాడు. ఈయన తన పార్టీలో నియంత కాదు, దాని నాయకుడు అని మనం స్పష్ట చేయాలి. ఈయన నాయకత్వం ప్రశ్నించరానిది, తిరుగులేనిది అయినప్పటికీ, ఆలోచనకు, నిర్మాణానికి సంబంధించి నిరంతర కృషి సలపవలసి ఉండేది. ప్రతి రోజు తన స్థానాన్ని పునరుద్ఘాటిస్తున్నట్లుగా, పునర్విజయం సాధించినట్లుగా ఆయన కార్యాచరణ ఉండాల్సి వచ్చేది.

సంవత్సర కాలం పాటు కొనసాగిన అనారోగ్యం ఆయన ప్రతిష్ఠను ఏ మాత్రం దిగజార్చలేదు. అయితే వ్యవహారాలపై పట్టు మాత్రం బలహీనపడింది. లెనిన్‌ని వ్యతిరేకించడం తమ స్థానాన్ని బలోపేతం చేసుకోవడానికి మార్గంగా మారింది. స్టాలిన్ ఈ పద్ధతిని ఈ సంవత్సర కాలంలో బాగా వినియోగించుకున్నాడు. ఇటీవల సోవియట్ పత్రాలు వెల్లడి కాక పూర్వం అందరూ అనుకున్నదాని కంటె ఎక్కువగానే స్టాలిన్ ఇలా ప్రవర్తించాడు. మౌలిక ప్రాధాన్యత కల అంశంగా లెనిన్ భావించిన విషయంలో తాను మైనారిటీలో ఉన్నప్పుడు, స్టాలిన్‌కి, ఇతర నాయకులకి వ్యతిరేకంగా ట్రాట్స్కీ మద్దతును కోరేవాడు. తాను ఆపదలో ఉన్నప్పుడు ట్రాట్స్కీ ఆసరా కోరేవాడు. మనం పరిశీలించబోయే రెండవ ఘర్షణ ఈ విషయాన్ని మరింత ప్రస్ఫుటంగా వివరించగలదు.

# 4

# స్టాలిన్, ట్రాట్స్కీ, జార్జియన్లు

1920-1921 మధ్య కాలంలో ఆరు జాతీయ రిపబ్లిక్కుల -- ఉక్రెయిన్, బైలో రష్యా, జార్జియా, అజర్‌బైజన్, అర్మీనియా, రష్యన్ ఫెడరేషన్ -- మధ్య సంబంధాలు స్పష్టంగా నిర్వచింపబడనప్పటికీ, రష్యన్ ఫెడరేషన్ మిగతా అయిదు రిపబ్లిక్కులతో కుదుర్చుకున్న అనేక ద్వైపాక్షిక ఒప్పందాల ద్వారా అవి క్రమబద్ధీకరించబడ్డాయి. ఈ ఒప్పందాల ద్వారా ఆర్థిక, రక్షణ, విదేశాంగ విధానాల్లో సహకారం సాధించబడింది. ప్రతి రిపబ్లిక్ ప్రభుత్వం రష్యా ప్రభుత్వ నిర్మాణానికి సమాంతరమైన నిర్మాణాన్ని కలిగి ఉంది. ఆచరణలో ప్రభుత్వానికి కేంద్రీకృత నిర్దేశనం ప్రతి రిపబ్లిక్‌లోని పార్టీ సెంట్రల్ కమిటీ ద్వారా జరిగేది. అది నిర్దేశించిన ప్రకారం స్థానిక ప్రభుత్వాలు నడుచుకునేవి. అయితే ఇదంతా అంతర్గత పార్టీ క్రమశిక్షణ పేరిట మాస్కోలోని పొలిట్‌బ్యూరో, సెంట్రల్ కమిటీల నిర్ణయాలకు లోబడి జరిగేది. రిపబ్లిక్‌లకి సొంత సైన్యాలను కలిగి వుండే అధికారం ఉన్నప్పటికీ, కేంద్రీకృత సైన్యాన్ని ఏర్పరచడం పాలనా వ్యవస్థలో ఐకమత్యాన్ని, భద్రతని సాధించడంలో తోడ్పడిన రెండవ అంశం.

మనం ఇక్కడ ముఖ్యంగా పట్టించుకోవలసింది మూడు కాకేసియన్ రిపబ్లిక్కులనే. అవి 1920 వరకు సోవియట్‌లో భాగం కాలేదు. జార్జియా విషయంలో అయితే 1921 ప్రారంభం వరకు అలా జరగలేదు. అది కూడ, ఎర్ర సైన్యం ఆయా దేశాల్లోని పారిశ్రామిక కేంద్రాల్లో ప్రబలంగా ఉన్న రష్యన్ శ్రామికవర్గం, స్థానిక కమ్యూనిస్టుల భాగస్వామ్యంతో ఆ దేశాలను జయించడం వల్ల సాధ్యపడింది. ఆర్జోనికిజ్ అంతర్యుద్ధ కాలంలో కాకేసియన్ యుద్ధ రంగంలో రాజకీయ, సైనిక నేతగా ఉన్నాడు. సోవియట్ రాజ్య వ్యవస్థ కోసం ఆ మూడు రిపబ్లిక్కులను సైనికంగా జయించడానికి దిశా నిర్దేశం చేసింది ఆయనే. యుద్ధానంతరం ఆయన అక్కడే ఉండి, పార్టీకి చెందిన కాకేసియన్ బ్యూరో – కావ్‌బ్యూరో– కి అధినేతగా, ఆ ప్రాంతంలో మాస్కో ప్రతినిధిగా వ్యవహరించాడు. సామర్థ్యాన్ని పెంచే లక్ష్యంతో 1921లో లెనిన్ ఈ మూడు రిపబ్లిక్కుల ఆర్థిక సమన్వయాన్ని, ముఖ్యంగా ప్రసార మాధ్యమాలు, తపాల సేవలు, విదేశీ వాణిజ్య రంగాలలో, ట్రాన్స్ కాకేసియన్ ఫెడరేషన్ ఏర్పాటు ద్వారా సాధించడానికి కృషి చేయవలసిందిగా కావ్‌బ్యూరోని కోరాడు.

పార్టీ ప్రాంతీయ నాయకత్వం "జక్రైకామ్" (ట్రాన్స్ కాకేసియన్ ఫెడరేషన్ పార్టీ కమిటీ) అనే పేరుతో వ్యవహరించబడాలన్నాడు. ఆర్జోనికిజ్ ఈ పనిలో ఉత్సాహభరితంగా నిమగ్నమయ్యాడు. అంతర్యుద్ధ సమయంలోను, దాని తదనంతర స్థితిలోను గడించిన అనుభవాన్ని, నేర్చుకున్న పద్ధతులను ఉపయోగపెట్టసాగాడు. ఆయన జార్జియన్ అయినప్పటికీ జార్జియన్ పార్టీ సెంట్రల్ కమిటీ నుండి వ్యతిరేకతను ఎదుర్కొన్నాడు. రష్యాతోను, సోవియట్ వ్యవస్థతోను సంబంధాలను కలిగి వుంటూనే జాతీయ స్వాతంత్ర్యపు ప్రత్యేక లక్షణాలను కాపాడుకోవాలనేది ఈ కమిటీ ఆకాంక్ష.

జాతి, జాతీయతా భావాలు బాగా వేళ్ళూనుకొని ఉండడమే కాక, అతి కొద్ది కాలం క్రితమే బలప్రయోగంతో అణచివేయబడిన మెన్షివిక్ ప్రభుత్వం క్రింద స్వాతంత్ర్యాన్ని అనుభవించి ఉండడం వల్ల, ఈ భావాలు తిరిగి మేల్కొల్పబడిన కాకసస్‌లో ప్రజా మద్దతుని పొందాలని జార్జియన్ కమ్యూనిస్టులు బలమైన కోరికతో ఉన్నారు. అందువల్ల వాళ్ళు పార్టీలోని మరే ఇతర జాతీయ సముదాయం కన్నా ఎక్కువగా సోవియట్ విధానపు పరిధి లోపల స్వేచ్ఛా సూత్రాన్ని బలంగా ప్రతిపాదిస్తున్నారు. పైగా ఆర్జోనికిజ్ పట్ల జార్జియన్లకు గల వ్యతిరేకత ఆయన స్థానిక నాయకుల అభిప్రాయాలను నిరంకుశంగా త్రోసిపుచ్చడం వల్ల మరింత బలపడింది. 1921వ సంవత్సరానికి ఈ వ్యతిరేకత ఎంతగా పెరిగి పోయిందంటే జాతుల యూనియన్ పథకానికి ఇంకా సమయం రాలేదని లెనిన్ అంగీకరించి, ముందుగా ప్రజలలో ప్రచారం ద్వారా తగిన భూమికను ఏర్పాటు చేయాలని భావించాడు. ("ది ఫార్మేషన్ ఆఫ్ సోవియట్ యూనియన్ : కమ్యూనిజం అండ్ నేషనలిజం 1917-1923" - రచయిత : రిచర్డ్ పైప్స్ - హార్వర్డ్ యూనివర్శిటీ ప్రెస్ - 1954). మాస్కో సెంట్రల్ కమిటీ ప్రతినిధికి, జార్జియన్ సెంట్రల్ కమిటీ సభ్యులకు మధ్య ఘర్షణ తీవ్రతరం కాసాగింది. ఈ ప్రతినిధికి పార్టీ జనరల్ సెక్రటరీ పదవి చేపట్టిన పిమ్మట రాజకీయంగా బలపడిన స్టాలిన్ నుండి గట్టి మద్దతు ఉన్నది. జార్జియన్ సెంట్రల్ కమిటీకి మాస్కో సెంట్రల్ కమిటీలో ప్రముఖ సభ్యుడైన మాఖరాజ్ మద్దతు ఉన్నది. అప్పటికి కొద్దికాలం క్రితం వరకు ఈయన జక్రైకామ్‌కి అనుకూలుడు. జగమెరిగిన అంతర్జాతీయవాది. గతంలో లెనిన్‌కి ఎంతో ప్రియమైన జాతుల స్వయం నిర్ణయ సిద్ధాంతాన్ని వ్యతిరేకించినవాడు; అప్పట్లో స్టాలిన్, ఆర్జోనికిజ్‌లు నిరంతరం జార్జియన్లపై మోపుతున్న "జాతీయవాద పెడ ధోరణి" అనే అభియోగాన్ని మాఖరాజ్‌పై సునాయాసంగా మోపడం సాధ్యం కాదు.

ఆ మూడు రిపబ్లిక్కులను ఆర్థికంగా సంఘటిత పరచేందుకు ఆర్జోనికిజ్ చేపట్టిన చర్యల్ని జార్జియన్లు తమకు చేతనైనంత మేరకు ధ్వంసం చేసేవాళ్ళు. జార్జియన్ రిపబ్లిక్

సరిహద్దుల్లో సైనిక కాపలా ఏర్పాటు చేసి నివాస ధృవీకరణ పత్రాలు మొదలైనవి కావాలని డిమాండ్ చేసేవాళ్ళు. ఆర్జోనికిజ్ తిరుగుదాడికి సిద్ధమవుతూ వుండగా, జార్జియన్లు తొలుత విప్లవ సైనిక కమిటీ ద్వారా తదుపరి ఆ రిపబ్లిక్ సోవియట్ల కాంగ్రెస్ ద్వారా వాళ్ళ జాతీయ స్వాతంత్ర్యాన్ని అతిక్రమించడానికి వీలు లేదని గంభీరమైన తీర్మానాలు చేశారు. ఈ తీర్మానాల సమాఖ్య వ్యతిరేక స్వభావం కొట్టొచ్చినట్లు కనిపిస్తున్నది. అయినప్పటికీ మార్చి 1922లో ఆర్జోనికిజ్‌కి విధేయులైన అర్మీనియా మరియు అజర్‌బైజన్ నాయకుల సహకారంతో, జార్జియన్ వ్యతిరేకతను ఖాతరు చేయకుండా, ఫెడరల్ రాజ్యాంగ పథకాన్ని ప్రకటించాడు. దీని ప్రకారం రిపబ్లిక్కుల సార్వభౌమత్వానికి భంగం వాటిల్లకుండానే ఫెడరల్ ప్రభుత్వం స్థాపించబడుతుంది. ఒకవైపు స్టాలిన్, ఆర్జోనికిజ్‌లు, మరోవైపు జార్జియన్ సెంట్రల్ కమిటీ సభ్యుల మధ్య ఘర్షణ మరింత తీవ్రమయింది. మాస్కో ప్రతినిధులు తమ ప్రసంగాలలో జార్జియన్ జాతీయవాద ధోరణులను “కాల్చిన ఇనుముతో” రూపు మాపాలని ప్రకటించారు.

ఈ మొండి, ఘటనామయ పోరాటం 1922వ సంవత్సరమంతా కొనసాగింది. దాని ప్రకంపనలు తరచుగా మాస్కోను తాకేవి. అంతర్జాతీయంగా సోవియట్ రాజ్యం తన స్థానాన్ని నిలబెట్టుకునే ప్రారంభ దశలో రిపబ్లిక్కుల మధ్య వుండే క్లిష్టమైన సంబంధాల వ్యవస్థ వల్ల తలెత్తిన, ఒకే ఒక్కటి కానప్పటికీ, అత్యంత తీవ్రమైన సమస్య ఇది. తత్ఫలితంగా, నాయకులకు దేశపు జాతుల విధానం, వ్యవస్థల గురించి మొత్తంగా స్పష్టత ఇవ్వవలసిన అవసరం ఏర్పడింది. 1922 ఆగస్టు 10న పొలిట్‌బ్యూరో ఆర్గ్‌బ్యూరోను ఒక కమీషన్‌ను నియమించవలసిందిగా కోరింది. ఆ కమీషన్ సెంట్రల్ కమిటీ రాబోయే సమావేశం నాటికి రష్యన్ ఫెడరేషన్‌కి మిగతా రిపబ్లిక్కులకి మధ్య సంబంధాలను క్రమబద్ధీకరించే ప్రణాళికను రూపొందించవలసి వుంది. లెనిన్ అస్వస్థతతో బాధపడుతున్నాడు. వ్యవహారాలపై ఆయన పట్టు తగ్గిపోతూ ఉంది. నాయకులు అసహనంగా ఉన్నారు. ఎటువంటి నిర్ధారణలకు రాబోతున్నారో బహుశా వాళ్ళకి అప్పటికే స్పష్టంగా తెలుసు. ఎందుకంటే పొలిట్‌బ్యూరో నిర్ణయం జరిగిన మరుసటి రోజే కమీషన్ ఏర్పాటు చేయబడింది. దాని నిర్మాణం ఆసక్తిని రేకెత్తించింది. దానిలో స్టాలిన్, క్యుబిషెవ్, ఆర్జోనికిజ్, రాకోవ్‌స్కీ, సొకోల్నికోవ్, బహుశా మాలటోవ్ కూడ, రష్యా ప్రభుత్వ ప్రతినిధులుగా ఉన్నారు. రిపబ్లిక్కుల తరఫున అగమలి –ఓగ్లి (అజర్‌బైజన్), మయాస్నికోవ్ (అర్మీనియా) ఎందివని (జార్జియా), పెట్రోవ్‌స్కీ (ఉక్రెయిన్), చెర్వియకోవ్ (బైలో రష్యా) సభ్యులుగా ఉన్నారు. (సమగ్ర రచనలు – సంపుటి : XLV – పుటలు : 556– 560).

జాతుల మంత్రిత్వశాఖ కమిస్సార్‌గా స్టాలిన్ ఈ కమీషన్‌కి అధ్యక్షుడయ్యాడు.

ఈ పదవిలో ఆయన ఒక సంవత్సరం పాటు కొనసాగాడు. జనరల్ సెక్రటరీగా తన ప్రాబల్యం వల్ల పొలిట్‌బ్యూరో నియమించే కమీషన్ల కూర్పును ఈయన ప్రభావితం చేయగలిగాడు. వాస్తవానికి ఈ కమీషన్‌లో కూడ ఆయన రాజకీయ మద్దతుదారులే అధిక సంఖ్యలో ఉన్నారు. రష్యన్ ఫెడరేషన్‌కి, స్వతంత్ర రిపబ్లిక్కులకి మధ్య నెలకొనవలసిన పరస్పర సంబంధాల గురించి కమీషన్ చేసిన తీర్మానాన్ని స్టాలిన్ స్వయంగా తయారు చేశాడు. ఈ తీర్మానం "స్వయం ప్రతిపత్తి ప్రణాళిక" గా గుర్తింపు పొందింది. ఈ ప్రణాళికలో "స్వతంత్ర రిపబ్లిక్కుల"ను రష్యన్ ఫెడరేషన్‌లో "స్వయం ప్రతిపత్తి కల రిపబ్లిక్"లుగా చేర్చడం ప్రతిపాదించబడింది. ఈ ప్రణాళిక ఇంకా నిర్దేశించేదేమంటే, రష్యన్ ఫెడరేషన్ ప్రభుత్వం, దాని కేంద్ర పాలక మండలి, దాని సోవ్నర్కోమ్ (మంత్రివర్గం) ఇకపై రిపబ్లిక్‌లన్నింటి సముదాయానికి ప్రభుత్వంగా పరిగణించబడతాయి. (స్టాలిన్ ప్రణాళిక పాఠం అనుబంధం -I లో ఇవ్వబడింది).

స్టాలిన్ ప్రణాళిక అన్ని రిపబ్లిక్కుల పార్టీ సెంట్రల్ కమిటీల ఆమోదం కోసం పంపబడింది. అజర్‌బైజన్, అర్మీనియాలు సురక్షితుల చేతుల్లో ఉన్నందున ఆమోదాన్ని తెలియజేశాయి. మిగతా చోట్ల అభ్యంతరాలు ఎదురయ్యాయి. ప్రస్తుతం అనుసరిస్తున్న ద్వైపాక్షిక ఒప్పందాల ఆధారంగా సంబంధాలు కలిగి వుండే విధానానికి తాము మొగ్గు చూపుతున్నామని బైలో రష్యన్ సెంట్రల్ కమిటీ తెలియజేసింది. మాకు లభించిన సమాచారం మేరకు, ఉక్రెయిన్ ఒక నిర్దుష్ట అభిప్రాయానికి రాలేదు. అది ఎందువల్ల అనే విషయం మాత్రం తెలియరాలేదు. (సమగ్ర రచనలు – సంపుటి – XLV – పుట: 556) జార్జియన్ల సమాధానం సుస్పష్టం : వాళ్ళు ఈ పథకానికి వ్యతిరేకం. సెప్టెంబర్ 15న జరిగిన వాళ్ళ సెంట్రల్ కమిటీ సమావేశంలో ఇలా నిర్ణయించారు : "కామ్రేడ్ స్టాలిన్ సూత్రీకరణలు ప్రతిపాదించిన స్వతంత్ర రిపబ్లిక్‌లను స్వయం ప్రతిపత్తి ప్రాతిపదికపై ఏకీకృతం గావించటం అపరిణత అంశంగా పరిగణిస్తున్నాం. ఆర్థిక నిర్వహణ, సాధారణ విధానపరమైన ఏకీకరణ ఆవశ్యకమని మేము భావిస్తున్నాం. అయితే స్వతంత్రతకు సంబంధించిన ప్రత్యేక లక్షణాలన్నీ కొనసాగాలి." (సమగ్ర రచనలు – సంపుటం : XLV– పుట : 556). ఈ నిర్ణయం ఒకే ఒక్క అసమ్మతి ఓటుతో ఆమోదింపబడటంతో ఆర్జోనికిజ్, అతని జక్రేకామ్ వెనువెంటనే స్పందించి స్టాలిన్ పథకానికి ఆమోదం తెలియచేస్తూ తీర్మానించటమేగాక, పార్టీ వ్యవస్థలో వారికున్న ఆధిక్యాన్ని ప్రయోగిస్తూ జార్జియన్ సెంట్రల్ కమిటీని స్టాలిన్ ఉత్తర్వులకు కట్టుబడి వుండమని, మాస్కోతో దానికున్న విభేదాలను బహిర్గతం చేయవద్దని ఆదేశించారు. ('ఫార్మేషన్ ఆఫ్ ది సోవియట్ యూనియన్' – రచయిత : పైప్స్ – పుటలు : 271–72). అదే సమాచార మూలం నుండి జార్జియన్లను

పూర్వ నిర్ణయానికి బద్ధులై వుండేట్లు చేయడానికి ప్రయత్నించడం ఇది మొదటిసారి కాదని కూడా తెలిసింది; స్థానిక కమ్యూనిస్టులకు ఎలాంటి హెచ్చరిక లేకుండా మాస్కో జార్జియాపై దండెత్తి మెన్షివిక్ ప్రభుత్వాన్ని కూలద్రోయాలని నిర్ణయించినప్పుడు కూడ ఇదే జరిగింది. మరల ఇప్పుడు, స్వయం ప్రతిపత్తికి సంబంధించిన తన పథకం చర్చించబడకముందే స్టాలిన్ ఎందివనికి 1922, ఆగస్టు 29న ఒక టెలిగ్రాం పంపినట్లుగా తెలుస్తున్నది. అందులో, ఇకపై రష్యన్ ఫెడరేషన్ యొక్క అత్యున్నత పాలనా సంస్థలయిన కేంద్ర పాలక మండలి, సోవ్నర్కోమ్, కార్మిక, రక్షణ మండళ్ళ నిర్ణయాలను అన్ని రిపబ్లిక్‌లు విధిగా పాటించాలని తెలియజేశాడు. ఈ చొరవ జార్జియన్లు మొత్తం ప్రణాళికను ఇంతకు ముందు కంటే మరింత స్పష్టంగా తిరస్కరించడానికి దారి తీసింది.

రిపబ్లిక్‌ల సెంట్రల్ కమిటీల ప్రతిస్పందనల్ని మాస్కో సేకరించగానే కమీషన్ తిరిగి సెప్టెంబరు 24, 25 తేదీలలో సమావేశమయింది. స్టాలిన్ రూపొందించిన ప్రణాళిక దాదాపు సంపూర్ణంగా అంగీకరించబడింది. జార్జియా ప్రతినిధి ఎందివని మాత్రం ఓటు వెయ్యలేదు. పేరాగ్రాఫ్‌ల వారీగా జరిగిన చర్చ, ఈ కమీషన్ రెండు వేర్వేరు సమావేశాలకు అధ్యక్షత వహించిన స్టాలిన్, మాలటోవ్‌లకు పెద్దగా ఇబ్బంది కలిగించలేదు. రష్యన్ ఫెడరేషన్ ప్రభుత్వమే అన్ని రిపబ్లిక్‌లకు ప్రభుత్వం అవుతుందని నిర్దేశించే రెండవ పేరాగ్రాఫ్‌కి వ్యతిరేకత ఎదురయింది : ఉక్రెయిన్ ప్రతినిధి పెట్రోవ్‌స్కీ ఓటుకి దూరంగా ఉండగా, ఎందివని వ్యతిరేకంగా ఓటు వేశాడు. వాస్తవానికి ఈ విజయం పైకి అలా అనిపించేదే కాని నిజమైన విజయం కాదు. ప్రతినిధుల నిజమైన అభిప్రాయాలు ద్వితీయ స్థాయి సమస్యల పరిశీలనలో బాగా వెల్లడయ్యాయి; సాధారణ సూత్రాలనే ప్రమాదకర ప్రాతిపదికపై బహుశా వాళ్ళెవ్వరూ పొలిట్‌బ్యూరో, ఆర్గ్‌బ్యూరో ప్రతినిధులను ఎదిరించడానికి సిద్ధంగా లేరు. అయితే పెట్రోవ్‌స్కీ ఈ ప్రణాళికను మరోసారి చర్చించే నిమిత్తం రిపబ్లిక్కులలోని పార్టీ ప్రాంతీయ కమిటీ (ఆబ్కోమీ) లకు పంపాలని చేసిన ప్రతిపాదన, ఈ నిర్ణయాన్ని వాయిదా వేయించాలని, బహుశా వీలైతే దానిని ఓడించాలనే ఉద్దేశంతో చేయబడింది. ఈ సవరణకు తొమ్మిదింట నాలుగు ఓట్లు లభించాయి. ఎందివని, పెట్రోవ్‌స్కీ, చెర్వియకోవ్‌లతో మాస్కో "విశ్వసనీయ సభ్యుల్లో" ఒకరైన అగమలై – ఓగ్లీ జత కట్టాడు. వాస్తవంలో స్వయం ప్రతిపత్తి ప్రతిపాదనకు రిపబ్లిక్కులలో ఎంత విస్తృతమైన వ్యతిరేకత ఉందో దీనిని బట్టి తెలుస్తున్నది; ఆరు రిపబ్లిక్‌లలో కనీసం నాలుగు వేర్వేరు స్థాయిల్లో దీనికి వ్యతిరేకంగా ఉన్నాయి. తన సవరణ తిరస్కరింపబడగానే పెట్రోవ్‌స్కీ సమావేశపు మినిట్స్‌లో ఈ మొత్తం ప్రణాళికపై ఉక్రెయిన్ ఇంకా ఒక నిర్ణయానికి రాలేదని రాయమని కోరాడు. ఉక్రేనియన్ల ఎత్తుగడలు స్పష్టమవుతున్నాయి : స్టాలిన్ ప్రతిపాదనపై

సరాసరి దాడి చేసే సాహసం కాని, కోరిక కాని వారికింకా లేదు. వాళ్ళు వేచి చూడదలిచారు. లెనిన్ అభిప్రాయాలను, పొలిట్‌బ్యూరో, సెంట్రల్ కమిటీలలోని అధికార సంబంధాల గురించి మరింతగా తెలుసుకోదలిచారు. అయితే రిచర్డ్ పైప్స్ అనే చరిత్రకారుని ప్రకారం, కమీషన్ సమావేశాలు ముగిసిన కొద్ది రోజులకే, అక్టోబరు 3న వాళ్ళ సెంట్రల్ కమిటీ రష్యన్ ఫెడరేషన్‌తో సంబంధాలని ఫ్రాంజ్ కమిషన్ ప్రతిపాదనల ఆధారంగా కొనసాగించేందుకు తీర్మానించింది. అంటే, స్వాతంత్ర్యం, యధాతథ స్థితి.

ఈలోగా లెనిన్, అనారోగ్యం నుండి ఇంకా కోలుకుంటూనే, ఈ సమస్యపై అమితమైన ఆసక్తి ఉన్నందువల్ల, కమీషన్ పనిలో ప్రగతిని గురించి సమాచారం అందించవలసిందిగా స్టాలిన్‌ని కోరాడు. స్టాలిన్ పంపిన మొత్తం సమాచారం సంపుటిని లెనిన్ సెప్టెంబరు 25న అందుకున్నాడు. లెనిన్ ప్రతిస్పందనకు అట్టే సమయం పట్టలేదు. మరుసటి రోజు లెనిన్, నేరుగా స్టాలిన్‌కి కాకుండా, సొవ్నర్కోమ్‌లో తన తరువాతి స్థానంలో ఉన్న కామెనెవ్‌కి లేఖ రాశాడు. ఈ వ్యవహారం ప్రాముఖ్యాన్ని ఆయన దృష్టికి తెస్తూ, ఈ సమస్య గురించి లోతుగా ఆలోచించవలసిందిగా ఆయన్ని కోరాడు. వాస్తవ ఘటనల వల్ల గాని, ఈ ప్రణాళికను అమలు చేయడానికి ఉపయోగించబడుతున్న పద్ధతుల వల్ల గాని లెనిన్ ఆందోళనకు గురి కాలేదు. జార్జియన్ సంఘర్షణ దానంతటది ఆయనకేమీ ఉత్సుకతను కలిగించలేదు. ఈ వ్యవహారంలోని ముఖ్యులందరినీ తరచు కలుస్తున్నప్పటికీ, తన మిత్రుడు ఆర్జోనికిజ్, స్టాలిన్‌లు అందించిన సమాచారాన్ని ఆయన విశ్వసిస్తున్నాడనే అభిప్రాయం ఎక్కువ మందిలో ఉంది. దీనికి మరింత ఋజువు మరుసటి నెలలో కనిపించింది. ఈ లేఖలో లెనిన్ ఎందివనిని "జాతీయ వాదిగా అనుమానించదగిన" వ్యక్తిగా అభివర్ణించినప్పటికీ, ఈ ఆరోపణని సూత్రబద్ధంగా చేయలేదు. మరోవైపు స్టాలిన్‌లో "ఎంతో తొందరపాటు" గమనించాడు. (లెనిన్ లేఖ అనుబంధం – II గా ఇవ్వబడింది.) అందువలన, వాస్తవికత ఆధారంగా కాక సూత్రబద్ధ వైఖరి ఆధారంగా లెనిన్ స్వయం ప్రతిపత్తి ప్రణాళికను తిరస్కరించి, వేరే పరిష్కారాన్ని సూచించే దిశగా పయనించాడు. "సమాన హక్కులు కలిగిన రిపబ్లిక్కుల ఫెడరేషన్" ని మనం సాధించాలని లెనిన్ అన్నాడు. ఈ విధమైన సమానత్వం కోసం పూచీ పడేందుకు స్టాలిన్ ప్రణాళిక నుండి రష్యన్ ఫెడరేషన్‌తో మిగతా రిపబ్లిక్కులను అనుసంధానించే ప్రతిపాదన చేసిన పేరాగ్రాఫ్‌ను తొలగించాడు. దాని స్థానే "ఐరోపా, ఆసియా సోవియట్ రిపబ్లిక్‌ల యూనియన్‌లో రష్యన్ ఫెడరేషన్‌తో లాంఛనప్రాయ కలయిక"ను ప్రతిపాదించాడు.

రష్యన్ ఫెడరేషన్ ప్రభుత్వం యూనియన్ ప్రభుత్వం కాబోదు. సోవియట్

రిపబ్లిక్కుల యూనియన్‌కి ఒక ఫెడరల్ పాలక మండలి, ఒక క్రొత్త ఫెడరల్ సోవ్నర్కోమ్‌ల ఏర్పాటును లెనిన్ ప్రతిపాదించాడు. రష్యన్ ప్రభుత్వం కూడ ఫెడరల్ సోవ్నర్కోమ్ అధికార పరిధికి లోబడి పని చేస్తుంది. ఈ విధంగా ఒక పథకం సిద్ధం చేయబడింది. ఇది త్వరలోనే సోవియట్ సోషలిస్టు రిపబ్లిక్కుల యూనియన్ (యుఎస్ఎస్ఆర్) గా రూపు దాల్చింది. కామెనెవ్‌కి లేఖ రాసిన తర్వాత (ఈ లేఖ ప్రతులు పొలిట్‌బ్యూరోలోని మిగతా సభ్యులకు కూడా తప్పనిసరిగా పంపబడి వుంటాయి), తదుపరి పరిణామాలను గోర్కీలోని తన గ్రామీణ నివాస ప్రాంతం నుండి లెనిన్ శ్రద్ధగా గమనించసాగాడు. సెప్టెంబరు 29న ఆర్జోనికిజ్ ఆయన్ని కలిశాడు. మరుసటి రోజు జార్జియన్ సెంట్రల్ కమిటీ సభ్యులు ఓకుద్‌జావా, దమాడ్జ, మినాజలను ఆయన కలిశాడు. జార్జియన్లు వాళ్ళను స్టాలిన్‌ని వ్యతిరేకించే నిమిత్తం మాస్కోకి పంపారు. లెనిన్ బహుశ వాళ్ళను నిరాశపరచి వుంటాడు. అయితే ఆయన కనీసం వాళ్ళు చెప్పింది శ్రద్ధగా విన్నాడు.

ఈలోగా స్టాలిన్ చాలా అసహనంగా ప్రవర్తిస్తున్నాడు. తన దృక్పథం సరైనదనే నమ్మకంతో, తాను ప్రతిపాదించిన దానిని మార్చేందుకు ఎవరికీ అవకాశం లేకుండా వెంటనే అమలు చేయాలనే పట్టుదలతో, లెనిన్ అభిప్రాయం కోసం వేచి వుండకుండా తన కమీషన్ చేసిన కృషి ఫలితాలను సెంట్రల్ కమిటీ సభ్యులందరికీ అక్టోబరు 6న జరగాల్సిన సమావేశంలో ఉపయోగించుకునేందుకు పంపాడు. ఐరోపా, ఆసియా సోవియట్ రిపబ్లిక్కుల యూనియన్‌ని ప్రతిపాదిస్తూ లెనిన్ రాసిన లేఖను, తాను జాతుల మంత్రిత్వశాఖ కమిస్సార్‌గా గణనీయమైన ఖ్యాతిని గడించినట్లుగా భావించిన స్టాలిన్, తన కార్యరంగంలో "పెద్దాయన" వైపు నుండి పనికిమాలిన జోక్యంగా పరిగణించాడు. ఈలోగా, జార్జియన్ పేచీకోర్ల దూరదృష్టి కొరవడిన కార్యకలాపాలతో నిమిత్తం లేకుండా, వ్యవహారం ఎటువంటి అవాంతరాలు లేకుండా ముందుకు వెళ్ళేందుకు అవసరమైన చర్యలు తీసుకుంటున్నాడు. లెనిన్ జోక్యం గురించి స్టాలిన్ చికాకు పడ్డాడేగాని దాని వల్ల ప్రభావితుడు కాలేదు. స్టాలిన్, కామెనెవ్‌లు బహుశా ఒక పొలిట్‌బ్యూరో సమావేశం జరుగుతుండగా లెనిన్ మెమోరాండం విషయంలో ఒకరికొకరు క్లుప్తంగా ఇలా రాసుకున్నారు.

కామెనెవ్ ఇలా రాశాడు : "స్వాతంత్ర్యాన్ని కాపాడేందుకు ఇల్లిచ్ యుద్ధానికి సన్నద్ధమవుతున్నట్లున్నది."

దానికి స్టాలిన్ సమాధానం: "మనం లెనిన్‌తో దృఢంగా వ్యవహరించాలని నేను అనుకుంటున్నాను."

("వ్లాదిమర్ ఇల్లిచ్ లెనిన్ : బయోగ్రఫియా" – రచన : పి.ఎన్. పోస్పెలోవ్ – రెండవ ముద్రణ – మాస్కో,– 1963 – పుట : 611)

తన స్వాభావికమైన జాగరూకతను విడనాడి, స్టాలిన్ అప్పుడు అదే చేశాడు. సెప్టెంబరు 27న లెనిన్ మెమోరాండం పాఠానికి తన లేఖనొకదాన్ని జత చేస్తూ పొలిట్‌బ్యూరో సభ్యులందరికీ పంపాడు. ఈ లేఖలో తన అభిప్రాయాన్ని దాచి పెట్టలేదు. సోవ్నర్కోమ్ అధినేతపై బహిరంగంగానే "జాతీయ ఉదారవాదం" అనుసరిస్తున్నట్లు ఆరోపించాడు. వేర్పాటువాదుల్ని ప్రోత్సహిస్తున్నాడన్నాడు. ఆ లేఖలో మాకు లభించిన కొంత భాగాన్ని దిగువ పొందుపరుస్తున్నాము :

"పేరాగ్రాఫ్ 2 : రెండవ పేరాగ్రాఫ్‌కి రష్యన్ కేంద్ర పాలకమండలితో పాటు ఫెడరేషన్‌కి మరో కేంద్ర పాలక మండలి ఏర్పాటు చేయడాన్ని ప్రతిపాదిస్తూ లెనిన్ చేసిన సవరణ, నా దృష్టిలో, అంగీకరించకూడదు. మాస్కోలో రెండు కేంద్ర పాలక మండళ్ళు ఉండటం, వాటిలో ఒకటి 'దిగువ సభ'గా, మరొకటి 'ఎగువ సభ'గా ఉండటం ఘర్షణకు, చర్చకు దారి తీయటం తప్ప ప్రయోజనకరం కాదు...

"పేరాగ్రాఫ్ 4 : నాల్గవ పేరాగ్రాఫ్ విషయంలో నా దృష్టిలో ద్రవ్య, ఆహార పంపిణీ, శ్రామిక, జాతీయ ఆర్థిక వ్యవస్థ కమిస్సారియట్లను ఫెడరేషన్ కమిస్సారియట్లతో విలీనం చేసే ప్రతిపాదన చేయడంలో కామ్రేడ్ లెనిన్ తనంత తాను కొంత 'తొందరపాటు' ప్రదర్శించాడు. ఈ 'తొందరపాటు' 'స్వతంత్రతను కోరుకునే వారిని ప్రోత్సహించడం' ద్వారా లెనిన్ ప్రతిపాదిస్తున్న జాతీయ ఉదారవాదానికి హాని కలిగిస్తుంది.

"పేరాగ్రాఫ్ 5 : అయిదవ పేరాగ్రాఫ్‌కి లెనిన్ చేసిన సవరణ, నా దృష్టిలో, అనావశ్యకం."

(ఈ లేఖను ట్రాట్‌స్కీ తన గ్రంథం "ది స్టాలిన్ స్కూల్ ఆఫ్ ఫాల్సిఫికేషన్" పుట : 66–67లో పొందుపరిచాడు. మాస్కోలోని మార్క్సిస్టు – లెనినిస్టు ఇన్‌స్టిట్యూట్ దానిని ముద్రించలేదు. కాని ఆ లేఖ ఉందనే విషయాన్ని, స్టాలిన్ "జాతీయ ఉదారవాదం" లెనిన్‌పై ఆరోపించడాన్ని ధృవీకరించింది).

లెనిన్ ప్రతిపాదనలపై ఒక్కొక్కటిగా స్టాలిన్ విమర్శలు ఎక్కుపెట్టాడు. అలా చేసేటప్పుడు తరచుగా వాగాడంబరాన్ని, రెచ్చగొట్టే ధోరణిని ప్రదర్శించాడు. లెనిన్ మితంగా స్టాలిన్ అసహనంతో ప్రవర్తిస్తున్నాడని అంటే, స్టాలిన్ ఇదే విమర్శను లెనిన్‌పై చేశాడు. అంతేకాక లెనిన్‌పై "జాతీయ ఉదారవాదం" అనే ముద్ర వేయడం ద్వారా స్టాలిన్ సాధారణ సూత్రాలపై దాడిని కూడా జత కలిపాడు. అయితే ఆయన అక్కడితో ఆగలేదు. లెనిన్ నుండి ప్రతి విమర్శల్ని ముందుగానే ఊహించి, లెనిన్‌ని అతి తొందరపాటుతో కేంద్రీకరణను ప్రతిపాదించినందుకు తప్పు పట్టాడు. అయితే వాస్తవానికి కేంద్రీకరణకు, లెనిన్‌కి ఉన్నట్లు చెప్పబడిన "జాతీయ ఉదారవాదం"కి చుక్కెదురు. ఒక విధంగా చూస్తే

స్టాలిన్ సంపూర్ణంగా ఈ లేఖలో కనిపిస్తాడు. ఆయన వాదనల తీరు గమనించిన ఎవరికయినా ఆయనకు అన్నింటి కంటే ఎత్తుగడలే ముఖ్యం అని తెలుస్తుంది. అందువల్లనే తాను ఎంతో నిశ్చయంతో చెప్పిన అభిప్రాయాలను ఒక రోజులోనే మార్చుకోవడానికి సిద్ధపడ్డాడు. సెంట్రల్ కమిటీలో తాను మైనారిటీలో వుంటానని తెలియగానే తన పట్టుని పూర్తిగా సడలించి, తన స్వయం ప్రతిపత్తి ప్రణాళికకు లెనిన్ సవరణలను కలుపుతూ యూనియన్ ప్రణాళికగా మార్చివేశాడు. ప్రణాళిక కొత్త పాఠం స్టాలిన్, మాలటోవ్, ఆర్జోనికిజ్, మయాస్నికోవ్‌ల సంతకాలతో, గత ప్రణాళికతో ఉన్న తేడాలు ఏమీ ప్రస్తావించకుండా, సెంట్రల్ కమిటీ సభ్యులకు పంపబడింది. లెనిన్ రచనల సర్వస్వంలోని XLV వ సంపుటానికి సంపాదకులుగా ఉన్న వారు ఈ తేడాలకు అంతగా ప్రాముఖ్యత లేదని చెప్పారు. నూతన పథకానికి రాసిన ఉపోద్ఘాతంలో ఏమాత్రం తొణక్కుండా ఆర్గ్‌బ్యూరో ప్రతిపాదించిన "సూత్రరీత్యా సరైన, సంపూర్ణంగా ఆమోదయోగ్యమైన" ప్రణాళికకు నూతన పథకం "స్వల్పంగా మార్చబడిన, మరింత ఖచ్చితమైన కూర్పు" అని పేర్కొనబడింది. (సమగ్ర రచనలు – సంపుటి : XLV పుట : 559. అంతిమ తీర్మాన పాఠం అనుబంధం – III గా ఇవ్వబడింది).

స్టాలిన్ లేఖను గాని, జెన్‌సెక్ తిరిగి రూపొందించిన పథకానికి రాసిన ఉపోద్ఘాతాన్ని కాని లెనిన్ చూశాడో లేదో తెలియదు. క్రొత్త పథకానికి ఆమోదం తెలిపిన అక్టోబరు 6న జరిగిన సెంట్రల్ కమిటీ సమావేశానికి లెనిన్ హాజరు కాలేదు. అయితే ఆసక్తికరమైన అంశమేమిటంటే, ఏది ప్రేరణగా పని చేసిందో తెలియదు కాని, సమావేశం రోజునే కామెనెవ్‌కు లెనిన్ సంక్షిప్తంగా రాసిన ఒక పత్రాన్ని పంపాడు. ఆ పత్రం 15 సంవత్సరాల తర్వాత బహిర్గతమయింది. కొంత హాస్యరసం మేళవించి లెనిన్ ఇలా రాశాడు :

"కామ్రేడ్ కామెనెవ్ ! జాత్యాధిపత్య దురహంకారంపై దాని సంపూర్ణ వినాశనం వరకు యుద్ధం ప్రకటిస్తాను. బాధపెడుతున్న దంతాలను తొలగించగానే పటిష్టమైన పలు వరుసతో దానిని నమిలి మింగేస్తాను. యూనియన్ కేంద్ర పాలక మండలికి వంతులవారీగా రష్యన్, ఉక్రేనియన్, జార్జియన్ వగైరా అధ్యక్షత వహించాలని తప్పనిసరిగా డిమాండ్ చేయాలి.

నీ

లెనిన్"

(సమగ్ర రచనలు – సంపుటి : XLV – పుట : 214).

లెనిన్ వ్యక్తిగత ప్రతిష్ట కారణంగా ఆయన అభిప్రాయాలు అందరికీ ఆమోదయోగ్యం అయినట్లు కనిపించాయి. సెంట్రల్ కమిటీ ఆ పథకాన్ని యధాతథంగా

ఆమోదించింది. దానిని మరింత వివరంగా రూపొందించి సెంట్రల్ కమిటీ రాబోయే సమావేశానికి సమర్పించే పని ఒక క్రొత్త కమీషన్‌కి అప్పచెప్పబడింది. ఎందివని దానిని వ్యతిరేకించలేదు కాని ఉక్రెయిన్, బైలో రష్యాల మాదిరిగా జార్జియా కూడా స్వతంత్ర సభ్యత్వాన్ని అంటే ఆర్జోనికిజ్, స్టాలిన్ కోరుతున్నట్లు ట్రాన్స్ కాకేసియన్ ఫెడరేషన్‌లో అంతర్భాగంగా కాకుండా కలిగి వుండేలా ఏర్పాటు చేయాలని కోరాడు. వాస్తవానికి, స్టాలిన్, ఆర్జోనికిజ్‌లు ఒక వ్యక్తిగత వైరాన్ని కొనసాగిస్తున్నారు. వాళ్ళు అందులో పూర్తిగా నిమగ్నమయ్యారు. ఆ ఇరువురు జార్జియన్లకు కావలసింది తామనుకున్నది సరైనదని, మిగతా జార్జియన్లు భావించింది తప్పు అని ఋజువు కావడం. ప్రత్యేకించి ఈ అంశంపై లెనిన్ మౌనం వహించడం వారికి ప్రోత్సాహాన్నిచ్చింది. ట్రాన్స్ కాకేసియన్ ఫెడరేషన్‌కి వ్యతిరేకంగా జార్జియన్లు మరోసారి మాస్కోకి తమ నిరసన తెలియచేశారు. సెంట్రల్ కమిటీ వాళ్ళ నిరసనల్ని ఏకగ్రీవంగా త్రోసిపుచ్చిందని స్టాలిన్ నుండి కటువైన సమాధానం వారికి అందింది. ('ఫార్మేషన్ ఆఫ్ సోవియట్ యూనియన్' – రచన : పైప్స్ – పుట : 274). దానితో కొత్తదైన, మరింత హింసాత్మకమైన నిరసనల వెల్లువ రహస్య సమావేశాల్లోను, కొన్నిసార్లు బహిరంగ సమావేశాల్లో కూడా ముందుకొచ్చింది. ఈ సందర్భాలలో జార్జియన్లు తమ స్వతంత్రతని ప్రకటించడంలోను, పునరుద్ఘాటించడంలోను ఎప్పుడూ వెనకాడలేదు.

ఆర్జోనికిజ్ మరింత కట్టుదిట్టమైన పద్ధతుల్ని ప్రయోగించసాగాడు. ఆయనకు నిరంతరం లభిస్తూ వున్న మాస్కో సెక్రటేరియట్ మద్దతుతో ఆర్జోనికిజ్ జార్జియన్ సెంట్రల్ కమిటీ మద్దతుదారులను వారి దేశం విడిచి వెళ్ళవలసిందిగా మరియు క్రమశిక్షణా చర్యగా మాస్కోలోని సెంట్రల్ కమిటీ అదుపాజ్ఞలలో ఉండవలసిందిగా ఆదేశించాడు. జార్జియన్ సెంట్రల్ కమిటీ తరఫున ఈ వ్యవహారంలోని పరిణామాలను అధ్యయనం చేయడానికి మాస్కోకి పంపబడిన ముగ్గురు ప్రతినిధులు రాజధాని నుండి తిరిగి వచ్చిన పిమ్మట తమ నివేదిక సమర్పించారు. ఆ నివేదిక పరిశీలించిన పిమ్మట జార్జియన్ సెంట్రల్ కమిటీ యూనియన్‌లో స్వతంత్ర అస్తిత్వంతో చేరాలనే తన నిర్ణయాన్ని అత్యధిక మెజారిటీతో పునరుద్ఘాటించింది. అదే సమయంలో మాఖరాజ్, సింసజేలు స్టాలిన్ చర్యలకు అడ్డుకట్ట వేసే ఉద్దేశ్యంతో, బుఖారిన్, కామెనెవ్‌లకి వ్యక్తిగత లేఖలు రాశారు. వాళ్ళ భ్రమలు త్వరలోనే చెల్లాచెదురయ్యాయి : బుఖారిన్, కామెనెవ్‌లు కూడా సెక్రటేరియట్‌ని (అంటే స్టాలిన్‌ని – అను.) సమర్థిస్తున్నట్లు తేలింది. వాళ్ళిద్దరు జాతీయవాదం గురించి కొత్త ఆరోపణలు చేస్తూ, జార్జియన్లు పార్టీ క్రమశిక్షణకు కట్టుబడి వుండాల్సిందేనని నొక్కి చెప్పారు. జార్జియన్లకు అంతకు మించిన తీవ్ర ఆశాభంగం ఎదురు కానున్నది. వాళ్ళ

ఫిర్యాదును బుఖారిన్ లెనిన్ దృష్టికి తేగా అప్పటికి తన "యూనియన్ సంబంధిత" సూత్రాలకు, మహా రష్యన్ జాతి దురహంకారానికి వ్యతిరేకంగా పోరాడాలనే తన పట్టుదలకు మరియు జార్జియా పట్ల అనుసరించబడుతున్న విధానానికి మధ్య ఉన్న వైరుధ్యాన్ని ఇంకా గమనించని లెనిన్ ఒక కటువైన, చికాకు ధ్వనించే సమాధానాన్ని తంతి ద్వారా పంపాడు :

"21/10/22

తిబిలిసి, జార్జియన్ రిపబ్లిక్ సెంట్రల్ కమిటీకి, సింసజే, కౌటరాజెలకు : (ప్రతులు : సెంట్రల్ కమిటీ సభ్యుడు ఆర్జోనికిజ్‌కి మరియు జక్రేకామ్ కార్యదర్శి ఒరాఖేలాష్‌విలికి).

సింసజే ఇతరుల సంతకాలతో టెలిగ్రాం ద్వారా పంపబడిన నోటులోని అభ్యంతరకరమైన ధ్వనికి ఆశ్చర్యపోయాను. ఈ నోటు, ఎందువల్లనో తెలియదు, సెంట్రల్ కమిటీ కార్యదర్శుల నుండి కాక, బుఖారిన్ నుండి నాకు వచ్చింది. నా పరోక్ష భాగస్వామ్యం, ఎందివని ప్రత్యక్ష భాగస్వామ్యంతో జరిగిన సెంట్రల్ కమిటీ ప్లీనం చేసిన తీర్మానాలు అన్ని విభేదాలను పూర్తిగా పరిష్కరించాయనే అభిప్రాయం నేను కలిగి వున్నాను. అందువలన, ఆర్జోనికిజ్ గురించి రాసిన నిందావాక్యాలను దృఢంగా ఖండిస్తున్నాను. మీ ఘర్షణను -- ఇది మరింత సభ్యమైన, విధేయతతో కూడిన ధ్వనితో నిర్వహించబడాలి -- రష్యన్ కమ్యూనిస్టు పార్టీ సెంట్రల్ కమిటీకి చెందిన సెక్రటేరియట్ పరిష్కరించాలని నొక్కి చెపుతూ, మీ ప్రకటనను టెలిగ్రాం ద్వారా వాళ్ళకి పంపుతున్నాను.

గౌరవాలతో

(సం.) లెనిన్"

(సమగ్ర రచనలు - సంపుటం : LIV - పుట : 299-300).

లెనిన్‌కి ఈ వ్యవహారం గురించి తనకు అందిన సమాచారం పట్ల ఎంత నమ్మకముందంటే, చివరికి ఆర్జోనికిజ్, స్టాలిన్‌లకి వ్యతిరేకంగా వచ్చిన ఫిర్యాదును స్టాలిన్‌కి అప్పగించాడు.

వాళ్ళ ఓపిక పూర్తిగా నశించి, మాస్కో నుండి న్యాయం పొందలేనందుకు నిరాశకు గురై, ఆర్జోనికిజ్ విధిస్తున్న "దేశ బహిష్కారాల" పట్ల ఆగ్రహం చెందిన జార్జియన్ సెంట్రల్ కమిటీ ఒక అసాధారణమైన చర్య తీసుకుంది: అక్టోబరు 22న సెంట్రల్ కమిటీ సభ్యులు సామూహికంగా రాజీనామా చేశారు. (ఫతియెవా రచన "ఇజ్ వొస్పమినసీయ్" (జ్ఞాపకాల నుండి) ప్రకారం 11 మంది సభ్యులలో 9 మంది రాజీనామా చేశారు). ఆర్జోనికిజ్ ఇటువంటి అవకాశం కోసమే ఎదురు చూస్తున్నాడు. ఆయన ఆధీనంలో ఉన్న

జ(ఖేకామ్ అసమర్థులైన కాని విధేయులైన యువకులతో క్రొత్త సెంట్రల్ కమిటీని వెంటనే నియమించింది. ఈ క్రొత్త కమిటీ కనురెప్పపాటులో ఫెడరేషన్ ప్రతిపాదనకు ఆమోదం తెలియజేసింది. మాస్కో సెక్రటేరియట్ పాత వాళ్ళ రాజీనామాలు అంగీకరించడం, క్రొత్త వాళ్ళ నియామకాలను ఆమోదించడం త్వరితగతిని పూర్తి చేసింది. అయితే వ్రణం ఇంకా సలుపుతూనే వుంది. పాత సెంట్రల్ కమిటీకి చెందిన సభ్యులు పోరాటాన్ని కొనసాగిస్తూనే వున్నారు. నాయకత్వ మార్పు ఆర్జోనికిజ్ తన దేశంలోనే ప్రజల హృదయాలను చూరగొనలేకపోయాడనే విషయాన్ని నొక్కి చెప్పేందుకే పనికి వచ్చింది. ఇది ఆయనకు చాలా కోపం తెప్పించింది. మరీ ముఖ్యంగా, ఫెడరేషన్ ప్రణాళిక అమలు చేయడానికి తాను తీసుకున్న నిర్దుష్ట చర్యల పురోగమనం మందకొడిగా వుండటం ఆయనకు నచ్చలేదు. ఇందుకు కారణం వీటిని జార్జియన్ స్వాతంత్ర్య ఉద్యమ కారులు అడ్డుకోవడం. ఘటనలు, కుట్రలు, మాస్కోకి అందే ఫిర్యాదులు ఇబ్బడిముబ్బడి కాసాగాయి.

ఇటువంటి ఘర్షణల్లో ఒకసారి కోపాన్ని నిగ్రహించుకోలేక ఆర్జోనికిజ్, ఎందివని మద్దతుదారుడైన ఒక పార్టీ సభ్యుణ్ణి కొట్టాడు. ఆర్జోనికిజ్ ఏర్పాటు చేసిన ఒక ప్రైవేటు సమావేశంలో ఈ సంఘటన జరిగింది. ఆ సమయంలో లెనిన్ సహాయకుడు పొలిట్‌బ్యూరో సభ్యుడైన రైకోవ్ అక్కడే వున్నాడు. (ఫతియెవా ప్రకారం ఈ సంఘటన బహుశా నవంబరు చివరన జరిగింది). "కోపిష్టి సెర్గో" (ఆర్జోనికిజ్) తనని తాను అభేద్యమయినవాడిగా భావించేవాడు. అయితే ఈ పర్యాయం విచారణను తిరిగి జరిపించవలసిందిగా మాస్కోని కోరుతూ మాఖరాజ్ తదితరుల సంతకాలతో సమర్పించిన విజ్ఞాపనను మాత్రం నిర్లక్ష్యం చేయడానికి వీల్లేదు (ఫతియెవా రచన – పుట : 52). లెనిన్ రచనల సర్వస్వం తాజా ముద్రణ సంపాదకులు జ(ఖేకామ్ పంథాని "సూత్రరీత్యా సరైనదని" సమర్థించడాన్ని కొనసాగిస్తూ, తాము "ఎందివని బృందం"గా పిలిచిన జార్జియన్ సెంట్రల్ కమిటీ యొక్క "సూత్రరీత్యా సరికాని వైఖరుల"పై దాడి చేశారు; అదే సమయంలో "ఆర్జోనికిజ్ చేసిన తప్పులు" అంటూ ఒక ఆకట్టుకునే జాబితాను రూపొందించారు: "జార్జియాలో పార్టీ జాతుల విధానాన్ని అమలు చేయడానికి అవసరమైన సర్దుబాటు తత్వం, జాగరూకత తనకు లేవని ఋజువు చేసుకున్నాడు; ఉద్యోగస్వామ్య పద్ధతులను ఆయన కొనసాగనిచ్చాడు; కొన్ని చర్యలు అమితమైన వేగంతో చేపట్టాడు. జార్జియన్ కమ్యూనిస్టు పార్టీ సెంట్రల్ కమిటీకి గల అభిప్రాయాలను, హక్కులను అనేక పర్యాయాలు పరిగణనలోకి తీసుకునేవాడు కాదు. అన్నిటినీ మించి ఎందివని బృందంతో తనకున్న సంబంధాలలో ఆవశ్యమైన స్వీయ – నియంత్రణ చూపలేకపోతున్నానని ఋజువు చేసుకున్నాడు." (సమగ్ర రచనలు – సంపుటం : XLV – పుట : 595).

ఈ దశలో పరిస్థితి పట్ల లెనిన్ ఆందోళన చెందసాగాడు. పాత జార్జియన్ సెంట్రల్ కమిటీ సభ్యురాలు ఓకుద్‌జావా రాసిన లేఖ వల్ల లెనిన్ అకస్మాత్తుగా కలవరపాటుకి గురయ్యాడు. ఈ లేఖలో ఆర్జోనికిజ్ జార్జియన్ కమ్యూనిస్టులను బెదిరిస్తున్నాడని ఆరోపణ చేయబడింది. ("ఫార్మేషన్ ఆఫ్ ది సోవియట్ యూనియన్"– రచన : పైప్స్ – పుట : 281). జార్జియన్ పార్టీలోని అంతర్గత వివాదాన్ని పరిష్కరించడానికి సెక్రటేరియట్ అక్కడకు పంపదలచిన విచారణ సంఘం (కమీషన్) లోని సభ్యుల పేర్లు లెనిన్ ఓటుకోసం పొలిట్‌బ్యూరో పంపినపుడు, నవంబరు 24న "జర్నల్"లో రాయబడిన దాని ప్రకారం, లెనిన్ ఓటు వేయలేదు. ఇలా చేయడం ద్వారా, స్టాలిన్ ప్రతిపాదించిన ముగ్గురు సభ్యులు -- జెర్జిన్‌స్కీ, లొజోవ్‌స్కీ, కప్సుకాస్ -- మైస్‌కివిచియస్‌లతో కూడిన కమీషన్ నిష్పక్షపాత ధోరణిపై అనుమానాన్ని వ్యక్తం చేయదలచుకున్నాడా అనే విషయం మనకు తెలియదు. అయితే ఒకటి మాత్రం స్పష్టం: తన తొలి వార్తాహరులపై అనుమానం పొడసూపింది. కనుక తానొక అభిప్రాయానికి వచ్చేందుకు గాను ఇతర సమాచార మూలాల కోసం అన్వేషిస్తున్నాడు. లెనిన్ పంపినందువలనగానీ, మరే కారణం వల్లనయినా గాని రైకోవ్ జార్జియా వెళ్ళాడు. ఏది ఏమయినా ఆయన కూడా ఈ విషయాన్ని పట్టించుకుంటూ, లెనిన్‌తో సంప్రదింపులు జరుపుతూ ఉండివుండవచ్చు. పెరుగుతున్న అసహనంతో లెనిన్ కమీషన్ సభ్యులు, రైకోవ్ ఎప్పుడు తిరిగి వస్తారా అని ఎదురు చూస్తున్నాడు. వాళ్ళ ప్రయాణ వివరాల కోసం లెనిన్ ప్రశ్నల పరంపర గుప్పించడం కార్యదర్శులు "జర్నల్"లో విశ్వసనీయంగా నమోదు చేశారు.

ఈ వ్యవహారం ఈ దశకు చేరుకున్న తరువాత కొన్ని సాధారణ వ్యాఖ్యలు చేయవచ్చు. ఇప్పుడు మనముందున్నది ఒక విధానాన్ని అమలు చేసేటప్పుడు దాని సూత్రాలకు, లక్ష్యాలకు మరియు అనుసరించే పద్ధతులకు మధ్య వుండే సాధారణమైన, తప్పనిసరియైన తేడా మాత్రమే కాదు. ఈ పద్ధతులను మొత్తంగా తీసుకుని చూస్తే అవి లక్ష్యంలోనే మార్పుని వ్యక్తీకరిస్తున్నాయి. ఈ మార్పు కొందరు నాయకుల మనస్సుల్లో అనేక సందర్భాలలో అచేతనంగా చోటు చేసుకుంది : రాజ్య వ్యవస్థలో కేంద్రీకృత విధానం అత్యున్నత సూత్రంగా నిలపబడింది. ఆర్జోనికిజ్ గవర్నర్ జనరల్ మాదిరిగా ప్రవర్తిస్తున్నాడు. న్యాయపరంగా, చట్టపరంగా పరిగణించవలసిన వాటిని ఉల్లంఘిస్తున్నాడు. జాతీయ రిపబ్లిక్కులకు చెందిన కమ్యూనిస్టులకు వ్యతిరేకంగా క్రూరత్వంతో ప్రవర్తిస్తున్నాడు. అతని చర్యలన్నీ గమనించిన పార్టీలోని వ్యతిరేకులు, చిత్రంగా స్టాలినిస్టులు కూడా, అతని పాలనను విమర్శనాత్మకంగా "అర్థరహిత పాలన"గా పేర్కొనసాగారు. ఈ విధమైన ఆచరణలన్నీ కలిసి ఒక వ్యవస్థగా రూపొందాయి. కాని, ఈ వ్యవస్థ అక్టోబరు విప్లవ

ఆకాంక్షలకు అనుగుణంగా లేదు. పాలనలో, అన్నిటినీ మించి క్లిష్టమైన జాతుల సమస్య పరిష్కారంలో, జాగరూకత, విచక్షణ, సర్దుబాటు తత్వం మార్గదర్శక సూత్రాలుగా లెనిన్ పేర్కొన్నప్పటికీ, ఆయన నడిపిస్తున్నది నిర్దాక్షిణ్యంగా లేకపోతే ఉనికిని కోల్పోయే ప్రమాదం వున్న నియంతృత్వం. వ్యతిరేకతను ఎదుర్కొని అధిగమించగల నాయకులను నియమించడంలో ఆయన తన తోడ్పాటునందించడం ఆశ్చర్యాన్ని కలిగించదు; తానే స్వయంగా ఆర్జోనికిజ్‌ని ఒక విజేతగా కాకసస్‌కి పంపాడు. అంతర్యుద్ధంలోను, తదనంతర స్థితిలోను జరిగిన పోరాటాల్లో పాల్గొని ప్రస్తుతం ప్రతినిధులు, కమిస్సార్లు, యుద్ధరంగ కమాండర్లు, ప్రాంతీయ కార్యదర్శులుగా ఉన్న వాళ్ళలో ఉన్న రెండు ప్రధాన తరహాల సమరశీలురతో పార్టీ నాయకత్వం నిండివుంది. వారిలో మొదటి తరహా వాళ్ళు, సైద్ధాంతిక ప్రమాణాలను పాటిస్తూ, వారి సోషలిస్టు దార్శనికతకు బలంగా నిబద్ధులై వుండే మేధావులు, ఆదర్శవాదులు. వీరిలో అత్యధికులు పాశ్చాత్య మార్క్సిజంతో, ముఖ్యంగా ప్రవాస కాలంలో దీర్ఘ కాలం ఐరోపాలో నివసించిన క్రమంలో, ఏర్పడిన పరిచయంతో పార్టీలోకి వచ్చినవారు. రెండవ తరహా వాళ్ళు ప్రధానంగా అధికారులు, కార్యశీలురు, విప్లవ ఆచరణవాదులు. వీరు ప్రధానంగా రోజువారీ ఘటనలతో సంబంధం కలిగి వుండేవారు. శిక్షణ లేక సామర్థ్యం రీత్యా చూస్తే వారిలో మేధావుల సంఖ్య బహు తక్కువ. వారిలో ఎక్కువమంది ప్రవాస జీవిత అనుభవం లేని జారిస్టు రష్యాలో అజ్ఞాత జీవితం గడిపిన బోల్షివిక్కులు.

ఈ రెండు రకాల వ్యక్తులు విప్లవంలోను, అంతర్యుద్ధంలోను, లెనిన్ ఆదర్శాలను అమలు చేయటంలోను పాత్ర నిర్వహించారు. అయితే, సిద్ధాంతకర్తలు ఊహించని రీతిలో అత్యంత విషాదమయంగాను, బాధాకరంగాను పరిణమించిన తరువాతి ఘటనల క్రమం రాకోవ్‌స్కీ, క్రిస్టిన్‌స్కీ, సెరెబ్రయకొవ్, ప్రియోబ్రజన్‌స్కీ, మాఖరాజ్, ట్రాట్‌స్కీ లాంటి వారి కంటే కార్యశీలురైన ఆర్జోనికిజ్, కగనోవిచ్, మాలటోవ్, క్యుబిషెవ్, స్టాలిన్ లాంటి వారి ప్రాబల్యానికి దారి తీసింది. రష్యాలోని వాస్తవ పరిస్థితుల భయానక తార్కికత కొందరిని సర్వనాశనం చేయగా, మరికొందరికి దీర్ఘకాలిక అధికారాన్ని కట్టబెట్టింది. అయితే వీళ్ళలో అనేకమంది 1936–1938 నాటి ప్రక్షాళనలో ప్రాణాలు కోల్పోయారు. ఐజక్ డాయిశ్చర్ ('ది ప్రాఫెట్ అన్‌ఆర్మ్‌డ్' అనే తన రచనలో – అను.) తమ స్వప్నానికి చివరికంటా నిబద్ధులై వున్న బోల్షివిక్కులకు, అధికారాన్నే పరమావధిగా భావించిన బోల్షివిక్కులకు మధ్య వ్యత్యాసాన్ని సూచించాడు. ఈ స్వప్నాన్ని సాకారం గావించే క్రమంలో మరింత లోతైన సందిగ్ధతలు తలెత్తాయి. ఈ రెండు తరహాల వ్యక్తుల మధ్య చీలిక మరింతగా ప్రస్ఫుటం కాసాగింది.

లెనిన్ మూర్తిమత్వం ఒక రకంగా చూస్తే ఈ రెండు విభిన్న స్వభావ రీతుల విజయవంతమైన సంశ్లేషణ; సిద్ధాంతం, మౌలిక సూత్రాల పట్ల ఆదర్శవాద నిబద్ధతను, ఆచరణవాదంతో అనుసంధానించగలిగిన లెనిన్ సామర్థ్యం ఆయనను ఊహాజనిత వాదం నుండి, సాంప్రదాయక సైద్ధాంతిక పిడివాదం నుండి రక్షించింది. ఇదే ఆయనకున్న బలం, బలహీనత కూడ; ఆయన మానసిక అంతస్సంఘర్షణకు కూడా ఇదే మూలం; ఇదే ఆయనకు ట్రాట్స్కీతో కలిసి పనిచేస్తూ, అదే సమయంలో స్టాలిన్‌కి అత్యున్నత బాధ్యతలు అప్పచెప్పడం సాధ్యపడేట్లు చేసింది. స్టాలిన్ ప్రాబల్యం అంతర్యుద్ధ కాలంలోను, లెనిన్ అనారోగ్య కాలంలోను రూపుదిద్దుకుంది. ట్రాట్స్కీకి అపారమైన ప్రజాదరణ ఉన్నది. పైకి కనిపించటమే కాక వాస్తవంలో కూడ స్టాలిన్ దేశంలో దాదాపు ఎవరికీ తెలియనప్పటికీ, లెనిన్ నేతృత్వంలో ప్రథమ శ్రేణి నాయకుడిగా ఎదిగాడు; లెనిన్ ఆయనను ప్రథమశ్రేణి నాయకుడిగా గుర్తించాడు. యు.ఎస్.ఎస్.ఆర్ రూపకల్పన గురించి సెప్టెంబరు 26న లెనిన్ కామెనెవ్‌కి రాసిన లేఖలో ముసాయిదాలోని ఒక పేరాగ్రాఫ్ విషయంలో స్టాలిన్ నుండి రాయితీ పొందగలిగినందుకు తనను తాను అభినందించుకోవడంలో ఇది మరీ స్పష్టంగా కనిపిస్తుంది. లెనిన్ "వీలునామా" అధ్యయనం దీనిని ధృవీకరిస్తుంది.

1922వ సంవత్సరంలో లెనిన్ స్టాలిన్‌ని అనేకసార్లు కలిశాడు. ప్రతి సందర్భంలోను సుదీర్ఘంగా మాట్లాడాడు. స్టాలిన్‌పై ఆయనకున్న నమ్మకానికి జార్జియన్ వివాదంలో తనతో వ్యక్తిగత సంబంధాలు ఉన్న ఎందివని బృందానికి వ్యతిరేకంగా ఒక సంవత్సరం పాటు స్టాలిన్‌ని సమర్థించడం ఋజువు. అయితే వీరిద్దరి మధ్య తీవ్రమైన విభేదాలు జాతుల సమస్య విషయంలో వారిరువురు అనుసరించిన వేర్వేరు ధోరణులలో ప్రస్ఫుటమయ్యాయి. అసలైన అధికార సాధనానికి నిర్దుష్ట రూపాన్ని సమకూర్చి, బలోపేతం చేసే సరళమైన, వేగవంతమైన పరిష్కారాన్ని స్టాలిన్ ప్రతిపాదించాడు. రష్యన్ రిపబ్లిక్ ప్రభుత్వం అన్ని ఆచరణాత్మక అవసరాలకు మిగతా రిపబ్లిక్కులకు కూడా ప్రభుత్వం కాదా? దీనిని అంగీకరించేట్లయితే అధికారికంగా మొత్తం యూనియన్‌కి అదే ప్రభుత్వం అవుతుంది. దీనిని ఎలా సాధించాలి? స్టాలిన్ పథకంలోని ఆరవ పేరాలో ఇందుకు సమాధానం ఉన్నది: "ఈ ఏర్పాటు రష్యన్ కమ్యూనిస్టు పార్టీ సెంట్రల్ కమిటీ ఆమోదించినట్లయితే, దానిని బహిరంగపరచకుండా, అఖిల రష్యా సోవియట్ల మహాసభ జరిగే లోపు ఆయా రిపబ్లిక్‌ల సోవియట్ల సంస్థలకు, సెంట్రల్ ఎగ్జిక్యూటివ్ కమిటీకి, సోవియట్ల కాంగ్రెస్‌కి తెలియజేసేందుకు వీలుగా రిపబ్లిక్కుల సెంట్రల్ కమిటీలకు పంపడం జరుగుతుంది. అఖిల రష్యా సోవియట్ల మహాసభ ఈ ఏర్పాటు రిపబ్లిక్‌ల అభీష్టం అని ప్రకటిస్తుంది." (సమగ్ర రచనలు – సంపుటం : XLV – పుట : 558). ఏది ఏమైనప్పటికీ,

మాస్కోలోని సెంట్రల్ కమిటీ నిర్ణయం గైకొని, దానిని రిపబ్లిక్‌ల సెంట్రల్ కమిటీలపై-- అమలు చేయకపోతే క్రమశిక్షణాయుత చర్యల ద్వారా శిక్షార్హం అయిన "సాధారణ ఆదేశం" ద్వారా -- విధించడం, సెంట్రల్ కమిటీ సంకల్పమే తరువాత తగు రీతిలో రిపబ్లిక్‌ల అభీష్టంగా ప్రకటించబడుతుంది. ఈ క్రమాన్ని గమనిస్తే, స్టాలిన్ పథకపు అసలు ప్రాముఖ్యత స్పష్టమవుతుంది: ఒక యదార్థ (de facto) స్థితిని చట్టబద్ధ (de jure) స్థితిగా మార్చడం ఇక్కడ ఉద్దేశించబడింది. మరోవైపు లెనిన్ తన దృష్టిని కేవలం పరిపాలనాపరమైన సమర్థతకు పరిమితం చేయక, తాను ఎన్నో సంవత్సరాల కృషిలో అభివృద్ధి చేసిన సూత్రాలను అన్వయించి ఈ సమస్యను పరిష్కరించడానికి ప్రయత్నించాడు. లెనిన్ తన లేఖలో తాను రిపబ్లిక్‌ల స్వాతంత్ర్యాన్ని ధ్వంసం చేయడాన్ని కోరుకోవడం లేదని, "స్వతంత్ర రిపబ్లిక్కుల ఫెడరేషన్" పేరిట రాజ్యాంగ దొంతరలో ఒక నూతన అంచెను సృష్టించాలని కోరుకుంటున్నానని రాశాడు. ఈ విషయంలో ఆయన నిజాయితీని శంకించాల్సిన పని లేదు. లెనిన్ సహజంగానే సామర్థ్యం విషయం కూడా పట్టించుకుంటాడు. చేపట్టిన పరిష్కారం రాజ్యాన్ని బలోపేతం చేసేదిగా ఉండాలి. కాని ఆయనకు ముఖ్యమైనదేమిటంటే జాతుల మొత్తం సమస్యను పరిష్కరించాలే కాని అణచి వేయకూడదు. అంతర్జాతీయతను కేంద్రీకృత విధానం కోసం త్యాగం చేయరాదు; జారిస్టు రాజ్యానికి స్వాభావికమైన అణచివేతకి సంబంధించిన బలమైన సాంప్రదాయానికి వ్యతిరేకంగా పోరాడాల్సిన అవసరం వుంది. సోషలిస్టు భావజాలానికి చెందిన మౌలిక సూత్రాలను నిరంతరం గమనంలో వుంచుకోవాలనే ఈ పట్టుదల యూనియన్ కోసం లెనిన్ రూపొందించిన పథకం రూపంలో వ్యక్తీకృతమయింది. ఈ యూనియన్‌లో దాని సమాఖ్య స్వభావానికి, రిపబ్లిక్కుల హక్కులకు, వాటి స్వాతంత్ర్య పరిరక్షణకు, వాటి ప్రత్యేకతల పరిరక్షణకు తగు ప్రాధాన్యత ఇవ్వబడుతుంది. ఆయన ప్రతిపాదించిన సంస్థలు, ఆధిపత్య జాతి (రష్యన్ జాతి – అను) మొత్తం అధికారాన్ని కైవసం చేసుకోకుండా, ఒక హామీగా పని చేయాలి. సోవియట్ పరిస్థితులలో ఈ పథకం వాస్తవ రూపం దాల్చాలంటే, మాస్కోలోని సెంట్రల్ కమిటీకి -- వ్యతిరేక దిశ నుండి ఎంత ఒత్తిడి వచ్చినప్పటికీ -- ప్రతిపాదిత సంస్థలు, హామీలు వాస్తవంలో మృతప్రాయంగా మిగిలిపోకుండా చూసేందుకు అవసరమైన సంకల్పం, దృఢచిత్తం, అధికారం ఉండాలి. అదే సమయంలో, రిపబ్లిక్‌లకి, అంతకు మించి స్థానిక కమ్యూనిస్టులకి, "ముఠా కార్యకలాపాలు" లేక "క్రమశిక్షణ ఉల్లంఘన" పేరిట దాడికి గురయ్యే ప్రమాదం లేకుండా, తమ అభిప్రాయాలను పార్టీ లోపల చట్టబద్ధంగా, సంస్థాగతంగా సమర్థించుకోగల వాతావరణం కల్పించడం కూడా అవసరం. లెనిన్ ప్రతిపాదనలు అర్థవంతం కావాలంటే, పార్టీ అంతర్గత నిర్మాణంలో మార్పులు చేయవలసి

వుంటుంది. ఈ మార్పులను లెనిన్ ఎలా, ఏ మేరకు ప్రతిపాదించాడనే అంశం తరువాత చూద్దాం.

స్టాలిన్ వైపు నుండి చూస్తే, యూనియన్ పథకపు క్రొత్త రూపం తాను రూపొందించిన మొదటి పథకం నుండి కొన్ని వివరాలలో మాత్రమే విభేదిస్తుందని, మొదటి పథకం "సూత్రరీత్యా సరైనదని, సంపూర్ణంగా ఆమోదయోగ్యమైనది" అని స్టాలిన్ పేర్కొనడం సరైనదే. కాలక్రమేణా రాజ్యం యొక్క నిజమైన ప్రయోజనాలది పైచేయి అవుతుందని, ఏది ఏమైనప్పటికీ యూనియన్ తాను అది ఎలా పనిచేయాలని కోరుకుంటున్నాడో అలాగే పని చేస్తుందని స్టాలిన్ విశ్వసించాడు. ఈ పరిస్థితుల్లో లెనిన్ చెప్పిన దానికి తాను పూర్తిగా తలొగ్గినట్లు కాగితం మీద ఉన్నా నష్టమేమీ లేదనుకున్నాడు. ఏది ఏమైనప్పటికీ, స్టాలిన్‌కి సంబంధించినంతవరకు బోల్షివిక్‌ల కార్యక్రమంలో సిద్ధాంతానికి, ఆచరణకు మధ్య ఎటువంటి వ్యత్యాసం లేదు. అయితే, మరోవైపు లెనిన్‌కి ఈ వక్రీకరణ అధికాధికంగా గోచరించసాగింది. అందుకు తాను పాక్షికంగా బాధ్యుడినని గ్రహించాడు. తన తొలి ఉద్దేశ్యాలనుండి, జరుగుతున్న పరిణామాలు మరీ దూరంగా వెళ్ళిపోకుండా తాను అరికట్టవలసి వుందని కూడా గ్రహించాడు.

# 5

# వ్యాధిగ్రస్తుడి నిశిత పరిశీలన

అక్టోబరు 1922లో లెనిన్ తిరిగి కార్యకలాపాలలో పాలుపంచుకోవటం ప్రారంభించినప్పటికీ పనిలో తన సామర్థ్యాన్ని పుంజుకోవటం కాని, పూర్వపు పట్టుని సాధించటం కాని జరగలేదు. నవంబరు 20 నాటి ఆయన ప్రసంగం (అదే లెనిన్ చివరిసారిగా ప్రజల మధ్య కన్పించటం) గందరగోళంగా ఉంది. ముందస్తు కృషి లేకుండా అప్పటికప్పుడు మాట్లాడినట్లు స్పష్టంగా తెలిసిపోతూ వుంది. తనను అధికంగా ఆందోళనకు గురి చేస్తున్న అంశాలపై మాట్లాడినప్పటికీ, ప్రజల్లో భయాందోళనలు రేకెత్తించకుండా ఉండేందుకు, పరిష్కారాల్ని సూచిస్తూ వారికి ఊరట కల్గించేందుకు ప్రయత్నం చేశాడు. అయినప్పటికీ,అందులో భవిష్యత్తును గురించిన స్పష్టమైన దక్పథం లోపించింది. నూతన ఆర్థిక విధానం అవసరమేగాని ప్రమాదకరం; అది ఇంకా తగినంతగా అదుపులో లేదు; ప్రజలింకా దానికి అలవాటు పడలేదు : “దిశా నిర్దేశంలోని ఈ మార్పు మనకు కొన్ని ఇబ్బందుల్ని కలిగించడం కొనసాగుతోంది -- పెద్ద ఇబ్బందుల్నే కలిగిస్తోందని చెప్పగలను”. లెనిన్ ఇంకా ఇలా అన్నాడు: “అసాధారణమైన చర్యల్ని చేపట్టాల్సి వుంది, అసాధారణమైన ఆవిష్కరణలు చేయవలసి ఉంది.” (సమగ్ర రచనలు – సంపుటం: XLV – పుట: 302). పాలనా వ్యవస్థ వెనుకంజ వేసిన మాట సత్యం, అయితే అది తన శక్తుల్ని కూడగట్టుకుని తిరిగి పోరాటానికి సిద్ధం కావాలి; అయితే అది ఏ పద్ధతిలో జరగాలన్నది తెలియడం లేదు. మొత్తం పరిస్థితి విపత్కరంగా ఉంది : “మనం ఎటువంటి పరిస్థితులలో జీవిస్తున్నామంటే, మన రాజ్య వ్యవస్థ యుద్ధంలో ఎంతగా నాశనం అయిందంటే, దాని సాధారణ దిశ నుండి ఎంతగా దారి మళ్ళిందంటే, దానికి ఎదురైన కష్ట నష్టాల వల్ల ఎంతగా బలహీనపడిందంటే, మనం, మన ఉద్దేశ్యాలతో నిమిత్తం లేకుండా, తప్పనిసరిగా యుద్ధానికి ముందున్న అత్యంత బలహీనమైన వృద్ధి రేటుని ప్రమాణంగా చేసుకుని మన ప్రస్తుత అంచనాలను రూపొందించుకోవలసి వుంది.”

విదేశీ సాయం నిదానంగా గాని అందేట్లు లేదు. లెనిన్ ప్రసంగం ఆయన ఎంతటి దుఃఖభరితమైన డోలాయమాన స్థితిలో ఉన్నాడో తెలియచెప్పింది. అన్ని విజయాలను, గత కాలపు అన్ని ఆశలను – అంటే అక్టోబరు రోజుల నాటివి, అవి

నిజమైనవైనా లేక భ్రాంతిజనకమైనా, అంతర్యుద్ధకాలం నాటివి కూడా - పరిరక్షించుకోవాలనే కోరికకు, మరింత వెనుకంజ వేయాల్సిన అవసరం ఏర్పడవచ్చునని, అలా జరిగినప్పుడు ఆశను, శక్తిని కోల్పోరాదనే ఎరుకకు మధ్య ఈ సందిగ్ధత ఇమిడి వుంది. గమ్యాలకు, మార్గాలకు మధ్య సామరస్య సాధన అంత సులభం కాదు. నూతన ఆర్థికవిధానం, ప్రతి దానిని తిరిగి నేర్చుకోవలసిన పరిస్థితి కల్పించింది: "అటువంటి అధ్యయనాన్ని సాధ్యం చేసే నిమిత్తం మనం ఒకరికొకరం ఒక విషయాన్ని గట్టిగా ధృవీకరించి చెప్పుకోవలసిన సమయం ఆసన్నమైందని నాకనిపిస్తోంది: నూతన ఆర్థిక విధానం పేరుతో ఈ వెనకడుగు వేసే క్రమంలో మనం పనులను ఏ రీతిలో చేశామంటే, మనం నూతనంగా ఆర్జించిన దానిని దేనినీ వదులుకోకుండానే, పెట్టుబడిదారులకి మనం అందించే ప్రయోజనాలు ఎలాంటివంటే మన పట్ల ఎంత శతృభావం వున్న రాజ్యమైనా సరే మన మార్కెట్లను, సంబంధాలను అంగీకరించక తప్పని పరిస్థితికి నెట్టబడుతుంది."

ఇదంతా జూదంలో పందెం ఒడ్డినట్లు కనిపిస్తోందని లెనిన్‌కి తెలుసు : కమ్యూనిస్టులు ఇంకా ప్రజా వ్యవహారాల్లో అనుభవం గడించలేదు; వాళ్ళు పాలనా యంత్రాంగంపై ఆధిపత్యం చలాయించడానికి బదులు అదే వీళ్ళపై ఆధిపత్యం చలాయిస్తోంది. లెనిన్ దృఢ విశ్వాసంతో చెప్పగలిగిందేమిటంటే "నూతన ఆర్థిక విధానం నేటి ప్రధానమైన, తక్షణమైన, సార్వజనీనమైన అవసరంగా కొనసాగుతున్నది." (సమగ్ర రచనలు - సంపుటం : XLV - పుట : 308).

అయినా ఈ కొంగ్రొత్త ధోరణికి ఇంకా ఒక నిర్దుష్ట రూపం ఇవ్వబడలేదు; ఏదీ విస్పష్టంగా సాధించబడలేదు.

ఈ ప్రసంగం తరువాత కొద్ది రోజులకు, జార్జియన్ వ్యవహారం గురించిన తీవ్రమైన అనుమానాలతో లెనిన్ వ్యాకులతకు గురి కావడం ప్రారంభమయిన తరుణంలోనే ఆయన పని బాగా తగ్గించుకోవాలని వైద్యులు గట్టిగా చెప్పారు. లెనిన్ సహకరించే రోగి కాదు; కార్యశూన్యత ఆయనకు నచ్చలేదు. కాని తన శారీరక శక్తి సన్నగిల్లుతోందని ఆయన అంగీకరించక తప్పలేదు. చివరకు మాస్కో దగ్గరలోని గోర్కీ అనే గ్రామంలోని తన ఇంటికి వెళ్ళి అక్కడ విశ్రాంతి తీసుకునేందుకు అంగీకరించాడు. కాని లేఖల ద్వారా, టెలిఫోన్ ద్వారా క్రియాశీలమైన రాజకీయ జీవితాన్ని కొనసాగించాడు. కాకసస్ నుండి తిరిగి రావలసి వున్న రైకోవ్, జెర్జిన్‌స్కీల గురించిన సమాచారం కోసం అసహనంగా నిరీక్షించసాగాడు. అయితే అధిక సమయాన్ని ప్రభుత్వంలో తన సహాయకులైన రైకోవ్, కామెనెవ్, స్యురూపల పనిని సమీక్షించడానికి కేటాయించేవాడు. వారితో ఎల్లప్పుడు సంబంధాలు నెరపుతూ, సోవ్నర్కోమ్ కార్యకలాపాల పరిధిని పునర్నిర్వచించడానికి వారు

చేపట్టిన ఉమ్మడి ప్రణాళిక గురించి చర్చించేవాడు. బాధ్యతల పంపకంలో క్రొత్త మార్పులతో సోవ్నర్కోమ్‌ని పునర్వ్యవస్థీకరించడం ఆయన మనస్సులో స్పష్టంగా వారసత్వ సమస్యతో ముడిపడి వుంది. డిసెంబర్ మొదట్లో ట్రాట్స్కీని వచ్చి తనని కలవవలసిందిగా లెనిన్ కోరాడు. మాటల మధ్యలో లెనిన్ "ఉద్యోగస్వామ్య వ్యతిరేక కూటమి"ని ఏర్పాటు చేయాలని సూచించాడు. ఉద్యోగస్వామ్య వ్యతిరేక పోరాటానికి నాయకత్వం వహించే ప్రత్యేక సంఘంలో సభ్యుడిగా ఉండవలసిందిగా ట్రాట్స్కీని కోరాడు. ప్రభుత్వంలో తన సహాయకులలో ఒకరిగా ఉండవలసిందిగా కూడా ట్రాట్స్కీని కోరాడు. ఈ సందర్భంగా ట్రాట్స్కీ ఉద్యోగస్వామ్యంపై పోరాటం, ఈ హానికర ధోరణిని పెంచి పోషించడానికి ఎక్కువ అవకాశాలున్న వారిలో నుండి, అంటే పార్టీలో నుండి, మరీ ముఖ్యంగా పార్టీ నాయకత్వంలో నుండి దానిని తొలగించటంతో ప్రారంభం కావాలని తనకు ఎంతో కాలంగా వున్న దృఢ విశ్వాసాన్ని వ్యక్తపరిచాడు. బహుశా ఈ అభిప్రాయమే గతంలో ట్రాట్స్కీ కార్మిక – కర్షక తనిఖీ వ్యవస్థ గురించి చేసిన, అప్పట్లో లెనిన్‌ని ఎంతో చికాకు పరచిన, విమర్శలకు కూడా ప్రాతిపదిక అయి వుండచ్చు. (ఈ సంభాషణ ట్రాట్స్కీ రచన "ది స్టాలిన్ స్కూల్ ఆఫ్ ఫాల్సిపికేషన్" (పుట: 73–74) లో మరియు డాయిశ్చర్ రచన "ది ప్రాఫెట్ అన్‌ఆర్మ్‌డ్" (పుట : 66) లో పొందుపరచబడింది. లెనిన్ డెప్యూటీగా పనిచేయడానికి ట్రాట్స్కీ మరోసారి తిరస్కరించాడు కానీ అందులో మునుపటి దృఢత్వం లేదు. కార్మిక–కర్షక తనిఖీ, గాస్‌ప్లాన్‌లపై ట్రాట్స్కీ పూర్వపు విమర్శల కోసం లెనిన్ సమగ్ర రచనలు – సంపుటం : XLV – పుట : 180–81 చూడవచ్చు). గతంలో కంటే ఎక్కువ అవగాహన, తక్కువ విశ్వాసంతో వున్న లెనిన్ ట్రాట్స్కీ అభిప్రాయాన్ని అంగీకరించి, దాని నుండి అనేక నిర్ధారణలకు వచ్చాడు.

రైకోవ్ ఎట్టకేలకు జార్జియా నుండి తిరిగి వచ్చి 1922 డిసెంబరు 9న లెనిన్‌ని కలిశాడు. (పైప్స్ రచన "ఫార్మేషన్ ఆఫ్ ది సోవియట్ యూనియన్" – పుట : 281). "జర్నల్" వీళ్ళ కలయికను ప్రస్తావించటం మాత్రమే చేసింది. రైకోవ్ ఏమి చెప్పాడన్నది తెలియదు. మూడు రోజుల తర్వాత జెర్జిన్‌స్కీ కూడా తిరిగి వచ్చాడు. ఆయనను కలిసి మాట్లాడేందుకు లెనిన్ గోర్కీ నుండి మాస్కో వెళ్ళాడు. జెర్జిన్‌స్కీ విచారణ సహజంగానే పార్టీ సెక్రటేరియట్ మొట్టమొదట ఇచ్చిన వివరణలను ధృవీకరించింది. ఆర్జోనికిజ్ తప్పులను కప్పిపుచ్చి, తప్పంతా మరల ప్రమాదకారులైన పెడధోరణివాదుల పైకి నెట్టివేయబడింది. అయితే ఈ పర్యాయం ఏం జరుగుతున్నదనేది లెనిన్ బాగా గ్రహించగలిగాడు. అధికార సూత్రీకరణ చట్రం దిగువన ఒక అసత్యం దాగి వుందని ఆయన అనుమానించాడు. జెర్జిన్‌స్కీ దాచలేకపోయిన రెండు వాస్తవాలను లెనిన్ ప్రత్యేకంగా గమనించదగినవిగా

భావించాడు. మొదటిది, జరిగిన దానంతటికీ బాధ్యులుగా పరిగణించబడిన పూర్వపు జార్జియన్ సెంట్రల్ కమిటీ నాయకులందర్నీ మాస్కోకి రప్పించడానికి కమీషన్ నిర్ణయించడం, రెండవది, ఆర్జోనికిజ్ తన సంయమనాన్ని కోల్పోయి తనను వ్యతిరేకించిన పార్టీ సభ్యుని కొట్టేవరకు వెళ్ళడం. ఫతియెవా జ్ఞాపకాల మేరకు – దీనికి లెనిన్ ధృవీకరణ కూడా వుంది – జెర్జిన్స్కీ వివరణ "ఆయనను తీవ్రంగా బాధపెట్టింది" (ఫతియెవా రచన – పుట : 54; సమగ్ర రచనలు – సంపుటం: XLV – పుట : 596). జబ్బుతో బాధపడుతున్నంత కాలం ఈ సంఘటన పట్ల లెనిన్ ఎంతగా నిమగ్నమయ్యాడో "జర్నల్" తెలియచేసింది.

అప్పుడే రక్తపాతం నుండి, కరువు కాటకాల నుండి బయటపడిన దేశంలో, తనకు నిర్దేశించబడిన విధానాన్ని అమలు చేయడంలో ఏర్పడిన ఇబ్బందుల్ని అధిగమించే క్రమంలో ఒక పార్టీ నాయకుడు కోపాన్ని వ్యక్తీకరించిన సంఘటనకు అంతటి ప్రాధాన్యతను ఆపాదించటం హాస్యాస్పదమయిన స్పందనగా ఎవరికైనా కనిపించవచ్చు. సైన్యంలో, పార్టీ సెక్రటేరియట్‌లో ఆర్జోనికిజ్ సహచరులు అలాగే భావించారు. కాని లెనిన్‌కి ఒక కమ్యూనిస్టు పరిపాలకుడు జయించబడిన దేశంలో నిరంకుశ రాజప్రతినిధిలా ప్రవర్తించడం మొత్తం రాజకీయ వ్యవస్థను ఆవరించిన వ్యాధిగ్రస్తతకి, అది మరింతగా చేయగల నష్టానికి ఒక ఆందోళనకర చిహ్నంగా కనిపించింది. జార్జియన్ వ్యవహారపు చిక్కుముడులు ఒక్కసారిగా భిన్నమైన అర్థంలో లెనిన్‌కి గోచరించసాగాయి. డిసెంబరు 30, 1922న లెనిన్ ఇలా రాశాడు : "విషయాలు ఇంతగా దిగజారిన స్థితికి వస్తే..... మనం ఎటువంటి గందరగోళంలో చిక్కుకున్నామో ఊహించుకోగలం." జెర్జిన్స్కీతో జరిగిన సమావేశం లెనిన్ ఆరోగ్య స్థితిపై ప్రతికూల ప్రభావం చూపింది. బహుశా పక్షవాతం తిరగబెట్టడాన్ని వేగిరపరచింది. ముందురోజు రాత్రి లెనిన్ కలత నిద్రతో గడిపాడు; డిసెంబరు 13 ఉదయం రెండు సార్లు పక్షవాతానికి గురికావడం వల్ల లెనిన్ పనికి పూర్తిగా స్వస్తి చెప్పవలసి వచ్చింది.

తనకు పంపిన వివిధ పత్రాల సంపుటులను తిప్పి పంపే పనిలో లెనిన్ రెండు రోజులు తీరిక లేకుండా గడిపాడు. సోవ్నర్కోమ్ పనుల నిర్వహణ గురించి తన సహాయకులతో ఉత్తర ప్రత్యుత్తరాలు కొనసాగించాడు; విదేశీ వాణిజ్యంపై సెంట్రల్ కమిటీ నిర్ణయాన్ని తిరగదోడే ప్రయత్నంలో తాను సహాయం ఆశిస్తున్న కొంతమందిని కలుసుకున్నాడు; ట్రాట్స్కీతో ఉత్తర ప్రత్యుత్తరాలు నడిపి, మనం ఇంతకుముందే గమనించినట్లుగా, తమ ఉమ్మడి లక్ష్యాన్ని సమర్థించే పనిని ఆయనకు అప్పచెప్పాడు. మరో నిద్ర లేమి రాత్రి పిమ్మట, డిసెంబరు 16 ఉదయం లెనిన్ మరోసారి తీవ్రమైన

పక్షవాతానికి గురయ్యాడు. అయినప్పటికీ, వైద్యులు వచ్చే లోపు చివరి టిప్పణి తన కార్యదర్శులకు చెప్పి రాయించాడు. ఆయన ఎన్నో వారాలుగా సిద్ధపడుతూ వున్న రాబోయే సోవియట్ల కాంగ్రెస్‌లో లెనిన్ పాల్గొనగలడన్న ఆశకి ఇక ఆస్కారం లేకుండా పోయింది. ఆయన క్రెమ్లిన్‌లో తన చిన్న గదికి పరిమితమై పోయాడు: ఆయన ఏ మాత్రం ప్రయాణం చేయగల స్థితిలో లేనందున ముందు అనుకున్న కార్యక్రమం ప్రకారం ఆయన్ను గోర్కీకి తీసుకువెళ్ళడం అసాధ్యమయింది. అయితే, అలా లెనిన్ క్రెమ్లిన్‌లోనే వుండిపోవడమన్నది అనారోగ్యంతో వున్న ఆయనకు మేధో స్పష్టతతో ఆలోచించగలగడానికి ఇంకా మిగిలి వున్న రానున్న ఎనభై రోజులలో ఆయన చేపట్టిన కార్యక్రమాలలో గణనీయమైన ప్రాముఖ్యత సంతరించుకుంది. సందర్శకులకు అనుమతి నిలిపివేయబడింది: వైద్య సిబ్బంది కాక తన భార్య క్రూప్‌స్కయా, సోదరి మారియా ఇల్లినిచ్నా మరియు ముగ్గురు లేదా నలుగురు కార్యదర్శులను చూడడానికి మాత్రమే ఆయనకు అవకాశం కల్పించబడింది. "ఆయన ఆలోచనకు, ఆందోళనకు గురి కాకుండా చూసే" ఉద్దేశ్యంతో ఆయన చుట్టూ ఉన్న వాళ్ళపై ఆయనతో మాట్లాడకూడదని, ఆయనకు ప్రస్తుత రాజ్య వ్యహారాలు తెలియచేయరాదని పరిమితులు విధించబడ్డాయి. (సమగ్ర రచనలు – సంపుటం: XLV – పుట : 710). దీనితో, తనకు ఆసక్తి కల విషయాలు తెలుసుకునేందుకు, తన అభిప్రాయాలు రూపొందించుకునేందుకు, వాటిని సరైన వ్యక్తులకు తెలియచేసేందుకు లెనిన్ సర్వశక్తులూ ఒడ్డి చేసిన పోరాటం ప్రారంభమయింది. ఇది ఒక అనారోగ్యపు మనిషి, మరణాన్ని చూడ నిరాకరిస్తూ, ఏమీ జరగనట్లుగా తన కార్యక్రమాలను కొనసాగిస్తూ చపలచిత్తంతో వ్యవహరించడం కాదు. తద్విరుద్ధంగా, లెనిన్‌కి తాను ఏ క్షణంలోనైనా మరణించవచ్చునని తెలుసు. అలా జరిగినప్పుడు స్పష్టమైన కార్యాచరణ ప్రణాళిక, ఏ దిశలో పయనించాలనే విషయంలో కనీసపు సకారాత్మక సూచనలు లేనందువల్ల దేశం, పార్టీ అత్యంత క్లిష్టమైన పరిస్థితిలో చిక్కుకుంటాయని తెలుసు; అత్యవసర సమస్యల గురించి కనీసం అత్యావశ్యక విషయాలు తాను తెలియచెప్పవలసి వుందని ఆయన భావించాడు; అలా చెప్పడం రాజ్య అధినేతగా, ఒక అపూర్వ విప్లవాన్ని నడిపించిన నాయకునిగా తన విధి అని లెనిన్ అభిప్రాయపడ్డాడు. ఈ రాజకీయ ఆలోచనల ఒత్తిడి రోగి పరిస్థితిని మరింత దిగజారుస్తుందనే అభిప్రాయం వుంది. అయితే, రాజ్య అధినేత తన కర్తవ్యాన్ని పూర్తి చేయటం కోసం మానవ ప్రయత్న రీత్యా సాధ్యమైనది కూడా చేయలేని పరిస్థితి మరింత అధ్వాన్నమైనది.

ఈ పరిస్థితిలో సందిగ్ధత మరింతగా పెరగడానికి, వైద్యుల సలహాలు ఖచ్చితంగా పాటించబడేట్లు చూసేందుకు ఎంపిక చేయబడిన వ్యక్తి మరెవరో కాక స్టాలిన్ కావటం

దోహదం చేసింది. (ఈ నిర్ణయం డిసెంబరు 18, 1922న జరిగిన సెంట్రల్ కమిటీ సమావేశంలో తీసుకోబడింది). అసలైన ఆజ్ఞలు జారీ చేసేది వైద్యులే కాని సెంట్రల్ కమిటీ నియమించిన పర్యవేక్షునితో సన్నిహిత సంప్రదింపుల ద్వారా చేయవలసి వుంటుంది. లెనిన్ పడక దగ్గర జరిగిన ప్రతి విషయం గురించి సమాచారం కలిగి వుండాలని స్టాలిన్ అధికారికంగా ఆదేశించబడ్డాడు. ఆయన తనకప్పగించిన పనిని శ్రద్ధగా నెరవేర్చసాగాడు. క్రూప్స్కయా, స్టాలిన్‌ల మధ్య చోటు చేసుకున్న ఒక ముఖ్యమైన ఘటన, ఆయన తన కర్తవ్యాన్ని ఎలా నెరవేర్చదలుచుకున్నాడో తెలియచెప్తుంది.

డిసెంబరు 22న అంతకు క్రితం రోజు క్రూప్స్కయా లెనిన్ చెప్పగా ఒక లేఖ, వాస్తవంలో ఒక సంక్షిప్త టిప్పణి, రాశారని తన వార్తాహరుల ద్వారా తెలుసుకున్న స్టాలిన్ ఆమెకు ఫోన్ చేసి, ఆమె మాటల్లోనే చెప్పాలంటే “అనుచితమైన నిందలు, బెదిరింపులు” ఆమెపై కుమ్మరించాడు. (ఈ విషయంలో క్రూప్స్కయా కామెనెవ్‌కి రాసిన లేఖ అనుబంధం – V వద్ద ఇవ్వబడింది). వైద్యుల ఆజ్ఞలను ఉల్లంఘించినందుకు ఆమెను పార్టీ కేంద్ర నియంత్రణ సంఘం ముందు విచారణకు నిలబెడతానని కూడా ఆయన బెదిరించాడు. పార్టీ నాయకులకు, లెనిన్ కుటుంబానికి మధ్య ఉండే సంబంధాలలో ఇటువంటి మొరటు ప్రవర్తన ముందెన్నడూ చోటు చేసుకోలేదు. రోగి పట్ల క్రూప్స్కయాకు గల శ్రద్ధను, ఆయనకు శుశ్రూష చేయటంలో ఆమెకున్న సామర్థ్యాన్ని శంకించడానికి ఎటువంటి కారణము కన్పించదు. స్టాలిన్ చర్య సూత్రరీత్యా కూడా సమర్థనీయం కాదు: క్రూప్స్కయా తన భర్తకు వైద్యం చేస్తున్న వైద్యుని అనుమతి పొందారు. స్టాలిన్ సులభంగా ఈ విషయాన్ని ధృవీకరించుకోగలిగి వుండేవాడు. ఆయన విచక్షణను, ఔచిత్యాన్ని పూర్తిగా వదిలి వేయటానికి కారణం పట్టరాని కోపావేశంతో ప్రవర్తించడం : లెనిన్ చెప్పగా క్రూప్స్కయా రాసిన ఈ లేఖ ట్రాట్స్కీకి రాయబడింది. విదేశీ వాణిజ్య గుత్తాధిపత్యంపై సెంట్రల్ కమిటీ చర్చలో “ఒక్క దెబ్బ కూడా కొట్టకుండా” విజయం సాధించినందుకు ట్రాట్స్కీని అభినందిస్తూ ఈ లేఖ రాయబడింది. లెనిన్, ట్రాట్స్కీల మధ్య సంబంధాలు ఇటీవలి కాలంలో మరింతగా సన్నిహితమవుతున్నాయని స్టాలిన్‌కి పూర్తిగా తెలుసు. 1922లో దాని గురించి స్టాలిన్ పెద్దగా పట్టించుకోలేదు. ఎందుకంటే ఆ ఇద్దరు నాయకులు సూత్రబద్ధమైన విషయాలపై ఎప్పుడు ఘర్షణ పడనప్పటికీ, తక్షణ ప్రశ్నలపై మాత్రం నిరంతరం వాగ్వివాదాలలో మునిగి తేలేవారు. అయితే ఇది ట్రాట్స్కీని తన సహాయకునిగా ఉండమని కోరడం నుండి లెనిన్‌ని ఆపలేదు. కాని, ట్రాట్స్కీ ఈ ప్రతిపాదనను తిరస్కరించాడు. ఈ సందర్భాన్ని ఉపయోగించుకుని స్టాలిన్, కొంత మేరకు లోలోన ఆనందపడుతూ, విధి నిర్వహణలో వైఫల్యానికి గాను ట్రాట్స్కీని పొలిట్‌బ్యూరో అభిశంసించేట్లు చేయడంలో విజయం

సాధించాడు. ("ది ప్రాఫెట్ అన్ఆర్మ్‌డ్", రచయిత: డాయిశ్చర్, పుట : 61). దాని తరువాతనే వారిరువురి మధ్య గుత్తాధిపత్య సమస్యపై సామరస్య పూర్వక సంబంధాలు ఏర్పడ్డాయి.

పైగా నవంబరు 25న లెనిన్ మూడో ఇంటర్నేషనల్ విషయంలో పాటించవలసిన ఎత్తుగడల గురించి ట్రాట్స్కీ చేసిన ప్రతిపాదనల్ని తాను ఆమోదిస్తున్నానని పొలిట్‌బ్యూరోకి చెప్పిన విషయం ఇటీవలే తెలిసింది. (సమగ్ర రచనలు – సంపుటం: LIV – పుట : 314). దానికి మించి ఆ వర్తమానంలోని రెండవ భాగంలో నూతన ఆర్థిక విధానం విషయంలో ట్రాట్స్కీ సూత్రీకరణలపై పొగడ్తతో కూడిన అభిప్రాయం వెలిబుచ్చాడు. వాటిని ఒక కరపత్రంగా ప్రచురించి విస్తృతంగా పంచాలని నొక్కి చెప్పాడు. అది నిస్సందేహంగా ఒక గొప్ప ప్రశంస. ఎందుకంటే ఆ సూత్రీకరణలు సోవియట్ విధానంలోని అత్యంత క్లిష్టమైన సమస్యలలో ఒకటి కావడమే కాక లెనిన్‌ని ఎంతో వ్యాకులతకు గురి చేసిన సమస్య కూడా అయిన దానికి సంబంధించినవి. అందరికంటె ఎక్కువగా వారసత్వ సమస్యని పట్టించుకున్న స్టాలిన్, ట్రాట్స్కీ పట్ల లెనిన్ చూపిన ఈ నూతన గౌరవ సూచిక గురించి తెలియగానే కోపంతో భగ్గుమనడంలో ఆశ్చర్య పడవలసిందేమీ లేదు. అంతేకాక, వారిరువురి మైత్రీ బంధం తనకు వ్యతిరేకంగా కలిసి పనిచేయడానికి దారి తీస్తుందేమోననే భయం కూడ స్టాలిన్‌లో ప్రారంభమయింది. అందువల్లనే స్టాలిన్ లెనిన్‌పై తన పర్యవేక్షణను మరింత బలోపేతం చేయడానికి తన శక్తి మేరకు ప్రయత్నించాడు. లెనిన్‌కి అత్యంత సన్నిహితురాలైన ఆయన ప్రధాన కార్యదర్శి ఫతియెవాతో స్టాలిన్ ఫోన్లో మాట్లాడటం ఇందుకు సాక్ష్యం. ఈ సందర్భంలో మాట్లాడిన తీరు మర్యాదపూర్వకంగానే ఉంది. జనవరి 30న ఫతియెవా "జర్నల్"లో ఇలా రాశారు: "వ్లాదిమర్ ఇల్లిచ్‌కి నేను మరీ ఎక్కువగా ఏమీ చెప్పడం లేదు కదా అని స్టాలిన్ నన్ను అడిగాడు. ఆయనకు తాజా వ్యవహారాలన్నీ ఎలా తెలుస్తున్నాయి? ఉదాహరణకు, కార్మిక – కర్షక తనిఖీ విషయంపై రాసిన వ్యాసం ఆయనకు కొన్ని పరిస్థితులు అర్థమయ్యాయని తెలియచేస్తున్నది." ఇది మరో అంశం. దీనిని ప్రాతిపదికగా చేసుకుని కూడా స్టాలిన్‌కి వ్యతిరేకంగా వ్యక్తిగత దాడి జరుగుతోంది. ఇది కొంత గుంభనగానే జరుగుతున్నప్పటికీ, స్టాలిన్‌కి మాత్రం జరుగుతున్నది స్పష్టంగా తెలుసు.

చట్టపర నిర్ణయాల ద్వారా తనపై విధించిన నిశిత పర్యవేక్షణకు, తన కార్యకలాపాలపై విధించిన కఠిన పరిమితులకు వ్యతిరేకంగా లెనిన్ పోరాడవలసి వచ్చింది. డిసెంబరు 23 నాటి ఘటన ఇందుకొక ఉదహరణ. డిసెంబరు 22-23ల మధ్య రాత్రి ఆయనకు తీవ్రమైన పక్షవాతపు పోటు వచ్చింది. కాని బాగానే నిద్ర పోగలిగాడు.

ఉదయం లేచిన తరువాత గాని తన కుడి చేయి, కాలు మళ్ళీ పని చేయటం లేదని తెలియరాలేదు. పొలిట్‌బ్యూరోకి ఈ సమాచారం వెంటనే తెలియచేశారు. పక్షవాతానికి సంబంధించిన అలజడిని ప్రక్కనబెట్టి లెనిన్ ఆలోచనలన్నీ దేశం, పార్టీ భవిష్యత్తు చుట్టూ పరిభ్రమిస్తున్నాయి. అప్పుడు ఆయన రోజుకి అయిదు నిమిషాల పాటు చెప్పి, రాయించేందుకు అనుమతి కోరాడు. తాను "శ్రేణులను విడిచి వెళ్ళడం" ఏ క్షణంలోనైనా జరగవచ్చుని, ఈ లోపు తాననుకున్నది చెప్పి రాయించకపోతే "ఏదైనా సమస్య ఆయనను వేధిస్తున్నప్పుడు, ఆయన నిద్రపోలేడు." అనుమతి లభించిన పిదప లెనిన్ తన కార్యదర్శులలో ఒకరిని పిలిచి నాలుగు నిమిషాలలో ముప్ఫై పంక్తులు చెప్పి రాయించాడు. ఆయనకు మరీ అనారోగ్యంగా అనిపించింది. వైద్యులకు విషయం చెప్పారు. వాళ్ళు అందుబాటులో ఉన్నారు. మరుసటి రోజు తాను "జర్నల్"గా పిలుస్తున్న దానిని చెప్పి రాయించే పని కొనసాగించడానికి అనుమతి కోసం పట్టు పట్టాడు. వైద్యులు ఆయనను ఆపడానికి ప్రయత్నించగా లెనిన్ వారికి తుది హెచ్చరిక జారీ చేశాడు : తనకు రోజుకి కొద్ది నిమిషాలపాటు చెప్పి రాయించడానికి అనుమతి ఇవ్వకపోతే తాను వారితో సహకరించనన్నాడు. (ఇది లెనిన్ సోదరి ఉల్యానోవా కథనం). వైద్యులు, పొలిట్‌బ్యూరో సభ్యులు స్టాలిన్, బుఖారిన్, కామెనెవ్‌లతో కూడిన సంఘానికి లెనిన్ తుది హెచ్చరికను ఖాతరు చేయక తప్పింది కాదు. అనుమతి ఇచ్చారు కాని పొలిట్‌బ్యూరో నిర్ణయం ఆయన చెప్పి రాయించేది జవాబు ఆశించే లేఖల రూపంలో ఉండరాదనే నియమం విధించింది. (ఈ నిర్ణయం అనుబంధం – VI వద్ద ఇవ్వబడింది). ఈ క్రమంలోనే లెనిన్ "వీలునామా" రాయబడింది. మొదట్లో అతి కష్టం మీద రోజుకి కొద్ది నిమిషాల పాటు విడి, విడి సంక్షిప్త టిప్పణుల రూపంలో ఇది చెప్పి, రాయించబడింది. లెనిన్ శారీరక దారుఢ్యం ఒక అద్భుతాన్ని సృష్టిస్తుందనిపిస్తోంది. ఆయన ఆరోగ్యం కుదుటపడసాగింది. పూర్తిగా కోలుకునే ఆశ జనించింది. తరువాత రోజుకొక ముప్పావుగంటపాటు చెప్పి, రాయించగలిగేవాడు. చదవగలిగేవాడు కూడ. తనకు విశ్వాసపాత్రులైన తన బృందం -- తన భార్య, సోదరి, కార్యదర్శులు -- పూర్తి అంకితభావంతో సాయపడగా ఆయన తన పోరాటాన్ని కొనసాగించగలిగాడు.

ఖచ్చితంగా చెప్పాలంటే "వీలునామా" అనేది డిసెంబరు 23-31 మధ్య రాయబడిన టిప్పణుల సమాహారం. జనవరి 4న మరొక టిప్పణి జత చేయబడింది. లెనిన్ రచనల సంపుటంలో వీటిని "పార్టీ మహాసభకి లేఖ" అని పిలిచారు. లెనిన్ భావాలకు నిజమైన వ్యక్తీకరణలు --వీలునామాగా సరైన అర్థంలో పిలవగలిగినవి -- ఈ కాలంలో ఆయన చేసిన రచనలన్నిటా కనుగొనవచ్చు. ఈ రచనలలో అంతర్జాతీయ

స్థితి వర్తమానం, భవిష్యత్తుల గురించిన సుసంగతమైన దృక్పథం, కార్యక్రమానికి, కార్యాచరణకు సంబంధించిన ప్రధాన అంశాలు, అంతర్గత అభివృద్ధి క్రమం ఎలా ఉండవచ్చుననే దానిని వివరించే ప్రయత్నంలాంటివి కనుగొనవచ్చుననే విషయంలో ఎలాంటి సందేహం లేదు. టిప్పణులు కాకుండా, ఈ భావాలు జనవరి, ఫిబ్రవరి 1923లో రాసిన అయిదు వ్యాసాలలో అభివృద్ధి చేయబడ్డాయి. అయితే పొలిట్‌బ్యూరోలో మెజారిటీ సభ్యులు వాటి ప్రచురణను నిరోధించడానికి గాని లేదా ఆలస్యం చేయడానికి గాని ప్రయత్నించారు. (లెనిన్ టిప్పణులు ఆంగ్లంలో ఆయన సమగ్ర రచనల నాల్గవ ముద్రణలో సంపుటం : XXXVI లో లభిస్తాయి. వ్యాసాలు సంపుటం : XXXIII లో లభిస్తాయి. కార్యావళి, చివరి వ్యాసం అనుబంధం – VII మరియు అనుబంధం – IX వద్ద ఇవ్వబడ్డాయి. ఇవన్నీ ఆంగ్లంలో సమగ్ర రచనల అయిదవ ముద్రణలో సంపుటం: XLV లో ఇవ్వబడ్డాయి. గతంలో ప్రచురించబడని అనేక లేఖలు సంపుటం : LIV లో ఇవ్వబడ్డాయి). ఆలోచనకు కొంత సమయం, చెప్పి రాయించడం (కొన్ని సార్లు రెండు భిన్న ప్రతుల్లో), దిద్దుబాట్లు, ప్రాథమిక అధ్యయనం, ఆధార పత్రాల సేకరణ, చరిత్ర, అర్థశాస్త్రం, సోషలిజం, మార్క్సిజం, వ్యవసాయక సమస్యల లోతైన అధ్యయనం – ఇలా తన కార్యకలాపాలన్నింటినీ ఒక ముందస్తు ప్రణాళికలో పొందుపరిచాడు. ఆయన ఆరోగ్యం కొంత మెరుగు పడగానే, లెనిన్ ఒక పనుల కాలక్రమణిక తయారు చేయించాడు. చివరకు ఆయన దానిని దాదాపు పూర్తిగా నెరవేర్చడంలో కృతకృత్యుడయ్యాడు. (ఈ కాలక్రమణిక అనుబంధం – VII వద్ద ఇవ్వబడింది). ఆయన అనారోగ్యం ఆయనలోని స్పష్టమైన భావ ప్రకటనను దెబ్బతీయలేదు గాని, శారీరకంగా పెరుగుతున్న నిస్సత్తువ ఆలోచనా ధారకు సంబంధించిన వేగాన్ని తగ్గేట్లు చేసింది. కొన్ని పర్యాయాలు రచనల్లోని– ముఖ్యంగా మొదట్లో చెప్పి రాయించిన సంక్షిప్త టిప్పణులలో -- స్పష్టతకు కూడ అంతరాయాన్ని కలిగించింది.

# 6
# లెనిన్ "వీలునామా"*

డిసెంబరు 23న లెనిన్ చెప్పి రాయించటం ప్రారంభించిన టిప్పణుల మొదటి పంక్తి నుండే అవి "మన రాజకీయ నిర్మాణంలో కొన్ని మార్పులు చేయడం" కోసం రాబోయే పార్టీ కాంగ్రెస్‌కు సమర్పించదలచిన ప్రతిపాదనగా ఉద్దేశించబడినవని స్పష్టంగా తెలుస్తుంది. (సమగ్ర రచనలు – సంపుటం : XLV – పుట : 343). ఆ మేరకు ఈ మార్పుల్ని తాను ప్రతిపాదించటానికి గల కారణాలను చాలా సంక్షిప్తంగా వివరించాడు. అంతర్జాతీయ రంగంలో వర్గపోరాటం అత్యంత పదునైన రూపు దాల్చటంతో, సోవియట్ నాయకత్వానికి అనేక అననుకూల ఘటనలు ఎదురు కావచ్చు. అందువల్ల సెంట్రల్ కమిటీ ఐక్యత బలోపేతం గావించవలసి వుంది. అప్పుడు మాత్రమే సెంట్రల్ కమిటీ రాజ్యవ్యవస్థని పునర్వ్యవస్థీకరించడం లేదా పునర్నిర్మించడం అనే అత్యవసర కర్తవ్యాన్ని నెరవేర్చగలదు. అదే సమయంలో వ్యక్తులు, బృందాల మధ్య ఘర్షణలకు దారి తీయగల చీలిక రూపంలో పార్టీకి పొంచి వున్న తక్షణ ప్రమాదం నుండి దానిని కాపాడగలదు. లెనిన్ అభిప్రాయంలో, పార్టీ స్థిరత్వానికున్న ఈ ప్రమాదాన్ని అత్యంత తక్షణ సమస్యగా పరిగణించవలసి వుంది.

అందువలన వేయవలసిన తొలి అడుగు సెంట్రల్ కమిటీ సంఖ్యను గణనీయంగా పెంచటం. దీని ప్రభావం పార్టీ స్థిరత్వాన్ని "వేయి రెట్లు" పెంచే విధంగా వుంటుంది. లెనిన్ "కేంద్ర ప్రణాళికా సంఘం నిర్ణయాలకు చట్ట స్థాయి కల్పించాలని, అలా చేస్తే కొంత మేరకు, కొన్ని షరతులకు లోబడి ట్రాట్‌స్కీ ఆకాంక్షలను అంగీకరించినట్లవుతుందని" కూడా ప్రతిపాదించాడు (పై గ్రంథం – అదే పుట). ఈ భావాలను లెనిన్ మొత్తం ప్రణాళిక సందర్భంలోనే అర్థం చేసుకోగలం. అయితే ఇక్కడ మనం నాయకుల మధ్య సంబంధాలలో ఈ టిప్పణులు పోషించిన పాత్ర ఎలాంటిదో తెలుసుకునేందుకు పరిమితమవుదాం.

---

* ('వీలునామా'గా పరిగణించబడే, పార్టీ మహాసభకి 1922 డిసెంబరు 23 నుండి జనవరి 4 తేదీల మధ్య లెనిన్ రాసిన మూడు లేఖలు అనుబంధం – X వద్ద ఇవ్వబడ్డాయి. అనువాదకుడు : రాచమల్లు రామచంద్రారెడ్డి – ప్రచురణకర్తలు).

డిసెంబరు 23 నాటి తొలి టిప్పణి పొలిట్‌బ్యూరో సభ్యులకు పంపడం కోసం వెంటనే స్టాలిన్‌కి అందచేయబడిందని ఇటీవల తెలియవచ్చింది. స్టాలిన్ బహుశా దానిని ఎవరికీ చూపించలేదు. (పై గ్రంథం – పుటలు : 593 – 94). ట్రాట్‌స్కీతో సౌహార్ద్రత పునఃస్థాపనకు నిదర్శనంగా ఉపయోగపడడంలో ఈ టిప్పణి ప్రాధాన్యత గురించి సందేహం లేదు : అది 1922వ సంవత్సరమంతా లెనిన్, ట్రాట్‌స్కీల మధ్య విభేదాలకు కారణమైన అంశానికి (కేంద్ర ప్రణాళికా సంఘానికి) సంబంధించినది. దాని తరువాతి టిప్పణులు చూసి వుంటే స్టాలిన్‌కి భరోసా వుండేది. కాని వాటిని కొంతకాలం పాటు ఎవరికీ పంపలేదు. లెనిన్ మాటల్లో చెప్పాలంటే అవి "ఖచ్చితంగా గోప్యమైనవి." (పై గ్రంథం – పుట : 592 – 93). ఈ టిప్పణులకు అయిదు ప్రతులు – ఒకటి రాజ్యాభిలేఖన నిలయాని (ఆర్కైవ్) కి, ఒకటి లెనిన్ కోసం, మూడు క్రూప్‌స్కయా కోసం – తయారుచేసి, సీలు వేసిన కవర్లలో ఉంచబడ్డాయి. ఈ వివరాలు ఓలడిచేవా 1929లో బయట పెట్టారు. ఈ కవర్లను తెరిచే అధికారం లెనిన్‌కి, లెనిన్ మరణానంతరం క్రూప్‌స్కయాకి మాత్రమే వుంది. అయితే ఈ కవర్లపై "లెనిన్ మరణానంతరం" అనే దురదృష్టకరమైన పదాలు రాసే సాహసం ఓలడిచేవా చేయలేకపోయారు.

అత్యంత తీవ్రమైన అంతర్గత విభేదాలు పార్టీలో చీలికకి దారి తీసే అవకాశం ఉంది. సోవియట్ వ్యవస్థ శత్రువులు అట్టి చీలికను ఊహించడం సరైనదే. ఈ పరిస్థితికి రెండు కారణాలున్నాయి. ఒక కారణాన్ని పాలనా వ్యవస్థ సామాజిక పునాదిలో కనుగొనవచ్చును. మొత్తం వ్యవస్థ అంతా కార్మిక – కర్షక పొత్తుపై ఆధారపడి వుంది. ఈ సఖ్యత విచ్ఛిన్నమైతే "సెంట్రల్ కమిటీ స్థిరత్వాన్ని గురించిన మాటలన్నీ నిష్ఫలమవుతాయి". అలాంటి ఘటన సమీప భవిష్యత్తులో జరిగే అవకాశం బహు తక్కువ. తక్షణ ప్రమాదం నాయకుల మధ్య సంబంధాలలో వుంది. "చీలిక ఏర్పడే ప్రమాదంలో అధిక భాగం" స్టాలిన్, ట్రాట్‌స్కీల మధ్య సంబంధాలపై ఆధారపడి వుంది. చీలిక ఏర్పడే అవకాశాలు ఎక్కువగా వున్నాయని లెనిన్ భావించాడు. ఈ భవిష్యద్దర్శక అంచనా పిమ్మట లెనిన్ ఆరుగురు నాయకుల –– స్టాలిన్, ట్రాట్‌స్కీ, జినొవీవ్, కామెనెవ్, బుఖారిన్, ప్యతకోవ్‌ల ––స్వభావ చిత్రణ అందించాడు. లెనిన్ ఆరోగ్యం ఆందోళనకరంగా వున్నా డిసెంబరు 23, 24 తేదీలలో రూపొందించిన ఈ టిప్పణులలో ఆయన తాను చెప్పదలచుకున్న అన్ని ప్రధాన అంశాలను వివరించాడు. అదే సమయంలో, భవిష్యత్తులో రాజ్యము, పార్టీల కొనసాగింపుకి, స్థిరత్వానికి భంగం కలిగించే ఒక్క అనాలోచిత పదం కూడా దొర్లకుండా జాగ్రత్త పడ్డాడు. ఇందు నిమిత్తం, ఆలోచన, పర్యాలోచన కలబోసి లెనిన్ ఎంతో శ్రమకోర్చి చేసిన ప్రయత్నం ఈ టిప్పణుల్లో ప్రస్ఫుటంగా కనిపిస్తుంది.

ఆ ఆరుగురిలోకి చిన్నవాళ్ళయిన బుఖారిన్, ప్యతకోవ్‌లలో ఒకరు ప్రతిభావంతుడైన సిద్ధాంతవేత్త, పార్టీలో అత్యంత ఆదరణ కల వ్యక్తి. రెండవ వ్యక్తి సమర్థుడు, దృఢ సంకల్పం కలవాడు. అయినా ఇరువురిలో లోపాలు ఉన్నాయి. బుఖారిన్ ఆలోచనా ధోరణి అంతా కూడా పూర్తిగా మార్క్సిస్టు వైఖరి అని చెప్పజాలం : "అతనిలో పండితుల తత్వం కొంత ఉంది. (అతను గతి తార్కిక వాదాన్ని ఎన్నడూ అధ్యయనం చేయలేదు. అది అతనికి ఎన్నడూ పూర్తిగా అర్థం కాలేదనుకుంటాను)." మరోవైపు ప్యతకోవ్‌లోని "పనిలో పరిపాలన పార్శ్వంపట్ల అత్యుత్సాహం చూపే ధోరణివల్ల గురుతరమైన రాజకీయ వ్యవహారాలలో అతనిపై ఆధారపడడం కష్టం." ఏమయినప్పటికీ వాళ్ళు ముప్పై నాలుగు, ముప్పై రెండేళ్ళ వాళ్ళే. వాళ్ళ తప్పులు సరిదిద్దుకునేందుకు ఇంకా సమయం వుంది.

జినొవీవ్, కామెనెవ్‌ల గురించి ఒకే ఒక వ్యాఖ్య చేయబడింది. అయితే దానిని అర్థం చేసుకోవడంలో కొన్ని సమస్యలు ఇమిడి వున్నాయి. ఈ వ్యాఖ్య వాళ్ళిద్దరు తిరుగుబాటు ద్వారా గత ప్రభుత్వాన్ని కూలద్రోయడానికి లెనిన్ చేసిన ప్రతిపాదనను వ్యతిరేకించిన "అక్టోబరు సంఘటన"కు[15] సంబంధించింది. "నిజమే, ఇది యాదృచ్ఛికంగా సంభవించలేదు అయినప్పటికీ దాని బాధ్యతను వారిపై వ్యక్తిగతంగా మోపరాదు. అలానే నాన్ – బోల్షివిజం[16] అనే ఆరోపణను ట్రాట్‌స్కీపై వ్యక్తిగతంగా మోపరాదు." అటువంటప్పుడు గతం ఇలా తవ్వడం వల్ల ప్రయోజనమేముంది? అది ఒక హెచ్చరికగా ఉద్దేశించబడిందా? లేక వారు దోష రహితులని ప్రకటించడమా? లేక రెండూనా? స్టాలిన్, ట్రాట్‌స్కీల గురించి లెనిన్ చేసిన స్వభావ చిత్రణ వెలుగులో పై ప్రశ్నకు సమాధానం చెప్పడం తేలిక కావచ్చు. వీరిద్దరి విరుద్ధ స్వభావాలు అకస్మాత్తుగా, అనుకోని రీతిలో పార్టీలో చీలికకు కారణం కావచ్చు :

"కామ్రేడ్ స్టాలిన్ జనరల్ సెక్రటరీ అయిన తరువాత అపరిమితమైన అధికారాన్ని స్వాయత్తం చేసుకున్నాడు. ఈ అధికారాన్ని ప్రతి సందర్భంలోను తగినంత జాగరూకతతో ఉపయోగించగల సామర్థ్యం ఆయనకు వుందని నాకు నమ్మకం లేదు. మరోవైపు కామ్రేడ్ ట్రాట్‌స్కీ వార్తా, రవాణాల ప్రజా కమిస్సారియట్ (మంత్రిత్వ శాఖ) సమస్యపై సెంట్రల్ కమిటీకి వ్యతిరేకంగా ఆయన చేసిన పోరాటం ఇప్పటికే ఋజువు చేసినట్లు, ఒక్క అసాధారణ సామర్థ్యం మాత్రమే ఆయన ఘనత కాదు. ఆయన బహుశా వ్యక్తిగతంగా ప్రస్తుత సెంట్రల్ కమిటీలో అత్యంత సమర్థుడైన వ్యక్తి. అయితే ఆయన మితిమీరిన ఆత్మవిశ్వాసాన్ని, పనిలో శుద్ధ పరిపాలన పార్శ్వం పట్ల మితిమీరిన నిమగ్నత ప్రదర్శిస్తున్నాడు". (పై గ్రంథం – పుట : 345).

స్టాలిన్, ట్రాట్స్కీ అత్యంత అగ్రశ్రేణి నాయకులన్న అభిప్రాయం, స్టాలిన్‌కి అది కల్పించిన స్థానం వల్ల, దేశంలో విస్మయాన్ని, ట్రాట్స్కీలో క్లేశాన్ని, జినొవీవ్, కామెనెవ్‌లలో అసంతృప్తితో కూడిన ఆశ్చర్యాన్ని రేకెత్తించే శక్తిగల అంశం. చివర పేర్కొన్న ఇద్దరు భవిష్యత్తులో ఏర్పడబోయే పాలకత్రయంలో తాము అత్యంత శక్తివంతులమన్న విశ్వాసంతో కొన్నేళ్ళపాటు ఉన్నారు. లెనిన్ వైపు నుండి చూస్తే, ఆయన గుర్తించిన రెండు క్రొత్త అంశాలు ఈ అభిప్రాయం కలిగించి వుండవచ్చు. ఎనిమిది నెలల క్రితం ఉనికిలోకి వచ్చిన జనరల్ సెక్రటరి పదవి ప్రాముఖ్యత మరియు ఈ పదవిలో వున్న వ్యక్తి అతి కొద్ది కాలంలో అత్యధిక అధికారాన్ని పొందగలిగాడన్న వాస్తవం. ఇరువురు నాయకుల్ని పోల్చటంలో ఎవరి పట్ల మొగ్గు చూపినట్లు కనిపించదు. ట్రాట్స్కీలో అందరికీ తెలిసిన మంచి లక్షణాలు ప్రధానమైన లోపాలతో సరి తూచబడ్డాయి. ఆయనలో "పనిలో శుద్ధ పరిపాలన పార్శ్వం పట్ల మితిమీరిన నిమగ్నత ప్రదర్శించడం" అన్నది ఎంత తీవ్రంగా వుంది? ఈ ప్రశ్నకు సమాధానం చెప్పాలంటే లెనిన్ నిజమైన నాయకునికి ఎటువంటి లక్షణాలుండాలని కోరుకున్నాడో మనం కనుగొనవలసి వుంది. వాటిని మనం గాస్‌ప్లాన్ పై లెనిన్ రూపొందించిన టిప్పణిలో చూడవచ్చు. డిసెంబరు 27, 28,29 తేదీలలో లెనిన్ ఆ లక్షణాలను వివరిస్తూ, గట్టిగా నొక్కి చెబుతూ తన దృష్టిలో రాజ్య నిర్వహణలో వున్న గొప్ప సంస్థలలో దేని అధిపతికైనా అవి ఉండాలన్నాడు. కాబట్టి దేశ నాయకులకు కూడా అటువంటి లక్షణాలు ఉండాలని లెనిన్ పరోక్షంగా సూచించినట్లు భావించవచ్చు. అటువంటి పదవిలో ఉన్న వ్యక్తి ఆర్థిక శాస్త్రం లేక సాంకేతిక విజ్ఞానానికి చెందిన ఏదో ఒక విభాగంలో పటిష్టమైన శాస్త్రీయ శిక్షణ కలిగి ఉండాలి; అతనికి "పరిస్థితి యొక్క సంపూర్ణ వాస్తవికత"ను అర్థం చేసుకోగలిగిన శక్తి ఉండాలి; తన క్రింద పని చేసేవారికి మార్గదర్శనం గావించేందుకు, వారి పనిని పర్యవేక్షించేందుకు అట్టి నాయకుడు కొంత వ్యక్తిగత ఆకర్షణ కలిగి వుండాలి. అదే సమయంలో అతను సమర్థుడైన కార్యనిర్వాహకుడు, పరిపాలకుడు అయి వుండాలి. కాని "ఒకే వ్యక్తిలో ఈ రెండు విధాలైన లక్షణాలు కలిసుండడం చాలా అరుదుగా కనిపిస్తుంది; అలా ఉండడం గట్టి అవసరం కూడా కాకపోవచ్చు" (అదే గ్రంథం–పుట : 351). గాస్‌ప్లాన్ లాంటి సంస్థ విషయంలో పాలనాపరమైన పార్శ్వం అంత ప్రధానమైనది కాదు. ఈ రెండు తరహాల వ్యక్తుల ఆదర్శ కలయికలో, శాస్త్రీయ జ్ఞానాన్ని సముపార్జించిన వ్యక్తి -- అతనిలో పర్యాలోచనా సామర్థ్యం, ప్రజలతో కలిసిపోగలిగిన శక్తి వుంటే -- అతనే నాయకుడిగా ఉండాలి. ఈ సూత్రీకరణ ద్వారా దేశం మొత్తానికి దిశా నిర్దేశం చేయగలిగిన ఒక ఆదర్శవంతమైన స్థితిని కనుగొన్నానని లెనిన్ విశ్వసించి ఉండవచ్చు. ఇక్కడ విషయం క్రిజిజనోవ్‌స్కీని

గాస్ప్లాన్ అధిపతిగా నియమించి, ప్యతకోవ్‌ను ఆయనకు సహాయకుడిగా నియమించడం మాత్రమే అయితే, లెనిన్ ఈ అంశాన్ని అంత విస్తృతితో లేవనెత్తి వుండేవాడు కాదు. కాని ట్రాట్స్కీ, స్టాలిన్‌లు అటువంటి కలయికగా ఏర్పడలేదు. పరస్పరం సహకరించుకోవడానికి బదులు భిన్న ధృవాలు అయ్యారు.

అంతర్యుద్ధం నాటి పరిస్థితులలో ట్రాట్స్కీ ప్రవర్తించిన తీరును ఇప్పుడు తప్పుబట్టడం అసమంజసమని నిస్సందేహంగా చెప్పవచ్చు. అప్పట్లో అది సంపూర్ణంగా యుక్తమైనదిగా భావించబడింది; పూర్తిగా విజయవంతమయింది. వేరే పరిస్థితులలో, సెంట్రల్ కమిటీలోని ఇతర సభ్యుల కంటే రాజ్యానికి, విప్లవానికి సంబంధించిన సమస్యల్ని శాస్త్రీయ దృక్పథంతో పరిశీలించడంలో ట్రాట్స్కీ మరింత సామర్థ్యం కలిగినవాడు. ఆదర్శ నాయకుడి నుండి లెనిన్ ఆశించిన "పరిస్థితి యొక్క సంపూర్ణ వాస్తవికత"ను అర్థం చేసుకునే శక్తి ట్రాట్స్కీ పూర్తిగా కలిగివున్నాడు. మరోవైపు నుండి చూస్తే ఆయనకు తగినంత "వ్యక్తిగత ఆకర్షణ" వుందా అనేది సందేహాస్పదం. ఏది ఏమైనా, ఆ పదానికి గల సంకుచితార్థంలో రాజకీయవేత్తకు ఉండాల్సిన కొన్ని లక్షణాలు ట్రాట్స్కీకి లేవని లెనిన్‌కి బాగా తెలుసు : ఇతరులతో సంబంధాలలో సర్దుకుపోయే తత్వం, ఎత్తుగడల పట్ల అభిరుచి, వ్యూహ రచనా పటిమ, ఎలాంటి శషభిషలు లేకుండా, విచక్షణా రహితంగా నియంతృత్వమనే రాజకీయ ఊబిలోకి దిగగలిగిన శక్తి. గెలుపు సంగతి అలా వుంచి, అసలు అలాంటి ఆట ఆడడానికే ట్రాట్స్కీ సన్నద్ధంగా లేడని తర్వాతి ఘటనలు చూపించాయి. ట్రాట్స్కీకి వ్యతిరేకంగా చేయబడిన విమర్శలు అంత స్పష్టంగా లేనప్పటికీ, ఆయన రాజకీయ సామర్థ్యాలను లెనిన్ శంకించటం సరైనదే. క్లుప్తంగా చెప్పాలంటే, "వీలునామా"లో పేర్కొన్న విషయాలు దృష్టిలో పెట్టుకుని చూస్తే ట్రాట్స్కీ స్థాయి తగ్గించబడినట్లు కనిపిస్తుంది. ఇందుకు ఒక ప్రధాన కారణం ఆయనను స్టాలిన్‌కి పైన ఉంచకపోవడం. మరో కారణం, గతంలో ట్రాట్స్కీ బోల్షివిజాన్ని వ్యతిరేకించిన అంశం, దానిని ఆయనకు వ్యక్తిగతంగా ఆపాదించకూడనప్పటికీ, పేర్కొనడం మాత్రం జరిగింది.

స్టాలిన్‌ను తప్పు పట్టేందుకు లెనిన్‌కి ఇదమిద్ధంగా ఏమీ పైకి కనిపించనప్పటికీ ఒక సందేహాన్ని మాత్రం వ్యక్తపరిచాడు : ఆయన తన చేతిలో ఉన్న అంతులేని అధికారాన్ని ఉపయోగించడంలో తగినంత జాగరూకత చూపగలడా? ఈ సందేహాన్ని వ్యక్తం చేయడంలో లెనిన్ చూపిన అంతర్బుద్ధి (ఇంట్యూషన్) ఎంత సరైనదైనప్పటికీ, 1923 ప్రారంభంలో దానికి అంత రాజకీయ ప్రాముఖ్యత లేదు. స్టాలిన్ స్థానాన్ని దెబ్బతీసే విధంగా అదేమీ చేయలేకపోయింది. టిప్పణులు ఇక్కడితో ఆగిపోయి వుంటే, వాటిని పార్టీ మహాసభలో చదివినా ప్రతినిధులకు అవి ప్రధానంగా నాయకుల మధ్య సరైన

సమతౌల్యాన్ని నెలకొల్పటం ద్వారా చీలికను నివారించడానికి ఉద్దేశించినట్లుగా కనపడి వుండేవి. ఈ పత్రంలో ప్రశంసను, విమర్శను సమపాళ్ళలో మేళవించడం పూర్తిగా ఉద్దేశ్య పూర్వకంగా జరిగిందనేది సుస్పష్టం. లెనిన్ తన అధికారాన్ని వేరెవరికీ సంక్రమింప చేయజాలడు; ఎందుకంటే ఆయన చక్రవర్తి కాడు. తన అనారోగ్యానికి ముందు నుండి తన తర్వాత నాయకుడు ఎవరన్న సమస్య లెనిన్ ఆలోచనలలో ఉన్నప్పటికీ, పార్టీకి తన తర్వాతి నాయకుడ్ని సూచించే అధికారం తనకుందని ఆయన భావించలేదు. తాను "శ్రేణుల్ని వదిలి వెళ్ళే" సమయం కోసం ఎదురు చూస్తున్న లెనిన్, పార్టీ ఐక్యతకు భంగం కలగకుండా చూసే ప్రయత్నంలో భాగంగా తన వ్యక్తిగత ఎంపికను ప్రస్ఫుటంగా ప్రకటించడానికి దూరంగా ఉన్నాడు. అంతేగాక, ఈ మొదటి టిప్పణులను రూపొందించే దశలో, లెనిన్‌కి ఎవరి పట్ల మొగ్గు వుండి వుండకపోవచ్చు. ఒకవేళ ఆయన ట్రాట్స్కీ వైపు మొగ్గు చూపినా, నాయకుల మధ్య సంబంధాలు చెడిపోకుండా చూసేందుకు ఆయన తన అభిప్రాయాన్ని దాచి పెట్టవలసి వుంది. ట్రాట్స్కీ పట్ల జినోవీవ్, కామెనెవ్, స్టాలిన్ లాంటి సహ బోల్షివిక్కులకి, పార్టీలోని వివిధ అతివాద బృందాలకు ఉన్న వైఖరిని ఆయన నిర్లక్ష్యం చేయజాలడు. గతంలో ట్రాట్స్కీ బోల్షివిజం పట్ల చూపిన వ్యతిరేకత ఇప్పటికే అనేక వివాదాలలో ఆయనకు వ్యతిరేకంగా పని చేసింది. లెనిన్ తన ప్రతిష్టను ఉపయోగించి ఆయనను సమర్థించవలసి వచ్చింది. ఆయనను తన వారసుడిగా ప్రతిపాదించడాన్ని లెనిన్ కలలో కూడా ఊహించజాలడు. మరీ ముఖ్యంగా, స్టాలిన్ విషయంలో ఆయనొక క్రొత్త అభిప్రాయానికి వచ్చేవరకు, ఒక్క వారసుడే వుండే పరిస్థితిని లెనిన్ ఊహించలేదు.

ఈ దశలో, క్రోడికరించి చెప్పాలంటే, లెనిన్ అభిప్రాయంలో ఇద్దరు అత్యంత ప్రముఖ నాయకులైన స్టాలిన్, ట్రాట్స్కీలు తమ అగ్రగణ్యత్వాన్ని పరిరక్షించుకోవాలి; జినోవీవ్, కామెనెవ్‌లు ద్వితీయ స్థానంలో ఉండాలి; ఎందుకంటే అత్యంత క్లిష్ట సమయంలో వారు చూపిన బలహీనత యాదృచ్ఛికం కాదు కావున పునరావృతం కావచ్చు; అందరిలోకి చిన్నవాళ్ళయిన బుఖారిన్, ప్యతకోవ్‌లు తాము మరింత పరిణతి సాధించేవరకు తృతీయ స్థానంలో ఉండాలి. కాని ఇంతకంటే మెరుగైన ఏర్పాటు సాధ్యంకానందున, పార్టీ తన నాయకులను శ్రద్ధగా కనిపెట్టి ఉండాలి; ఎందుకంటే వాళ్ళు తప్పులకు అతీతులు కారు; వాళ్ళ మధ్య వైరాలు తీవ్ర పర్యవసానాలకు దారి తీయవచ్చు. అలానే స్టాలిన్ తన అధికారాన్ని ఉపయోగించే తీరుతెన్నులను కూడా జాగ్రత్తగా గమనిస్తూ ఉండాలి. ఇటువంటి నియంత్రణలను అమలు చేయడం కోసం సెంట్రల్ కమిటీ అధికారాన్ని, ప్రతిష్టను బలోపేతం చేయాలి. ఈ దశలో కూడా తాను సాధించదలచిన సమతౌల్యాన్ని దెబ్బ

తీయగల "సూక్ష్మ విషయాన్ని" గమనించడంలో లెనిన్‌లోని సూక్ష్మగ్రాహ్యత స్పష్టమవుతుంది. ఈ విషయం స్టాలిన్ స్థానాన్ని మిగతా అయిదుగురి కంటే బలోపేతం చేసిన "అపరిమితమైన అధికారం". అప్పటికి ఆయన ఆ "సూక్ష్మ విషయం" పై వ్యాఖ్యానించలేదు. కాని, మౌలిక ప్రశ్నలపై సుదీర్ఘ పర్యాలోచన పిమ్మట ఆయన తిరిగి వ్యక్తులు, వ్యక్తిత్వాల సమస్యను పరిశీలించినప్పుడు ఈ "సూక్ష్మ విషయం" దారి తీయగల పరిణామాలను సవివరంగా పేర్కొన్నాడు.

వాస్తవానికి లెనిన్ ఆరోగ్య స్థితి అలానే కొనసాగుతున్నందున, ఆయన పని చేసుకుంటూ పోయాడు. మొదటి టిప్పణి చెప్పి రాయించిన పదిరోజుల పిమ్మట -- ఈ మధ్య కాలంలో ఆయన దృష్టి వేరే సమస్యల వైపుమళ్ళింది -- 1923 జనవరి 4న తన "వీలునామా"కి అంతిమ వివరణను జోడించాడు. ఈ వివరణ అంతకుముందు రాసిన విషయాల ద్వారా సాధించ యత్నించిన సున్నితమైన సమతౌల్యాన్ని పూర్తిగా కూలద్రోసింది. మరోవిధంగా చెప్పాలంటే లెనిన్ అప్పటికే అంతర్లీనంగా గ్రహించిన వాస్తవ అసమతౌల్యాన్ని సరిచేయడానికి ఇది ఉద్దేశించబడింది. స్టాలిన్‌ని జనరల్ సెక్రటరీ పదవి నుండి తొలగించటాన్ని లెనిన్ ప్రతిపాదించాడు.

"స్టాలిన్ మరీ మొరటు; ఈ లోపం మన మధ్యలోనూ, కమ్యూనిస్టులమైన మనతో జరిపే వ్యవహారాలలో ఎంతో సహించదగినది అయినప్పటికీ, జనరల్ సెక్రటరీలో సహించరానిదవుతుంది. అందుకని, ఆ పదవి నుండి స్టాలిన్‌ని తొలగించే మార్గం అన్వేషించవలసిందిగా కామ్రేడ్స్‌కి నేను సూచిస్తున్నాను. ఆయన స్థానంలో అన్ని విషయాలలో ఆయన నుండి భిన్నంగా వుండే ఔన్నత్యం గల వ్యక్తిని నియమించాలి. అంటే ఎక్కువ సహనమూ, కామ్రేడ్స్ పట్ల ఎక్కువ చిత్తశుద్ధి, మర్యాదా, సుహృద్భావమూ, చపల చిత్తత లేకపోవడం వంటి లక్షణాలు అట్టి వ్యక్తికి ఉండాలి." (సమగ్ర రచనలు - సంపుటం : XLV - పుట : 346)

ఈ పదాలన్నీ ఏదయినా కోపం తెప్పించిన ఘటనకు ప్రతిచర్యగా వెనువెంటనే జరిగిన భావ వ్యక్తీకరణగా భావించే అవకాశం వుంది. దానికి గాను డిసెంబరు 22న స్టాలిన్ క్రూప్‌స్కయాపట్ల అవమానకరంగా ప్రవర్తించిన తీరును ఉదహరించడానికి మనం ప్రేరేపించబడవచ్చు. సింహం ప్రాణాంతకంగా గాయపడిందని తెలిసివుండకపోతే స్టాలిన్ తాను ప్రవర్తించిన తీరులో ప్రవర్తించి వుండేవాడు కాదు. లెనిన్, రెండునెలల తర్వాత తాను స్టాలిన్‌కి రాసిన లేఖలో పేర్కొన్నట్లుగా, అటువంటి ప్రవర్తనను క్షమించే వ్యక్తి కాదు : "నాకు వ్యతిరేకంగా జరిగిన దానిని అంత తేలికగా మర్చిపోయే ఉద్దేశ్యం నాకు లేదు. ఇక నా భార్య పట్ల ఏదయినా అనుచితంగా జరిగి వుంటే అది నా పట్ల జరిగినట్లుగానే

భావిస్తానని ప్రత్యేకించి చెప్పనవసరం లేదు." (ఈ లేఖ ఏడవ అధ్యాయంలో పూర్తిగా ఉటంకించబడింది). వాస్తవానికి క్రూప్స్కయా ఆ సమయంలో లెనిన్‌కు జరిగిన విషయం చెప్పలేదు. చెప్తే ఆయన ఆరోగ్యంపై తీవ్ర ప్రభావం చూపుతుందనే భయం ఇందుకు కారణం. అయితే ఆమె తనకు తక్షణం కలిగిన కోపాన్ని ఉపశమింపచేసుకునేందుకు తీవ్రంగా ఫిర్యాదు చేస్తూ కామెనెవ్‌కు లేఖ రాశారు. (ఈ లేఖ అనుబంధం - V వద్ద ఇవ్వబడింది). కొన్నాళ్ళు పోయాక ఆమె భర్తకు ఈ విషయం చెప్పి ఉండవచ్చు. తనంత తాను చెప్పి ఉండవచ్చు లేదా ఏదో అనుకోనిది జరిగిందనిపించి లెనిన్ ఆమెను గుచ్చిగుచ్చి ప్రశ్నించడం వల్ల చెప్పి ఉండవచ్చు. వెంటనే కలిగిన కోపావేశంలో లెనిన్ ఈ టిప్పణి చెప్పి రాయించి ఉండవచ్చు. దీనిలో స్టాలిన్ నైజానికి సంబంధించిన లోపాలే పేర్కొనబడినాయి కాని, రాజకీయ విమర్శలు చేయలేదు. లెనిన్ రచనల సర్వస్వానికి సంపాదకత్వం వహించినవారు మార్చి వరకు క్రూప్స్కయా ఈ విషయం ఆయనకు తెలియచేయలేదని భావించారు. అయితే ఈ విషయంలో ఏదీ మనం గట్టిగా చెప్పలేము. అంతేకాక, లెనిన్ గురించి మనకు తగినంతగా తెలుసు కావున నాయకునిగా అన్నిటికంటె రాజకీయాలకు అత్యధిక ప్రాధాన్యాన్నిచ్చే ఆయన స్వభావంలో ఈ విషయానికి వివరణ కోసం మనం చూడవలసి వుంటుంది. "వీలునామా" తొలి టిప్పణి లెనిన్ ఏ సమస్యపై తన ఆలోచనలను కేంద్రీకరించాడో స్పష్టంగా తెలియచేస్తుంది. ఇదే అంశాన్ని అనేక ఇతర వాస్తవాలు రూఢిపరిచాయి. తన భార్య పట్ల చూపిన అమర్యాదకు ప్రతిగా -- అందునా ఇటువంటి ప్రవర్తన కమ్యూనిస్టుల మధ్య సంబంధాలలో ''ఎంతో సహించదగింది" అని లెనిన్ పరిగణిస్తున్న దృష్ట్యా -- సెంట్రల్ కమిటీలోని అధికార సమతౌల్యాన్ని దెబ్బతీసే రాజకీయ చర్య తీసుకునే దిశగా లెనిన్ ప్రేరేపించబడ్డాడని భావించడం నిష్ప్రయోజనకరమైనది. లెనిన్ చర్యకు మరింత ముఖ్యమైన కారణాలు ఉన్నాయి. ఇందుకు ఋజువు డిసెంబరు 30,31 తేదీలలో జాతుల సమస్యపై, స్వయం ప్రతిపత్తి ప్రణాళికపై రూపొందించిన టిప్పణిలో మనకు లభిస్తుంది. తన కార్యావళికి అనుగుణంగా, మొదటి టిప్పణి రాయించిన వారం రోజుల పిమ్మట లెనిన్ ఈ అంశాలను చేపట్టాడు.

ఈ టిప్పణి మొత్తం "వీలునామా"లో అత్యంత ముఖ్యమైన వాటిలో ఒకటి. బహుశా ఇది అత్యంత ప్రధానమైనది కూడా ఎందుకంటే అప్పుడు లెనిన్ ఎదుర్కొంటున్న సంక్షోభం తీవ్రతను, ఆయన మేధోపరమైన నిజాయితీని, రాజకీయ సాహసాన్ని ఇది మనకు అవగతం చేస్తుంది. రాజకీయ సమస్యల పట్ల ఆయన పడిన ఆందోళన ఆరోగ్య క్షీణతను వేగిరపరచి ఉండవచ్చు.

జాతుల సమస్యపై లెనిన్ పర్యాలోచన ఒక ఆత్మ విమర్శతో ప్రారంభమవుతుంది: "అందరికీ తెలిసిన స్వయం ప్రతిపత్తి సమస్య విషయంలో శక్తివంతంగాను, నిర్ణయాత్మకంగాను నేను జోక్యం చేసుకోనందుకు రష్యన్ కార్మికుల విషయంలో చాలా తప్పు చేసినట్లు నేను భావిస్తున్నాను. ఈ సమస్య అధికాధికంగా సోవియట్ సోషలిస్టు రిపబ్లిక్కుల యూనియన్ సమస్యగా పిలవబడుతున్నది." (సమగ్ర రచనలు – సంపుటం : XLV – పుట : 356). దీని తరువాత ప్రధానంగా తన అనారోగ్యాన్ని ఆధారంగా చేసుకుని సుదీర్ఘమైన వ్యక్తిగత సమర్ధన ఇవ్వబడింది; తదుపరి జెర్జిన్స్కీ సమర్పించిన నివేదిక బహిర్గతపరచిన అంశాలు వివరించబడ్డాయి -- ప్రధానంగా ఆర్జోనికిజ్ తన కోపాన్ని అదుపులో పెట్టుకోలేక తనను వ్యతిరేకించిన సాటి కమ్యూనిస్టుని కొట్టడం! "మనం ఎంతటి గందరగోళ స్థితిలో చిక్కుకున్నాం!" రష్యా గురించి, "సోవియట్ స్ఫూర్తి ఏమాత్రం సోకని" రష్యన్ ఉద్యోగస్వామ్యం గురించి, అన్నిటినీ మించి "ఆ నిజమైన రష్యన్ మనిషి, ఫక్తు రష్యన్ ఉద్యోగిలానే యదార్ధ స్వభావంలో ధూర్తుడు, నియంత అయిన మహా రష్యన్ జాతికి చెందిన దురహంకారి" గురించి కరతలామలకంగా తెలిసిన లెనిన్, తన ప్రభుత్వం రష్యన్ జాత్యహంకారుల దాడి నుండి మైనారిటీ జాతులకు తగు రక్షణ కల్పించలేకపోయిందని గుర్తించగలిగాడు. అయితే విమర్శ ఇంకా ముందుకు సాగింది: గతంలో లెనిన్ భావించినట్లు దోషులు మునుపటి నిరంకుశ ఉద్యోగస్వామ్యంలో సభ్యులుగా ఉండినవారిలో మాత్రమే లేరు; సోవియట్ పాలనా వ్యవస్థ కూడా, అత్యున్నత స్థానాలలో వున్న పార్టీ నాయకులతో సహా, సిసలైన సామ్రాజ్యవాద ధోరణిలో, సూక్ష్మాంశాలలోనే అయినప్పటికీ, ప్రవర్తించింది. ఈ పరిస్థితి పార్టీ బహిరంగంగా ప్రకటించిన "సిద్ధాంతం పట్ల పూర్తి నిజాయితీ, సామ్రాజ్యవాద వ్యతిరేక పోరాట సూత్రానికి పూర్తి మద్దతు"లను అర్ధ రహితంగా మార్చిందని లెనిన్‌కి స్పష్టంగా తెలుసు; అలా చెప్పడానికి ఆయన జంకలేదు. ఇదంతా మరింత తీవ్రమైన విషయం అవుతుంది. ఎందుకంటే "ప్రపంచ చరిత్రలో రేపటి రోజు, సామ్రాజ్యవాద అణచివేతకు గురైన ప్రజలు జాగృతమై పూర్తి సన్నద్ధతతో తమ విముక్తికోసం నిర్ణయాత్మకమైన, సుదీర్ఘమైన, కఠినమైన పోరాటాన్ని ప్రారంభించే రోజవుతుంది." లెనిన్ నిరంతరం వ్యతిరేకిస్తున్న చర్యల్ని పరిగణనలోకి తీసుకుని చూస్తే పార్టీ యొక్క సోషలిస్టు, విప్లవ నిజాయితీ మరింత అనుమానాస్పదమయిందని మనం ప్రత్యేకించి చెప్పనవసరం లేదు.

లెనిన్ అభిప్రాయంలో అంతర్జాతీయవాద స్ఫూర్తితో జాతుల సమస్యకు పరిష్కారం కనుగొనడంలో వారిని నడిపించవలసిన తొట్టతొలి సూత్రాన్ని కూడా పార్టీ నాయకులు కనీసం అర్థం చేసుకోలేదు. తమను ఎన్నో అవమానాలకు, అన్యాయాల పరంపరకు

గురిచేసిన మెజారిటీ జాతిపట్ల ప్రగాఢమైన అవిశ్వాసంతో వున్న సరిహద్దు ప్రాంతాల ప్రజలను కార్మిక వర్గం, తన ప్రయోజనాల పరిరక్షణ కోసం, గెల్చుకోవలసి వుంది. పరిస్థితి ఎలాంటిదంటే, సంఖ్యాధిక్య జాతి చట్టపరమైన సమానత్వాన్ని ప్రకటించడంతో సరిపెడితే దానిని బూర్జువా ధోరణిగా పరిగణించే అవకాశం వుంది. చిన్న జాతులకు వ్యతిరేకంగా జరిగిన తప్పుల్ని సరిదిద్దాలంటే పెద్ద జాతి తనకు అననుకూలమైన అసమానత్వాన్ని అంగీకరించాల్సి వుంటుంది. చిన్న జాతుల ప్రయోజనాలకు భంగకరంగా వాస్తవంలో ఉనికిలో కొనసాగుతున్న అసమానత్వానికి పరిహారంగా పెద్దజాతి తనకి వ్యతిరేకంగా అసమానతను విధించుకుని ఆచరించవలసి వుంటుంది. చిన్న జాతులకిచ్చే రాయితీలలో, వారి ప్రయోజనాల పరిరక్షణకై తీసుకొనే చర్యలలో పెంపుదల ఉండాలి. ఇది స్టాలిన్, ఆర్జొనికిజ్, జెర్జిన్స్కీల విధానం కాదు. లెనిన్ ఖండన ఎంత తీవ్రంగా ఉందంటే, వారి పట్ల, వారిలాంటి వారి పట్ల ఆయనకు లోతైన రాజకీయ వ్యతిరేకత ఉందన్న విషయంలో ఇక ఏమాత్రం సందేహం లేదు. స్టాలిన్‌పై అభియోగాలేమంటే హానిదాయకమైన తొందరపాటుతో ప్రవర్తించడం, "సామాజిక జాతీయవాదులు"గా పరిగణింపబడుతున్న వారి పట్ల తన కోపాన్ని ప్రమాదకరమైన రీతిలో వ్యక్తీకరించడం. సరిహద్దు ప్రాంతాల నుండి వలస వచ్చి రష్యనీకరించబడిన వారిలో కొట్టొచ్చినట్లు కనిపించే "సిసలైన రష్యన్" ధోరణి జెర్జిన్స్కీ ప్రదర్శిస్తున్నాడు. ఒక విచారణ సంఘానికి అధిపతిగా నియమించినప్పుడు ఆయన ఎంతటి క్షమార్హం కాని పక్షపాతాన్ని ప్రదర్శించాడంటే, ఆ సంఘం మొత్తం కృషిని నిరర్ధకంగా పరిగణించవలసి వుంటుంది. విచారణలో "నిస్సందేహంగా చోటు చేసుకున్న అపరిమితమైన తప్పులు, పక్షపాతపూరిత నిర్ధారణల పట్టికను సరి చేయాలంటే" మొత్తం విచారణను తిరిగి ప్రారంభించాల్సి వుంటుంది. స్టాలిన్, ఆర్జొనికిజ్‌లు మహా రష్యన్ జాత్యహంకారుల్లా ప్రవర్తిస్తున్నారని, కార్మిక వర్గ అంతర్జాతీయత నియమాలను త్రోసిపుచ్చి సామ్రాజ్య వాద వైఖరికి లోనయ్యారని లెనిన్ వారిపై సంపూర్ణ నేరారోపణ చేశాడు. ఆర్జొనికిజ్‌కి "హెచ్చరికగా పనిచేసే శిక్ష" విధించాలని ఆయన కోరాడు. ట్రాట్స్కీ ప్రకారం ఈ శిక్ష కనీసం తాత్కాలికంగానైనా పార్టీనుండి తొలగించటం అయివుండవచ్చు. ఈ వ్యవహారానికి స్టాలిన్, జెర్జిన్స్కీల రాజకీయ బాధ్యత దృష్ట్యా వారిద్దరినీ అధికారికంగా ఖండించాలని కూడా లెనిన్ ప్రతిపాదించాడు. అంతేకాక, వారిరువురిని "ఉల్లంఘన వాదుల" ని కూడా లెనిన్ ఆరోపించాడు. (7వ అధ్యాయంలో చూడండి). స్వయం ప్రతిపత్తి పథకం ఏదైనా "బహుశా దాని సారాంశంలోనే అన్యాయమైనది. అపరిపక్వమైనది" అని లెనిన్ గుర్తించాడు. యూనియన్‌ని కొనసాగించాలని లెనిన్ అంగీకరిస్తాడు. అయితే ఇది రెండు షరతులకు లోబడి జరగాలి. ఒకటి,

అవసరమైనప్పుడు కలయికను రద్దు పరిచే అవకాశం వుండాలి. రెండవది, యూనియన్ అధికారాలను విదేశాంగ విధానం, రక్షణలకు పరిమితం చేసి మిగతా అన్ని అంశాలలో "పాత కమిస్సారియట్ల సంపూర్ణ స్వతంత్రతని పునరుద్ధరించాలి." మరో విధంగా చెప్పాలంటే, రాబోయే సోవియట్ల కాంగ్రెస్ నుండి ప్రారంభించి గతంలో వున్న సంబంధాలను తిరిగి ప్రవేశపెట్టాలి. లెనిన్ కనుక మార్చిలో పూర్తిగా అశక్తుడు కాకుండా వున్నట్లయితే "సోవియట్ యూనియన్ యొక్క అంతిమ నిర్మాణం స్టాలిన్ దానికి చివరగా ఇచ్చిన రూపు కంటే ఎంతో భిన్నంగా వుండేదని" పైప్స్ చేసిన వాదన సహేతుకంగా అనిపిస్తుంది. ("ఫార్మేషన్ ఆఫ్ సోవియట్ యూనియన్", రచయిత : పైప్స్, పుట : 276).

అదే విధమైన పరికల్పన మొత్తం సోవియట్ పాలనా వ్యవస్థ నిర్మాణానికి కూడా అన్వయించవచ్చు. స్వయం ప్రతిపత్తిపై తన పర్యాలోచనలను లెనిన్ చెప్పి రాయించిన సమయంలోనే, తాను ఎంతగానో విమర్శించిన పరిష్కారానికి ఆమోదముద్ర వేసిన సోవియట్ల మహాసభ ప్రారంభమవుతూ వున్నది. ఇది యాదృచ్ఛికం కాదని, ఎందుకంటే లెనిన్ "జాతుల సమస్యకు సరైన పరిష్కారం కోసం ఎంతగానో ఆందోళన చెందుతున్నాడని" ఫతియెవా పేర్కొన్నారు. స్టాలిన్ అనుసరించిన జాతుల విధానాన్ని, జార్జియన్ల పట్ల ఆయన వ్యవహరించిన తీరుని విమర్శించడం లెనిన్ ఆలోచనల్లో వచ్చిన మార్పుకి, స్టాలిన్‌ని పదవినుండి తొలగించాలన్న ఆయన నిర్ణయానికి సరిపోయే వివరణగా నిలిచింది. లెనిన్ నిర్ణయానికి వచ్చాడు. ఇకపై ఎత్తుగడల అవసరాలు మాత్రమే తన క్రొత్త భావాల సమర్ధనకు అవసరమైన పద్ధతులను, సమయానుకూలతను ఎంపిక చేసుకోవడంలో లెనిన్‌ని నడిపిస్తాయి.

# 7
# "గోప్య వ్యవహారం"

1923 వ సంవత్సరపు తొలి రెండు మాసాలు లెనిన్‌కి అత్యంత మేధోపరమైన క్రియాశీలతకు, ఆరోగ్యపరమైన ఆకస్మిక మార్పులకు ఆలవాలమైన కాలం. కొన్ని సార్లు ఆయన అత్యంత ప్రసన్న చిత్తంతో ఉండేవాడు. వైద్యులు ఆయన సాధారణ ఆరోగ్య స్థితిలో చెప్పుకోదగ్గ మెరుగుదల గమనించారు. తాను చెప్పి రాయించే వాటి గురించి సంతోషంగా ఉన్నాడు. తన చుట్టూ వున్న వాళ్ళతో చతురోక్తులాడేవాడు. అది గమనించిన వైద్యులు ఆయనకు మరింత సమయం పని చేయడానికి, చదవడానికి అనుమతినిచ్చారు. తరువాత ఆయన తన కుడిచెయ్యిని తిరిగి స్వాధీనంలోకి తెచ్చుకోవడం ప్రారంభమయినప్పుడు, వార్తా పత్రికలు చదవడానికి, సందర్శకులను కలవడానికి కూడా ఆయనకు వెసులుబాటు కల్పించబడింది. లెనిన్‌కి కొన్నిసార్లు ఎంత బాగున్నట్లుగా అనిపించేదంటే ఆయన ఒక రోజు తన అనారోగ్యానికి మూలం మానసిక ఆందోళన మాత్రమే అనే అభిప్రాయం వ్యక్తం చేశాడు. (ఫిబ్రవరి 14 నాటి "జర్నల్" చూడాలి. ఆ సమయంలో వైద్యులు జబ్బుని ఏమని నిర్ధారించారో, ఆ విషయం లెనిన్‌కి ఏ మేరకు తెలుసో మనకు తెలియదు. తరువాత ఆయన మరణాన్ని అధికారికంగా ధమనులు గట్టి పడటమనే వ్యాధికి (ఆర్టీరియో స్క్లెరోసిస్) ఆపాదించారు). కాని ఈ ఉల్లాస సందర్భాలు తొలగిపోయి వాటి స్థానే వేరే స్థితి చోటు చేసుకునేది. ఈ స్థితిలో ఆయన అమితమైన అలసటకు, జ్ఞాపక శక్తి కోల్పోవడానికి, మాట్లాడటంలో ఇబ్బందికి, మానసిక ఆందోళనకు, శారీరక బాధకు గురయ్యేవాడు. లెనిన్ చుట్టూ ఉన్నవాళ్ళు ఆయన అనారోగ్యంలోని ఒడిదుడుకులను శ్రద్ధతో పట్టించుకునేవారు. పొలిట్‌బ్యూరో సభ్యులు వాటిని జాగ్రత్తగా గమనించేవారు. ఈ రెండు నెలల కాలంలో రాజ్య భవిష్యత్తు, దాని నాయకుల అస్థిత్వం డోలాయమాన స్థితిలో వున్నాయి; లెనిన్ అనారోగ్యం నుండి తగినంతగా కోలుకుని వచ్చే పార్టీ కాంగ్రెస్‌లో పాల్గొనగలడా, పాల్గొంటే ఏమి చెప్తాడు అనే దానిపై మొత్తం ఆధారపడి వుంది.

జనవరి, ఫిబ్రవరి నెలల్లో లెనిన్ టిప్పణుల్లో వ్యక్తీకరించిన భావాల ఆధారంగా రూపొందించిన అయిదు వ్యాసాల రూపంలో కొద్ది వారాల్లో జరగబోయే పార్టీ కాంగ్రెస్

పరిశీలన కోసం రాజకీయ వ్యూహానికి సంబంధించిన విస్తృత కార్యాచరణ ప్రణాళికను సిద్ధం చేశాడు. కాంగ్రెస్‌కు తాను హాజరు కాలేనేమోనన్న భయం దృష్ట్యా తాను ప్రతిపాదించదలచుకున్న సంస్కరణల అత్యవసర స్వభావం దృష్ట్యా తాను చేపట్టిన పనిని వేగంగా పూర్తిచేసే దిశగా ఆయన కృషి చేశాడు.

ఆచరణ రంగంలో ప్రత్యేకించి మూడు ప్రశ్నలపై ఆయన దృష్టి సారించాడు.

మొదటగా, ఆయన ప్రోద్బలంతో నిర్వహించబడిన పెద్ద నగరాలలోని ప్రభుత్వోద్యోగుల జనగణన (సెన్సస్) వివరాలను లెనిన్ తెలుసుకోగోరాడు. ఉద్యోగ స్వామ్యం పట్ల ఆయనకెంత అపనమ్మకమంటే ఈ గణన ఫలితాలు తెలుసుకునేందుకు మళ్ళీ మళ్ళీ విజ్ఞాపనలు పంపాడు. చివరకు, ఆయన కార్యదర్శికి స్టాలిన్ అనుమతి లేకుండా లెనిన్‌కి ఆ పత్రాలు చూసే అవకాశం లేదనే వాస్తవం చెప్పక తప్పలేదు. లెనిన్‌కి ఈ సంగతి తెలియదు. ఈ వ్యవహారం లెనిన్‌ని తీవ్ర ఆగ్రహానికి గురిచేసిందని, జనవరి 10న, నెల రోజుల పిమ్మట ఫిబ్రవరి 12న భావోద్వేగపూరిత సంక్షోభాన్ని కూడా కలగజేసిందని ఫతియెవా తన స్మృతులలో పేర్కొన్నారు. (పుట : 70). ఆయన వైద్యులలో ఒకరైన ఫారస్టర్ వార్తా పత్రికలు చదవడానికి, సందర్శకులను కలవడానికి లెనిన్‌ని అనుమతించడానికి సిద్ధమై కూడా అకస్మాత్తుగా "రాజకీయ సమాచారం" పై నిషేధం విధించడం ద్వారా ఆయన ఆశలను వమ్ము చేశాడు. ఈ పదానికి అర్థమేంటని లెనిన్ అడగగా "సరే, ఉదాహరణకి, సోవియట్ ప్రభుత్వోద్యోగుల జనగణన పట్ల మీకు చాలా అసక్తి వుంది" అని వైద్యుడు సమాధానమిచ్చాడు. ఈ సమాధానం లెనిన్‌ని ఎంత దిగ్భ్రాంతికి గురిచేసిందంటే ఆయన పెదాలు కంపించాయి. వైద్యుల వద్ద విడి అంశాల గురించి అంత సమాచారం వుండడం, వారు వాటి మధ్య భేదాలను తెలుసుకోగలగడం లెనిన్ భయపడుతూ వున్న అనుమానాలను ధృవీకరించాయి. ఫతియెవా "జర్నల్"లో (ఫిబ్రవరి 1, 3న రాసిన అంశాలు) వివేచనతో ఇలా రాశారు. "సెంట్రల్ కమిటీకి వైద్యులు ఆదేశాలు జారీ చేయడానికి బదులు వైద్యులకి సెంట్రల్ కమిటీ ఆదేశాలు జారీ చేస్తున్నదనే అభిప్రాయానికి బహుశా లెనిన్ వచ్చి వుండవచ్చు". ఫతియెవా అభిప్రాయంలో ఈ విషయం సంభావ్యత దశను దాటి వాస్తవమని రూఢి అయింది.

లెనిన్ ఆలోచనలు లగ్నమయిన రెండవ అంశం కార్మిక – కర్షక తనిఖీ కమిస్సారియట్‌ని కేంద్ర నియంత్రణ సంఘంతో విలీనం చేయడానికి ఆయన రూపొందించిన ప్రణాళిక. సెంట్రల్ కమిటీని, పార్టీ అగ్రనాయకత్వ వ్యవస్థని పునర్వ్యవస్థీకరించడానికి లెనిన్ రూపొందించిన విస్తృత ప్రణాళికలకు ఆధారప్రాయమైన కీలక సూత్రంగా ఇది ఉద్దేశించబడింది. ఈ ప్రణాళికల గురించి సమాచారం ఇంతకు ముందే తెలియచేయబడిన

తన సహాయకుడు స్యురూప నుండి, మంత్రిత్వ శాఖ సభ్యుల నుండి లెనిన్ అనేక మార్లు సలహా కోరాడని "జర్నల్" నుండి మనకు తెలుస్తుంది. క్రియాశీలంగా వుండవలసిందిగా, రాజ్య యంత్రాంగంలో ఈ ముఖ్యమైన మార్పులు చేయడానికి మార్గం సుగమ చేయవలసిందిగా లెనిన్ వాళ్ళను కోరాడు. చివరకు మొత్తం సమస్యను పార్టీ మహాసభ ముందుంచేందుకు నిర్ణయించుకున్నాడు.

కాని, జార్జియన్ వ్యవహారం, సోవియట్ సోషలిస్టు రిపబ్లిక్కుల యూనియన్ నిర్మాణం ఆయన అత్యధిక కాలం కేటాయించిన అంశాలు, ఆయనకు అత్యంత ప్రధానమైన అంశాలు. అప్పటికే డిసెంబరు చివరిలో తాను రూపొందించిన మెమోరాండంలో, లెనిన్ వీటిలో ఇమిడి వున్న సూత్రంపై తన అభిప్రాయాన్ని వ్యక్తీకరించాడు. సంబంధిత వ్యక్తులపై తన అంచనాలను వెల్లడి చేశాడు. బాధ్యులైన వారిపై అసాధారణ చర్యలు తీసుకొనవలసి వున్నందున, పార్టీ మహాసభ ప్రారంభమయ్యే లోపు తన ఆరోపణలకు మద్దతుగా సవివరమైన ఋజువులు సేకరించేందుకు లెనిన్ త్వరితంగా పని చేయవలసి వచ్చింది. "జర్నల్" నుండి, రచనల సర్వస్వం అయిదో ముద్రణ అంతటా అక్కడక్కడ వున్న అనేక ఇతర రచనల నుండి లెనిన్ తలపెట్టిన "నిగూఢమైన కుట్ర" గురించి కొంత మేరకు మనకు స్పష్టత లభిస్తుంది. జనవరి 24న కార్మిక తనిఖీ వ్యవస్థపై తన వ్యాసాన్ని పూర్తి చేసి, ప్రచురణకై ప్రావ్దాకి పంపిన పిమ్మట, లెనిన్ ఫతియెవాని పిలిచి జార్జియా సమస్యపై జెర్జిన్స్కీ నాయకత్వం వహించిన విచారణ సంఘపు పత్రాల కోసం అడిగాడు. ఈ అంశం పొలిట్‌బ్యూరోలో చర్చకు రానున్నదన్న విషయం ఆయనకు తెలియదు. మరుసటి రోజు స్టాలిన్ కాని, జెర్జిన్స్కీ కాని ఆ పత్రాలు పంపారా అని మళ్ళీ అడిగాడు. ఈలోగా పొలిట్‌బ్యూరో ఈ సంఘపు నిర్ధారణలను ఆమోదించింది. జార్జియన్లని మరోసారి ఖండించింది. ఆర్జోనికిజ్, స్టాలిన్ల లోపాలను కప్పిపుచ్చింది. ఎందివని, మాఖరాజ్, సింసజే, ఇంకా అనేక మందిని మాస్కోకి వెనక్కి పిలిపించాలని సంఘం సూచించింది. ఇది కూడా అంగీకరించబడింది. పొలిట్‌బ్యూరో సమావేశానికి ముందే ఈ మేరకు ఉత్తర్వులు పంపబడ్డాయని ప్రొఫెసర్ పైప్స్ పేర్కొన్నాడు. (ఫార్మేషన్ ఆఫ్ సోవియట్ యూనియన్ –రచన : పైప్స్ – పుట : 282 మరియు "ఇజ్ వొస్పమినసీయ్" – రచన : ఫతియెవా – పుట : 54).

పై స్థాయిలో జరుగుతున్న విషయాలను ఫతియెవా ఎప్పటికప్పుడు తెలుసుకో గలుగుతున్నారు. అంతేగాక, ఫిబ్రవరి 3న ఈ విషయాలను "ఏదో గందర గోళంలో" చెప్పినట్లు కనిపించేలా జాగ్రత్తపడుతూ లెనిన్‌కి తెలిసేట్లు చేశారు. లెనిన్‌కి పంపాల్సిన పత్రాల కోసం ఆమె తిరిగి అడిగినప్పుడు ఆమెకు గట్టి వ్యతిరేకత ఎదురయింది. జెర్జిన్స్కీ

స్టాలిన్‌ని అడగమని ఫతియెవాకి చెప్పాడు. కాని అప్పుడు స్టాలిన్ మాస్కోలో లేడు. చివరకు, పొలిట్‌బ్యూరో అనుమతి లేనిదే తానా పత్రాలు ఆమెకు ఇవ్వలేనని స్టాలిన్ తెలియచేశాడు. లెనిన్ కోరిక ఆయన్ని ఆందోళనకి గురి చేసింది. రోజువారీ వ్యవహారాలకి సంబంధించిన మొత్తం సమాచారాన్ని లెనిన్‌కి తెలియనివ్వకూడదనే నిర్ణయం వున్న దృష్ట్యా ఒక వేళ ఫతియెవా బహుశ లెనిన్‌కి అవసరాన్ని మించిన సమాచారాన్ని తెలియచేసిందా అని స్టాలిన్ ఆమెని అడిగాడు. తానలా చేయలేదని ఫతియెవా స్పష్టం చేశారు. కాని ఈ సంభాషణ ఆమె లెనిన్‌కి తెలియచేశారు. లెనిన్ కటువుగా "అంటే జాతుల సమస్య రోజువారీ విషయమన్నమాట" అన్నాడు. లెనిన్ ఎంతగా పట్టు పట్టాడంటే, పొలిట్‌బ్యూరో అనుమతి లేదనే పేరుతో లెనిన్ కోరిన పత్రాలు ఇవ్వ నిరాకరించడం స్టాలిన్‌కి కష్టమయింది. అందునా నిజంగానే జాతుల సమస్య రోజువారీ విషయం కాదు. తనకి సమాచారం ఎలా వచ్చిందో వెల్లడించకుండా, ఫతియెవా ఒక పొలిట్‌బ్యూరో సమావేశం జరుగుతూండగా కామెనేవ్, స్టాలిన్‌ల మధ్య జరిగిన సందేశాల మార్పిడిని ఇలా వివరించారు.

కామెనెవ్ : "వ్లాదిమిర్ ఇల్లిచ్ గట్టిగా అడుగుతున్నప్పుడు కాదనడం ఏ మాత్రం బాగుండదు."

స్టాలిన్ : "నాకు తెలియదు, ఆయన కిష్టమయినట్లు ఆయన చేసుకోవచ్చు."

కాని స్టాలిన్ కోరుకుంది ఇది కాదు. లెనిన్‌కి అందించే వైద్య సేవల పర్యవేక్షణ బాధ్యత నుండి తనని తప్పించాల్సిందిగా ఆయన కోరాడు. ఈ విజ్ఞాపన అంగీకరించ బడలేదు. పొలిట్‌బ్యూరో లెనిన్ కోరుతున్న పత్రాలు చూడడానికి ఆయనకు అనుమతి నిచ్చింది. ఈ పత్రాలతో ఆయన ఏం చెయ్యదలచుకున్నాడో తెలియరాలేదు. (ఫతియెవా– "ఇజ్ వొస్పమినసీయ్" (జ్ఞాపకాల నుండి) – పుట : 64–65).

లెనిన్ తనకు తానే వాస్తవాలను తెలుసుకోదలచుకున్నాడు ఈ లక్ష్యాన్ని దృష్టిలో వుంచుకుని తన వ్యక్తిగత స్థాయిలో ఒక విచారణ సంఘాన్ని నియమించాడు. ఇందులో సోవ్నర్కోమ్‌లో తనకు సహాయ కార్యదర్శిగా పనిచేసిన గోర్బునోవ్, తన కార్యదర్శులైన ఫతియెవా, గ్లియాసర్‌లు సభ్యులు. ఈ సంఘం వివరణ తయారు చేయాల్సిన మొదటి ప్రశ్నలు -- ఈ పత్రాల అధ్యయనం ముందుకు వెళ్ళిన కొలది మరిన్ని ప్రశ్నలు తలెత్తాయి -- దిగువ ఇవ్వబడ్డాయి.

1 "మునుపటి జార్జియన్ సెంట్రల్ కమిటీపై పెడ ధోరణి అనే ఆరోపణ ఎందుకు చేయబడింది?

2. "వాళ్ళు పార్టీ క్రమశిక్షణను ఉల్లంఘించారనే నేరారోపణ ఎందుకు చేయబడింది?

3. “జ(థేకామ్ జార్జియన్ సెంట్రల్ కమిటీని అణచివేస్తున్నదనే అభియోగం ఎందుకు మోపబడింది?
4. “అణచివేత యొక్క భౌతిక సాధనాలు. ఆర్జోనికిజ్ సాటి కమ్యూనిస్టుని కొట్టిన సంఘటన.
5. “రష్యన్ కమ్యూనిస్టు పార్టీకి చెందిన సెంట్రల్ కమిటీ వ్లాదిమిర్ ఇల్లిచ్ సమక్షంలోను, ఆయన లేనప్పుడు ఎటువంటి వైఖరి అవలంబించింది?
6. తన పనిలో భాగంగా ఈ కమీషన్ ఎవరెవరిని కలిసింది? అది కేవలం జార్జియన్ సెంట్రల్ కమిటీపై చేయబడిన ఆరోపణల గురించి విచారణ జరిపిందా లేక జ(థేకామ్‌కి వ్యతిరేకంగా చేయబడిన ఆరోపణల గురించి కూడా విచారణ జరిపిందా? అది ఆర్జోనికిజ్ కాబానిజ్‌ని కొట్టిన సంఘటనని అధ్యయనం చేసిందా?
7. ప్రస్తుత పరిస్థితి : ఎన్నికల ప్రచారం, మెన్షివిక్కులు, అణచివేత, జాతుల వైరం.” (సమగ్ర రచనలు – సంపుటం : XLV – పుట : 60 –67).

ఈ ఆదేశాలు జారీ చేయడంతో పాటు లెనిన్ నిరంతరం త్వరపెట్టడం వల్ల ఈ ముగ్గురు కార్యదర్శులు పని ప్రారంభించారు. మూడు వారాలలోగా తాము నిర్ధారణలకు రాగలమని వారు ఆశించారు. తన భయాలకు బలమైన ఆధారాలు మరింతగా గోచరించడంతో, దీనితో ప్రమేయమున్న వ్యక్తుల బాధ్యత మరింత ఆక్షేపణీయమైనదిగా కనిపించడంతో లెనిన్ మరిన్ని వివరణాత్మకమైన ప్రశ్నలతో ఫతియెవాను ఉక్కిరిబిక్కిరి చేశాడు. ఫిబ్రవరి 14న ఈ సంఘానికి లెనిన్ జారీ చేసిన అదనపు ఆదేశాలు అప్పటి లెనిన్ మానసిక స్థితిని, ప్రయత్న లోపం లేకుండా కృషి చేయాలనే ఆయన పట్టుదలను చక్కగా వెల్లడి చేశాయి :

“మూడు అంశాలు : (1) ఒకరిని కొట్టేందుకు ఎవరికీ అనుమతి లేదు; (2) రాయితీలు అనేవి తప్పవు; (3) చిన్న రాజ్యాన్ని పెద్ద రాజ్యంతో ఎవరూ పోల్చి చూడలేరు.

“ఈ సంఘటన స్టాలిన్‌కు తెలుసా? దానిని గురించి ఆయన ఎందుకు పట్టించుకోలేదు?”

వ్యక్తిగత తప్పిదం అత్యంత తీవ్రమైన రాజకీయ తప్పిదంగా పరిణమించింది. ఇంకా ఇలా పేర్కొన్నాడు : “జాతి దురభిమానం, మెన్షివిజం లాంటి ధోరణులపై వేసిన “పెదధోరణివాదులనే” ముద్ర జాత్యాధిపత్యవాదులకు (వెలికోదర్‌ఝుప్నికీ) కూడా అన్వయిస్తుంది.” తాను విమర్శించే వ్యక్తులను అభివర్ణించడానికి లెనిన్ తరచుగా ఉపయోగించిన ఈ పదాన్ని అనువదించటం కష్టం; ఈ పదం జాతి దురభిమానాన్ని, అగ్రరాజ్యపు అహంకృతిని, సామ్రాజ్య వాదాన్ని సూచిస్తుంది. పార్టీలోని ఈ ప్రతికూల

ధోరణిని తొలగించాలని లెనిన్ కృతనిశ్చయంతో వున్నాడు. ఈ క్రింది ఉత్తర్వులు జారీ చేయడం ద్వారా లెనిన్ వెనువెంటనే చర్యకు పూనుకున్నాడు.

"వ్లాదిమిర్ ఇల్లిచ్ నుండి ఆదేశం : సోల్జ్ సమక్షంలో లెనిన్ బలహీనుల పక్షాన ఉన్నాడనే విషయాన్ని ప్రస్తావించండి. బాధిత పక్షానికి చెందిన వారికి ఆయన వారి వైపు ఉన్నాడని తెలపండి." (పై గ్రంథం – పుట : 107). దీనిని లెనిన్ చెప్పగా ఫతియెవా రాశారు. సోల్జ్ కేంద్ర నియంత్రణ సంఘం నాయకులలో ఒకరు).

లెనిన్ ఆ సమయంలో తన ఆలోచనలను రహస్యంగా ఉంచాలని గాని లేదా తటస్థంగా ఉండాలని గాని ఇంకేమాత్రం అనుకోలేదు; తద్భిన్నంగా, కారకులైన వారందరినీ హెచ్చరించే ప్రయత్నం చేశాడు. ఇది సోల్జ్‌కి తెలియరాగానే పొలిట్‌బ్యూరోలోని కొందరు సభ్యులకి బహుశా స్టాలిన్‌కి కూడా తెలియచేసి ఉంటాడనటంలో ఎలాంటి సందేహం లేదు. జార్జియన్లు కూడా ఈ వార్తని తమ పరిరక్షకులలో ఎవరో ఒకరికి చేరవేసి వుంటారు. కాబట్టి, ఈ విషయం మొదట్లో పరిమితంగా మాత్రమే ప్రచారంలోకి వచ్చినప్పటికీ, రెండు వైపుల వారినీ అప్రమత్తం చేసింది. బండారాన్ని బట్టబయలు చేసే పత్రాలు ఫైళ్ళనుండి మాయమయ్యాయి. తనను ఆశ్చర్యచకితురాల్ని చేసిన సోల్జ్ చెప్పిన మాటలు ఫతియెవా ఇలా తెలియచేశారు. "జార్జియన్ల (జార్జియన్ కమ్యూనిస్టు పార్టీ పాత సెంట్రల్ కమిటీ మద్దతుదార్లు) నుండి తామెదుర్కొన్న అన్ని తరహాల వేధింపుల గురించి జార్జియన్ ప్రస్తుత సెంట్రల్ కమిటీ కామ్రేడ్లు ఆయనకు ఆధారాలు అందజేశారు. కాబానిజ్ పట్ల ఆర్జోనికిజ్ దురుసు ప్రవర్తన గురించి బాధితుడు ఇచ్చిన ప్రకటన కేంద్ర నియంత్రణ సంఘం అధీనంలో వుంది. కాని అది ఇప్పుడు అదృశ్యమయింది. 'ఏమిటి నువ్వనేది? అదృశ్యమైందా?' అని నేనడిగినదానికి 'కన్పించకుండాపోయింది అంతే' అని కామ్రేడ్ సోల్జ్ సమాధానమిచ్చాడు. అయినా పెద్దగా వచ్చే తేడా ఏమీ ఉండదు, ఎందువల్లనంటే సంఘటన జరిగిన సమయంలో అక్కడే వున్న రైకోవ్ సమర్పించిన నిష్పక్షపాత వివరణ కేంద్ర నియంత్రణ సంఘం వద్ద వున్నది. (ఫతియెవా – "ఇజ్ వొస్పమిననీయ్" (జ్ఞాపకాల నుండి) – పుట : 75). (ఎక్కువగా వివరాల్లోకి వెళ్ళకుండానే రైకోవ్ నిష్పక్షపాత ధోరణిని ఎవరైనా ప్రశ్నించవచ్చు. 1922 డిసెంబరు 9న ఆయన నివేదికను లెనిన్‌కి సమర్పించిన సందర్భంలో ఆ సంఘటనను గురించి ఒక్క మాట కూడా అనలేదు. లెనిన్ ఆ విషయాన్ని మూడు రోజుల తరువాత జెర్జిన్‌స్కీ స్వయంగా చెప్పినప్పుడే తెలుసుకున్నాడు.

లెనిన్ తాను నియమించిన కమీషన్ పనిని వేగిరపర్చాడు; ఆయన ఆరోగ్యం అనిశ్చితంగా ఉన్నది; జాతుల సమస్యపై ఒక నివేదికను ఎట్టి పరిస్థితులలోను వచ్చే పార్టీ కాంగ్రెస్‌కి సమర్పించాలనేది లెనిన్ కోరిక. క్రొత్త సమాచారం వల్ల కమీషన్ గడువు

పెంచవలసిన అవసరం రావచ్చు; ఎవరినయినా ఘటనా స్థలానికి పంపడం కూడా బహుశా అవసరం కావచ్చు. దానంతటికీ చాలా కాల వ్యవధి పడుతుంది. కమీషన్ పనిలో ఏమాత్రం ఆలస్యం జరిగినా అది దాని విజయావకాశాలను ధ్వంసం చేస్తుందని, అలా జరగడం తనకు పెద్ద విఘాతం అవుతుందని లెనిన్ ఫిబ్రవరి 14న ఫతియెవాకు చెప్పాడు. "జర్నల్" లో ఫిబ్రవరి 14 నుండి మార్చి 5 వరకు ఏమీ రాయలేదు. అంతేకాక రచనల సర్వస్వం సంపాదకులు ఈ మూడు వారాల గురించి ఎటువంటి సమాచారం ఇవ్వలేదు. ఈ సమయంలో లెనిన్ ఏమీ రాసి వుండకపోవచ్చు. ఏది ఎలా వున్నా, కార్యదర్శులు "రహస్య కమీషన్" కోసం తమ పనిలో పూర్తిగా నిగమ్నమయ్యారు. (అయితే, ఫతియెవా తన రచనలో జనవరి 10న (పుట : 70) మరియు ఫిబ్రవరి 16న (పుట : 75) లెనిన్ చెప్పినవి తాను రాసుకున్నట్లుగా పేర్కొన్నారు. కాని "జర్నల్"లో అవి కనిపించలేదు). అయితే, ఒక విషయం మాత్రం తెలియవచ్చింది; ఈ కమీషన్ మార్చి 3న తన నివేదికను సమర్పించింది (సమగ్ర రచనలు – సంపుటం: XLV – పుట: 714). ఈ పత్రం ఇప్పటి వరకు వెలుగులోకి రాలేదు. మార్క్సిజం – లెనినిజం సంస్థ దానిని ఇంతవరకు ఎందుకు బయట పెట్టలేదు? అది కూడ కాబానిజ్ ఫిర్యాదు మాదిరిగా "మాయమయిందా?" ప్రస్తుతానికి దాని గురించి ఏమీ తెలియదు. ఏది ఏమయినా ఆ నివేదికలోని నిర్ధారణలు లెనిన్ జీవితంలోని చివరి రెండు క్రియాశీల దినాలకు ఒక బృహత్తర పోరాట స్వభావాన్ని కల్గించి వుంటాయి. అవి తన సహచరుల పట్ల లెనిన్‌కి ఎన్నడూ లేనంత విముఖతను, ఆగ్రహాన్ని కల్గించి వుంటాయి; విచారకర జార్జియన్ వ్యవహారం మరింత లోతైన వ్యాధిగ్రస్తతకు చెందిన ఒకానొక లక్షణం మాత్రమే అనే లెనిన్ నమ్మకాన్ని బలపర్చాయి. కాని క్షీణిస్తున్న లెనిన్ ఆరోగ్యం అటువంటి భావోద్వేగపూరిత, మానసిక ఒత్తిడికి లోనైన ఆయనకు ఎక్కువ కాలం జీవించి ఉండే అవకాశం ఇవ్వలేదు. మానసిక ఆందోళనకు రక్తం గడ్డ కట్టే సమస్య తోడు కావటంతో ఆయన అనారోగ్యం త్వరితంగా ప్రమాదస్థాయికి చేరుకుంది. తన అస్వస్థత తీవ్రమైనట్లుగా ఆయనకు అనిపించసాగింది. (మార్చి 5,6 తేదీల "జర్నల్" మరియు ట్రాట్స్కీ రచన "ది స్టాలిన్ స్కూల్ ఆఫ్ ఫాల్సిఫికేషన్" పుట : 71 చూడండి).

ఈ కారణం వల్లనే లెనిన్, మరింత ఆలస్యం చేయకుండా, తన ప్రత్యర్థులకు వ్యతిరేకంగా తాను సిద్ధం చేస్తున్న అస్త్రాలను, అప్పటికి అది కొంత తొందరపాటు అయినప్పటికీ, వారి పైకి సంధించడానికి పూనుకున్నాడు. మొదటి మూడు విమర్శలకు ఏకైక లక్ష్యం స్టాలిన్. ఈ నిర్ణయాలు తీసుకున్నప్పుడు తాను ఎదుర్కొన్న భావోద్వేగ ఒత్తిడిని లెనిన్ తన వైద్యుల దృష్టికి రాకుండా కప్పిపుచ్చి, వారికి తాను వ్యవహార

సంబంధమైన లేఖలు మాత్రమే రాయిస్తున్నానని చెప్పాడని ఫతియెవా పేర్కొన్నారు. మార్చి 5న మిట్టమధ్యాహ్న సమయంలో ఓలడిచేవాను పిలిచి రెండు లేఖలు తయారు చేయించాడు.

మొదటిది అత్యంత గోప్యంగా, ఎన్నడూ లేనంత ఆదర భావాన్ని వ్యక్తం చేస్తూ ట్రాట్స్కీకి రాయబడింది. దానిని వెనువెంటనే ట్రాట్స్కీకి ఫోనులో విన్పించాల్సిందిగా ఆదేశించాడు. ఆ లేఖ ఇలా వుంది:

"పార్టీ సెంట్రల్ కమిటీలో జార్జియన్ వ్యవహారాన్ని సమర్థించవలసిందిగా నిన్ను హృదయపూర్వకంగా కోరుతున్నాను. ఆ వ్యవహారం ఇప్పుడు స్టాలిన్, జెర్జిన్స్కీల చేతుల్లో బందీ అయింది. వారి నిష్పాక్షికతపై నాకు విశ్వాసం లేదు. నిజానికి, తద్విరుద్ధం వాస్తవం! నీవు గనుక ప్రతివాదనకు అంగీకరిస్తే నేను ప్రశాంతంగా ఉండగలను. ఒకవేళ ఏ కారణం చేతయినా నీవు అలా చేసేందుకు అంగీకరించని పక్షంలో పత్రాలన్నీ నాకు తిప్పి పంపు. దానిని నీ అసమ్మతిగా నేను భావిస్తాను.

అత్యంత స్నేహపూర్వక శుభాకాంక్షలతో,

లెనిన్

(సమగ్ర రచనలు – సంపుటం : LIV – పుట : 329)

లెనిన్ ఒక సహచరుడి మద్దతు లేకుండా ఏమీ చేయలేని స్థితిలో ఉన్నాడు. అట్టి సహచరుడు కాగల అవకాశం వున్న వ్యక్తి ట్రాట్స్కీ ఒక్కడే కాదు; కాని ఆయనపై కూడ ఆధారపడవచ్చు. లెనిన్ మద్దతు కొనసాగుతున్న 1923 ప్రారంభ మాసాల్లో ట్రాట్స్కీకి ఎదురు లేదు. లెనిన్ రాసిన లేఖ ముగింపులో ట్రాట్స్కీకి తెలియజేసిన శుభాకాంక్షలు ఎంత ఆదరపూర్వకంగా వున్నాయంటే, స్టాలిన్ ఆ లేఖను జులై 1926 లో సెంట్రల్ కమిటీ ముందు తప్పనిసరిగా చదవవలసి వచ్చినప్పుడు -- అప్పటికి ఆయన స్థానానికి ఎటువంటి చెప్పుకోదగిన ముప్పు లేదు -- దానిని మార్చి కేవలం "కమ్యూనిస్టు శుభాకాంక్షలతో" అని చదివాడు. ('స్టాలిన్ స్కూల్ ఆఫ్ ఫాల్సిఫికేషన్' – రచన : ట్రాట్స్కీ – పుట : 71). ఈ లేఖ ట్రాట్స్కీకి గొప్ప విజయం లాంటిది. దీని అర్థం ఏమిటంటే, లెనిన్ డిసెంబరు ప్రారంభంలో ట్రాట్స్కీకి ప్రతిపాదించిన "ఉద్యోగస్వామ్య వ్యతిరేక ఒడంబడిక" అనేది ఎట్టకేలకు ఏర్పడింది. దీని కోసం ట్రాట్స్కీ దీర్ఘకాలంగా ఎదురు చూస్తున్నాడు. (అదే గ్రంథం – పుట : 73). దీని వల్ల వారసుని ఎంపిక విషయంలో లెనిన్ మద్దతు తనకు వుంటుందని ట్రాట్స్కీ భావించసాగాడు. లెనిన్ అనారోగ్యం పాలయినప్పటి నుండి తనకు వ్యతిరేకంగా జరుగుతున్న కుతంత్రాల అంతిమ పర్యవసానం గురించి ఇక నిశ్చింతగా వుండొచ్చని ట్రాట్స్కీ భావించాడు.

లెనిన్ రాజకీయ నిర్ణయాలు తీసుకున్నాడు కనుక ఇక తన దాడిని తీవ్రతరం చేసి స్టాలిన్‌తో వున్న వ్యక్తిగత సమస్యను పరిష్కరించుకోదలుచుకున్నాడు. తన మొదటి లేఖకు ట్రాట్స్కీ నుండి సమాధానం కోసం ఎదురు చూసే సమయంలోనే మరో లేఖను స్టాలిన్‌కి పంపడానికి చెప్పి రాయించసాగాడు. ఇందులో క్రూప్స్కయా పట్ల స్టాలిన్ చూపిన అవమానకర ప్రవర్తనను ప్రస్తావించదలచుకున్నాడు. కాని తాను అలసిపోయినందున, బహుశా ఆ లేఖ రాయడంలోని వ్యూహాత్మక వివేకంపై సందేహం కలగడం వల్ల, ఆ క్లిష్టమైన లేఖ రాసే పనిని మరునాటి వరకు వాయిదా వేశాడు. అటువంటి వ్యక్తిగత విమర్శ సైద్ధాంతిక విమర్శను బలహీనపరుస్తుందేమోనని, ఈ చర్య తన సాధారణ కార్యాచరణ ప్రణాళికకు అనుగణమైనదా కాదా అని లెనిన్‌కి బహుశా సంశయం కలిగి వుండవచ్చు. కాని మరుసటి రోజు ట్రాట్స్కీ నుండి సానుకూల సమాధానం (ట్రాట్స్కీ సమాధానంపై వివరణ అనుబంధం VIII లో ఇవ్వబడింది) అందిన పిమ్మట, లెనిన్ ఆ లేఖ రాయించడం పూర్తి చేసి, మొత్తం లేఖావళిని మరల చదివిన పిమ్మట ఓలడిచేవాను ఆ లేఖ స్టాలిన్‌కి అందజేసి ఆయన ప్రత్యుత్తరం తీసుకురమ్మన్నాడు. లేఖని క్రింద పొందు పరుస్తున్నాం; అది స్టాలిన్‌ని వీలైనంత గట్టి దెబ్బ తీయడానికి ఉద్దేశించబడిందనేది సుస్పష్టం.

కామ్రేడ్ స్టాలిన్‌కి,

అత్యంత గోప్యం, వ్యక్తిగతం

ప్రతులు కామ్రేడ్ కామెనెవ్, కామ్రేడ్ జినొవీవ్‌లకు

అత్యంత గౌరవనీయ కామ్రేడ్ స్టాలిన్,

నా భార్యకు ఫోన్ చేసి ఆమెను నిందించిన విషయంలో నీవు దుష్ప్రవర్తనను ప్రదర్శించావు. ఆమె నీవన్నది మరచిపోవడానికి అంగీకరించింది. అయినప్పటికీ ఆ సంఘటన గురించి ఆమె కామెనెవ్, జినొవీవ్‌లకు తెలియచేసింది. నాకు వ్యతిరేకంగా జరిగిన దానిని మర్చిపోవడానికి నేను సిద్ధంగా లేను. నా భార్యకు వ్యతిరేకంగా జరిగిన దానిని నాకు వ్యతిరేకంగా కూడా జరిగిన దానిగా నేను భావిస్తాననేది నిర్వివాదాంశం. కావున, నీవు అన్న మాటలను ఉపసంహరించుకుని క్షమాపణ చెప్పటమా లేక మన మధ్య సంబంధాలను తెగతెంపులు చేసుకోవటమా తేల్చుకోవలసిందిగా కోరుతున్నాను.

గౌరవాలతో

లెనిన్"

(సమగ్ర రచనలు – సంపుటం: LIV – పుట : 329 – 30)

ఆ రోజు, మార్చి 6, పొద్దు గడిచిన కొద్దీ లెనిన్ ఆరోగ్యం అంతకంతకు దిగజారసాగింది. కాని ఆయన తన పనిని కొనసాగించే పట్టుదలతో వున్నాడు. అంతకు

ముందు రోజు లెనిన్ – ట్రాట్స్కీ (ఈయన నడుంనొప్పితో బాధపడుతూ క్రెమ్లిన్‌లో తన గదికి పరిమితమయ్యాడు) ల మధ్య సంధాన కర్తలుగా పని చేసిన ఫతియెవా, గ్లియాసర్‌లు ట్రాట్స్కీతో కామెనెవ్ కాకసస్ వెళుతున్నాడని అక్కడ తనకు ఏమైనా పని వుంటే ఆయనకు అప్పచెప్పవచ్చని తెలియచేశారు (పై గ్రంధం – పుట : 329). కామెనెవ్ ఖచ్చితంగా ఏ పని మీద అక్కడకు వెళ్ళాడో మనకు తెలియదు. జార్జియా సమస్యపై డిసెంబరు 30 నాటి మెమోరాండం, ఇతర పత్రాలు లెనిన్ నుండి అందుకున్న ట్రాట్స్కీ, వాటిని కామెన్‌వ్‌కి కూడా చూపెడితే ఆయన అక్కడికక్కడే కొన్ని చర్యలు తీసుకోవడానికి వీలుంటుందని సలహా ఇచ్చాడు. ఈ విషయంలో లెనిన్ అభిప్రాయం తెలుసుకోవడానికి వెళ్ళిన ఫతియెవా ఆయన స్పష్టంగా నిరాకరించినట్లు ట్రాట్స్కీకి తెలియచేశారు: "ఇది ఏమాత్రం సాధ్యం కాదు. వ్లాదిమిర్ ఇల్లిచ్ చెప్పిందేమంటే కామెనెవ్ అలేఖలను స్టాలిన్‌కి చూపిస్తాడు; స్టాలిన్ ఒక నిరుపయోగమైన రాజీ ప్రతిపాదన చేసి తదుపరి మోసం చేస్తాడు". (ట్రాట్స్కీ 'స్టాలిన్ స్కూల్ ఆఫ్ ఫాల్సిఫికేషన్' – పుట : 71. ట్రాట్స్కీ చెప్పినదానిని "జర్నల్" నుండి, ఇతర మూలాల నుండి మొత్తంమీద మనం ధృవీకరించుకోవచ్చు. సంఘటనల అనుక్రమణిక విషయంలో కొన్ని సార్లు ఆయన 24 గంటల మేరకు కూడా పొరబడిన దాఖలాలు వున్నప్పటికీ, ఈ విషయంలో ఆయనది నమ్మదగిన రుజువుగా మనం పరిగణించవచ్చు). బహుశా ఇదంతా ఉదయం జరిగి వుంటుంది. లెనిన్ ఇచ్చిన మొదటి సమాధానం తర్వాత కొద్దిసేపటికే లెనిన్ నుండి నూతన ఆదేశాలు, మరో లేఖ ప్రతితో ఫతియెవా తిరిగివచ్చి ట్రాట్స్కీకి అందచేశారు. ఇప్పుడు కామెనెవ్‌కి అంతా వెల్లడించవలసిందని లెనిన్ ప్రతిపాదించాడు. జార్జియన్ అసమ్మతివాదులుగా పిలవబడే వాళ్ళకి తాను రాసిన క్లుప్తమైన లేఖను కూడా ఆయనకు చూపవలసిందిగా కోరాడు. ఆ లేఖ ఇలా వుంది:

"(అంత్యంత గోప్యం)

కామ్రేడ్లు ఎందివని, మాఖరాజ్, ఇంకా ఇతరులకు :

(ప్రతులు కామ్రేడ్లు ట్రాట్స్కీ, కామెన్‌వ్‌లకు)

అత్యంత గౌరవనీయమైన కామ్రేడ్స్,

మీ వ్యవహారాన్ని నేను సన్నిహితంగా గమనిస్తున్నాను. ఆర్జోనికిజ్ దురుసుతనం పట్ల, దానిని స్టాలిన్, జెర్జిన్‌స్కీలు ఉపేక్షించడం పట్ల నేను దిగ్భ్రాంతి చెందాను. మీ కోసం నేను కొంత వివరణను, ఒక ప్రసంగాన్ని తయారు చేస్తున్నాను.

గౌరవాలతో

లెనిన్

మార్చి 6, 1923."

(సమగ్ర రచనలు – సంపుటం : LIV – పుట : 330).

అక్టోబరు 21న లెనిన్ జార్జియన్లకు రాసిన కోపం ధ్వనించే సమాధానానికి ఇది పూర్తిగా భిన్నమైనది. లెనిన్ పూర్తిగా విరుద్ధమైన నిర్ధారణలకు వచ్చాడు. ఆయన వాస్తవాన్ని దాచి పెట్టలేదు. పైపెచ్చు, ఇపుడు జార్జియన్లకు మద్దతు పలకడానికి ఇది మరింత గట్టి కారణం.

లెనిన్ ఆలోచనలలో చోటు చేసుకున్న ఈ ఆకస్మిక మార్పుకి ఆశ్చర్యచకితుడైన ట్రాట్స్కీ వివరణ కోరాడు. ఫతియెవా తన అభిప్రాయంగా "వ్లాదిమిర్ ఇల్లిచ్ ఆరోగ్యం బాగా క్షీణిస్తున్నందున ఆయన చేయగలిగిందంతా త్వరగా చేసేయాలని అనుకుంటున్నాడు" అని చెప్పారు. లెనిన్ కార్యదర్శులలో ఒకరు, బహుశా గ్లియాసర్, వ్లాదిమిర్ ఇల్లిచ్ స్టాలిన్‌కి వ్యతిరేకంగా ఒక "బాంబు" సిద్ధం చేస్తున్నాడని తనకి చెప్పినట్లుగా ట్రాట్స్కీ చెప్పినది పూర్తిగా విశ్వసనీయమైన విషయమే. (ట్రాట్స్కీ : 'స్టాలిన్ స్కూల్ ఆఫ్ ఫాల్సిఫికేషన్' – పుట : 75).

స్టాలిన్ నుండి క్షమాపణ కోరుతూ రాసిన లేఖను ఆయనకు అందజేయాలని లెనిన్ నుండి స్పష్టమైన ఆదేశాలున్నప్పటికీ క్రూప్స్కయా ఆ లేఖను పంపకుండా ఆపే ప్రయత్నం చేశారు. ఆ దశలోనే ఆమె జెన్‌సెక్ అంటే భయపడుతున్నారనేది సుస్పష్టం. ఆ లేఖను పంపటంలో కొంచెం నిదానాన్ని పాటించమని ఆమె కార్యదర్శులను కోరారు. అయితే మరుసటి రోజు ఓలడిచేవా ఇంకే మాత్రం జాప్యం చేయడానికి నిరాకరించారు. లెనిన్ ఆదేశాలను పాటించవలసిన బాధ్యత అమెకున్నది. ఈ విషయంలో నిర్ణయం తీసుకునే ముందు క్రూప్స్కయా, గతంలో అనేకమార్లు వలెనే స్నేహశీలి అయిన కామెనెవ్ సలహా కోరారు. ఈ విధంగా వ్లాదిమిర్ ఇల్లిచ్ "రాజకీయంగా స్టాలిన్‌ని నామ రూపాలు లేకుండా చేయాలనుకుంటున్నాడు" అని కామెనెవ్‌కి తెలియవచ్చింది. (డాయిశ్చర్, 'ది ప్రాఫెట్ అన్‌ఆర్మ్‌డ్, పుట : 90). ఓలడిచేవా లెనిన్ రాసిన లేఖను స్టాలిన్‌కి అందచేశారు. స్టాలిన్ అప్పటికప్పుడే క్షమాపణలు కోరుతూ సమాధానం రాశాడు. ఈ విషయాన్ని లెనిన్ సోదరి తరువాత వెల్లడి చేశారు. కాని లెనిన్‌కి ఈ క్షమాపణల సంగతి ఏమీ తెలియదు. ఆరోజు, మార్చి 7న, లెనిన్ మరోసారి తీవ్రమైన పక్షవాతానికి గురయ్యాడు. మార్చి 10న శరీరంలో సగ భాగం చచ్చుబడిపోయింది. మాట్లాడే శక్తిని ఆయన శాశ్వతంగా కోల్పోయాడు. (మార్చి 10 తరువాత లెనిన్ ఆరోగ్య స్థితి గురించిన వివరాలు అనుబంధం XI లో ఇవ్వబడ్డాయి).

లెనిన్ రాజకీయ జీవితం సమాప్తమయింది. ఆయన వయస్సు కేవలం 53 సంవత్సరాలే. పదకొండు నెలల తరువాత జనవరి 21, 1924న ఆయన మరణించాడు. ఆయన దృఢకాయం చివరి వరకు నిరాశావహమైన పోరాటాన్ని సాగించింది.

# 8

# ప్రాక్ - పశ్చిమాల మధ్య రష్యా

లెనిన్‌కి తన ఆలోచనలకి రూపం ఇచ్చి, వాటిని ఇతరులకు అందించగలిగిన శక్తి ఇంకా మిగిలి ఉన్న చివరి ఎనభై రోజుల్లో ఆయన ఆలోచనలలోని విలక్షణమైన, ప్రస్ఫుటమైన అంశం ఆయన వ్యక్తుల్ని అంచనా వేసిన విధానం. కాని ఈ నిర్ధారణలు ఒక విధంగా సూచన ప్రాయాలే. ఎందుకంటే లెనిన్ దృష్టిలో అవన్నీ రాజ్యం ఎదుర్కొంటున్న సాధారణ సమస్యలతో ముడిపడి ఉన్నవే.

వాస్తవానికి ప్రపంచ రాజకీయ పరిస్థితికి సంబంధించిందే ప్రధాన సమస్య. మిగతా అన్ని సమస్యల్ని సరిగా మదింపు చేసేందుకు ఈ పరిస్థితిని గురించిన విశ్లేషణ ఆవశ్యకమైన ముందస్తు అవసరమయింది. ఇది లేకుండా చారిత్రకాభివృద్ధి ప్రధాన క్రమాన్ని అవగాహన చేసుకోజాలము; భవిష్యత్తు గురించి నాయకుల ఆకాంక్షలకు, భయాలకు వాస్తవ ప్రాతిపదిక ఉండదు. అయితే ప్రపంచ పరిస్థితి బోల్షివిక్కులు అధికారం చేపట్టిన పిమ్మట వారు ఆశించిన దానికి పూర్తిగా భిన్నమైన రీతిలో పరిణామం చెందుతున్నది. పశ్చిమ ఐరోపాలో ఏ విప్లవము జరగలేదు. దాదాపుగా విప్లవం సంభవించిన ఒకే ఒక్క దేశం అయిన జర్మనీలో అది మిత్ర రాజ్యాల కూటమిచే అణచివేయబడింది. మరొకవైపు గెలుపొందిన దేశాలు అనూహ్యమైన రీతిలో స్థిరత్వాన్ని సాధించాయి; అవి తమ దేశాల శ్రామిక వర్గాలకు తగినన్ని ప్రయోజనాలు కల్పించి తద్వారా పాశ్చాత్య ప్రపంచంలో విప్లవ అవకాశాలకు ప్రస్తుతానికి అడ్డుకట్ట వేయగలిగిన స్థితిలో ఉన్నట్లు కనిపించాయి. ఇప్పుడు ఐరోపాలో రష్యా ఒంటరిదైందని గ్రహించిన లెనిన్ మద్దతు కోసం ఇతర ప్రాంతాల వైపు చూడనారంభించాడు. ఈ క్రమంలో ప్రాక్ ప్రపంచం వైపు ఇతోధిక విశ్వాసంతో దృష్టి సారించాడు.

ఆసియాలో అత్యంత నిబిడీకృత శక్తి కల ప్రక్రియ ప్రారంభం కావటాన్ని ఆయన గమనించాడు. జర్మనీని అణచివేసిన శక్తుల చేతనే అణచివేయబడుతున్న ఆసియా ప్రజలు పెట్టుబడిదారీ దశలోకి అడుగిడసాగారు. అయితే అదే సమయంలో, జాతీయవాద, సామ్రాజ్యవాద వ్యతిరేక స్వభావం కల విప్లవకర ఆందోళన సాగుతున్న దశలో వారున్నారు. ఎక్కువగా ఈ దిశ నుండే దీర్ఘకాలంలో రష్యా ఏకాకితనం అంతం కావడానికి, ప్రపంచ విప్లవ శక్తుల పునరుద్ధరణను ఆశించడానికి ఊతం లభిస్తుందని లెనిన్ ఊహించాడు:

"అంతిమ విశ్లేషణలో పోరాట ఫలితాన్ని రష్యా, ఇండియా, చైనా, తదితర దేశాలు ప్రపంచ జనాభాలో అత్యధిక మెజారిటీ జనాభాను కలిగి ఉన్నాయనే వాస్తవం నిర్ణయిస్తుంది. గత కొద్ది సంవత్సరాలలో ఈ మెజారిటీనే అసాధారణమైన వేగంతో విముక్తి పోరాటంలోకి లాగబడింది. ఇందువలన ప్రపంచ పోరాటపు అంతిమ ఫలితం ఎలా ఉంటుందనే విషయంలో ఇక ఎటువంటి సందేహానికి తావు లేదు. "(సమగ్ర రచనలు – సంపుటం : XLV – పుట : 404. అనుబంధం– IX చూడండి.)

అంతిమ ఫలితం నేటికీ అనిశ్చితంగానే ఉన్నప్పటికీ వర్తమాన చరిత్ర గమనానికి భూమికగా ఉన్న ఉద్యమాన్ని గురించిన అంచనా సరిగ్గానే వుంది. వాస్తవికత గురించి తనకున్న ప్రగాఢమైన అవగాహన వల్ల లెనిన్, విప్లవ క్రమం యొక్క భవిష్యత్ పరిణామం, పిడివాద మార్క్సిస్టులు రష్యాలో ఎదుర్కొన్న వాటికంటే, మరింత నిర్దుష్టమైన, మరింత ఆందోళనకరమైన రూపాల్ని సంతరించుకుంటుందని కూడా ముందుగా చూడగలిగాడు. ఈ సందర్భంలోనే లెనిన్ రష్యన్ విప్లవపు విలక్షణతను ప్రశ్నించాడు. లెనిన్ దానిని పెట్టుబడిదారీ నాగరికతా ప్రపంచానికి, ఆసియా ప్రాచ్య ప్రపంచానికి మధ్య రష్యా స్థానం అనే కోణం నుండి వివరించాడు. తాను రాసే సమయానికి రష్యాలో ప్రాచ్య ప్రపంచపు అంశాలు ప్రబలంగా వున్నాయని కూడా పేర్కొన్నాడు. స్టాలినిజానికి వివరణ కొన్ని సందర్భాలలో ప్రాచ్య వారసత్వం అనే కోణంలో అన్వేషించబడింది. ఇది స్పష్టంగా లెనినిస్టు వ్యాఖ్యానం. ఈ సందర్భంలో సోషల్ డెమొక్రాట్ల సూత్రీకరణలకు వ్యతిరేకంగా లెనిన్ రాసిన "మన విప్లవం" నుండి ఈ క్రింది భాగాన్ని ఉటంకించడం ఉపయుక్తంగా వుంటుంది. లెనిన్ సోషల్ డెమొక్రట్ల సూత్రీకరణలను దిగువ విషయాల్ని పరిగణనలోకి తీసుకోనందుకు విమర్శించాడు.

"నాగరిక దేశాలకు, ఈ యుద్ధం వల్ల మొదటిసారిగా నాగరికతా కక్ష్యలోకి ప్రవేశించిన అన్ని ప్రాచ్య, ఐరోపాయేతర దేశాల మధ్య సరిహద్దు రేఖపై రష్యా నిలిచి వున్నందున అది తప్పనిసరిగా కొన్ని ప్రత్యేక లక్షణాలు కలిగి వుంటుంది; ఇవి ప్రపంచ అభివృద్ధి సాధారణ క్రమానికి అనుగుణంగానే ఉన్నప్పటికీ, రష్యన్ విప్లవాన్ని పశ్చిమ ఐరోపా దేశాలలో జరిగిన విప్లవాల నుండి భిన్నమైనదిగా చేస్తాయి; విప్లవం ప్రాచ్య దేశాలకు వ్యాపించే క్రమంలో కొన్ని పాక్షిక నవీకరణలకు దారి తీస్తాయి" (పై గ్రంథం – పుట : 379).

లెనిన్ దీనిని క్లిష్టతకు, బలహీనతకు మూలంగా భావించాడు. లెనిన్ మరణానంతరం పాతికేళ్ళపాటు అది రష్యాని, కొందరు వ్యాఖ్యాతలు పేర్కొన్నట్లుగా "ఆసియా ఉత్పత్తి విధానం"లోకి కొనిపోయింది. అయినప్పటికీ అదే సమయంలో,

వ్యూహాత్మక దృక్పథం నుండి చూస్తే, అది దాదాపు ఒక సానుకూలత కూడ! రష్యా పశ్చిమ భాగం పశ్చిమ దేశాలలో విప్లవాన్ని రగిల్చేందుకు శక్తి చాలనిదిగా వుంది. కాని దాని ఆసియా భాగం మాత్రం ప్రాచ్య దేశాలలోని కోట్లాది ప్రజలకు ఒక నమూనాగా, ఒక వేగవర్ధక పరికరంగా పని చేసేందుకు మెరుగైన అవకాశం కలిగివున్నట్లు కనిపిస్తోంది. ఈ దిశలో అంతిమ విజయం తథ్యమని లెనిన్ భావించాడు. కాని అది సుదూర భవిష్యత్తులో జరిగేదని ఆయనకి తెలుసు. రాజనీతిజ్ఞుని ముందున్న సమస్య ఏమిటంటే, ఈ అదనపు బలగాలు వచ్చి చేరేవరకు రష్యాను నిలబెట్టుకునే మార్గాలను అన్వేషించడం. విజయానికి తామింకా చాలా దూరంలో వున్నామన్న విషయాన్ని లెనిన్ ప్రజలనుండి దాచి పెట్టలేదు. ఆయన ప్రకటనలన్నీ పత్రికలలో అచ్చయ్యేవని మనం గుర్తుంచుకోవాలి. అంతర్యుద్ధ కాలంలో రష్యాకి ప్రయోజనం చేకూర్చిన -- పశ్చిమ దేశాలు, జపాన్‌ల మధ్య ఘర్షణల నుండి -- అది ఇకపై కూడ ప్రయోజనం పొందగలుగుతుందా? అలా జరుగుతుందని చెప్పడానికి లెనిన్ సిద్ధంగా లేడు. సాధారణ చరిత్ర గతి గురించి ఆశావహ భవిష్యద్దర్శనం చేయడానికి లెనిన్ వెనకాడేవాడు కాదు. కాని తక్షణ భవిష్యత్తు గురించి భరోసా ఇచ్చే ముందస్తు అంచనాలనుండి మాత్రం ఎంతో వివేకంతో దూరంగా వుండేవాడు.

ఈ విషయంలో లెనిన్ విధానాన్ని "ఒక దేశంలో సోషలిజం" అనే నినాదమిచ్చిన ఆయన వారసులు అనుసరించలేదనే అంశం గమనించవలసి వుంది. తద్భిన్నంగా, లెనిన్ విధానం ఏమిటంటే అదనపు బలగాలు వచ్చి చేరేవరకు నిలబెట్టుకుంటూ, ఈ మధ్య కాలంలో ఒకేసారి సోషలిజాన్ని కాక ఒక పరివర్తనలో వున్న సమాజాన్ని నిర్మించడం. "తక్కువే మేలు, కాని మేలుగా వుండాలి" అనే తన రచనలో లెనిన్ ఇలా ప్రకటించాడు: "సోషలిజంలోకి నేరుగా పోవడానికి తగినంత నాగరికత మనకు లేదు". లెనిన్ తాను మరణించే లోపు తన ప్రజలకు వదిలి వెళ్లాలని గాఢంగా కాంక్షించిన వారసత్వపు సారాంశాన్ని ఈ వ్యాసం కలిగివుంది. ఇందులో ప్రధానాంశం ఏమిటంటే, వాళ్ళ లక్ష్యాలు పరిమితంగా, వాస్తవికంగా ఉండాలని, అత్యాశకు పోకుండా ఉండాలని, ఆత్మ మహత్వోన్మాదం (మెగలోమానియా) పట్ల జాగరూకత వహించాలని ప్రజలకు తెలియ చెప్పడం. కాని ఈ వాస్తవిక దృక్పథం, రష్యన్ విప్లవపు నిర్దుష్ట పరిస్థితి దాని అత్యంత విశ్వాసనీయులైన అనుయాయులలో ప్రేరేపించిన తీవ్రమైన రుగ్మతను రూపుమాపడంలో ఇంకా విజయం సాధించలేకపోయింది. కార్మిక వర్గ అధికారం ఎందుకోసమైతే సృష్టించబడిందో ఆ కర్తవ్యాలను అది పరిపూర్తి చేయలేని అశక్తతకి లోను కావడం, దారి తప్పడం కానప్పటికీ, ఒక వైచిత్రిగా కనిపిస్తుంది. లెనిన్ ప్రధానంగా శ్రద్ధ వహించిన విషయం విప్లవం మనుగడ కొనసాగించడాన్ని ఆచరణ సాధ్యం చేయడం; అయినప్పటికీ,

ఆయన కూడా పైన చెప్పిన రుగ్మతకు గురయ్యాడు; అందువలన విప్లవాన్ని మార్క్సిస్టు పరిభాషలో సమర్థించడానికి శాయశక్తులా కృషి చేశాడు. మార్క్సిస్టులకు తాము అందరికంటే మిన్నగా చారిత్రక పరిణామ క్రమాన్ని ముందుగా ఊహించగలమన్న విశ్వాసం ఉన్నందున, కొన్ని ముందుగా సిద్ధం చేసుకున్న భావనలకు, జరుగుతున్న వాస్తవాలకు పొంతన కుదరక పోవటం వాళ్ళను ఇబ్బంది పెట్టింది.

నిజానికి రష్యన్ విప్లవం మార్క్సిజాన్ని గురించి సాధారణంగా అంగీకరించబడిన వ్యాఖ్యానానికి ఎంత విరుద్ధంగా వుందంటే, దాని వ్యతిరేకులకు అది నిస్సందేహంగా "మార్క్సిస్టు వ్యతిరేకం"గా కనిపించింది. చాలా మేరకు లెనిన్ అసాధారణ రాజకీయ ప్రతిభ మూలంగా చారిత్రక కార్యాచరణ రంగంలో ఓటమి పాలై తిరస్కృతులైన మెన్షివిక్కులకు కనీసం సైద్ధాంతిక తలంపై తమ పగ తీర్చుకునే అవకాశం ఇప్పుడు లభించింది. భౌతిక పునాది సరిపడినంత లేని స్థితిలో రాజ్యాధికారాన్ని చేపట్టటం, కార్మిక వర్గం దాదాపుగా లేకుండా శ్రామిక వర్గ నియంతృత్వాన్ని ఏర్పాటు చేయడం, దానికి కార్మిక వర్గం మైనారిటీగా వున్న ఒక పార్టీ నాయకత్వం వహించటం, సోషలిస్టు విప్లవంగా పరిగణించబడిన ఘటన పిమ్మట పెట్టుబడిదారీ విధానాన్ని తిరిగి ప్రవేశపెట్టడం, ఒక అతిపెద్ద ఉద్యోగస్వామ్య యంత్రాంగానికి అపరిమితమైన అధికారాన్ని కట్టబెట్టటం -- ఈ నిరాకరించలేని వాస్తవాలు మార్క్సిస్టు సిద్ధాంతానికి, లోక జ్ఞానానికి పూర్తిగా విరుద్ధంగా ఉన్నాయి. ఇక ఇప్పుడు లెనిన్ తన ఆశలను నాగరిక పాశ్చాత్య దేశాలపై కాక, పెట్టుబడిదారీ పూర్వదశలో వున్న ప్రాచ్య దేశాల జన సమూహాలపై పెట్టుకున్నాడు. అనారోగ్యంగా ఉండి కూడా లెనిన్ ఈ విమర్శలను అధ్యయనం చేశాడు. రాజనీతిజ్ఞుని కార్యాచరణ వలె సిద్ధాంతవేత్త సమాధానం కూడా వినూత్నమైనది.

"ఏ మాత్రం ఆశాలేశం లేని పరిస్థితి, కార్మికుల, కర్షకుల కృషిని పదింతలు ప్రేరేపింపజేయడం ద్వారా నాగరికతకు చెందిన మౌలిక ప్రమాణాలను పశ్చిమ ఐరోపా దేశాల కంటే భిన్నమైన మార్గంలో సృష్టించడానికి మనకు అవకాశం కల్పిస్తే ఏమైంది?

"సోషలిజం నిర్మాణానికి ఒక నిర్దుష్ట స్థాయి కల సంస్కృతి అవసరమైనట్లైతే... ముందుగా అట్టి సంస్కృతికి అవసరమైన ముందస్తు పరిస్థితుల్ని విప్లవాత్మక మార్గంలో సాధించి, అప్పుడు కార్మిక కర్షక ప్రభుత్వం, సోవియట్ వ్యవస్థల మద్దతుతో మిగతా దేశాలను అధిగమించి ముందుకు వెళ్ళే విధంగా మనం ఎందుకు చేయలేం?"

లెనిన్ కొంత మేరకు ఊహించని వ్యక్తి నుండి ఉదహరిస్తూ, ఇంకా మెరుగైన అంశాన్ని ఇలా పేర్కొన్నాడు : "నెపోలియన్ రాశాడనుకుంటాను: ముందు *తీవ్రమైన పోరాటం చెయ్యి, ఏం జరుగుతుందో తరువాత చూడు."* (పై గ్రంథం – పుట : 380

– 81). వాస్తవానికి సోవియట్ యూనియన్, తదుపరి చైనా, క్యూబాలు ముందుగా అధికారాన్ని కైవసం చేసుకుని తదుపరి ఇతర దేశాల స్థాయిని అందుకోవటం సాధ్యమేనని ఋజువు చేశాయి. అయితే *ముందు తీవ్రమైన పోరాటం చెయ్యి, ఏం జరుగుతుందో తరువాత చూడు* అనే సూత్రం పూర్తిగా అసందిగ్ధమైనదేమీ కాదు. తన ప్రాపంచిక దృక్పథంలో, సామాజిక వాస్తవికత పట్ల అవగాహనలో పూర్తి మార్క్సిస్టు అయిన లెనిన్, కార్యాచరణ ఎల్లప్పుడు తప్పనిసరిగా సామాజిక శక్తుల బలాబలాల మదింపుపై ఆధారపడి వుండాలని విశ్వసించిన లెనిన్, ఏ విధమైన దుందుడుకు ధోరణినైనా అంగీకరించని లెనిన్, ఇక్కడ మాత్రం, అధికారాన్ని కైవసం చేసుకునేందుకు చేసే కాల నిర్ణయాన్ని, దానిని కైవసం చేసుకున్న తీరుని ఒక సిద్ధాంతపరమైన చారిత్రక – సామాజిక విశ్లేషణ ద్వారా ఖచ్చితంగా అంచనా వేయలేమని చెపుతున్నట్లుగా కనిపిస్తున్నది. ఒక విధంగా చూస్తే విప్లవ కార్యాచరణ, అన్ని రాజకీయాల వలె, ఒక కళ. ఇందులో వాస్తవికవాదం సాహసోపేత ధోరణితో పెనవేసుకుపోతుంది. ఏ విప్లవం కూడా దానికంటే ముందే ఏర్పడి వున్న ఏ సిద్ధాంతాన్నైతే విప్లవ సాధనకు ఉపయోగించుకుంటుందో, దానితో పూర్తి అనుగుణ్యత కలిగి వుండదు. ఈ కారణం వల్లనే భవిష్యత్ విప్లవకారులకు లెనిన్ ఇచ్చిన సందేశం -- అది సాహసోపేత కార్యక్రమానికి పిలుపునిచ్చినట్లు అనిపించినప్పటికీ -- వారు అన్నిటినీ మించి కాలం చెల్లిన పిడివాద సిద్ధాంతాలను -- అవి గతంలో ఎంతగా ఉపయోగపడినప్పటికీ -- తిరస్కరించగలిగే శక్తి కలిగి ఉండాలనే అంశాన్ని నొక్కి చెప్పింది. ఈ విధంగా చూస్తే, అది లెనిన్ స్వంత సిద్ధాంతాలను పిడివాదంగా మార్చడానికి వ్యతిరేకంగా అంతర్లీనమైన హెచ్చరిక కలిగి వుంది.

లెనిన్‌కి ఇదంతా సునాయాసంగా సాధ్యపడలేదు; తన ప్రభుత్వం నిలిచి వుంటుందనే నమ్మకం ఆయనకు వుండివుంటే తన విజయాన్ని సమర్థించుకునే ఈ చిత్రమైన అవసరం ఏర్పడి వుండేది కాదు. కాని పరిస్థితి అలా లేదు. విప్లవం ఇంకా అణచివేయబడవచ్చు. అప్పుడు చరిత్ర దానిపై ఎలాంటి తీర్పు ఇస్తుందనే విషయం లెనిన్‌కి తెలియదు.

కాని సోవియట్ రాజ్యం ఎదుర్కొనే ప్రమాదాల జాబితా అంతర్జాతీయ సమస్యలకే పరిమితం కాలేదు. కొత్త ప్రభుత్వం మరింతగా క్లిష్టతరమౌతున్న పరిస్థితులలో నెగ్గుకు రావలసి ఉంది. (పై గ్రంథం – పుటలు : 343 – 44). ఎంతకాలం అవసరమైతే అంత కాలం ఉనికిని కాపాడుకోవాలనే నిర్ణయం జరిగిన దృష్ట్యా, ఏ కార్యక్రమం, ఏ అంతర్గత సంస్కరణలు అవసరం?

లెనిన్‌కి ఉద్యోగస్వామ్య రుగ్మత గురించిన ఆందోళన ఖచ్చితంగా వుంది.

కాని ఆయన అభిప్రాయంలో అత్యంత తీవ్రమైన ప్రమాదం ఆ వైపు నుంచి లేదు. కార్మికులకు, కర్షకులకు మధ్య చీలిక ఏర్పడితే అది విప్లవాన్ని పరిసమాప్తి గావిస్తుందని ఆయన విశ్వాసం. విప్లవానంతర రష్యన్ సమాజాన్ని గురించిన విశ్లేషణ, సాధారణంగా రెండు ప్రధాన వర్గాల ఉనికిపై ఆధారపడి జరిగేది. ఇప్పుడు నూతన ఆర్థిక విధానం ప్రవేశపెట్టబడడంతో మూడో వర్గంగా బూర్జువా వర్గాన్ని కూడా కలుపుకోవలసి వచ్చింది. భవిష్యత్తు ఎన్నడూ లేనంత నిరాశాపూరితంగా ఉంది. రైతాంగానికి బహుశా ఒక మిత్రవర్గాన్ని అందించడం, అది విప్లవానికి దూరమయ్యే అవకాశాన్ని పెంచింది. ప్రత్యామ్నాయం ఇలా వుంది. "అంతిమ విశ్లేషణలో మన రిపబ్లిక్ భవితవ్యం రైతాంగ జన సమూహాలు కార్మిక వర్గంతో కలిసి నిలబడతారా, ఈ వర్గంతో తమ మైత్రికి కట్టుబడి వుంటారా లేక వాళ్ళు తమకు, కార్మిక వర్గానికి మధ్య చీలిక తెచ్చి, తమ మైత్రిని విచ్ఛిన్నం చేయడానికి నూతన బూర్జువా వర్గానికి అవకాశమిస్తారా అనే అంశంపై ఆధారపడి వుంది." (అదే గ్రంథం - పుట : 387- 88). ఏ కూటమిపై అయితే ఈ వ్యవస్థ ఆధారపడి వుందో అది అనిశ్చితమైనది. లెనిన్ ఈ వాస్తవాన్ని దాచిపెట్టలేదు. ప్రస్తుతానికి విప్లవ క్రమంలో ఆవిర్భవించిన చిన్న అతి చిన్న రైతాంగం సోవియట్ వ్యవస్థకు విశ్వాసపాత్రంగా ఉందనేది వాస్తవం: కాని ఈ విశ్వాసం ఒక్కదాని ఆసరాతో అభివృద్ధి చెందిన దేశాలలో సోషలిస్టు విప్లవం విజయవంతమయ్యే వరకు మన ప్రయాణాన్ని కొనసాగించడం అంత తేలిక కాదు." (అదే గ్రంథం - పుట : 401). ప్రత్యేకించి అంతర్యుద్ధం, విదేశీ జోక్యం మూలంగా దేశ ఆర్థిక వ్యవస్థ బలహీనపడిన నేపథ్యంలో ఎంతో వెనుకబడి వున్న రైతాంగం మద్దతుపై ఆధారపడడం సాధ్యం కాదు.

అటువంటి సామాజిక పునాది రాజ్యము, పార్టీల స్థిరత్వాన్ని సందిగ్ధంలో పడవేసింది. నాయకుల మధ్య చీలిక అవకాశం వల్ల పార్టీ స్థిరత్వం అప్పటికే ప్రమాదంలో పడింది. ఇక్కడ కూడ లెనిన్, చారిత్రక పరిణామంలో వ్యక్తుల మధ్య సంబంధాల ప్రాముఖ్యత గురించి తన అభిప్రాయాలను మార్క్సిస్టు సిద్ధాంతంతో వాటి అనుగుణ్యతను చూపుతూ సమర్థించవలసిన అవసరం వుందని భావించాడు. ఈ ప్రాముఖ్యత రష్యన్ మార్క్సిజంకి పితృసమానుడైన ప్లెఖనోవ్[17] చేసిన సామాజిక రచనల్లో తక్కువ చేసి చూపబడింది. ఇక్కడ కూడా లెనిన్ అవగాహనే సరైనదని ఋజువయింది.

లెనిన్ రెండు దిశల నుండి ప్రమాదాన్ని ఎదుర్కోవలసి వచ్చింది: మొదటిది కార్మిక - కర్షక కూటమి వైపునుండి; రెండవది పార్టీలో చీలిక వచ్చే అవకాశం కలిగించిన ప్రమాదం. మొదటిదానికి కొన్ని దీర్ఘకాలిక చర్యల అవసరం వుంది. రెండవదాని

విషయానికొస్తే ప్రభుత్వ యంత్రాంగపు ఉన్నత శ్రేణుల్ని వెనువెంటనే పునర్ వ్యవస్థీకరించవలసి ఉంది. ఈ సందర్భంలో లెనిన్ రూపొందించిన ప్రణాళికలను -- వాటిలో ఎక్కువ భాగం ఫలప్రదం కావటానికి కొంత సమయం పట్టినప్పటికీ -- మనం అత్యవసర చర్యలుగా పరిగణించాల్సి వుంటుంది. అంతేకాక, ఈ రెండు విధాలైన నివారణ మార్గాల మధ్య సన్నిహిత సంబంధం వుంది. ఎందుకంటే ప్రభుత్వ యంత్రాంగం వీలైనంత తక్కువ ఖర్చుతో పని చేయగలిగితే అది రైతాంగం మద్దతు పొందడానికి తోడ్పడుతుంది. రైతు మద్దతును తప్పనిసరిగా గెల్చుకోవలసిందే, కాని అది ప్రత్యక్ష కమ్యూనిస్టు ప్రచారం ద్వారా చేయరాదు. లెనిన్ అటువంటి ప్రయత్నానికి వ్యతిరేకంగా పార్టీని ఈ విధంగా హెచ్చరించాడు:

"ఎట్టి పరిస్థితులలోను దీనిని శుద్ధమైన, నికార్సయిన కమ్యూనిస్టు భావాల్ని గ్రామీణ ప్రాంతాల్లో వెంటనే ప్రచారం చేయవచ్చనే అర్థానిస్తున్నట్లు పరిగణించరాదు. మన గ్రామీణ వ్యవస్థలో కమ్యూనిజానికి అవసరమైన భౌతిక పునాది లోపించినంత కాలం, అలా చేయడం నా దృష్టిలో హానికరం, ఇంకా చెప్పాలంటే, కమ్యూనిజానికి మరణ శాసనం." (పై గ్రంథం - పుట : 36).

పట్టణాలకు చెందిన కార్మిక సంఘాలు తమ నగర, సోవియట్ ప్రభావాన్ని గ్రామీణ ప్రాంతాల్లో వ్యాపింపచేసే ఒక విధమైన ఆరంభక్రియ గురించి లెనిన్ ఆలోచిస్తున్నాడు. అయితే, తన చుట్టూ ఉన్న ప్రపంచాన్ని ఆకళింపు చేసుకున్న లెనిన్, ఇందుకు ఒక షరతు ప్రతిపాదించాడు. ఈ కార్యకలాపాలన్నీ పూర్తిగా స్వచ్ఛందంగా జరగాలి. పార్టీ యంత్రాంగంలోని మిగతా విభాగాలలో జరిగినట్లు ఈ కార్మిక సంఘాలు ఉద్యోగస్వామ్య సంఘాలుగా మారడాన్ని నివారించాలి.

రైతుల కోసం లెనిన్ రూపొందించిన యావత్ కార్యక్రమాన్ని "సాంస్కృతిక విప్లవం" అనే నినాదంతో క్రోడీకరించవచ్చు. లెనినిజాన్ని అనుసరిస్తున్నట్లుగా చెప్పుకుంటున్న ఒక దేశంలో* ప్రస్తుతం అత్యంత ప్రాచుర్యంలో వున్న ఈ భావనను లెనిన్ అర్థం చేసుకున్న తీరును భావావేశంతో కూడిన వాస్తవిక, హేతుబద్ధ వైఖరిగా మాత్రమే వివరించగలం. నిజానికి ప్రజాశ్రేణులు "వెనుకబాటుతనం"లో మగ్గుతూ వుండగా అనాలోచితంగా "శ్రామికవర్గ సంస్కృతి" గురించి మాట్లాడిన వారినందరినీ లెనిన్ నిర్దాక్షిణ్యంగా విమర్శించాడు. దానికంటే ఎంతో కొంత సంస్కృతిని ప్రోది చేసుకోవటం మేలు. ఇంకా మితార్థంలో చెప్పాలంటే చదవటం, రాయటం నేర్చుకోవడం మేలు; శ్రామిక వర్గ సంస్కృతి గురించి వ్యాఖ్యానించే ముందు సగటు పాశ్చాత్య దేశపు స్థాయిని

---

* ఇది చైనాలో జరిగిన సాంస్కృతిక విప్లవం గురించిన ప్రస్తావన. - ప్రచురణకర్తలు.

అందుకొనవలసి వుంది : "ఈ ప్రారంభ దశలో మనం నిజమైన బూర్జువా సంస్కృతితో సంతృప్తి చెందాల్సి వుంది. ఈ దశలో మనం బూర్జువా పూర్వ సంస్కృతి అపరిపక్వ రూపాలైన ఉద్యోగస్వామ్య సంస్కృతి, అర్థ – బానిస సంస్కృతి లాంటి వాటిని విడనాడడంతో సంతృప్తి చెందాలి. సంస్కృతికి సంబంధించిన విషయాల్లో తొందరపాటు కాని, పరిమితులు పాటించని చర్యలు కాని అత్యంత హానికరం." (పై గ్రంథం – పుట : 389). ఈ కార్యక్రమాన్ని "విప్లవం" అని పిలిచినప్పటికీ దాని అమలుకు సుదీర్ఘ చారిత్రక కాలం పడుతుంది. ఇదొక దీర్ఘకాలిక పథకం. "యావత్తు ప్రజానీకం ఒక సాంస్కృతిక అభివృద్ధి దశ ద్వారా పయనించాలి". ఒక విధంగా చూస్తే, రష్యాకు అవసరమైంది అంతా అదే. "ప్రస్తుతం సోషలిజం దిశగా పురోగమించడానికి ఇక ఏ ఇతర సాధనాలు అవసరం లేదు" అని లెనిన్ "సహకారం మీద" (ఆన్ కోఆపరేషన్) అనే తన వ్యాసంలో పేర్కొన్నాడు.

ఈ కర్తవ్యం ప్రభుత్వ ప్రధాన లక్ష్యం కావాలి. ప్రజా పాఠశాలోపాధ్యాయుని స్థానానికి నూతన ప్రతిష్టను, కొన్ని మెరుగైన జీవన పరిస్థితులను (అంటే ఈ సమయంలో ఆహార పంపిణీలో ప్రాధాన్యం ఇవ్వటం) కల్పించాలి. లెనిన్ చేపట్టిన బృహత్తర ప్రణాళికలోని ఈ అంశం ఎక్కువ ఊహాజనిత స్వభావం కలిగిన వాటిలో ఒకటి: వాస్తవానికి గ్రామంలోని పాఠశాల ఉపాధ్యాయుని స్థితి చాలాకాలం వరకు తీసికట్టుగానే మిగిలిపోయింది.

లెనిన్ గ్రామీణ ప్రాంతాల కోసం ఉద్దేశించిన సామాజికార్థిక ప్రణాళిక అయిన "సహకార ప్రణాళిక"కి "సాంస్కృతిక విప్లవం"తో సన్నిహిత సంబంధం వున్నట్లుగా కనిపిస్తుంది. అలా అయినందువల్ల దాని ప్రాముఖ్యత పెరిగింది. కాని ఇది కూడా దీర్ఘకాలిక ప్రణాళికే.

లెనిన్ అభిప్రాయంలో నూతన ఆర్థిక విధానం రాబోయే దీర్ఘకాలం పాటు రైతు తన కార్యకలాపాలను నిర్వర్తించే సామాజికార్థిక చట్రంగా, అతను అర్థం చేసుకోగలిగిన, అతని ప్రయోజనాలకు అనుగుణంగా వున్న వ్యవస్థగా నిలిచి వుండాలి. తన మరణానికి ముందు, ఈ భావమే దీర్ఘకాలపు పరివర్తనకు మార్గదర్శక సూత్రం కావాలని లెనిన్ విశ్వసించాడు. "నూతన ఆర్థిక విధానం క్రింద మనం చేయవలసిందల్లా రష్యన్ ప్రజానీకాన్ని తగినంతగా పెద్ద ఎత్తున సహకార సంఘాలలోకి తీసుకురావడం" అని లెనిన్ పేర్కొన్నాడు. (అదే గ్రంథం – పుట : 370). ఈ భావం వ్యవస్థ యొక్క సోషలిస్టు లక్ష్యంతో ఏ మేరకు పొసుగుతుందనేది ఇప్పుడు తలెత్తే ప్రశ్న. సహకార వ్యవస్థను లెనిన్ ఎల్లప్పుడు ప్రధానంగా బూర్జువా తరహా ఆర్థిక కార్యక్రమంగానే పరిగణించాడు; మరి అటువంటప్పుడు నూతన ఆర్థిక విధానంలోని పెట్టుబడిదారీ ధోరణులు రైతాంగ సహకార ఉద్యమానికి ఉందనుకొంటున్న బూర్జువా స్వభావాన్ని దృఢతరం చేయవా అనే ప్రశ్న ఎదురయ్యే అవకాశం వుంది. లెనిన్ ఈ అంశంపై తన సైద్ధాంతిక అవగాహనను

పూర్తిగా తలక్రిందులు చేశాడు. రైతాంగాన్ని సోషలిస్టు నిర్మాణం వైపు నడిపించడానికి సహకార వ్యవస్థ సరైన పద్ధతి అని ఆయన ఇప్పుడు విశ్వసించసాగాడు. దీనిని ఆయన ఎంత బలంగా విశ్వసించాడంటే, రాజ్య పెట్టుబడిదారీ విధానం ఆచరణలో విఫలమైన పిమ్మట ఆయన దానిని అయిష్టంగానే తన ప్రణాళికలలో నుండి తొలగించినప్పుడు ఏర్పడిన ఖాళీని ఇప్పుడు సహకార ఉద్యమం ఆక్రమించింది. రాజ్యం, ప్రధాన ఉత్పత్తి సాధనాలు ఇప్పుడు కార్మికులచేతుల్లో వున్న కారణంగా సహకారం ఇకపై ఎంత మాత్రం గతంలో వలె బూర్జువా, వ్యాపార సంబంధిత వ్యవస్థ కాదు. అది సోషలిజంతో పాటు అభివృద్ధి చెందే ఒక సోషలిస్టు వ్యవస్థ. తనకు సుపరిచితమైన పద్ధతుల్లో ప్రతి రైతు సోషలిజం నిర్మాణంలో పాలుపంచుకునేందుకు సహకార వ్యవస్థ తోడ్పాటునందిస్తుంది. సరైన మార్గాన్ని కనుగొన్నట్లనిపించసాగింది: "ఖచ్చితంగా చెప్పాలంటే ఇప్పుడు మనం చేయవలసింది ఒక్కటి 'మాత్రమే'. అదేమిటంటే, ప్రతి ఒక్కరు సహకార సంస్థల పనిలో భాగస్వాములు కావడంలోని ప్రయోజనాలను గ్రహించేట్లుగా మన ప్రజలకు 'చైతన్యం' కలిగించడం. వారి భాగస్వామ్యాన్ని వ్యవస్థీకృతం చేయడం. చేయవలసింది అది మాత్రమే. సోషలిజం దిశగా పురోగమించడానికి ఇప్పుడు ఇక ఏ ఇతర సాధనాలు అవసరం లేదు". తొలిగా ఏర్పరచుకున్న లక్ష్య సాధనకు అవసరమైన సుదీర్ఘ కాలం తరువాతనే సోషలిజాన్ని సాధించగలమని దీని ద్వారా లెనిన్ చెప్పదలచుకున్నాడు. సహకార వ్యవస్థకు సంబంధించిన తన నూతన వ్యూహాన్ని దృష్టిలో వుంచుకుని లెనిన్ సోషలిజాన్ని కూడా తిరిగి నిర్వచించాడు: "ఉత్పత్తి సాధనాలపై సామాజిక యాజమాన్యం, బూర్జువా వర్గంపై కార్మిక వర్గ విజయం నెరవేరిన ఈ తరుణంలో నాగరిక సహకార వ్యవస్థే సోషలిజం." (అదే గ్రంథం – పుట : 373). తన వ్యాసంలో ఈ భావాన్ని అభివృద్ధి చేసేందుకు లెనిన్‌కి తగినంత సమయం లేదు. కాని ఆయన ఆలోచనా క్రమం పూర్తిగా స్పష్టంగా వుంది. అయితే, ఏ అర్థంలో ఒక సహకార సంస్థ (కాని ఏ రకమైన సహకార సంస్థ – వినిమయం కోసమా, అమ్మకం కోసమా లేక ఉత్పత్తి కోసమా అనేది మనకు తెలియదు) రాజ్యం సరాసరి నిర్వహించే సంస్థలతో సమానంగా సోషలిస్టు కాగలదో ఆయన వివరించిన రచనా భాగాలలో కొంత గందరగోళం చోటు చేసుకుంది. రాజ్యం నిర్వహించే సంస్థల సోషలిస్టు స్వభావం గురించి లెనిన్‌కి ఏమాత్రం సందేహం లేదు. సిద్ధాంతంలో చోటు చేసుకున్న ఈ మార్పు ఎన్ని సమస్యల్ని పరిష్కరిస్తుందో అన్ని సమస్యల్ని సృష్టిస్తుంది. ఉదాహరణకి లెనిన్ మాట్లాడేది ఉత్పత్తి సహకార సంస్థల్ని గురించి కాదు; ఆయన ప్రస్తావించిన సహకార సంస్థల విధులు ప్రధానంగా వ్యాపారపరమైనవి. రష్యన్ రైతు, వర్తకుడు "వ్యాపారాన్ని ఆసియా పద్ధతుల్లో నడుపుతారు, కాని ఒక మంచి వర్తకుడు

కావాలంటే వ్యాపారాన్ని ఐరోపా పద్ధతులలో నిర్వహించాలి". సహకార విధానం రైతాంగం "సంస్కారవంతులైన వ్యాపారులు"గా రూపొందడానికి తోడ్పడుతుంది. అలా జరిగినప్పుడు రష్యా అభివృద్ధి చెందిన దేశాల స్థాయిని అందుకోగలదని లెనిన్ అన్నాడు.

కనుక సోషలిజం అంటే "సంస్కారవంతులైన వ్యాపారుల" వ్యవస్థ అని వాదించవచ్చా? లెనిన్ ఉద్దేశించింది అది కానే కాదు. లెనిన్‌కి 'సోషలిజం', 'కమ్యూనిజం' అనే భావనలు సుదూర భవిష్యత్తు లక్ష్యాలు. కమ్యూనిజం, సోషలిజం భావనలకున్న సమీకరణ శక్తి, ప్రచార విలువల దృష్ట్యా మధ్యంతర రాజకీయ వ్యూహాలపై జరిగే చర్చలో లెనిన్ ఆ భావనలను ఉపయోగించడానికి వెనుకాడలేదు. ఈ క్రమంలో శాస్త్రీయ ప్రామాణికత పట్ల లెనిన్ అంత జాగ్రత్త వహించలేదు. అదే వ్యాసం, అటువంటి భావనలను పరిశీలించేటప్పుడు ఆయన ప్రదర్శించిన కొంత అనాలోచిత ధోరణిని అర్థం చేసుకునేందుకు అవసరమైన ఆధారాలను అందించింది. లెనిన్‌ని మించి సైద్ధాంతిక శుద్ధత పట్ల శ్రద్ధ కనపరుస్తూ రాజ్య పెట్టుబడిదారీ విధానం అనే భావనను నిరంతరం విమర్శించిన కమ్యూనిస్టులకు వ్యతిరేకంగా తాను ఈ భావనను త్యజించటాన్ని సమర్థించుకుంటూ లెనిన్ ఇలా వ్యాఖ్యానించాడు: "నాకు ఆచరణాత్మక ప్రయోజనమే ఎల్లవేళల ముఖ్యమైనదని వాళ్ళు గ్రహించలేదు." ఈ వ్యాసాలలో సమకాలీనపు అత్యంత ముఖ్యమైన కర్తవ్యాలను "సోషలిస్టు" లేక "కమ్యూనిస్టు" అని ఎందుకు పిలవడం జరిగిందో ఇది వివరిస్తుంది; ఇలా చేయడం రాజ్యాన్ని దాని అంతిమ లక్ష్యాల చేరువకు తెస్తుందని బహుశా ఆయన భావించి వుండవచ్చు. రాజ్యానికి సహకార వ్యవస్థ తిరుగులేని అవసరమని ఆయన ఇప్పుడు విశ్వసిస్తున్నాడు కనుక దానికి తగినంత గౌరవనీయతను కల్పించడం ద్వారా పార్టీ ఉన్నత శ్రేణుల దృష్టిని ఈ దిశగా ఆకర్షించడానికి గట్టిగా ప్రయత్నించాడు. ప్రతి సామాజిక వ్యవస్థ ఒక ప్రత్యేక వర్గపు మద్దతుతో ఆవిర్భవిస్తుందని ఆయన వివరించాడు; సహకార వ్యవస్థకి మద్దతునిచ్చి దానికి పెట్టుబడిని, అనేక ఇతర సౌకర్యాలను కల్పించడం ప్రయోజనకరంగా వుంటుంది. ఇదీ ఆయన సూచించిన కార్యాచరణ ప్రణాళిక. కాని ఆయన వారసులు చాలా పాక్షికంగా మాత్రమే ఆయనను ఈ విషయంలో అనుసరించారు.

# 9

# ప్రభుత్వ వ్యవస్థలలో సంస్కరణ

అప్పటి రష్యన్ సమాజం వున్న స్థితిలో క్రింది నుండి వచ్చే సజ్జోజనిత ఒత్తిడి ద్వారా సోషలిజాన్ని సాధించడం ఊహాతీతం కావున, బోల్షివిక్కులకి తాము కోరుకున్న లక్ష్యాన్ని సాధించడానికి ఒకే ఒక్క మార్గం మిగిలి వుంది: రాజ్య యంత్రాంగాన్ని వారి నియంత్రణలో ఉంచుకోవడం. అందువలన అప్పటి లెనిన్ రచనలలో పూర్తిగా అభివృద్ధి చేయబడిన అంశం ప్రభుత్వ వ్యవస్థలో సంస్కరణ అయి వుండటంలో ఆశ్చర్యపడవలసిందేమీ లేదు. ఎందుకంటే ఈ అధికారాన్ని అత్యంత వివేచనతో నిర్వర్తించకపోతే, ఇది కూడా వారి గుప్పిటనుండి జారిపోయే అవకాశం వుంది. అంతర్యుద్ధం ముగిసిన నాటి నుండి లెనిన్ నిరంతరం నొక్కి చెపుతున్న ఆదేశం "మనం పరిపాలించడం నేర్చుకుందాం."

రాజ్య యంత్రాంగం, పార్టీ యంత్రాంగంలోని అన్ని అవాంఛనీయ ధోరణులకు వ్యతిరేకంగా చేసే పోరాటంలో లెనిన్ ఒకే ఒక్క అంశాన్ని నూతన మార్గంగా చూశాడు. కమ్యూనిస్టు మేధావుల్ని, అంతకు మించి, పార్టీ నాయకత్వాన్ని పునర్వ్యవస్థీకరించడం. మార్పులను తప్పనిసరిగా ఉన్నత స్థానాలలో ప్రారంభించాలి; అది మిగతా సమాజానికి ఉదాహరణ అవుతుంది. ఆ సమయంలో పెద్ద మంత్రిత్వ శాఖలు (కమిస్సారియట్లు) కూడా లోపభూయిష్టంగా పని చేసేవి; లెనిన్ వాటిపై పరుషమైన విమర్శలు చేసేవాడు. కాని మరింత దారుణమైంది రాబోతోంది. తన నాయకత్వంలో నడిచే సోవ్నర్కోమ్ (కేంద్ర ప్రభుత్వం) పని తీరు గురించి లెనిన్ ఆందోళనతో వున్నాడు. అందువల్లనే ఆయన 1922 సంవత్సరమంతా తనకున్న సమయంలో గణనీయమైన భాగాన్ని తన సహాయకుల విధులను, వారి ద్వారా, మొత్తం కేంద్ర ప్రభుత్వ విధులను పునర్వ్యవస్థీకరించడానికి కేటాయించాడు. సోవ్నర్కోమ్ 120 కమీషన్లను నియమించిందని తెలుసుకుని లెనిన్ నిర్ఘాంతపోయాడు. ఆయన అభిప్రాయంలో 16 కమీషన్లు ఆ కర్తవ్యాలను నెరవేర్చటానికి పూర్తిగా సరిపోయేవి.

మరో వైపు, ఆరోగ్యం కుదుటపడి బాధ్యతలు తిరిగి స్వీకరించినప్పుడు లెనిన్ తాను బాధ్యతలకు దూరంగా వున్న తరుణంలో ప్రభుత్వ, పార్టీ యంత్రాంగాలు

సమన్వయంతో పని చేయలేదని గుర్తించాడు. ఒకళ్ళు చేసిందే రెండవవాళ్ళు పునరావృతం చేయడమో లేదా కేవలం 'మందకొడితనం' ప్రదర్శించటమో జరిగింది. అనుభవజ్ఞులైన ప్రభుత్వోద్యోగులు, కమిస్సార్లతో సహా, 120 కమీషన్ల వెనుక దాగి కాని లేదా ప్రతి ప్రశ్నను అదెంత ప్రాముఖ్యత లేని, సాదాసీదా ప్రశ్న అయినప్పటికీ పొలిట్‌బ్యూరోకి సమర్పించి వారి బాధ్యతల నుండి తప్పించుకోవడానికి ప్రయత్నించేవారు.

డిసెంబరు 23న లెనిన్ చేసిన అతి ముఖ్యమైన మొదటి సిఫారసు సెంట్రల్ కమిటీ సభ్యుల సంఖ్యను వందకు పెంచటం. ఇలా చేయడం ద్వారా వైరం పూనిన నాయకుల మధ్య ఘర్షణను తగ్గించవచ్చని, దెబ్బతిన్న సెంట్రల్ కమిటీ ప్రతిష్టను పునరుద్ధరించవచ్చని, దానికి ఒక నూతన కర్తవ్యాన్ని అప్పగించవచ్చని లెనిన్ ఆశించాడు. యావత్ రాజ్య యంత్రాంగాన్ని ఒక నూతన ప్రాతిపదికపై పునర్నిర్మించడమే ఆ కర్తవ్యం. (లెనిన్ ఈ భావాలను తిరిగి తన వ్యాసాలు "కార్మిక – కర్షక తనిఖీ గురించి" మరియు "కొంచెమే మేలు, కాని మేలుగా ఉండాలి" లలో పేర్కొన్నాడు. రెండవ వ్యాసం అనుబంధం – IX వద్ద ఇవ్వబడింది)

సెంట్రల్ కమిటీ ప్రతిష్టను పునరుద్ధరించవలసిన అవసరం ఎందుకు ఏర్పడిందో లెనిన్ వివరించలేదు. కాని ఇరవైమంది ఇతర సభ్యులున్న కేంద్ర కమిటీలో ఏడుగురు పొలిట్‌బ్యూరో సభ్యులకు మితిమీరిన ప్రభావం వుండటాన్ని తేలికగా అర్థం చేసుకోవచ్చు. పదకొండవ మహాసభ తరువాత ఈ ఏడుగురు సభ్యులుగా లెనిన్, స్టాలిన్, ట్రాట్‌స్కీ, జినొవీవ్, కామెనెవ్, టామ్‌స్కీ, రైకొవ్ ఉన్నారు. (మరో నలుగురు కాండిడేట్ సభ్యులు: బుఖారిన్, క్యుబిషెవ్, కలినిన్, మాలటోవ్). తన ప్రణాళిక రెండవ కూర్పులో లెనిన్ విస్తరింపజేసిన సెంట్రల్ కమిటీకి అదనంగా 75 నుండి 100 మంది సభ్యులుండే కేంద్ర నియంత్రణా సంఘాన్ని (సెంట్రల్ కంట్రోల్ కమిషన్) ఒక పెద్ద వ్యవస్థగా కొత్తగా ఏర్పాటు చేసి దానికి రాజ్య యంత్రాంగాన్ని నిర్మించే ప్రత్యేక కర్తవ్యాన్ని అప్పగించాలని ప్రతిపాదించాడు. మొదట కొత్త సభ్యులను కార్మికులలో నుండి తీసుకోవాలని భావించడం జరిగింది. కాని వారికి అప్పగించే పనులు అత్యంత క్లిష్టంగా వుంటాయి కావున వాటిని సక్రమంగా నెరవేర్చడం కేవలం ఫాక్టరీ కార్మికులకు సాధ్యం కాకపోవచ్చనే కారణంతో ఆ నిబంధనను చివరకు తొలగించటం జరిగింది.

సెంట్రల్ కమిటీ, కొత్త కేంద్ర నియంత్రణ సంఘం కలిసి కొత్త సెంట్రల్ కమిటీగా ఏర్పడతాయి. నూటయాభై నుండి రెండు వందల మంది సభ్యులుండే పెద్ద సమూహంగా వుంటుంది. చూడ్డానికి ఇది ఒక పార్టీ మహాసభలా వుంటుంది. సంవత్సరానికి ఆరుసార్లు సమావేశం కావలసి వుంటుంది. అంతేకాక, కేంద్ర నియంత్రణ సంఘపు అధ్యక్ష వర్గం

పొలిట్ బ్యూరో పనిలో క్రియాశీలంగాను, పర్యవేక్షక హోదాలోను పాలుపంచు కుంటుంది. సెంట్రల్ కమిటీ, పొలిట్‌బ్యూరోలు సక్రమంగా పనిచేసే విధంగా అన్ని పత్రాలు పరిశీలించడం తదితర చర్యల ద్వారా, ఇది కనిపెట్టి వుంటుంది; తన విధి నిర్వహణలో జనరల్ సెక్రటరీతో సహా వ్యక్తులు ఎవరనే దానితో ఈ సంఘానికి నిమిత్తం లేదు.

కనుక సెంట్రల్ కమిటీని బలోపేతం గావించటమే కాక, దానికి విస్తృతమైన బాధ్యతలు కూడా అప్పగించబడతాయి. చివరికొక సమస్య మిగిలి వుంది: సమర్థవంతమైన ప్రభుత్వోద్యోగుల వ్యవస్థను రూపొందించడానికి అవసరమైన శిక్షణనిచ్చేందుకు కావలసిన నైపుణ్యం, పద్ధతి ఎక్కడ నుండి వస్తాయి? లెనిన్ తాను రూపొందించిన, కాని తదుపరి తననెంతో నిరాశపరచిన, వ్యవస్థ వైపు తిరిగి వెళ్ళాడు: కార్మిక – కర్షక తనిఖీ. ప్రభుత్వ సంస్థల, ఇతర పరిపాలనా సంస్థల పనిని పర్యవేక్షించే బాధ్యత దీనికి అప్పచెప్పబడింది. మార్చి 1919 నుండి 25 ఏప్రిల్, 1922 వరకు దాని కమిస్సార్‌గా వున్న స్టాలిన్ పర్యవేక్షణలో అది, అతి తక్కువ మంది కార్మికులు సభ్యులుగా వున్న పన్నెండు వేల మంది ప్రభుత్వోద్యోగుల బృందంతో, అవసరాన్ని మించి పెరిగిపోయిన, అత్యంత ఉద్యోగస్వామ్య సంస్థగా మారింది. ఉద్యోగస్వామ్యాన్ని అరికట్టడానికి ప్రత్యేకంగా సృష్టించబడిన సంస్థలను కూడా అతి త్వరగా తన స్వాధీనంలోకి తెచ్చుకోవడంలో ఉద్యోగస్వామ్యం విజయం సాధించింది.

1922 ప్రారంభంలో ట్రాట్స్కీ కార్మిక – కర్షక తనిఖీపై దాడి ప్రారంభించాడు. అప్పటికి లెనిన్ ఆ మంత్రిత్వ శాఖను, అంటే పరోక్షంగా దాని అధినేతను ఇంకా సమర్థిస్తూనే ఉన్నాడు; కాని తన చివరి రచనలలో ఆయన దానిని చేతకానితనానికి నెలవుగాను, ఒక "నిరాశమయ వ్యవహారం" గాను అభివర్ణించాడు. "అన్ని మంత్రిత్వ శాఖలలోకి కార్మిక – కర్షక తనిఖీ నిర్వహణ అత్యంత దారుణంగా ఉన్నది. అది పూర్తిగా నిరర్థకమయింది." మంత్రిత్వ శాఖ ద్వారా దాని అధినేత అయిన స్టాలిన్‌కి వ్యతిరేకంగా ఉద్దేశించబడిన ఈ విమర్శనా బాణాలు, బహుశ, ఫిబ్రవరి 10న పూర్తి చేయబడిన "కొంచెమే మేలు, కాని మేలుగా వుండాలి" అనే వ్యాసం ప్రావ్దాలో మార్చి 4 వరకు ప్రచురితం కాకపోవడానికి కారణం అయి వుండవచ్చు. ('ది ప్రాఫెట్ ఆర్మ్‌డ్' (పుట : 88–90) అనే తన రచనలో పొలిట్‌బ్యూరోలో మెజారిటీ సభ్యులు దాని ప్రచురణని వ్యతిరేకించారని డాయిశ్చర్ పేర్కొన్నాడు. క్యుబిషెవ్ అయితే లెనిన్ కోసం ఈ వ్యాసాన్ని ప్రచురిస్తూ ప్రావ్దా ప్రత్యేక ప్రతిని ముద్రించాలని సూచించాడు. కాని ఈ వ్యాసాన్ని మామూలు పద్ధతిలోనే ప్రచురించాలని ట్రాట్స్కీ పట్టుపట్టాడు. చివరికి ఆయన సూచన కామెనెవ్ లేక జినొవీవ్ మద్దతుతో నెగ్గింది).

తలకు మించిన భారంగా మారిన ఈ మొత్తం గందరగోళాన్ని వీలైనంత త్వరలో క్రమ పద్ధతిలో పెట్టాలి. పరిపాలనా రంగం, పని విధానాలలో శాస్త్రీయ పరిజ్ఞానం కల మూడు, నాలుగు వందల మంది అత్యుత్తమ నిపుణుల్ని ఇంతకు ముందటి కార్మిక – కర్షక తనిఖీ సిబ్బంది నుండి కాని లేక వేరే శాఖ నుండి కాని ఈ మంత్రిత్వ శాఖ తన సిబ్బందిగా ఎంపిక చేసుకోవలసి వుంటుంది. వాళ్ళు సెంట్రల్ కమిటీలోని కొత్త సభ్యులకు శిక్షణ గరిపే పాత్ర నిర్వహించవచ్చు. అంతేకాక, ప్రభుత్వ పరిపాలనా రంగానికి సంబంధించినంత వరకు కొత్త కార్మిక – కర్షక తనిఖీ వ్యవస్థ కేంద్ర నియంత్రణ సంఘంతో విలీనమై "మన సామాజిక వ్యవస్థలో అత్యుత్తమమైన వాటన్నిటికీ" ప్రాతినిధ్యం వహించే ఒక నమూనా మంత్రిత్వ శాఖగా రూపొందవలసి వుంటుంది. కార్మిక – కర్షక తనిఖీలోని నిపుణులు, వారు రాజ్య వ్యవస్థలోని అత్యున్నత అధికారంతో పాక్షికంగా మమేకమవుతారు కనుక, భౌతిక ప్రయోజనాల దృష్ట్యానే కాక ప్రతిష్ట విషయంలో కూడా మరింత మెరుగైన స్థానాన్ని పొందుతారు.

కొత్త కేంద్ర నియంత్రణ సంఘం కూడా, సందర్భానుసారంగా, ఒక విధమైన విద్యా కేంద్రంగా లేక సంస్థగా పని చేస్తుంది. అది తన సమయంలో కొంత భాగాన్ని, నిపుణుల నిర్దేశకత్వంలో, పని నిర్వహణను, నియంత్రణను, హేతుబద్ధతను అధ్యయనం చేయడానికి కేటాయిస్తుంది. ఈ కొత్త కేంద్ర నియంత్రణ సంఘం – కార్మిక కర్షక తనిఖీల సంయుక్త వ్యవస్థ, దాని అయిదు వందల మంది నిపుణులు మరియు నియంత్రణ సంఘం సభ్యులతో సామర్థ్యంలో, దక్షతలో దేశంలోనే సాటిలేని సంస్థగా రూపొందుతుంది. నిర్వహణ, పర్యవేక్షణలకు అదొక విలక్షణమైన అత్యున్నత మంత్రిత్వ శాఖగా రూపొంది, ప్రజాపాలనా రంగంలోని అన్ని స్థాయిల్లో సరైన పద్ధతుల్ని వ్యాపింపజేసే బాధ్యతను నిర్వహిస్తుంది.

పరిపాలించడం నేర్చుకోవడం, పరిపాలనా యంత్రాంగానికి ఆ మెళకువలు నేర్పించటం, తద్వారా రైతాంగపు విశ్వాసాన్ని చూరగొనడం, "కూటమి" (కార్మిక వర్గం, రైతాంగాల కూటమి) విచ్ఛిన్నం అయ్యే ప్రమాదాన్ని కనీస స్థాయికి తగ్గించడం, పార్టీ "యాదృచ్ఛికంగా" చీలిపోయే ప్రమాదాన్ని నివారించడం, అంతర్జాతీయ రంగంలో వ్యూహాత్మక స్వేచ్ఛతో మసలేందుకు రాజ్యానికి తోడ్పాటు నందించడం: "ఇవి నేను కలలు కంటున్న, మన కార్మిక – కర్షక తనిఖీ వ్యవస్థ నెరవేర్చవలసిన ఉత్కృష్ట కర్తవ్యాలు. ఇందు నిమిత్తమే పార్టీకి చెందిన అత్యంత శక్తివంతమైన సంస్థ ఒక 'సాధారణ' ప్రజా మంత్రిత్వ శాఖతో కలవడాన్ని నేను ప్రతిపాదిస్తున్నాను" అని లెనిన్ పేర్కొన్నాడు. ఇవి లెనిన్ రాసిన చివరి వ్యాసంలోని ముగింపు వాక్యాలు.

తనను తాను ఎల్లప్పుడు సాంప్రదాయ మార్క్సిస్టుగా పరిగణించుకునే లెనిన్, సామాజిక వాస్తవాల్ని పరిశీలించేటప్పుడు మార్క్సిస్టు పద్ధతిననుసరించిన లెనిన్, అంతర్జాతీయ వాస్తవికతను వర్గ కోణం నుండి చూసిన లెనిన్, ప్రభుత్వ పాలనా సమస్యల్ని మాత్రం ఒక ప్రధాన కార్య నిర్వహణాధికారి వలె, ఖచ్చితమైన "శిష్టవర్గ" మేధో వైఖరితో పరిశీలించాడు. సామాజిక విశ్లేషణా పద్ధతులను ఆయన ప్రభుత్వ పాలనకు అన్వయించలేదు. దానిని నిర్వహణా పద్ధతుల నుండి కోణం మాత్రమే చూడడానికి పరిమితమయ్యాడు. ఇది పూర్తిగా 1923 ప్రారంభంలో సోవియట్ అధికారం వున్న నిర్దుష్ట పరిస్థితి వల్ల సిద్ధించిన ఫలితం: ముఖ్యంగా నూతన ఆర్థిక విధానం క్రింద రాజకీయ అధికారం ఒక్కటే వాస్తవంలో బోల్షివిక్కులకు మిగిలిన కార్యాచరణ సాధనం. ఈ అధికారాన్ని కలిగి ఉన్న వారిని వ్యాకులతకు గురి చేసిన ఈ అనూహ్యమైన వాస్తవం మన కాలపు అత్యంత మౌలిక లక్షణాలలో ఒక దాని తొట్టతొలి వ్యక్తీకరణ : అది రాజకీయాంశాల సర్వోత్కృష్టత, ఆర్థిక వ్యవస్థపై, సమాజం మొత్తంపై ప్రభుత్వ నియంత్రణ. ఈ సత్యాన్ని గ్రహించడానికి ఇతర మార్క్సిస్టు ధోరణుల కంటే లెనినిజం అనువుగా వుంటుంది. ఎందుకంటే దాని స్వచ్ఛంద వాదం (వాలంటరిజం) వల్ల అది రాజకీయ చైతన్యాన్ని, దానిని సామాజిక శక్తులలోకి పై నుండి చొప్పించే అవకాశాన్ని నొక్కి చెప్పే దిశగా మొగ్గు చూపుతుంది.

కమ్యూనిస్టు పాలనకి శిష్టులే చోదక శక్తిగా మారారు. ఈ పరిస్థితికి అనుగుణంగా లెనిన్ మారాడు. దాని వ్యక్తీకరణే లెనిన్ శిష్టవర్గ దృష్టి. లెనిన్ ఎదుర్కొన్న సమస్య ఏమిటంటే ఎలా ఆ శిష్టవర్గాన్ని అది దేశ వ్యాప్తంగా సామాజిక పరిణామ క్రమాన్ని ప్రారంభించే దిశగా ఉపయోగించుకోవాలి అన్నది. కాని ఈ రంగంలో లెనిన్ ఆలోచనా విధానంలో కొన్ని బలహీనతలున్నాయి. ఏ ధోరణులైతే త్వరలో అధికార శిఖరాగ్రాన ప్రాబల్యం సంతరించుకోబోతున్నాయో వాటి ప్రమాదాన్ని గ్రహించడంలో ఆయన విఫలమయ్యాడు.

1921వ సంవత్సరాంతం నాటి పరిస్థితులలో లెనిన్ అధికార దుర్వినియోగానికి, ప్రబలమవుతున్న నియంతృత్వానికి వ్యతిరేకంగా రక్షణలను వ్యవస్థీకరించడంపై కంటే త్యాగాలతో సాధించుకున్న అధికారాన్ని కాపాడుకోవడంపై ప్రధానంగా శ్రద్ధ వహించడం పూర్తిగా అర్థం చేసుకోగల విషయమే. ఈ సమస్యను 1922లో లెనిన్ పట్టించుకుని వుండవలసింది. కాని జాతుల సమస్యలాగే ఈ సమస్య కూడా తన దృష్టి నుండి "దాదాపు పూర్తిగా" తప్పించుకుందని ఆయన తరువాత అంగీకరించాడు. తన అనారోగ్యానికే కాక ప్రభుత్వ యంత్రాంగానికి కూడా బందీ అయిన లెనిన్, చివరిగా నియంతృత్వపు రాజకీయ,

నైతిక స్వస్థతని ఎలా ఖాయపరచాలి అనే క్లిష్టమైన, స్వల్పకాలంలో పరిష్కరించలేని సమస్య వైపు తన దృష్టిని మరల్చాడు. దాని నిర్వహణలో క్రియాశీలంగా పాల్గొనవలసిన సామాజిక శక్తులపై ఆధారపడడం సాధ్యం కాదు. ఎందుకంటే, అన్నిటికంటే ముందుగా, వారికి విద్య నేర్పవలసి వుంది. ముఖ్యంగా కార్మికులు "మనకోసం మెరుగైన సాధనాన్ని నిర్మించడానికి ఇష్టపడుతున్నారు, కాని అదెలా చేయాలో వారికి తెలియదు... దానికి తగిన సంస్కృతిని వారింకా పెంపొందించుకొనలేదు." (సమగ్ర రచనలు – సంపుటం : XLV - పుటలు : 390–91. కార్మిక – కర్షక తనిఖీపై రచనల మొదటి కూర్పులో కార్మికులు కొత్త సెంట్రల్ కమిటీ మరియు కేంద్ర నియంత్రణ సంఘాల ప్రధాన శక్తిగా వుంటారని చెప్పబడింది. కాని ప్రావ్దాలో ప్రచురించబడిన వ్యాసం ఈ విషయం గురించి తక్కువగా ప్రస్తావించింది. "తక్కువే మేలు, కాని మేలుగా వుండాలి" అనే వ్యాసంలో కొత్త సంస్థలలో కార్మికులు మెజారిటీగా ఉండాలనే భావం పూర్తిగా త్యజించబడింది). ఇక రైతుల విషయానికొస్తే వారిని కనిపెట్టి ఉండవలసిన అవసరం వుంది. ఈ కారణం వల్లనే లెనిన్ లేశమాత్రమైన సూచనగానైనా బూర్జువా ప్రజాస్వామ్యానికి సంబంధించిన దేనినైనా గట్టిగా వ్యతిరేకించేవాడు. ఆయన ఈ విషయమై మరింత ఆలోచించి వుంటే ప్రయోజనకరంగా వుండేది. కాని అప్పటి తక్షణ పరిస్థితిలో ప్రజాస్వామ్య పద్ధతుల్ని అనుసరించడం వెంటనే బోల్షివిక్కులు అధికారం నుండి తొలగించబడడానికి దారితీసి వుండేది. అందువలన, దేశం తగినంత సాంస్కృతిక స్థాయిని చేరుకునేవరకు ఆయన శిష్టవర్గ భావన వైపు, తన వాళ్ళలో గుణాత్మకత వైపు మరలాడు.

మొత్తం నిర్మాణాన్ని కార్మిక వర్గ అధికారం, చైతన్యాలపై కాక అనుభవజ్ఞులైన కార్యకర్తల గుణాత్మకత అనే "భావవాద" పునాదిపై నిలబెట్టడమనే ఈ ధోరణి ఎంత సంశయాత్మకమైనదైనా, ఒక మార్క్సిస్టులో ఎంత అనూహ్యమైనదైనా, అప్పుడు లెనిన్ ఎదుర్కొంటున్న పరిస్థితికి మాత్రం సరిగ్గా సరిపోయింది. తరువాత ఇతర దేశాలు ఇదే విధమైన నిర్మాణపరమైన సమస్యలు ఎదుర్కొని, ఇదే పరిష్కారాన్ని అనుసరించాయి. ఈ సందర్భంలో లెనిన్ తన "వీలునామా"లో ప్రతిపాదించిన ప్రభుత్వ కాడర్ విధానం ఈ రోజుకీ ఆసక్తిదాయకమైనదే. కాని అధికారమనే వాస్తవికతకు చెందిన మరో కోణమైన ఉద్యోగస్వామ్యాన్ని గురించి మరింత విస్తృతమైన, లోతైన విశ్లేషణ జరగవలసి వున్నది. ఇది అత్యంత కేంద్రీకృత, రాజ్య ప్రాబల్య వ్యవస్థల్ని ఎంపిక చేసుకున్న అన్ని అభివృద్ధి చెందుతున్న దేశాలకు ప్రధాన సమస్యగా వుంది.

లెనిన్ ఉద్యోగస్వామ్య వ్యవస్థకి తీవ్రమైన వ్యతిరేకి. కాని ఆయన దానిని కావలసినంత లోతుగా విశ్లేషించలేదు. అప్పటికి తానింకా ఈ విషయాన్ని పూర్తిగా అర్థం

చేసుకోలేదని లెనిన్ అంగీకరించాడు: ఇది "మనమింకా అధ్యయనం చేయని ప్రశ్న" (పై గ్రంథం – పుట : 251). సర్వ సాధారణంగా దీనిని పూర్వ పాలనా యంత్రాంగం నుండి సంక్రమించిన వారసత్వంగా చూడడానికి లెనిన్ మొగ్గు చూపేవాడు. ఈ వివరణ, పాక్షికంగా వాస్తవమే అయినప్పటికీ, అసంపూర్ణం. పైగా, ఉద్యోగస్వామ్యం, దాని కూర్పు, పద్ధతుల కారణంగా, క్రమేపీ సోవియట్ సమాజంలో విడదీయరాని భాగం కావడం, సోవియట్ వ్యవస్థలో లోతుగా పాతుకుపోవడం ఎంతగా జరిగిందంటే, గత కాలపు అంశాలు త్వరలోనే వాటి ప్రాముఖ్యతను కోల్పోయాయి. వివరణను వేరేచోట వెతకాలి.

దేశ ఆర్థిక వ్యవస్థని ప్రణాళికాబద్ధ, కేంద్రీకృత పద్ధతులలో అభివృద్ధి చేయడానికి గాను కొత్త పాలనా సంస్థలు, అదనపు పాలనాధికారులు నిజంగా అవసరమైన ఒక వెనుకబడిన దేశంలో అంతర్లీనంగా వుండే అనేక అంశాల సమ్మేళనం వల్ల ప్రభుత్వోద్యోగుల సంఖ్య, జాతి జీవనంపై వారికున్న పట్టు నిరంతరం పెరగడమనేది సాధ్యపడింది. కాని దీని అర్థం -- ఈ అంశాన్ని లెనిన్ గ్రహించలేదు -- ఉద్యోగస్వామ్యమే అధికారానికి నిజమైన సామాజిక పునాది అవుతుంది. సామాజిక పునాది లేని "శుద్ధ" రాజకీయాధికారం ఏదీ ఉండదు. అణచివేత సాధనం కాని దానిలో పాలనా వ్యవస్థ తన సామాజిక పునాదిని కలిగి వుండాలి. ఏ "శూన్యత"లో అయితే సోవియట్ పాలనా వ్యవస్థ వేళ్ళాడుతున్నట్లుగా అనిపించేదో, అది త్వరలోనే పూరించబడింది. బోల్షివిక్కులు దీనిని గమనించనప్పటికీ, లేదా వారు దానిని గమనించాలని కోరుకోనప్పటికీ ఇది జరిగింది. అందువలన స్టాలిన్ పరిపాలనా కాలాన్ని, వ్యవస్థ యొక్క మౌలిక సామాజిక పునాది అయిన కార్మిక వర్గం, అతి పేద రైతులలో ఒక భాగం, మేధావి వర్గంలోని కొన్ని శ్రేణులకి బదులుగా ఉద్యోగస్వామ్యాన్ని ఆ స్థానంలో నెలకొల్పడంగా నిర్వచించవచ్చు.

లెనిన్ వలె స్టాలిన్ కూడా అధికారం గుట్టుమట్లు బాగా ఎరిగిన వాడు. ఆయనకు లెనిన్‌కున్న మేధో నైతిక స్థాయి లేదు. "పార్టీలోని ఐరోపా శ్రేణుల" కున్న నైతిక ప్రమాణాలు లేవు. అనేక విషయాలు కాగితంపైనే ఉండిపోతాయని, వాస్తవికత తాను అర్థం చేసుకున్న తీరులో పై చేయి సాధిస్తుందని ఆయనకు తెలుసు. కనుక, తన ప్రణాళికలన్నింటిలోకి లెనిన్ ప్రతిపాదించిన ఆదర్శవాద, అంతర్జాతీయవాద, సోషలిస్టు తరహా సవరణలన్నిటినీ కలుపుకోవడానికి సిద్ధపడ్డాడు. సెంట్రల్ కమిటీ విస్తరణ, కొత్త కేంద్ర నియంత్రణ సంఘాన్ని ఏర్పాటు చేయడం, దానిని కార్మిక – కర్షక తనిఖీ వ్యవస్థతో విలీనం చేయడం లాంటి లెనిన్ అత్యంత ప్రధానమైనవిగా పరిగణించిన పథకాలన్నిటినీ అంగీకరించి ఆచరణలో పెట్టడం జరుగుతుంది. కాని ఈ పథకాలను ఏ భావస్ఫూర్తితో లెనిన్ రూపొందించాడో,

వాటి అమలులో ఆ స్ఫూర్తి కొరవడడం వలన, లెనిన్ ఏ ధోరణులనైతే వ్యతిరేకించాడో అవే బలపడతాయి.

చివరికి లెనిన్ నాయకత్వంలోని పాలనా వ్యవస్థ ఆయన అసహ్యించుకున్న ఉద్యోగ స్వామ్యంపై ఆధారపడవలసి వచ్చింది. అందుకు కారణం వెనుకబడిన దేశంలో కీలక సామాజిక శక్తులు బలహీనంగా, నిరాసక్తంగా లేక వ్యతిరేకంగా ఉన్న స్థితిలో కొత్త పాలనా వ్యవస్థ ఒక అభివృద్ధి ప్రణాళికను దేశంపై విధించడం. లెనిన్ ఈ పరిణామాన్ని ఊహించలేదు. ఎందుకంటే ఆయన తన సామాజిక విశ్లేషణకు కార్మిక వర్గం, రైతాంగం, బూర్జువా వర్గం అనే మూడు సామాజిక వర్గాలను మాత్రమే ఆధారం చేసుకున్నాడు. ఆర్థిక వ్యవస్థలోని ప్రధాన రంగాలను జాతీయం చేసిన దేశంలో రాజ్య యంత్రాంగం ఒక భిన్నమైన సామాజికాంశంగా నిర్వహించగల పాత్రను ఆయన పరిగణనలోకి తీసుకోలేదు. ఆధునిక సమాజంలో లేక ఆధునీకరించబడే క్రమంలో వున్న సమాజంలో పరిపాలనా యంత్రాంగం పాత్రను అర్థం చేసుకోవడంలో విఫలమయినందుకు ఒక ప్రసిద్ధ చరిత్రకారుడు లెనిన్‌ని విమర్శించాడు. ('సోషలిజం ఇన్ వన్ కంట్రీ' – రచయిత: కార్ – సంపుటి : 2 – పుట : 200). ఉద్యోగస్వామ్య యంత్రాంగాన్ని జారిస్టు తరహా ఉద్యోగ వ్యవస్థ పాలనతో లెనిన్ గందరగోళపడినందువల్ల ఈ విమర్శ సరైనదే. కాని లెనిన్ ఇంతకుముందే 1918 లో ఈ ప్రశ్నను పరిశీలించాడు. అప్పట్లో ఈయన కార్మికులలో వున్న రాజ్య రహిత కార్మికపాలన (అనార్కో సిండికలిజం) ధోరణులను వ్యతిరేకించి, రాజ్య వ్యవస్థ కొనసాగింపును సమర్థించాడు. 1923లో ఆయన పునర్వ్యవస్థీకరణకు ప్రణాళికలు ప్రతిపాదించడం, సమస్యను మరింతగా గుర్తిస్తున్నాడనడానికి దృష్టాంతం.

ఈ పర్యాయం సమస్యను ఆయన మరో కోణం నుండి చూశాడు. లెనిన్ పార్టీని "శ్రామిక వర్గ అగ్రగామి దళం"గా విశ్లేషించడాన్ని కొనసాగించాడు. కాని ఇందులో కార్మికులు మైనారిటీలో ఉండడం, అంతేకాక ఈ మైనారిటీ నాయకత్వ పాత్ర నిర్వహించక పోవడం లెనిన్‌ని చెప్పుకోదగినంతగా వ్యాకుల పరిచాయి. పార్టీ నిర్మాణం దేశంలోని సామాజిక శక్తుల స్థితిగతులను కొంచెం ఎక్కువ తక్కువలతో ప్రతిఫలిస్తుంది. మొత్తం పాలనా వ్యవస్థలో లానే పార్టీ నిర్మాణంలో సాధారణ గతి క్రమం ఉద్యోగస్వామ్యం దిశగా సాగుతోంది. ఇది తరువాతి దశలో పార్టీ "ఏక శిలా సదృశ" స్వభావాన్ని అధికం చేసింది. ఇది మనకు కార్య నిర్వాహక విధులు ప్రాబల్యం సంతరించుకోవడంలోను, యంత్రాంగపు నిర్మాణం పిరమిడ్ తరహాలో వుండటంలోను ప్రత్యేకంగా ప్రస్ఫుట మవుతుంది. ఈ క్రమం అంతా రాజకీయ పార్టీ రాజ్య యంత్రాంగంగా పరిణామం చెందడమే. లెనిన్ కోరుకున్నట్లుగా దీనిని నియంత్రించడానికి బదులుగా, స్టాలిన్ ఈ

ధోరణిని అవకాశంగా ఉపయోగించుకుని, తన అధికారానికి దానిని ఆధారంగా చేసుకుని, మరింత అభివృద్ధి చేశాడు.

తన జీవిత చరమాంకంలో లెనిన్ ఈ సమస్యలన్నిటినీ మరింత స్పష్టంగా చూడగలిగాడు. ఎందుకంటే ఆయన రూపొందించిన అన్ని పథకాల అంతర్లీనమైన లేక ప్రస్ఫుటమైన ఉద్దేశ్యం పాలనా వ్యవస్థలో గోచరిస్తున్న, తన మరణానంతరం విజయం సాధించే అవకాశమున్న, ధోరణులను నిరోధించడం. ఆయన జీవించి వుండి వుంటే తాను దేనినైనా మౌలికంగా మార్చగలిగానని ఋజువు చేసుకునే అవకాశం లభించేది. అలా జరిగితే ఆయన తన విశ్లేషణలో, హేతుబద్ధతలో ఉన్న కొన్ని బలహీనతలను అధిగమించవలసి వచ్చేది. తన "వీలునామా"లో ఆయన ప్రస్తావించిన విషయాల పట్ల ఆయనకింకా పూర్తి స్పష్టత లేదు.

ఉదాహరణకి, ఆయన ప్రతిపాదించిన కేంద్ర నియంత్రణ సంఘం, కార్మిక - కర్షక తనిఖీల సంయుక్త వ్యవస్థ ప్రభుత్వ శిఖరాగ్రాన వున్న ఇతర సంస్థల నుండి స్వతంత్రంగా వుండాలనే అంశాన్ని పరిశీలిద్దాం. సిద్ధాంత పరంగా చూస్తే, పార్టీ మహాసభతో దానికి సరాసరి సంబంధం ఉండడం, ఆ మహాసభకే ఇది సరాసరి జవాబుదారీ కావడం స్వతంత్రతకి హామీగా నిలుస్తాయి. కాని లెనిన్ మహాసభ గురించి, దాని పాత్ర గురించి ఒక్క ముక్క కూడా చెప్పలేదు. ఇదొక ముఖ్యమైన లోపమే. బహుశా ఇది ఎందువల్లనంటే, మహాసభ అప్పటి వరకు తగినంత ప్రాముఖ్యతను, ప్రతిష్టను కలిగి ఉండేది. కాని, మార్చి 1921లో పార్టీలో ముఠాలను నిషేధిస్తూ లెనిన్ జారీ చేసిన ఆదేశం, ఆయన కోరుకోనప్పటికీ, మహాసభ అధికారాన్ని గణనీయంగా తగ్గించింది. ఇది కార్యదర్శివర్గం చేతుల్లో మంచి ఆయుధంగా మారింది. ఏ అసమ్మతినైనా ముఠాతత్వంగా ముద్ర వేయడం ద్వారా కార్యదర్శివర్గం నిజమైన చర్చను, విమర్శను విజయవంతంగా అణచివేసింది. పార్టీలోని దాదాపు అన్ని బాధ్యతాయుత పదవులకు నియామకాలు జరిపే అధికారం కార్యదర్శివర్గానికి వుండడంతో మహాసభ అశక్తతకు గురైంది. త్వరలోనే మహాసభకి ప్రతినిధుల ఎంపికని కూడ కార్యదర్శివర్గం స్వేచ్ఛగా తారుమారు చేయగలిగిన పరిస్థితి తటస్థించింది.

ఈ పరిస్థితులలో, సిసలైన విధాన రూపకల్పనకు అవసరమైన స్వేచ్ఛ మృగ్యమైంది. విధాన నిర్ణయ మార్పుకిగాని, ఏదైనా పదవిలో ఉన్న వ్యక్తిని మార్చడానికి గాని అమలులో వున్న సంవిధానం భగ్నమయింది. లెనిన్ దీని గురించి ఏమీ చెప్పలేదు. మరో తీవ్రమైన లోపం ఏమిటంటే భవిష్యత్తులో ఏర్పడే కేంద్ర నియంత్రణ సంఘం - కార్మిక కర్షక తనిఖీ సభ్యులు ఎన్నిక కాబడరు. వారిని ఆర్గ్‌బ్యూరో నియమిస్తుంది. అందువలన సంస్కరణ

యొక్క మొత్తం మనుగడ ఈ ఎంపిక ఏ సూత్రాల ఆధారంగా, ఏ స్ఫూర్తితో జరుగుతుందనే దానిపై ఆధారపడి వుంటుంది. తనకు తెలియకుండానే లెనిన్ తాను అప్పటికింకా వుంటాననే ప్రాతిపదికపై విషయ పరిశీలన చేయడం కొనసాగించాడు. పొలిట్‌బ్యూరో సభ్యులలో ఒకడైన జనరల్ సెక్రటరీ మిగతా సభ్యులకు లేని అధికారాలు కలిగి ఉన్నాడని ఆయన గ్రహించాడు. నియంత్రణా సంఘం జనరల్ సెక్రటరీ మరియు ఆర్గ్‌బ్యూరోల కార్య కలాపాలను పర్యవేక్షించేందుకు వీలయ్యే పరిస్థితి ఉండాలని ఆయన కోరుకున్నాడు. కాని జనరల్ సెక్రటరీ తన ప్రత్యేక అధికారాలను అట్టిపెట్టుకుంటే ఆ పదవిలో ప్రస్తుతం ఉన్న వ్యక్తిని మార్చడం తప్పిస్తే లెనిన్ ఈ పరిస్థితిని మార్చేందుకు స్పష్టంగా ఏమీ ప్రతిపాదించలేదు. ఆచరణలో జనరల్ సెక్రటరీనే తన నియంత్రణదారులను ఎంపిక చేస్తాడు. సరిగ్గా అదే జరిగింది.

ఎంతో భిన్నమైన మరో లోపం, కాని ఎంతో ప్రాధాన్యత కల అంశం ఏమిటంటే లెనిన్ ప్రతిపాదించిన ప్రణాళిక మొత్తం చీలికని నివారించి, పార్టీ ఐక్యతను కాపాడటంపైనే లగ్నం కావటం. కాని ఆయన విమర్శను అణచివేసే ప్రతి ప్రయత్నానికి ఎల్లప్పుడు సాకుగా పని చేసిన ముఠాతత్వం గురించి ఏమీ చెప్పలేదు. స్టాలిన్ హయాంలో కేంద్ర నియంత్రణ సంఘం చూడటానికి లెనిన్ సూచనల మేరకే నియమించబడినప్పటికీ దాదాపు ఇది ఒక్కటే (ముఠాతత్వాన్ని రూపుమాపడం – అను) దాని కార్యక్రమంగా పని చేసింది. ముఠాతత్వం క్రాన్‌స్టట్ తిరుగుబాటు సమయంలో ఉన్నంత ప్రమాదభరితంగా లేదని లెనిన్ భావించాడనుకోవడానికి, పదో మహాసభలో ఆమోదించిన రహస్య క్లాజులను త్యజించడానికి సిద్ధంగా ఉన్నాడనుకోవడానికి గట్టి అవకాశం వుంది. "వీలునామా" స్ఫూర్తికి అనుగుణంగానే ఈ ఊహ ఉంది. ఈ అంశాన్ని ముగింపు అధ్యాయంలో నిరూపించడానికి ప్రయత్నిస్తాను.

# 10

# లెనిన్ జీవించి ఉండివుంటే...

సోవియట్ సోషలిస్టు రిపబ్లిక్‌ల యూనియన్ లోని పరిణామాలపై లెనిన్ సూచనలు వాస్తవంలో దాదాపు అతి స్వల్ప ప్రభావం మాత్రవే చూపిన దృష్ట్యా, అవి ఊహాజనితమైనవని, వాస్తవ దూరమైనవని, లేక నిష్ఫలమైనవని నిర్ధారించడానికి మనం ప్రేరేపించబడవచ్చు. నా అభిప్రాయంలో మరింత శ్రద్ధ, మరింత సానుకూల దృష్టితో చూడడానికి అవి అర్హమైనవి. తన పాలనలోని సమస్యలను లెనిన్ నిష్పక్షపాతంగా పరిశీలించినప్పటికీ, కొన్ని ధోరణులు జీవితపు చిట్టచివరి దశలోనే ఆయనకు స్పష్టమయ్యాయనేది, కొన్ని అసంపూర్ణంగా అర్థమయ్యాయనేది వాస్తవం. అయినప్పటికీ, ఆయన ప్రతిపాదించిన సంస్కరణలు -- వాటి విషయ స్పష్టతలోను, అంతర్లీనంగా వున్న వాటి పర్యవసానాలలోను -- దేశంలోని రాజకీయ వాస్తవాలకు ఒక సంపూర్ణ స్పందనను ప్రతిబింబిస్తాయి.

ఈ అంశాలను ఈ దశలో క్లుప్తంగా సమీక్షించడం బహుశ ప్రయోజనకరంగా వుండవచ్చు.

అధికార శ్రేణీ వ్యవస్థ శిఖరాగ్రాన అధికార దుర్వినియోగం జరగడం, అది బాధ్యతారహిత వ్యక్తిగత నియంతృత్వంగా దిగజారిపోవడం జరిగితే ఏర్పడే ప్రమాదపు పూర్తి విస్తృతిని లెనిన్ గ్రహించలేకపోయాడు. కాని ఆయన ఈ సమస్యను జాతుల సమస్యకు సంబంధించినంత వరకు చూడగలిగాడు. నిజానికి ఆయన తాను చూసిన దాని వల్ల ఎంత కలవరపాటుకి గురయ్యాడంటే, అప్పుడే సోవియట్ల మహాసభ ఆమోదించిన యూనియన్ నిర్మాణ స్వరూపాన్ని రద్దు చేయటానికి సిద్ధపడ్డాడు. నిరంకుశ పాలకులను రాజకీయంగా రూపుమాపాలని డిమాండ్ చేయటానికి సిద్ధపడ్డాడు. లెనిన్ మరణించిన రెండు సంవత్సరాల తరువాత ముగ్గురు ప్రధాన నిరంకుశ నాయకులు నిర్వర్తిస్తున్న పదవులు గమనిస్తే తరువాత ఘటనల క్రమానికి, లెనిన్ వాటి దిశను ఆకాంక్షించిన తీరుకి మధ్యవున్న తీవ్రమైన అంతరం ప్రస్ఫుటంగా కనిపిస్తుంది. పార్టీనుండి బహిష్కరించబడటానికి బదులుగా ఆర్జోనికిజ్ పార్టీ, రాజ్య నియంత్రణ యంత్రాంగానికి

బాధ్యుడుగా ఉన్నాడు. జెర్జిన్‌స్కీ జాతీయ ఆర్థిక మండలి అధ్యక్షుడిగా ఉన్నాడు. స్టాలిన్ కీలకమైన పార్టీ పదవిలో ఇంకా కొనసాగుతున్నాడు.

కేంద్ర నియంత్రణ సంఘం అనే భావన రాజ్య యంత్రాంగపు పని తీరును మెరుగుపర్చే సాధనంగా మాత్రమే ఉద్దేశించబడలేదు. దాని ఏర్పాటు పార్టీ నాయకత్వపు మరియు పాలక శిష్ట వర్గపు మూల స్వభావంలో ముఖ్యమైన మార్పులు తీసుకురావడానికి ఉద్దేశించబడింది. సెంట్రల్ కమిటీని విస్తృత పరచటం జరిగి వుంటే అది సెక్రటేరియట్ మరియు పార్టీ పూర్తి కార్యనిర్వాహక వర్గం ఒక విస్తృతమైన, మరింత ప్రాతినిధ్య స్వభావం కలిగిన సంస్థ నియంత్రణకు లోబడి పని చేయడానికి దారి తీసి వుండేది. పార్టీ ప్రభుత్వపు అత్యున్నత సంస్థల్లోకి నిపుణుల, శాస్త్రవేత్తల ప్రవేశంతో వారికి కొత్త పాత్రను ఇవ్వడం సాధ్యపడేది -- లెనిన్ వారి పాత్ర ప్రబలంగా వుండాలని కోరుకున్నాడు. గాస్‌ప్లాన్ (కేంద్ర ప్రణాళికా సంఘం) నిర్ణయాలకు ఎక్కువ అధికారాన్ని కల్పించాలని తొలుత భావించినా లెనిన్ తరువాత సెంట్రల్ కమిటీ సభ్యులకు శిక్షణనిచ్చి, యంత్రాంగాన్ని సంస్కరించే కర్తవ్య నిర్వహణలో వారికి తోడ్పాటునందించేందుకు కేంద్ర నియంత్రణ సంఘం - కార్మిక కర్షక తనిఖీల సంయుక్త వ్యవస్థ నెలకొల్పాలనే భావనను అభివృద్ధి చేశాడు. "నియంతృత్వంలోని అత్యుత్తమమైనదంతా" సెంట్రల్ కమిటీకి మద్దతుగా సమకూర్చడమనే ఈ సాహసోపేత ప్రయత్నం వాస్తవీకరించబడి వుంటే, అధికార శిఖరాగ్రాన వున్న ఉద్యోగ బృందపు గుణాత్మకతలో, దాని పని పద్ధతులలో, దాని అంతర్గత సంబంధాలలో మౌలికమైన మార్పు సాధ్యపడి వుండేది. ఒకవేళ అది విజయవంతం కాకపోయినా, యంత్రాంగం లోపలి ధోరణులను ఎదుర్కొనడానికి ఒక గట్టి ప్రయత్నమైనా జరిగి వుండేది. అంతేకాక, ఈ మార్పులు అప్పుడే ప్రారంభమవుతున్న నూతన దశ స్వభావానికి ప్రత్యేకించి అనుగుణంగా వున్నట్లు కనిపించాయి -- లెనిన్ అభిప్రాయంలో అది ఉపశమనం కలిగించిన దశ. ముఖ్యంగా 1921, 1922 సంవత్సరాలలో విలయ తాండవం చేసిన క్షామం, నూతన ఆర్థిక విధానం ప్రవేశపెట్టడంతో, 1922లో మంచి పంటలు పండటంతో తగ్గుముఖం పట్టింది. దేశం ఇప్పుడు నిర్మాణం, సంస్కృతి (ఈ పదం విస్తృతార్థంలో వాడబడింది) కి సంబంధించిన కర్తవ్యాలను చేపట్టడానికి సిద్ధంగా వుంది. అయితే, వాటి పరిపూర్తికి నిర్దుష్ట కాల పరిమితి విధించడం సాధ్యం కాదు. ఈ పనిని సంపూర్ణంగా నెరవేర్చాలంటే ప్రభుత్వ విధానాల్లో, శైలిలో పరివర్తన తీసుకురావడమే కాక, అత్యున్నత స్థానాల్లో ఉన్న పార్టీ కార్యనిర్వాహకుల్లో కొంత మొరటు స్వభావం కలవారిని, తగినంత విద్య లేనివారిని తొలగించి వారి స్థానంలో సంస్కృతీ సంపన్నులైన, ప్రత్యేక నైపుణ్యం కల పరిపాలకుల్ని, రాజకీయవేత్తల్ని నియమించడం కూడా (ఇది నిర్దుష్టంగా

చెప్పబడనప్పటికీ) స్పష్టంగా అవసరం. దానివలన అధికార కేంద్రం సెక్రటేరియట్ నుండి సెంట్రల్ కమిటీకి మారి వుండేది. లెనిన్ రూపొందించిన పథకం దాదాపు ఒక తిరుగుబాటు లాంటిది. ఎందుకంటే అది కొందరు నాయకులను తొలగించటాన్ని, నియంతృత్వపు మొత్తం కార్యాచరణలో ఒక కొత్త దృష్టిని ప్రవేశపెట్టడాన్ని ప్రతిపాదించింది. ఈ కొత్త దృష్టి నియామకాలకు, పనికి సంబంధించిన పద్ధతులకు, లక్ష్యాల ఎంపికలో కొత్త ప్రమాణాలు పాటించడానికి అన్వయిస్తుంది. ఇప్పుడు ప్రాచుర్యంలో వున్న పదాన్ని ఉపయోగించి చెప్పాలంటే, లెనిన్ పథకం ఆయన చాలా పురాతన స్థాయిలో ఉన్నట్లుగా భావించిన ఉద్యోగస్వామ్యానికి వ్యతిరేకంగా "సాంకేతిక నిపుణుల విప్లవం".

మరోవైపు లెనిన్, నియంతృత్వపు అగ్రభాగాన ఒక పరస్పర నియంత్రణ వ్యవస్థ ద్వారా వివిధ విభాగాల మధ్య సమతుల్యత సాధించడానికి ప్రయత్నిస్తున్నాడు. ఈ వ్యవస్థ -- ఈ పోలిక ఉజ్జాయింపుగానే సరిపోతుంది కాని అంతకు మించి కాదు -- ప్రజాస్వామ్య వ్యవస్థలో అధికార విభజన నిర్వహించే విధినే నియంతృత్వం విషయంలో నిర్వహిస్తుంది. పార్టీ మహాసభ స్థాయికి పెంచబడిన కీలకమైన సెంట్రల్ కమిటీ ప్రధాన విధాన క్రమాన్ని నిర్దేశిస్తుంది. పార్టీ యంత్రాంగాన్ని పర్యవేక్షిస్తుంది. ఒక సంస్థగాను, దాని సభ్యుల కార్యకలాపాల ద్వారాను అది అధిక ప్రాధాన్యత కల కర్తవ్యాల అమలులో పాలుపంచుకుంటుంది. సెంట్రల్ కమిటీలో అంతర్భాగమైన కేంద్ర నియంత్రణ సంఘం, సెంట్రల్ కమిటీలోని దాని పనికి అదనంగా సెంట్రల్ కమిటీపైన, దాని ఉపాంగాలైన పొలిట్‌బ్యూరో, కార్యదర్శివర్గం, ఆర్గ్‌బ్యూరోలపై నియంత్రణాధికారాన్ని కలిగివుంటుంది. కార్మిక – కర్షక తనిఖీ వ్యవస్థకి లేక కేంద్ర నియంత్రణ సంఘం – కార్మిక కర్షక తనిఖీల సంయుక్త వ్యవస్థకి చెందిన నిపుణులు కేంద్ర నియంత్రణ సంఘం పర్యవేక్షణలో వున్న కారణంగా ఇతర సంస్థలతో పోలిస్తే ఈ సంస్థ ఒక ప్రత్యేక స్థానాన్ని కలిగి వుంటుంది; పొలిట్‌బ్యూరోకి, దాని పాలనా విభాగాలకి, సెంట్రల్ కమిటీకి అతీతంగా దానికి పార్టీ మహాసభతో సరాసరి సంబంధం వుండటం వల్ల దాని స్వతంత్రతకు భద్రత వుంటుంది. ఈ విధంగా చూచినప్పుడు ఈ పథకాలన్నీ సంకీర్ణత కలిగినవిగా అనిపిస్తాయి కాని పరిణతి చెందినవిగా అనిపించవు. కాని అవి ఇంకా బీజ రూపంలోనే ఉన్నప్పటికీ, సూత్రబద్ధ సమస్యను మాత్రం గుర్తిస్తాయి : "పరిపక్వం కాని" పరిస్థితులలో నెలకొల్పబడిన విప్లవాత్మక నియంతృత్వం కొనసాగింపుకి హామీ ఇవ్వడం ఎలా? అదే సమయంలో దాని మౌలిక స్వచ్ఛతని, సిద్ధాంతం పట్ల అంకిత భావాన్ని రక్షించడం ఎలా? లెనిన్ నియంతృత్వానికి హేతుబద్ధతని ఆపాదించడానికి ప్రయత్నించాడు. దాని ద్వారా నియంతృత్వం తనను తాను బాహ్య శత్రువుల నుండి, నిరంకుశాధికారంలోని అంతర్గత ప్రమాదాల నుండి కాపాడుకోవడానికి ప్రాతిపదిక కల్పించాడు.

లెనిన్ "వీలునామా"లోని అత్యంత స్పష్టమైన భాగాన్ని ఈ క్రింది మూడు ఆదేశాల రూపంలో క్రోడీకరించవచ్చు.

1. జాతీయ వాదానికి, ప్రత్యేకించి రష్యన్ జాతీయవాదానికి, వ్యతిరేకంగా పోరాడాలి -- రష్యన్ జాతీయవాదం మొత్తం ప్రభుత్వ యంత్రాంగం అనుసరించే అగ్రరాజ్య దురహంకారం అవుతుంది. సోవియట్ యూనియన్ ప్రజలలో అంతర్జాతీయ స్ఫూర్తిని ప్రోది చేసేందుకు ప్రయత్నించాలి.

2. పార్టీ నాయకత్వంతో సహా అజ్ఞానపూరితమైన, నిరర్థకమైన, అణచివేసే శక్తి కల ఉద్యోగ స్వామ్యానికి వ్యతిరేకంగా అన్ని స్థాయిల్లో పోరాడాలి. సమర్థవంతమైన రాజ్య పాలనా యంత్రాంగాన్ని సృష్టించాలి.

3. స్టాలిన్‌ని పదవి నుండి తొలగించాలి.

"వీలునామా"లో ముఠాలపై నిషేధం గురించి ఎలాంటి ప్రస్తావన లేకపోవడం, ప్రభుత్వ ప్రణాళికల అమలును సాధ్యం చేసేందుకు భయోత్పాతాన్ని ఒక సాధనంగా ఉపయోగించడం గురించి కూడా ఎలాంటి ప్రస్తావన లేకపోవడం వల్ల అది మరింత ప్రాధాన్యత సంతరించుకుంది. అంతకు మునుపటి లెనిన్ రచనల్లో భయోత్పాతం చెప్పుకోదగినంత స్థానాన్ని కలిగి వుంది. లెనిన్ దానిని ఎల్లప్పుడు అంతిమ ఆయుధంగా సమర్థిస్తూ వచ్చాడు. సమగ్ర రచనల కొత్త ప్రతిలో సంపుటి –XLV లో లెనిన్ భయోత్పాతాన్ని ఒక పద్ధతిగా విశ్లేషించిన, ఇంతకు ముందు అసలు తెలియని లేదా స్వల్పంగా తెలిసిన, అనేక రచనలు ప్రచురించబడ్డాయి. ఇది ఎల్లప్పుడు నేపథ్యంలో వుంచవలసిన ఆయుధం అని, మరీ ముఖ్యంగా నూతన ఆర్థిక విధానం ప్రవేశపెట్టిన సరళీకరణ రాజ్య భద్రతను బలహీనపరిచే అవకాశం వుంది కనుక ఇది అవసరమని లెనిన్ తన పాఠకులకు గుర్తు చేశాడు. మొట్టమొదటగా 1959లో ప్రచురితమైన తాను కామెన్‌వ్‌కి రాసిన లేఖలో లెనిన్ ఇలా ప్రకటించాడు : "నూతన ఆర్థిక విధానం భయోత్పాతాన్ని అంతం చేస్తుందనే అభిప్రాయం పెద్ద పొరపాటు. మనం మరల భయోత్పాతాన్ని, ఆర్థిక భయోత్పాతాన్ని అవలంబించవలసి వుంటుంది" (కామెన్‌వ్‌కి రాసిన లేఖ – మార్చి 3, 1922 – సమగ్ర రచనలు – సంపుటి : XLIV – పుట : 428). రాజ్యం వ్యాపార వర్గానికి విధించిన పరిమితులు దాటి వెళ్ళాలనుకునే వారందరికీ ఈ చిట్టచివరి ఆయుధం గురించి "నేర్పుగా, మర్యాదగా" గుర్తు చేసే మార్గాన్ని కనుగొనవలసి వుందని లెనిన్ కామెనెవ్‌కి వివరించాడు.

కాని ఇతర రచనలలో -- వాటిని తరువాత ఉపయోగించుకున్న తీరు వల్ల ఇవి మరింత సమస్యాత్మకమైనవి -- లెనిన్ మరింత ముందుకు వెళ్ళాడు. శిక్షా స్మృతి రూపకల్పనలో తాను ప్రతిపాదించిన సవరణలలో "విప్లవ ప్రతీఘాత కార్యకలాపాలు"

అనే భావనకు తప్పనిసరిగా వీలైనంత విస్తృతమైన అర్థాన్ని ఇవ్వాలని నొక్కి చెప్పాడు. ఈ నిర్వచనాన్ని "అంతర్జాతీయ బూర్జువా వర్గం" తో ముడిపెట్టిన తీరు వల్ల, చట్టబద్ధత కోణం నుండి చూస్తే ఈ తరహా నేరం పట్ల అవగాహన పూర్తిగా అస్పష్టంగా వుంది. అందువల్ల అనేక రకాల నిరంకుశ చర్యలకు ద్వారాలు తెరుచుకున్నాయి. మిగతా వాటిలో భాగంగా, పెట్టుబడిదారీ దేశాలతో సోవియట్ వ్యవస్థ సమాన హక్కుల్ని గుర్తించని, దానిని బలప్రయోగం ద్వారా కూలదోయాలనుకునే అంతర్జాతీయ బూర్జువా వర్గం లోని శక్తులకు ప్రయోజనం చేకూర్చే అవకాశమున్న "ప్రచారం, ఆందోళన" మరియు "ఏదైనా ఒక సంస్థ కార్యకలాపాలలో పాల్గొనటం లేదా దానికి సహాయమందించటం"లను ఈ నేర పరిధిలోకి తీసుకురావడం ప్రతిపాదించబడింది. ఈ నిర్వచనం ఇప్పటికే కావలసినంత విస్తృతంగా వుంది. ఈ నేరానికి మరణశిక్ష విధించే అవకాశం వున్న దృష్ట్యా దీనిని వేరే సందర్భాలకు కూడా అన్వయించే అవకాశం వుండడం ప్రమాదకరమైన విషయం. ఎవరైనా "అంతర్జాతీయ బూర్జువా వర్గంలోని" (సోవియట్ వ్యవస్థను క్రియాశీలంగా వ్యతిరేకించే) "శక్తులకు వస్తుగతంగా తోడ్పాటునందిస్తే", అలానే ఈ బూర్జువా వర్గానికి "సహాయపడే అవకాశం వున్న లేక అలా సహాయపడే స్వభావం వున్న" కార్యకలాపాలు నిర్వహించే దేశం లోపలి ఏ సంస్థకైనా చెంది వుంటే, అట్టి వ్యక్తి కూడా నేరస్తుడిగా పరిగణింపబడవచ్చు. (న్యాయ మంత్రిగా వున్న కుర్స్కీకి లేఖ – 1922 మే 15న రాసినది. సమగ్ర రచనలు – సంపుటం : XLV – పుటలు : 189 – 190). ఇదంతా చూస్తే, సోవియట్ యూనియన్‌కి పెద్ద పెట్టుబడిదారీ దేశాలనుండి ప్రమాదం వున్నంత కాలం భయోత్పాతాన్ని (చెకా ద్వారానే కాక ట్రిబ్యునళ్ళు, నిర్దేశిత పద్ధతి ద్వారా కూడా) ఉపయోగించడానికి లేదా ఉపయోగిస్తామని బెదిరించడానికి అవకాశం అట్టిపెట్టుకోవాలని ఈ సమయంలో లెనిన్ ఆతురతతో ఉన్నాడు.

కనుక దీనిని బట్టి చూస్తే లెనిన్ అవసరమైనప్పుడు దృఢ సంకల్పంతో చర్యలు చేపట్టలేని దుర్బలుడైన ఉదారవాది కాడు. కాని తన వారసుల్లోని కొందరిలా కాక ఆయన అణచివేతను ద్వేషించాడు. ఆయన అభిప్రాయం ప్రకారం దానిని వ్యవస్థను తీవ్రమైన ప్రమాదం నుండి రక్షించడానికి, చట్టాన్ని ఉల్లంఘించిన వారిని శిక్షించడానికి మాత్రమే ఉపయోగించాలి.

కాని, లెనిన్ చివరి కార్యక్రమాన్ని తిరిగి పరిశీలిస్తే, నూతన సమాజ నిర్మాణంలో, భయోత్పాతాన్ని అలా వుంచి, ఇతర నిర్బంధాలను ఉపయోగించడం కూడా ప్రక్కన పెట్టబడింది. లెనిన్ తన చివరి కార్యక్రమంలో జాగరూకత, నిగ్రహం, మిత దృష్టి, సహనం చూపవలసిందిగా కోరాడు. వ్యవస్థను కాపాడడం కోసం నిర్బంధాన్ని

ఉపయోగించడాన్ని లెనిన్ త్రోసిపుచ్చలేదు. కాని నిర్మాణ కార్యక్రమాలలో అనవసరమైన తొందరపాటును గర్హించాడు : "మనం అభివృద్ధిని మరీ వేగవంతం గావించే విషయంలోను, మనల్ని మనం ప్రశంసించుకునే విషయంలోను గట్టి సంశయ ధోరణి చూపాలి". ఈ వాక్యం "తక్కువే మేలు, కాని మేలుగా వుండాలి" అనే రచన నుండి తీసుకోబడింది. "అసలేమీ పొందే ఆశ లేకుండా తొందరపాటుతో పని చేయటం కంటే, రెండేళ్ళలో లేక కనీసం మూడేళ్ళలోనైనా మంచి మానవ సంపదను పొందటం మేలు". "మరో విప్లవం అవసరం లేదు!" -- స్టాలిన్‌ను తిప్పికొట్టేందుకు లెనిన్ "వీలునామా" ఆధారంగా ఐదేళ్ళ తరువాత బుఖారిన్ చేసిన వ్యాఖ్యానమిది. ఆయన వ్యాఖ్యానం సరైనదే. అధికారాన్ని కైవసం చేసుకుని, శాంతిని నెలకొల్పిన పిదప లెనిన్ బల ప్రయోగాన్ని "నూతన సమాజపు మంత్రసాని"గా పరిగణించడాన్ని కొనసాగించలేదు. ఈ కొత్త పరిస్థితికి అన్వయించే కొత్త సూత్రం స్పష్టంగా క్రమ పరిణామమే. ఈ సూత్రం, వ్యతిరేక దిశలో పయనించవలసిందిగా రష్యన్ వాస్తవికత తీసుకొస్తున్న మొత్తం ఒత్తిడికి వ్యతిరేకంగా రూపొందించబడింది. ఈ విషయం లెనిన్‌కి బాగా తెలుసు.

"తక్కువే మేలు, కాని మేలుగా వుండాలి" అనే సూత్రం పాటించటం కష్టం. కాని లెనిన్ సహజోజనిత (స్పాంటేనియస్) ధోరణుల కోణం నుండి చేయబడిన వాదనని ముందుగానే తిరస్కరించాడు : "దీనికి విరుద్ధమైన సూత్రం వెయ్యి లొసుగుల ద్వారా చొరబడుతుందని నాకు తెలుసు. తీవ్రంగా ప్రతిఘటించాల్సి వుంటుందని, మానవాతీత పట్టుదల అవసరమవుతుందని, కనీసం మొదటి కొద్ది సంవత్సరాలు ఈ రంగంలో కృషి నరక యాతనలా వుంటుందని నాకు తెలుసు. అయినప్పటికీ, ఈ లక్ష్యాన్ని సాధించడం ద్వారా మాత్రమే మనం సోవియట్, సోషలిస్టు, తదితర పదాలకు నిజంగా అర్హమైన రిపబ్లిక్‌ని సృష్టించగలమని నేను విశ్వసిస్తున్నాను." (అదే గ్రంథం - పుట : 392. అనుబంధం - IX చూడండి).

నా అభిప్రాయంలో, ఎవరయినా సరే లెనిన్ గొప్ప లక్ష్యాలను ఊహాజనితమైనవిగా వర్ణించలేరు. వ్యవస్థకు నిర్దేశించబడిన ఆర్థిక, సాంస్కృతిక రంగాల అభివృద్ధికి చెందిన అనేక లక్ష్యాలు సాధించబడ్డాయి. చాలా మేరకు తనని తాను నియంత్రించుకోగల నియంతృత్వ యంత్రాంగాన్ని నిర్మించడమనే మరో గొప్ప ప్రణాళికను సాధించడం సమీపంలో వున్నట్లు కనిపిస్తున్నది. కాని ఇది మొదట ఒక విపత్కర వైఫల్యం తరువాతనే సాధ్యపడింది : సోవియట్ పాలనా వ్యవస్థ దీర్ఘకాలం పాటు "వీలునామా"లోని సిఫార్సులకు పూర్తిగా విరుద్ధమైన మౌలిక లక్షణాలున్న "స్టాలినిజం"కి గురయింది. ఈ వాస్తవానికి కొంత వివరణ అవసరం. వామపక్ష నియంతృత్వం అన్నది మన కాలంలోని

అత్యంత ప్రాధాన్యత కల రాజకీయ దృగ్విషయాలలో ఒకటి. దాని పాలన ప్రాముఖ్యత కలది. దాని అభివృద్ధికి కల అవకాశాలు ఏ మాత్రం అంతరించి పోలేదు. కాని ఈ తరహా నియంతృత్వం, దాని అభివృద్ధి క్రమంలో ఒక నిర్దుష్ట దశలో, ప్రతిసారి ఒక వ్యక్తిగత, నిరంకుశ, నిర్హేతుక నియంతృత్వంగా దిగజారక తప్పదని చెప్పడానికి దాఖలాలు లేవు. నిజాయితీ గల వ్యక్తుల నాయకత్వంలో ఒక సహేతుక నియంతృత్వ వ్యవస్థను సాధించడం అభివృద్ధి లేమిని, నియంతృత్వాన్ని దాటి వెళ్ళేందుకు చైతన్యవంతంగా కృషి చేసే సమర్థవంతమైన సంస్థలను స్థాపించడం లెనిన్ పెట్టుకున్న లక్ష్యాలు. చారిత్రక దృక్కోణం నుండి చూస్తే ఈ లక్ష్యాలలో ప్రత్యేకించి ఊహాజనితమైనదేదీ లేదు. అంతేకాక, లెనిన్ జీవించి వున్న కాలంలో, అత్యంత క్లిష్టమైన పరిస్థితులలో కూడా సోవియట్ నియంతృత్వ యంత్రాంగం తరువాత ఇది అనుసరించబోయే పద్ధతులకు ఎంతో భిన్నంగా పనిచేస్తూ వుండేది. లెనిన్ రూపొందించిన ప్రణాళికలను అమలుపర్చక పోవటానికి కారణం ఏమిటంటే, అంతర్యుద్ధం నుండి ఆవిర్భవించిన ధోరణులను వ్యతిరేకించడం సాహసోపేత సంస్కరణల ద్వారానే సాధ్యం. సమర్థుడైన తిరుగులేని నాయకుడు లేనందువల్ల ఈ ప్రణాళికలు ఉత్త "ఆకాంక్షలు"గా మిగిలిపోయాయి. లెనిన్ ఆధ్వర్యంలో రూపు దిద్దుకున్న యంత్రాంగం ఆయన మరణానంతరం ఆయనకున్న అత్యంత గాఢమైన ఆకాంక్షలను పట్టించుకోకుండా నిర్లక్ష్యం చేయడంలో ఎటువంటి ఇబ్బందికి లోను కాలేదు. ఆయన భౌతికకాయాన్ని భద్రపరచడం, మరణానంతరం ఆయన పట్ల వ్యక్తి ఆరాధనని ప్రోత్సహించడం లాంటివి, మభ్యపెట్టి ఆయన ప్రణాళికలకు పూర్తిగా విరుద్ధమైనటువంటి నియంతృత్వాన్ని అమలులోకి తేవడంలో తోడ్పడ్డాయి.

లెనిన్ ఉద్దేశ్యాలకు, చారిత్రక వాస్తవాలకు మధ్య గల అతి పెద్ద తేడా విధానాల రంగంలో వుంది. సోవియట్ సోషలిస్టు రిపబ్లిక్‌ల యూనియన్ లెనిన్ కోరుకున్నట్లుగా పాలనాపరమైన నిర్బంధం స్థానే క్రమేపీ ఆర్థిక, విద్యా విధానాల ద్వారా అంతర్గత అభివృద్ధి సాధించే దశలో ప్రవేశించినట్లు ఈ రోజు మనకి అనిపిస్తున్నది. కాని దీర్ఘకాలం పాటు నూతన నిర్మాణాలను నెలకొల్పడానికి భయోత్పాతం ప్రధాన సాధనంగా వుండేది.

సోషలిజం సాధారణ భావనకు, ప్రపంచ సోషలిస్టు ఉద్యమ అభివృద్ధికి ఎంతో నష్టదాయకంగా ఋజువైన స్టాలిన్ అనుసరించిన పద్ధతులను అవి క్రూరమైనవైనప్పటికీ, ఉన్న ఒకే ఒక మార్గపు సరైన ఎంపికగా చూడాలా లేక మరో మార్గం ఉన్నప్పటికీ దానిని గ్రహించడంలో స్టాలిన్ వ్యక్తిగతంగా విఫలమయినట్లు చూడాలా అనే విషయంపై మన కాలంలో చెప్పుకోదగినంత చర్చ జరుగుతున్నది.

రష్యా అంతర్గత పరిస్థితిలోను, దాని అంతర్జాతీయ స్థానంలోను అభివృద్ధికి ఏర్పడే

అవరోధాలను అధిగమించడానికి నిర్బంధ పద్ధతులను అనుసరించడానికి ప్రోత్సాహాన్నిచ్చే బలీయమైన శక్తులు అంతర్లీనంగా వున్నాయనే విషయంలో ఎవరికీ సందేహం లేదు. వెనుకబడిన, వ్యావసాయక దేశం కావడమే కాక ఏకాకి అయి వున్న రష్యాలో ఈ అవరోధాలు చాలా బలంగా వుండేవి. నాయకులు, మేధావులు ఎంతటి సత్తా కలవారైనా సరే సోవియట్ రష్యా తప్పనిసరిగా ఉద్ధాన పతనాలను ఎదుర్కొనవలసి ఉండేదనేది నిస్సందేహం. అభివృద్ధి రేఖ సాఫీగా, క్రమేపీ ఎలాంటి ఒడిదుడుకులు లేకుండా సాగి ఉండేదని ఊహించడం కష్టం. ఈ విషయంలో లెనిన్‌కి ఎటువంటి భ్రమలు లేవు. ఆయన అలాంటి భ్రమలు కల్పించలేదు. అయితే అన్ని సందర్భాలలోను ఆయన కోరుకున్నది నికరమైన విధానం. దేశం ఎటువంటి ఘర్షణలో లేక సందిగ్ధావస్థలో చిక్కుకున్నప్పటికీ అది తన వివేచనను కోల్పోరాదని ఆయన కోరుకున్నాడు. లెనిన్ కనుక జీవించివుండి వుంటే, ఆయనకు ఆ భావన పట్ల ఎంత విముఖత వున్నప్పటికీ, అనివార్యంగా "ఆదిమ సంచయనం" (పారిశ్రామిక ఆర్థిక వ్యవస్థను ప్రారంభించడానికి అవసరమైన తొలి పెట్టుబడిని సృష్టించడం) అనే సమస్యను పరిష్కరించవలసి వచ్చేది. రైతాంగం పారిశ్రామిక ఉత్పత్తుల అరకొర సరఫరా కారణంగా, తెలిసి వారికి ఎలాంటి వ్యతిరేక రాజకీయ ఉద్దేశ్యాలు లేనప్పటికీ, ధాన్యాన్ని అమ్మడానికి తిరస్కరించడం ద్వారా దాదాపు దేశాన్ని ఆకలితో మాడ్చేందుకు సిద్ధమైనప్పుడు ఆయన చర్యలు తీసుకొనక తప్పేది కాదు. సామాజిక వైవిధ్యత గల దేశంలో ఒక పార్టీ పాలన అనే వైచిత్రిని ఆయన అడుగడుగునా ఎదుర్కొనవలసి వచ్చేది. పార్టీ ఉద్యోగస్వామ్య క్షీణతకు గురికాకుండా రక్షించాలంటే కల్పించవలసిన విమర్శనా స్వేచ్ఛకి విరుద్ధంగా పనిచేసేటటువంటి పార్టీ ఐక్యత, క్రమశిక్షణ, సమర్ధతలను ఆయన కాపాడవలసి వచ్చేది.

ఈ సమస్యలన్నింటికీ వాస్తవంగా సరైన పద్ధతిలో పరిష్కారాలు కనుగొనటంలో లెనిన్ సఫలీకృతుడయ్యేవాడా? సఫలీకృతుడయ్యేందుకు ఏమి చేసి వుండేవాడు? (చరిత్రకారుడు ఇటువంటి పరికల్పనలను పరిశీలించడం సక్రమమేనా అనే ప్రశ్న తలెత్తే అవకాశం వుంది. కొన్ని పరిమితులు అతిక్రమించని షరతుకు లోబడి చరిత్రకారుడు అలా చేయవచ్చని నేను విశ్వసిస్తున్నాను. అలా కాక చరిత్రకారుడు ఆ పరిమితులు అతిక్రమిస్తే అప్పుడు అతని కృషి తప్పనిసరిగా నిర్హేతుక ఊహాగానం అవుతుంది.)

ఈ ప్రశ్నకు సమాధానం చెప్పడం కోసం మనం కొన్ని ప్రక్షిప్తాలను పరిశీలించ వలసి వుంది. వీటి మూలం లెనిన్ స్వభావం గురించి, ఆయన చివరి ప్రణాళిక గురించి మనకు తెలిసిన అంశాలలో కనుగొనవలసి వుంటుంది. లెనిన్ తాను ప్రతిపాదించిన సంస్కరణల అమలుకై కృషి చేసేవాడని చెప్పడానికి సందేహించనక్కరలేదు. అలా చేసే

క్రమంలో, వాటిలో కొన్ని అవాస్తవికమని, అనాచరణీయమని తేలితే, వాటి స్థానంలో వేరే వాటిని భర్తీ చేయడం జరిగి ఉండేది. మిగిలిన సంస్కరణలు, బహుశ ఆయన మొత్తం విధానం, పార్టీలో అంతర్గత వ్యతిరేకతను ఎదుర్కొని వుండేవి. దేశమంతటా ఆచరణపరమైన ఇబ్బందులు ఎదురై ఉండేవి. ఉద్యోగస్వామ్యం నుండి, ఆర్గ్‌బ్యూరో నియమించిన పార్టీ కార్యనిర్వాహక బృందం నుండి అంతర్గత వ్యతిరేకత ఎదురై ఉండేది. కాని ఈ వ్యతిరేకత -- లెనిన్ కోరుకున్నట్లుగా స్టాలిన్ బృందాన్ని తొలగిస్తే -- కనీసం తాత్కాలికంగానైనా బలహీనపడేది. లెనిన్ ఆధ్వర్యంలో "పరిపాలనా పద్ధతులకు", ఉద్యోగస్వామ్య అసమర్ధతకు, అలానే రష్యన్ జాతీయవాదానికి (అది సజీవంగా వుంచిన స్థానిక జాతీయ వాదాలకు) వ్యతిరేకంగా చేసే పోరాటంలో విరామం వుండి వుండేది కాదు. పార్టీ లోపల, బయట మద్దతు కూడగట్టుకోవడానికి ఆయన నిరంతరం ప్రయత్నించవలసి వచ్చి ఉండేది: దేశంలోని క్రియాశీలురకు, నైతిక స్పృహ కలిగినవారికి ఆయన విజ్ఞప్తి చేయవలసి వచ్చి ఉండేది. యువ కార్మికులు, విద్యార్థులు, మేధావులు, రైతాంగంలో అత్యుత్తమ శ్రేణులు, తొలితరం విప్లవకారుల్లోని కొన్ని శ్రేణులు, అలానే పరిస్థితులను బట్టి ఇతర సోషలిస్టు పార్టీలలోని, ఇతర బృందాలలోని కొన్ని శ్రేణులు, మొదటి తరం బోల్షివిక్కులలో యుక్తవయస్కులు, పరిపాలక శ్రేణుల్లో వివేకవంతులైన వారు కూడా మద్దతు పలికి వుండేవారు. పార్టీ కార్యనిర్వాహకులు, పోలీసులు, నిరంకుశ ధోరణి కలవారు, ఉద్యోగులు పూర్తిగా కనుమరగవడం ఎప్పటికీ జరిగి వుండేది కాదనేది వాస్తవమే. కాని ఈ శక్తులకి వ్యతిరేకంగా నిరంతరం పోరాడడం, వారి స్థైర్యాన్ని దెబ్బతీయడం, అణచివేయడం జరిగి వుండేది. ముందు భాగాన తరువాత స్టాలిన్ కాలంలో చంపబడిన సమరశీలురు వుండి వుండేవారు. అలాగే సంకుచిత మనస్తత్వం కలిగిన వారైనా తరచు నిజాయితీ కనపరిచే స్టాలినిస్టు వ్యవస్థ ముమ్మందు ఉపయోగించుకొనబోయే సమరశీలురు కూడా వుండి వుండేవారు. అలాగే ప్రక్షాళనలో ప్రాణాలు కోల్పోనున్న పార్టీ సభ్యులు కాని అన్ని తరహాలకు చెందిన విలువైన వారు కూడా వుండి వుండేవారు. దేశంపై అటువంటి ఉన్మాదపూరిత హింసాప్రయోగం (ఇది స్టాలిన్ పాలనకు ఉల్లేఖన – ప్రచురణకర్తలు) చేయడం కంటే లెనిన్ జైలులో మగ్గి వుండేవాడని తేలికగా ఊహించవచ్చు. ట్రాట్‌స్కీ, ఇతరులతో లెనిన్ కలయిక జరిగితే కార్యకర్తలలోని అత్యుత్తమమైన వారిని రూపుమాపడానికి బదులుగా వివేకవంతంగా ఉపయోగించుకోవడం సాధ్యపడి వుండేది. అయితే, ఈ వ్యక్తుల సమూహం లెనిన్ ప్రణాళికను అమలు చేయడంలో తోడ్పాటు నందించటం ఒక్కటే చేసేవారని చెప్పలేము. వ్యతిరేకతకి వేదికగా రూపొంది లెనిన్‌పై పైచేయి సాధించడానికి కొన్నిసార్లు వామపక్షం వైపు నుండి, కొన్నిసార్లు మితవాదం వైపు

నుండి ప్రయత్నం కూడా చేసి వుండేవారు. కాని లెనిన్ వారికి వ్యతిరేకంగా స్టాలినిస్టు పద్ధతులను ఉపయోగించి వుండేవాడు కాదని మనం గట్టిగా చెప్పవచ్చు. మరోవైపు, లెనిన్ నిస్సందేహంగా విజయం సాధించి వుండేవాడని చెప్పటం ఊహాజనితం మాత్రమే. ఇతర అనేకమంది "పెదధోరణివాదుల" మాదిరిగా లెనిన్ కూడా అంతమై ఉండేవాడు. కాని, స్టాలినిస్టు దశని సాధ్యం చేయబోతున్న ప్రక్రియలకు వ్యతిరేకంగా పోరాడడానికి ఆయన తన శాయశక్తులా కృషి చేసి వుండేవాడని మనం నిశ్చయంగా చెప్పవచ్చు.

ఓటమిని తప్పించుకోవాలంటే లెనిన్ రాజకీయ వ్యూహ చతురుడిగా, నూతన పథగామిగా ఎంతో అసాధారణమైన నైపుణ్యాన్ని, సాహసాన్ని చూపవలసి వుండివుండేది. ఈ లక్షణాలు లెనిన్‌లో మెండుగా వున్నాయనేది అందరికీ తెలిసిన విషయమే. ఆయన, తన మాటల్లోనే చెప్పాలంటే, "మొక్కవోని పట్టుదల"తో పనిచేయాల్సి ఉండేది. బహుశా ఆయనకు అలా చేయగల పూర్తి సామర్థ్యం వుంది. లెనిన్, ట్రాట్స్కీతో, మరి ఇతరులతో కలిసి పనిచేస్తూ, సోవియట్ రష్యాని తక్కువ విషాదకరమైన, ఎక్కువ హేతుబద్ధమైన, సోషలిస్టు లక్ష్యానికి తక్కువ నష్టదాయకమైన మార్గం గుండా తీసుకువెళ్ళగలిగి వుండేవాడు. వాస్తవానికి లెనిన్‌కి తన భావాలు సాకారం చేసుకోవడానికి ట్రాట్స్కీ అవసరం. కేవలం తన అనారోగ్యం కారణంగానే లెనిన్ ట్రాట్స్కీ సహాయం కోరడం చేయలేదు. లెనిన్ గాస్‌ప్లాన్‌లో జిజనోవ్‌స్కీ, పృతకోవ్‌ల మధ్య కోరుకున్నటువంటి అరమరికలు లేని పరస్పరాశ్రిత కృషి స్థాయిలో కాకపోయినప్పటికీ, లెనిన్, ట్రాట్స్కీలు ఒకరినొకరు చక్కగా పూరించుకుంటూ కలిసి పని చేశారు. అక్టోబరు విప్లవపు చోదక శక్తికి లెనిన్, ట్రాట్స్కీలు ప్రతీకలుగా నిలిచారు.

ట్రాట్స్కీ ఒక్కడే పునర్వ్యవస్థీకరణను, ఏకీకరణను, తరువాత దశలో ప్రక్షాళనకు గురైన వారిని కాపాడటం చేయగలిగి వుండేవాడు కాదు. ఆయన లెనిన్‌కి "వారసుడు" కాలేకపోవటానికి కారణాలు డాయిశ్చర్ చక్కగా వివరించాడు : ఉదాహరణకి లెనిన్ చివరిగా తీవ్రస్థాయిలో పక్షవాతం బారిన పడినప్పుడు, లెనిన్ దేనికి వ్యతిరేకంగా తనని హెచ్చరించాడో సరిగ్గా అలాంటి "నిరర్ధకమైన రాజీ"ని కుదుర్చుకున్నాడు. కామెనెవ్‌లోని భయాలను తొలగించేందుకు తాను మౌలికంగా లెనిన్‌తో ఏకీభవించినప్పటికీ, "స్టాలిన్‌ని తొలగించే విషయంలో, అర్జోనికిజ్‌ని బహిష్కరించే విషయంలో, జెర్జిన్‌స్కీని ప్రసార సాధనాల మంత్రిత్వశాఖ నుండి తొలగించే విషయంలో" తాను అంగీకరించజాలనన్నాడు. "ఇకపై ఎటువంటి కుట్రలు వుండడానికి వీల్లేదు. నిజాయితీతో కూడిన సహకారమే ఉండాలి" అని చెప్పడం ద్వారా స్టాలిన్‌ని మందలించి వూరుకున్నాడు. (ట్రాట్స్కీ – మై లైఫ్ – పుట : 486). ఆయన ఉదాత్తతను చూపాలనుకున్నాడు. "వీలునామా"లో

నిక్షిప్తమైన లెనిన్ మద్దతు వల్ల తాను అలా చేయగలననుకున్నాడు. దీనిని బట్టి ఆయన లెనిన్ సిఫార్సుల సారాంశాన్ని అర్థం చేసుకోలేదని తెలుస్తోంది.

శృతిమించిన స్వాతిశయం, చిన్న చిన్న నాయక బృందాలలో జరిగే కుతంత్రాలు తన స్థాయికి తగినవి కావని భావించే బలహీనతలు ట్రాట్స్కీలో వున్నాయి. ఆయన గతం వల్ల, వ్యవహారశైలి వల్ల పార్టీలో బయటి వ్యక్తిగా పరిగణించబడ్డాడు. దీనివల్ల అవకాశం వచ్చినప్పుడు -- ఆయనకు అది ఒకే ఒక్కసారి వచ్చింది -- అవసరమైన దృఢత్వంతో దానిని అందిపుచ్చుకోలేకపోయాడు. ఆయన పార్టీని సర్వోత్కృష్టమైనదిగా పరిగణించటానికి, పరిమిత చట్ట దృష్టికి, నైతిక సందిగ్ధానికి లోను కావడం వల్ల శత్రువులు తనకు వ్యతిరేకంగా చేస్తున్న వాటికి లెనిన్ అయితే చేసి వుండే విధంగా, తడబాటు లేకుండా ప్రతిచర్య తీసుకోలేక పోయాడు. వ్యవస్థాపకునిగా లెనిన్ తాను నిర్మించిన దానిని కూలగొట్టేందుకు, పునర్నిర్మించేందుకు భయపడలేదు. తన చుట్టూ ఉన్నవారిని సంస్థాగత నిర్మాణంలోకి తీసుకురావడానికి, రహస్య కార్యాచరణకు, తన వైఖరి విజయం కోసం పోరాడడానికి, పరిస్థితిని తన నియంత్రణలో వుంచుకోవడానికి ఆయన వెనకాడలేదు.

ట్రాట్స్కీ అలాంటి మనిషి కాదు. లెనిన్ కనుమరుగయ్యాడు. స్టాలిన్ విజయం ఖాయమయింది.

# I

# స్టాలిన్ "స్వయం ప్రతిపత్తి" ప్రణాళిక

1. సోవియట్ రిపబ్లిక్‌లయిన ఉక్రెయిన్, బైలో రష్యా, అజర్ బైజన్, జార్జియా, అర్మీనియాలు రష్యన్ సోవియట్ రిపబ్లిక్ (RSFSR) తో కలగలసి పోవటానికి సంబంధించి, బుఖారా, ఖోరెజమ్, దూరప్రాచ్య రిపబ్లిక్‌లను అలా ప్రక్కన వుంచి, ఒక ఒడంబడిక కుదుర్చుకోవటం ప్రయోజనకరమా అనేది పరిశీలించాలి. ఈ ఒడంబడిక కస్టమ్స్ సుంకాల విధింపు, విదేశీ వాణిజ్యం, విదేశీ వ్యవహారాలు, సైనికపరమైన అంశాల వంటి వాటికి పరిమితం చేయాల్సి ఉంటుంది.

చేర్పులు : మొదటి పేరాలో పేర్కొన్న రిపబ్లిక్‌ల, రష్యన్ రిపబ్లిక్ యొక్క రాజ్యాంగాలలో సోవియట్ల ప్రాధికార శాఖల పరిశీలన తరువాత అవసరమైన మార్పులు చేయాలి.

2. తత్ఫలితంగా అఖిల రష్యా కేంద్రపాలక మండలి (VTSIK) తీర్మానాలను మొదటి పేరాలో పేర్కొన్న రిపబ్లిక్‌లలోని కేంద్ర సంస్థలన్నింటికీ అమలు చేయవలసి ఉంటుంది. అదే విధంగా రష్యన్ రిపబ్లిక్‌కి చెందిన సోవ్నర్కోమ్ లేక ప్రజా కమిస్సార్ల మండలి (SNK) మరియు కార్మిక, రక్షణ మండలి (STO) ల నిర్ణయాలు ఈ రిపబ్లిక్‌ల ఏకీకృత మంత్రిత్వ శాఖలకు వర్తిస్తాయి.

చేర్పులు : ఈ రిపబ్లిక్కుల ప్రతినిధులు VTSIK, RSFSR ల ప్రిసీడియంలలో సభ్యులవుతారు.

3. పేరా 1లో పేర్కొన్న రిపబ్లిక్‌ల విదేశీ వ్యవహారాలు, విదేశీ వాణిజ్యం, రక్షణ, ప్రసార మాధ్యమాలు, తపాలా సర్వీసుల వంటి సేవలు RSFSR కి చెందిన సమాంతరమైన సంస్థలలో విలీనం చేయబడతాయి. RSFSR కి చెందిన ఆయా మంత్రిత్వ శాఖలు (కమిస్సారియట్లు) వాళ్ళ ప్రతినిధి బృందాలను కొద్దిమంది అధికారులతో కలిపి ఆయా రిపబ్లిక్కులకి పంపుతాయి.

ఈ ప్రతినిధుల్ని రష్యన్ రిపబ్లిక్‌కి చెందిన కమిస్సారియట్లు రిపబ్లిక్‌లలోని పాలక మండళ్ళ అంగీకారంతో నియమిస్తాయి.

విదేశీ వ్యవహారాలు, విదేశీ వాణిజ్యానికి సంబంధించిన కమిస్సారియట్లలో రిపబ్లిక్‌ల నుండి ఎంపిక చేయబడే ప్రతినిధులు పాల్గొనడం ప్రయోజనకరంగా ఉంటుంది.

4. రిపబ్లిక్‌లలోని ఆర్థిక, ఆహార, కార్మిక, ద్రవ్య మంత్రిత్వ శాఖలు రష్యన్ రిపబ్లిక్‌కి చెందిన ఆయా మంత్రిత్వ శాఖలు జారీ చేసే ఆదేశాలకు అనుగుణంగా నడుచుకోవాలి.

5. మొదటి పేరాగ్రాఫ్‌లో పేర్కొన్న రిపబ్లిక్‌ల ఇతర మంత్రిత్వ శాఖలు అంటే న్యాయం, విద్య, అంతర్గత భద్రత, వ్యవసాయం, కార్మిక – కర్షక నియంత్రణ, ఆరోగ్యం మరియు సామాజిక బీమా స్వతంత్రమైనవిగా పరిగణించబడతాయి.

చేర్పులు : 1. పైన పేర్కొన్న రిపబ్లిక్కులకి చెందిన విప్లవ ప్రతీఘాత పోరాటాన్ని నియంత్రించే సంస్థలు రష్యన్ రిపబ్లిక్ పోలీసు వ్యవస్థ ఆదేశాలననుసరించి వ్యవహరించాల్సి ఉంటుంది.

2. రిపబ్లిక్కుల పాలక మండళ్ళు కేవలం సివిల్ వ్యవహారాల్లో మాత్రమే క్షమాభిక్ష పెట్టే అధికారాన్ని కలిగి వుంటాయి.

6. ఈ ఏర్పాటు రష్యన్ కమ్యూనిస్టు పార్టీ సెంట్రల్ కమిటీ ఆమోదించినట్లయితే, దీనిని బహిరంగ పరచకుండా, అఖిల రష్యా సోవియట్ల మహాసభ జరిగే లోపు ఆయా రిపబ్లిక్‌ల సోవియట్ల సంస్థలకు, కేంద్ర పాలక మండలికి, సోవియట్ల కాంగ్రెస్‌కి తెలియజేసేందుకు వీలుగా రిపబ్లిక్‌ల సెంట్రల్ కమిటీలకు పంపడం జరుగుతుంది. అఖిల రష్యా సోవియట్ల మహాసభ ఈ ఏర్పాటు రిపబ్లిక్‌ల అభీష్టం అని ప్రకటిస్తుంది.

(ఇనిస్టిట్యూట్ ఆఫ్ మార్క్సిజం – లెనినిజం కి చెందిన సెంట్రల్ ఆర్కైవ్స్. మూలం: లెనిన్ సమగ్ర రచనలు – సంపుటం : XLV – పుటలు : 557 – 58).

# II

# లెనిన్ వ్యాఖ్యలు :

## సోవియట్ సోషలిస్టు రిపబ్లిక్కుల యూనియన్ స్థాపనకు లెనిన్ ప్రణాళిక

యల్.బి.కామెనెవ్‌కు లేఖ – రష్యన్ కమ్యూనిస్టు పార్టీ కేంద్ర కమిటీ యొక్క పొలిటికల్ బ్యూరో సభ్యుల కొరకు

26×IX

కామ్రేడ్ కామెనెవ్! స్టాలిన్ నుండి స్వతంత్ర రిపబ్లిక్కులను రష్యన్ రిపబ్లిక్‌లో విలీనం గావించే విషయంలో సంబంధిత కమీషన్ తీర్మానాలు నీకు తప్పక అందే వుంటాయి.

ఇప్పటి వరకు అవి నీకు చేరి ఉండకపోతే సెక్రటరీ నుండి తీసుకుని వెంటనే చదువు. నేను ఈ విషయంలో సోకోల్నికోవ్‌తో చర్చించాను. ఈ రోజు స్టాలిన్‌తో మాట్లాడాను. ఎందివనిని (జార్జియన్ కమ్యూనిస్టు; జాతీయ స్వాతంత్ర్య వాదిగా అనుమానించబడిన నేత) రేపు కలుస్తాను.

నా ఉద్దేశ్యంలో ఈ సమస్య ఎంతో ముఖ్యమైనది. స్టాలిన్ చాలా తొందరపాటును ప్రదర్శిస్తున్నాడు. నువ్వొకసారి ఈ సమస్యను పట్టించుకుని కొంత అధ్యయనం చేయటం జరిగింది కనుక నీవు తప్పక దీనిపై ఆలోచించాల్సి వుంది; అలాగే జినొవీవ్ కూడ.

స్టాలిన్ ఒక మార్పు చేయడానికి అంగీకరించాడు. మొదటి పేరాలో రష్యన్ రిపబ్లిక్‌తో కలగలసి పోవటం (adhesion) అనే పదానికి బదులుగా “ఐరోపా, ఆసియా సోవియట్ రిపబ్లిక్‌ల యూనియన్ చట్రంలో రష్యన్ రిపబ్లిక్‌తో చట్టబద్ధ ఐక్యత” (formal union) అనే పదాన్ని వాడేందుకు అంగీకరించాడు.

ఈ విధమైన రాయితీ ప్రాముఖ్యం నీకు స్పష్టమయిందని భావిస్తాను : చట్ట ప్రకారం ఉక్రెయిన్ మొదలుగాగల రిపబ్లిక్‌లు రష్యన్ రిపబ్లిక్‌తో సమాన హోదా కలిగి ఉన్నాయని గుర్తిస్తాం. ఈ రిపబ్లిక్‌లు సమానమైన హోదాతో కొత్త యూనియన్‌లో, కొత్త ఫెడరేషన్‌లో, “ఐరోపా, ఆసియా సోవియట్ రిపబ్లిక్కుల యూనియన్”లో ప్రవేశాన్ని పొందుతాయి.

అలా అయ్యేట్లయితే రెండవ పేరాగ్రాఫ్‌ను కూడ మార్చి రష్యన్ రిపబ్లిక్‌కి చెందిన కేంద్ర పరిపాలక మండలికి సమాంతరంగా "ఐరోపా, ఆసియా సోవియట్ రిపబ్లిక్‌ల యూనియన్ యొక్క ఫెడరల్ కేంద్ర పరిపాలక మండలి"ని నెలకొల్పాల్సి ఉంటుంది.

మొదటి సంస్థ వారానికి ఒక పర్యాయం సమావేశం అయ్యేట్లయితే రెండవది కూడ అదే విధంగా సమావేశమైతే (ఒకవేళ పక్షానికి ఒకసారి సమావేశమయినా) వాటి కార్యకలాపాలను కలిపి చేపట్టేందుకు ఇబ్బందేమీ ఉండదు.

జాతీయ స్వతంత్రవాదుల కార్యక్రమాలకు అవకాశం కల్పించకుండా, రిపబ్లిక్‌ల స్వాతంత్ర్యాన్ని ధ్వంసం చేయకుండా ఉండటం ముఖ్యం. ఇందు నిమిత్తం ఒక నూతన *శ్రేణిని, సమాన హక్కులు గల రిపబ్లిక్‌ల ఫెడరేషన్‌ను స్థాపించవలసి ఉన్నది.*

రెండవ పేరాలో రెండవ భాగంలో ఏ విధమైన మార్పు అవసరం లేకుండా అలాగే ఉంచవచ్చు. ఫిర్యాదులు (STO, SNK నిర్ణయాలకు వ్యతిరేకంగా) ఏవయినా ఉంటే వాటిని ఫెడరల్ కేంద్ర పాలక మండలి పరిశీలించవచ్చును. అయితే, *నిర్ణయాల అమలులో ఆలస్యం చేయకూడదు.* (రష్యన్ సోవియట్ సోషలిస్టు రిపబ్లిక్ అనుసరిస్తున్న పద్ధతిలివే).

మూడవ పేరాగ్రాఫును ఈ సవరణతో అలాగే ఉంచవచ్చు: "మాస్కోలోని కేంద్ర మంత్రిత్వ శాఖలలో విలీనమవుతాయి; రష్యన్ రిపబ్లిక్‌కి చెందిన మంత్రిత్వ శాఖలు అధికారిక గుర్తింపు కలిగిన ప్రతినిధులను, కొద్ది మంది అధికారులను *ఐరోపా, ఆసియా సోవియట్ రిపబ్లిక్‌ల యూనియన్‌లోని సభ్య రిపబ్లిక్‌లకి* పంపవచ్చు.

మూడవ పేరాగ్రాఫ్‌లోని రెండవ భాగము యధావిధిగా ఉండవచ్చును; అయితే మరింత సమత్వాన్ని సాధించేందుకు ఇలా చెపితే బాగుంటుంది: "ఐరోపా, ఆసియా సోవియట్ రిపబ్లిక్‌ల యూనియన్‌లోని సభ్య రిపబ్లిక్‌ల కేంద్రపాలక మండళ్ళతో ఒప్పందం కుదిరిన పిమ్మట."

మూడవ పేరాగ్రాఫులోని మూడోభాగాన్ని గురించి మనం బాగా ఆలోచించాలి. "ప్రయోజనకరం" అనే పదానికి బదులుగా "*ఆవశ్యకం*" అని ఉండొద్దూ? వివరణ కోరే పద్ధతిని *నియమంగా కలిగిన* ఆవశ్యకతను నిర్దేశించడం, అట్టి వివరణ పొందకుండా తీసుకోబడిన నిర్ణయాలను 'అసాధారణ' పరిస్థితులలో మాత్రమే అంగీకరించడం మనం చేయద్దూ?

నాల్గవ పేరాగ్రాఫులో "కేంద్ర పరిపాలక మండళ్ళతో ఒప్పందం పిమ్మట విలీనం కావాలి" అనే నియమాన్ని బహుశా విధించాలి.

ఐదవ పేరా(గ్రాఫులో *"పూర్తిగా సలహాలిచ్చే (లేక సలహాలిచ్చే పరిధి దాటని)* స్వభావం కలిగిన ఉమ్మడి *(లేక సాధారణ)* సదస్సులు, మహాసభల వ్యవస్థని సృష్టించడం ద్వారా" అని కలపాలి.

దీని వల్ల మొదటి, రెండవ చేర్పులలో మార్పులు అవసరమౌతాయి.

నేను వచ్చే వరకు తీర్మానాన్ని సెంట్రల్ కమిటీ, పొలిట్‌బ్యూరో ముందుంచటాన్ని నిలిపి వుంచేందుకు స్టాలిన్ అంగీకరించాడు. నేను అక్టోబరు 2 సోమవారం వస్తాను. నిన్ను, రైకోవ్‌ని ఓ రెండు గంటల పాటు కలవాలి. మధ్యాహ్నం 12 నుండి 2 గంటల మధ్య కాని లేదా అవసరమయితే సాయంత్రం 5-7 మధ్యగాని, 6-8 మధ్యగాని.

ఇది ప్రాధమికంగా నా పధకం. ఇంకా మార్పులు, చేర్పులు ఉంటే ఎందివని, మిగతా కామ్రేడ్లతో చర్చించిన తరువాత చేస్తాను. నీవూ అలాగే చేసి నాకు జవాబు పంపు.

నీ

లెనిన్

తుది మాట : ప్రతులు పొలిట్‌బ్యూరో సభ్యులందరికి పంపండి. (లేఖ రాసిన తేదీ సెప్టెంబరు 26, 1922. రాత ప్రతి నుండి ప్రచురించబడింది. తొలిసారిగా 1959లో లెనిన్ సమగ్ర రచనల సంపుటం XXXVI లో ప్రచురింపబడింది.)

# III

## లెనిన్ సవరణలను చేర్చి తయారుచేసి 1922 అక్టోబరు 6న స్టాలిన్ సెంట్రల్ కమిటీ ముందుంచిన ప్రణాళిక

1. ఉక్రెయిన్, బైలో రష్యా, ట్రాన్స్ కాకేసియన్ రిపబ్లిక్కుల ఫెడరేషన్‌కు రష్యన్ రిపబ్లిక్‌కి మధ్య "సోవియట్ సోషలిస్టు రిపబ్లిక్కుల యూనియన్" చట్రంలో కలయికను -- ఆయా రిపబ్లిక్‌లకి "యూనియన్" నుండి వాటంతటవి వైదొలగే హక్కు కల్పిస్తూ -- సాధించడం కోసం ఒక ఒడంబడికను కుదుర్చుకోవడం తప్పనిసరి అవసరంగా పరిగణించాలి.
2. "యూనియన్" అత్యున్నత సంస్థ ఫెడరల్ కేంద్ర పరిపాలక మండలి అవుతుంది. అది రష్యన్ రిపబ్లిక్, ట్రాన్స్ కాకేసియన్ ఫెడరేషన్, ఉక్రెయిన్, బైలో రష్యాల కేంద్ర పరిపాలక మండళ్ళ ప్రతినిధులతో జనాభా దామాషా పద్ధతిలో రూపొందుతుంది.
3. "ఫెడరల్ కేంద్ర పరిపాలక మండలి" కార్యనిర్వాహక వర్గం "ఫెడరల్ సోవ్నర్కోమ్ (మంత్రిమండలి)" అవుతుంది. దానిని "ఫెడరల్ కేంద్ర పరిపాలక మండలి" నియమిస్తుంది.
4. యూనియన్‌గా రూపొందే రిపబ్లిక్కులు, ఫెడరేషన్‌కు చెందిన విదేశీ వ్యవహారాలు, విదేశీ వాణిజ్యం, దేశ రక్షణ, ప్రసార సాధనాలు, తపాలా శాఖల మంత్రిత్వ శాఖలు అన్నీ యుఎస్ఎస్ఆర్ (USSR) కి చెందిన తత్సంబంధిత మంత్రిత్వ శాఖలలో విలీనమవుతాయి. అన్ని రిపబ్లిక్కులు, ఫెడరేషన్లలలో తమ అధికారిక ప్రతినిధులను, కొద్దిమంది అధికారులను ఆయా రిపబ్లిక్కుల, ఫెడరేషన్ల పరిపాలక మండళ్ళ అంగీకారంతో యూనియన్ మంత్రిత్వ శాఖలు నియమిస్తాయి.

చేర్పులు : వివిధ రిపబ్లిక్‌ల ప్రతినిధులను విదేశీ వ్యవహారాలకు, విదేశీ వాణిజ్య మంత్రిత్వ శాఖలకి చెందిన విదేశాల్లోని ప్రతినిధి బృందాలకు అనుషంగికంగా నియమించడాన్ని ఆవశ్యకమైన పద్ధతిగా పరిగణించాలి.

5. సభ్య రిపబ్లిక్కులు, ఫెడరేషన్లకు చెందిన విత్త, ఆహార, ఆర్థిక, శ్రామిక శిక్షణ మంత్రిత్వ శాఖలు, విప్లవ పోరాటాన్ని వ్యతిరేకించే సంస్థలను అదుపు చేసే కేంద్ర సంస్థలు అన్నీ "రిపబ్లిక్‌ల యూనియన్" కి చెందిన ఆయా విభాగాల మంత్రిత్వ శాఖలు, సోవ్నర్కోమ్ మరియు కార్మిక రక్షణ మండలి నిర్ణయాలకు అనుగుణంగా నడుచుకోవాల్సి ఉంటుంది.

6. యూనియన్‌లోని సభ్య రిపబ్లిక్కులకు చెందిన మిగతా మంత్రిత్వ శాఖలు అంటే న్యాయం, విద్య, అంతర్గత భద్రత, వ్యవసాయం, ఆరోగ్యం, సామాజిక బీమాలకు సంబంధించినవి స్వతంత్రంగా పని చేస్తాయి.

(సోవియట్ కమ్యూనిస్టు పార్టీ సెంట్రల్ కమిటీకి చెందిన ఇనిస్టిట్యూట్ ఆఫ్ మార్క్సిజం - లెనినిజం సెంట్రల్ ఆర్కైవ్స్ ఆధారం. సమగ్ర రచనలు - సంపుటం : XLV - పుట : 559).

# IV

## విదేశీ వాణిజ్య గుత్తాధిపత్యంపై అక్టోబరు 13 నాటి లెనిన్ లేఖపై స్టాలిన్ అభిప్రాయం

విదేశీ వాణిజ్య గుత్తాధిపత్యం విషయంలో అక్టోబరు 6న సెంట్రల్ కమిటీ ప్లీనం తీసుకున్న నిర్ణయం సరైనదేననే నా అభిప్రాయాన్ని కామ్రేడ్ లెనిన్ రాసిన లేఖ ప్రభావితం చేయలేదు. విదేశీ వాణిజ్య మంత్రిత్వశాఖ "కోట్లాది రూపాయలు" గడిస్తోందని చెప్పబడుతోంది. (ఈ అంకెలను లెక్కగట్టి నిర్ధారించవలసి వుంది). అయితే ఈ విలువ కంటే ఇదే మంత్రిత్వ శాఖ ద్వారా రష్యా నుండి తరలి వెళ్తున బంగారం విలువ అనేక రెట్లు అధికం. అయినా కామ్రేడ్ లెనిన్ సెంట్రల్ కమిటీ ప్లీనం నిర్ణయాన్ని వాయిదా వేయాలన్న తన ప్రతిపాదనపై పట్టుపడుతున్న దృష్ట్యా, లెనిన్ సమక్షంలో తదుపరి ప్లీనం సమావేశంలో ఈ అంశాన్ని చర్చించేందుకు వీలుగా, నేను అనుకూలంగా ఓటు వేస్తున్నాను.

(సోవియట్ కమ్యూనిస్టు పార్టీ సెంట్రల్ కమిటీకి చెందిన ఇనిస్టిట్యూట్ ఆఫ్ మార్క్సిజం – లెనినిజం సెంట్రల్ ఆర్కైవ్స్. ఆధారం : ఫతియెవా రచన : "ఇజ్ వొస్పమినసీయ్" (జ్ఞాపకాల నుండి) – పుటలు : 28–29).

# V

## స్టాలిన్ తన పట్ల ప్రవర్తించిన తీరుపై క్రూప్‌స్కయా కామెనెవ్‌కి 1922, డిసెంబరు 23న రాసిన లేఖ

లెవ్ బొరిసోవిచ్! వైద్యుల అనుమతితో లెనిన్ నాకు చెప్పి రాయించిన సంక్షిప్త టిప్పణి విషయంలో స్టాలిన్ నన్ను కఠోరమైన తిట్ల ఉప్పెనకు గురి చేశాడు. పార్టీలో నేను నిన్న చేరలేదు. పార్టీలో చేరి గడిచిన గత ముప్ఫై సంవత్సరాలలో ఏ కామ్రేడ్ నుండి కూడ ఒక్క దురుసు మాట నాకు వినపడలేదు. పార్టీ, ఇల్లిచ్ (లెనిన్)ల శ్రేయస్సు పట్ల నాకున్న శ్రద్ధ స్టాలిన్ చూపేదానికేమీ తీసిపోదు. ఇపుడు నేను నా మొత్తం స్వయం నియంత్రణా శక్తిని కూడగట్టుకోవలసి వుంది. ఇల్లిచ్‌కి ఏమి చెప్పాలో ఏమి చెప్పకూడదో డాక్టర్లకి మించి నాకే ఎక్కువగా తెలుసు. ఎందుకంటే లెనిన్‌ని ఏది ఆందోళన పరుస్తుందో, ఏది అలా చేయదో నాకు తెలుసు. ఏది ఏమైనా, ఈ విషయం స్టాలిన్ కంటే మెరుగ్గా నాకు తెలుసు.

(క్రూప్‌స్కయా "తన వ్యక్తిగత జీవితంలోకి చొరబాటు నుండి, అనుచితమైన నిందలు, బెదిరింపుల నుండి'' రక్షణ కోరుకుంటున్నారు (దీనిని లేఖ నుండి ఉటంకించకుండా సంపాదకులు సంక్లిప్తంగా రాశారు). ఆమె ఇంకా ఇలా అన్నారు:

కంట్రోల్ కమీషన్ ఏకగ్రీవ నిర్ణయం గురించి (లెనిన్ ఆరోగ్య బాధ్యతను స్టాలిన్‌కి అప్పచెప్పిన నిర్ణయం – ప్రచురణకర్తలు) నాకేమీ సందేహం లేదు. ఆ నిర్ణయమే స్టాలిన్ నన్ను బెదిరించడానికి ఆస్కారమిచ్చింది. అయితే ఈ అవివేకపు ప్రహసనంలో తలదూర్చే సమయంగాని, శక్తిగాని నాకు లేవు. నేనూ మనిషినే. నా నరాలు చిట్లి పోయేట్లున్నాయి – యన్. క్రూప్‌స్కయా.

(అవే ఆర్కైవ్స్. ఆధారం : సమగ్ర రచనలు – సంపుటం : LIV – పుటలు : 674–675).

# VI

## పొలిటికల్ బ్యూరో చెప్పి రాయించేందుకు లెనిన్‌కి డిసెంబరు 24న అనుమతించింది

1. రోజూ ఐదు నుండి పది నిమిషాల పాటు ఏదయినా చెప్పి రాయించేందుకు వ్లాదిమిర్ ఇల్లిచ్‌కి అనుమతి ఇవ్వబడింది. అయితే అది ఉత్తర ప్రత్యుత్తర రూపంలో ఉండరాదు; ఇల్లిచ్ తన టిప్పణులకు సమాధానాలను ఆశించరాదు. ఆయన్ని సందర్శించటం నిషేధించబడింది.
2. రాజకీయ విషయాల్ని గురించి స్నేహితులుగాని, సేవకులుగాని లెనిన్‌కి చెప్పడం నిషేధించబడింది. ఆయన లోతైన ఆలోచనకు, ఆందోళనకు గురి కాకుండా ఉండేందుకు ఇది ఉద్దేశించబడింది.

(అవే ఆర్కైవ్స్. ఆధారం : సమగ్ర రచనలు – సంపుటం : XLV – పుట:710).

# VII

## 1922 డిసెంబరు 27 (లేదా 28)న లెనిన్ తయారుచేయించిన పనుల వివరాలు

*మెమోరాండం:*

సెంట్రల్ కమిటీ సభ్యుల సంఖ్యను పెంచే విషయంంలో రాసిన లేఖలో ఒక పేరాగ్రాఫ్ వదిలివేయబడింది. అది విస్తృతపరచబడిన సెంట్రల్ కమిటీకి, కార్మిక - కర్షక తనిఖీ వ్యవస్థకు మధ్య సంబంధాలకు అన్వయించేది.

**పరిశీలించవలసిన అంశాలు :**

1. సెంట్రోసోయజ్ (సహకార వినిమయ సంఘం), నూతన ఆర్థిక విధానం దృక్కోణం నుండి దాని ప్రాముఖ్యత.
2. గ్లావ్‌ప్రొఫోబ్ర్ (వృత్తి విద్యాసంఘం) కి, ప్రజలకు సాధారణ విద్య గలిపే కార్యక్రమానికి మధ్య ఉన్న సంబంధం.
3. జాతుల సమస్య - అంతర్జాతీయ వాదం (ఇటీవల జార్జియన్ పార్టీలో తలెత్తిన సంఘర్షణలకు సంధానిస్తూ).
4. 1922లో ప్రచురించబడిన జాతీయ విద్యాగణాంకాల కొత్త పుస్తకం

(ఆధారం : సమగ్ర రచనలు - సంపుటం : XLV - పుట : 592).

# VIII

## జార్జియన్ల పక్షాన వాదించే విషయంలో లెనిన్‌కి ట్రాట్స్కీ రాసిన జవాబు

మాస్కోలోని ఇనిస్టిట్యూట్ ఆఫ్ మార్క్సిజం – లెనినిజం సమాచారం ప్రకారం ట్రాట్స్కీ జార్జియన్ల పక్షాన సెంట్రల్ కమిటీ ముందు, పార్టీ కాంగ్రెస్‌లోను వాదించేందుకు నిరాకరించాడు. తాను జబ్బున పడినట్లుగా సాకును చూపాడు. ఈ విధమైన అభియోగాన్ని ట్రాట్స్కీపై మోపడానికి తగిన ఋజువులేమీ చూపలేదు. అయినా దీనిని లూయీ ఫిషర్ తాను రాసిన లెనిన్ జీవిత చరిత్రలో తిరిగి పేర్కొన్నాడు. కాని డాయిశ్చర్ ఇందుకు విరుద్ధంగా చెప్పాడు. 1923 మార్చి 6న (లెనిన్ కార్యదర్శి) "జర్నల్" లో రాసినదాని ప్రకారం "జవాబు (ట్రాట్స్కీది) టెలిఫోన్‌పై అందింది. దానిని షార్ట్‌హాండ్‌లో రాసుకోవటం జరిగింది." ఒకవేళ ఆ జవాబు అనుకూలంగా ఉండివుంటే లెనిన్ ట్రాట్స్కీకి తన మెమోరాండం పాఠాన్ని, ట్రాట్స్కీ సమాధానం పిమ్మట జార్జియన్లకి రాసిన లేఖ ప్రతిని పంపి ఉండేవాడు కాదు.

ఫతియెవా 1923 ఏప్రిల్ 16న కామెనెవ్‌కి రాసిన లేఖ మావద్ద ఉంది. అందులో ట్రాట్స్కీ అంగీకరించినట్లుగా ఉంది. (ట్రాట్స్కీ ఈ లేఖను తన "స్టాలిన్ స్కూల్ ఆఫ్ ఫాల్సిఫికేషన్స్" అదే పుస్తకంలో ఉదహరించాడు – పుట :73). లేఖ ప్రతి దిగువ ఇస్తున్నాము:

కామ్రేడ్ కామెనెవ్‌కి (ప్రతి కామ్రేడ్ ట్రాట్స్కీకి):

లియోన్ బొరిసోవిచ్:

మన టెలిఫోన్ సంభాషణకి కొనసాగింపుగా, పొలిటికల్ బ్యూరో తాత్కాలిక ఛైర్మన్‌గా ఉన్న మీకు దిగువ సమాచారం పంపాను:

నేను మీకు ఇంతకుముందుగానే తెలియజేసినట్లు 1922 డిసెంబరు 31న వ్లాదిమిర్ ఇల్లిచ్ జాతుల సమస్యపై ఒక వ్యాసం చెప్పి రాయించటం జరిగింది.

ఈ సమస్య ఆయనకు ఎంతగానో ఆందోళనను కలిగించింది. పార్టీ మహాసభలో

దానిపై ప్రసంగించేందుకు సంసిద్ధుడవుతున్నాడు. ఈ వ్యాసాన్ని కొంతకాలం ఆగి ప్రచురిస్తానని ఇటీవల తను జబ్బు పడటానికి కొంచెం ముందుగా ఆయన నాకు చెప్పాడు. ఈ విషయంలో అంతిమ సూచనలు చేయకముందే ఆయన జబ్బుపడ్డాడు.

వ్లాదిమిర్ ఇల్లిచ్ ఈ వ్యాసాన్ని మార్గదర్శకమైనదిగాను, అతి ముఖ్యమైనదిగాను భావించాడు. ఆయన ఆదేశం మేరకు *దానిని కామ్రేడ్ ట్రాట్స్కీకి పంపటం జరిగింది. ఈ సమస్యపై తన అభిప్రాయాన్ని సమర్థించే బాధ్యతను వ్లాదిమిర్ ఇల్లిచ్ ఆయనకు అప్పచెప్పాడు...”*

(ఇనిస్టిట్యూట్ ఆఫ్ మార్క్సిజం – లెనినిజం ఈ లేఖను ఉటంకించదు. అది ఉందని అంగీకరిస్తుంది. ఫతియెవా దీనిని 1923 ఏప్రిల్ 16న పొలిటికల్ బ్యూరోకి పంపినట్లు అంగీకరిస్తుంది).

# IX

## తక్కువే మేలు, కానీ మేలుగా వుండాలి *

(ప్రావ్దా, మార్చి 4, 1923)

మన రాజ్య యంత్రాంగాన్ని మెరుగుపరిచే విషయంలో, నా అభిప్రాయంలో, 'కార్మిక కర్షక తనిఖీ' పరిమాణం కొరకు కష్ట పడడం గానీ, తొందరపడడం గానీ చేయకూడదు. యింతవరకు మనం మన రాజ్య యంత్రాంగపు సమర్థతకు యెంత తక్కువ ఆలోచనా, శ్రద్ధా అర్పించినామంటే, యిప్పుడు దాని సమగ్ర నిర్మాణాన్ని సాధించడానికి మనం ప్రత్యేక జాగ్రత్త వహించి, నిజంగా కాలానికి వెనుకబడని, అనగా ఉత్తమ పశ్చిమ యూరోపియన్ ప్రమాణాలకు తక్కువ కాని, కార్యకర్తల సిబ్బందిని 'కార్మిక కర్షక తనిఖీ'లో సాంద్రీకరిస్తే అది పరమ న్యాయంగా వుంటుంది. సోషలిస్టు రిపబ్లిక్కుకు, సహజంగానే, ఈ షరతు మరీ మితమైనది. కానీ, మన అయిదేండ్ల అనుభవం మన తలకాయలనిండా అపనమ్మకాన్నీ, సందేహాన్ని కూరింది. "కార్మికవర్గ" సంస్కృతిని గురించి మరీ దీర్ఘంగా, మరీ తేలికగా మాట్లాడే వాళ్లపట్ల అలాంటి భావాలు కలిగినాయి. ప్రారంభంలో మనం నిజమైన బూర్జువా సంస్కృతితో తృప్తి చెందవచ్చు; ప్రారంభంలో, మొరటు బూర్జువా పూర్వపు రకాల సంస్కృతిని, అనగా బ్యురాక్రటిక్ సంస్కృతీ, ఫ్యూడల్ దాస్య సంస్కృతీ, వగైరాలను, తొలగించుకోవడంతో తృప్తి చెందవచ్చు. సాంస్కృతిక విషయాలలో తొందరా, మూకుమ్మడి చర్యలూ అత్యంత హానికరం. మన యువ రచయితలూ, కమ్యూనిస్టులూ చాలా మంది ఈ విషయాన్ని బాగా తమ బుర్రల్లోకి ఎక్కించుకోవాలి.

కనుక, మన రాజ్య యంత్రాంగం విషయంలో, మరింత నెమ్మదిగా ముందుకు పోవడం మేలని మన గత అనుభవం ద్వారా ఇప్పుడు మనం నిర్ధారణ లాగాలి.

---

* ఈ అనుబంధపు అనువాదాన్ని 'వి.ఐ.లెనిన్ ఏరిన రచనలు', నాల్గవ భాగం (ప్రగతి ప్రచురణాలయం, మాస్కో 1975) నుండి తీసుకోబడింది. అనువాదకుడు : రాచమల్లు రామచంద్రారెడ్డి.

మన రాజ్య యంత్రాంగం దౌర్భాగ్యంగా వుందనక పోయినా, ఎంత శోచనీయంగా వుందంటే, ఒక విషయం మనసులో పెట్టుకుని, దాని లోపాలతో ఎలా పోరాడవలసిందీ మొదట మనం అతి జాగ్రత్తగా ఆలోచించాలి -- ఏ గతం కూలదోయ బడినప్పటికీ ఇంకా ఓడింపబడలేదో, ఏ గతం సుదూర భూతకాలంలోకి నిర్గమించిన సంస్కృతి స్థాయికి యింకా చేరలేదో, ఆ గతంలో ఈ లోపాలు వేర్లు పాతుకొనివున్నాయనే విషయం. సంస్కృతిని గురించి ఉద్దేశపూర్వకంగా మాట్లాడుతున్నాను. ఎందుకంటే, ఈ విషయాలలో, మన సంస్కృతిలోనూ, మన నిత్య జీవితంలోనూ, మన అలవాట్లలోనూ విడదీయరాని భాగమైన దానిని మాత్రమే సాధింపబడినదిగా మనం పరిగణించగలం. మన సామాజిక వ్యవస్థలోని మంచి సక్రమంగా అధ్యయనం చేయబడలేదు, అర్థం చేసుకోబడలేదు, జీర్ణం చేసుకోబడలేదు, అని మనం అనవచ్చు; అది తొందరపాటుగా గ్రహించబడింది, అది సరిచూడబడలేదు, పరీక్షించి చూడబడలేదు, అనుభవంచేత ధ్రువపరచబడలేదు, స్థిరమైనదిగా చేయబడలేదు, వగైరా. నిజమే, విప్లవ కాలంలో, కేవలం అయిదేండ్లలో మనం జారిజంనుండి సోవియట్ వ్యవస్థకు మారగలిగినంత మహావేగంతో అభివృద్ధి జరిగిన దశలో, అది మరొకవిధంగా వుండజాలదు.

దీన్ని గురించి మన ఏదో ఒకటి చేయవలసిన సమయం వచ్చింది. మితిమీరిన వేగం గల పురోగమనమూ, డంబమూ, వగైరాలపట్ల మనం ఆరోగ్యకరమైన అపనమ్మకం చూపించాలి. ప్రతి గంటా మనం ఏ ముందడుగులు ప్రకటిస్తున్నామో, ప్రతి నిముషమూ మనం ఏ ముందడుగులు వేస్తున్నామో, ప్రతి క్షణమూ మనం ఏ ముందడుగులు నిరర్థకమైనవనీ, పై పైవి అనీ, అపార్థం చేసుకోబడినవనీ రుజువు చేస్తున్నామో ఆ ముందడుగులను పరీక్షించి చూసుకోవడం గురించి మనం ఆలోచించాలి. యిక్కడ అత్యంత హానికరమైనది తొందర. యిక్కడ అత్యంత హానికరమైనది మనకు కనీసం కొంతైనా తెలుసుననే ఊహమీద, లేదా నిజంగా నూతనమైన రాజ్య యంత్రాంగాన్ని, సోషలిస్టు, సోవియట్, వగైరా అని అనడానికి నిజంగా యోగ్యమైనదానిని, నిర్మించడానికి అవసరమైన అంశాలు గణనీయమైన సంఖ్యలో మనకు వున్నాయనే ఊహమీద ఆధారపడడం.

అలాంటి యంత్రాంగం, దాని అంశాలు కూడా మనకు అపహాస్యకరమైనంత తక్కువగా వున్నాయి. దానిని నిర్మించడానికి కాలాన్ని వినియోగించడంలో మనం లోభపడకూడదనీ, దానికి చాలా చాలా యేండ్లు పట్టుతుందనీ మనం జ్ఞాపకం పెట్టుకోవాలి.

ఈ యంత్రాంగాన్ని నిర్మించడానికి మనకు ఏ అంశాలు వున్నాయి? రెండే. మొదటిది, సోషలిజం కొరకు జరిగే పోరాటంలో లీనమైన కార్మికులు. వీరు తగినంత

విద్యావంతులు కాదు. వాళ్లు మనకోసం మేలైన యంత్రాంగాన్ని నిర్మించగోరుతారు, కానీ నిర్మించడం వాళ్లకు తెలియదు. వాళ్లు నిర్మించలేరు. దీనికి అవసరమైన సంస్కృతిని వాళ్లు అభివృద్ధి చేసుకోలేదు, మరి దీనికి కావలసింది సంస్కృతి. వేగంతో, దాడితో, చొరవతో, ఉత్సాహంతో, లేక సాధారణంగా ఏ ఉత్తమ మానవ గుణంతోనైనా పనులు చేయడం ద్వారా ఈ విషయంలో ఏమీ సాధింపబడదు. రెండవది, మనకు జ్ఞానమూ, విద్యా, శిక్షణా గల వారు కూడా వున్నారు. కానీ యితర అన్ని దేశాలతోనూ పోలిస్తే వారి సంఖ్య అపహాస్యకరమైనంత అరకొరగా వుంది.

మన జ్ఞాన లోపాన్ని ఉత్సాహమూ, తొందరా, వగైరాలతో పూరించడానికి (లేదా, పూరించగలమని ఊహించడానికి) మనం మరీ అభిముఖంగా వున్నామనే విషయాన్ని యిక్కడ మనం మరిచిపోకూడదు.

మన రాజ్య యంత్రాంగాన్ని పునర్నవం చేయడానికి మనం ఎంత కష్టమైనప్పటికీ నేర్చుకోవాలి, ముమ్మాటికీ నేర్చుకోవాలి, ఆ తరువాత ఆ జ్ఞానం శుష్క పాండిత్యం కాకుండానూ, ఫాషనబుల్ పడికట్టు మాట కాకుండానూ (అతి తరుచుగా మనకు యిలా అవుతుందని మొమోటం లేకుండా మనం ఒప్పుకోవాలి), మన జీవితంలో నిజంగా ఒక భాగం అయ్యేటట్లూ, మన నిత్య జీవితంలో వాస్తవంగా, పూర్తిగా ఒక భాగం అయ్యేటట్లూ చూసుకోవాలి. టూకీగా చెప్పాలంటే, బూర్జువా పశ్చిమ యూరప్ చేసే డిమాండ్లు మనం చేయకూడదు, సోషలిస్టు దేశంగా అభివృద్ధి కావడానికి పూనుకున్న దేశానికి ఉచితమూ, యోగ్యమూ అయిన డిమాండ్లు మనం చేయాలి.

పై దానినుండి లాగవలసిన నిర్ధారణలు యివి: 'కార్మిక కర్షక తనిఖీ'ని మనం నిజంగా ఆదర్శప్రాయమైన సంస్థగా, మన రాజ్య యంత్రాంగాన్ని మెరుగుపరిచే సాధనంగా చేయాలి.

మనం కోరే ఉన్నత స్థాయిని అది అందుకోడానికి వీలుగా మనం ఈ కింది నియమాన్ని పాటించాలి: "మూడు సార్లు కొలిచి ఒక సారి కత్తిరించు."

దీనికి గాను, మన సామాజిక వ్యవస్థలోని అత్యుత్తమమైనదాన్ని మనం వినియోగించుకోవాలి; కొత్త ప్రజా కమిస్సారియట్‌ను నిర్మించడానికి దానిని అత్యంత ముందు జాగ్రత్తతో, ఆలోచనతో, జ్ఞానంతో వినియోగించుకోవాలి.

దీనికిగాను మన సామాజిక వ్యవస్థలో మనకు గల అత్యుత్తమ ప్రజాశ్రేణులు-- ఉదాహరణకు, మొదటిది, పురోగామి కార్మికులూ, రెండవది, మాటను చేతగా తీసుకోరనీ, తమ అంతరాత్మకు వ్యతిరేకమైన మాట ఒకటి కూడా మాట్లాడరనీ మనం యెవరిని గురించి హామీ యివ్వగలమో ఆ నిజంగా విజ్ఞాన ప్రబుద్ధులైన వారు -- ఏ కష్టాన్నైనా

ఒప్పుకోడానికి జంకకూడదు, తాము సాధించాలని నిష్ఠగా పెట్టుకొన్న లక్ష్యాన్ని సాధించడానికి ఏ పోరాటానికైనా జంకకూడదు.

మన రాజ్య యంత్రాంగాన్ని మెరుగుపరచడానికి అయిదేండ్లుగా మనం హడావుడి చేస్తున్నాము; కానీ అది వట్టి హడావుడిగా వుంది, ఈ అయిదేండ్లలో నిరుపయోగంగా, నిరర్థకంగా కూడా, హానికరంగా కూడా వుంది. ఈ హడావుడి మనం ఏదో చేస్తున్నామనే అభిప్రాయాన్ని కలిగించింది, కానీ క్రియలో మన సంస్థలకూ, మన బుర్రలకూ గుదిబండగా వుండింది.

పరిస్థితులను మార్చవలసిన సమయం వచ్చింది.

మనం ఈ నియమాన్ని పాటించాలి: తక్కువే మేలు, కానీ మేలుగా వుండాలి. మనం ఈ నియమాన్ని పాటించాలి: రెండేండ్లలో, మూడేండ్లలోనయినా, మంచి కార్యకర్తలను సంపాయించడం మేలు, యెవరినీ సంపాయించే ఆశ లేకుండా తొందరపాటుతో పనిచేయడంకంటె.

ఈ నియమానికి అంటిపెట్టుకోవడమూ, మన పరిస్థితులలో దీనిని వర్తింపజేయడమూ కష్టంగా వుంటుందని నాకు తెలుసు. దీనికి వ్యతిరేకమైన నియమం వేయి సందుల గుండా చొచ్చుకొని వస్తుందని నాకు తెలుసు. బ్రహ్మాండమైన ప్రతిఘటన చేయవలసి వుంటుందనీ, మానవాతీతమైన పట్టుదల అవసరమనీ, కనీసం మొదటి కొద్ది సంవత్సరాలు ఈ రంగంలో పని నరకప్రాయమైనంత కష్టంగా వుంటుందనీ నాకు తెలుసు. అయినప్పటికీ, అలాంటి కృషిద్వారా మాత్రమే మనం మన లక్ష్యాన్ని సాధించగలమనీ, మన లక్ష్యాన్ని సాధించడం ద్వారా మాత్రమే సోవియట్, సోషలిస్టు, వగైరా, వగైరా పేరుకు నిజంగా యోగ్యమైన రిపబ్లిక్కును మనం సృష్టిస్తామనీ నాకు దృఢ విశ్వాసం కలిగింది.

నా మొదటి వ్యాసం ('కార్మిక, కర్షక తనిఖీని మనం ఎలా పునర్వ్యవస్థీకరించాలి?') లో ఉదాహరణ రూపంలో నేను ఉటంకించిన అంకెలు మరీ స్వల్పంగా వున్నాయని చాలామంది పాఠకులు బహుశా అనుకొని వుంటారు. అవి మరీ స్వల్పంగా వున్నాయని రుజువుచేయడానికి చాలా గణనలు చేయవచ్చునని నాకు విశ్వాసం వుంది. కానీ మనం అలాంటివీ, యితరవీ అయిన గణనలన్నిటికంటె ఒక విషయాన్ని మిన్నగా పెట్టాలి: నిజంగా ఆదర్శప్రాయమైన నాణ్యతను పొందాలనే మన కోరికను.

మన రాజ్య యంత్రాంగాన్ని మెరుగుపరచడానికి మనం మనస్ఫూర్తిగా కృషి చేయవలసిన సమయం చివరకు వచ్చిందని నేను అనుకుంటాను; ఈ విషయంలో తొందరపాటుకంటె హానికరమైనది ఏదీ వుండజాలదు. అందుకనే, అంకెలను

ఉబికించడానికి వ్యతిరేకంగా గట్టి హెచ్చరిక చేయాలని వుంది నాకు. నా అభిప్రాయంలో, దీనికి విరుద్ధంగా, ఈ విషయంలో అంకెలను మరీ మితంగా యివ్వాలి. ప్రస్తుతం 'కార్మిక కర్షక తనిఖీ' యొక్క ప్రజా కమిస్సారియట్‌కు కించిత్తు అర్హత కూడా లేదని మనం నిర్మొగమాటంగా చెప్పుదాం. మన 'కార్మిక కర్షక తనిఖీ' కంటె అధ్వాన్నంగా ఏ యితర సంస్థలూ నిర్మింపబడలేదనీ, ప్రస్తుత పరిస్థితుల్లో ఈ ప్రజా కమిస్సారియట్ నుండి యేమీ ఆశించలేమనీ అందరికీ తెలుసు. ఈ విషయాన్ని మనం స్థిరంగా మనసులో పెట్టుకోవాలి – ప్రథమంగా, ఆదర్శప్రాయమైన సంస్థగా వుండేదీ, ద్వితీయంగా, ప్రతివొక్కరి నిరవధిక విశ్వాసాన్ని చూరగొనేదీ, తృతీయంగా, అంత ఉన్నత స్థాయిలో వుంచబడిన కేంద్ర కంట్రోల్ కమీషన్ లాంటి సంస్థయొక్క పనిని మనం నిజంగా సమర్థించినామని అన్ని రకాల మనుషులకూ రుజువుచేసేది అయిన సంస్థను కొద్ది సంవత్సరాల లోపల సృష్టించాలని మనం నిజంగా కోరితే, నా అభిప్రాయంలో, ఆఫీసు సిబ్బందుల పరిమాణాల గురించిన సాధారణ అంకెల నన్నిటినీ మనం తక్షణం, తిరుగులేకుండా నిరాకరించాలి. ప్రత్యేక జాగ్రత్తతో, అత్యంత కచ్చితమైన పరీక్షల ఆధారంమీద మాత్రమే మనం 'కార్మిక కర్షక తనిఖీ'కి ఉద్యోగులను యెన్నుకోవాలి. నిజంగా, ఎలా బడితే అలా పని సాగిస్తూ, కించిత్తు విశ్వాసం కూడా చూరగొనకుండా, తన మాటకు దాదాపు ఏమీ విలువలేకుండా వుండే ప్రజా కమిస్సారియట్‌ను నెలకొల్పడం వల్ల ప్రయోజన మేమిటి? యిప్పుడు మన మనసులో వున్న పునర్నిర్మాణపు పనిని ప్రారంభించడంలో మన ప్రధాన లక్ష్యం దీనినంతటినీ పరిహరించడమని అనుకుంటాను.

కేంద్ర కంట్రోల్ కమీషన్ సభ్యులుగా మనం కూర్చుకునే కార్మికులు అనింద్యులైన కమ్యూనిస్టులుగా వుండాలి. వాళ్లకు తమ పని పద్ధతులనూ, లక్ష్యాలనూ నేర్పించడానికి యింకా చాలా కృషి చేయవలసి వుందనుకుంటాను. అంతేగాక, ఈ పనిలో తోడ్పడడానికి నిశ్చితమైన సంఖ్యలో కార్యదర్శులు వుండాలి: ఆ పదవులకు నియమించే ముందు వాళ్లను త్రిముఖ పరీక్షకు గురిచేయాలి. చివరి విషయం, అసాధారణ సందర్భాలలో 'కార్మిక కర్షక తనిఖీ' ఉద్యోగులుగా మనం నేరుగా అంగీకరించేవాళ్లు ఈ కింది అవసరాలకు అనుగుణంగా వుండాలి:

మొదటిది, వాళ్ళు కొంతమంది కమ్యూనిస్టుల చేత సిఫారస్ చేయబడాలి;

రెండవది, మన రాజ్య యంత్రాంగం గురించిన జ్ఞానంలో పరీక్ష నెగ్గాలి;

మూడవది, మన రాజ్య యంత్రాంగ సిద్ధాంతపు మౌలిక సూత్రాలలోనూ, నిర్వహణ, ఆఫీసు రోజువారీ పనీ, వగైరాల మౌలిక సూత్రాలలోనూ వాళ్లు పరీక్ష నెగ్గాలి;

నాల్గవది, వాళ్లు కేంద్ర కంట్రోల్ కమీషన్ సభ్యులతోనూ, తమ సొంత

కార్యదర్శివర్గ సభ్యులతోనూ ఎంత గాఢ సుసమన్వయంతో పనిచేయాలంటే, మొత్తం యంత్రాంగపు పనికి మనం హామీ యిచ్చేటంతగా.

ఈ అవసరాలు అసాధారణమైనంత కఠినంగా వున్నాయని నాకు తెలుసు; 'కార్మిక – కర్షక తనిఖీ'లోని "ఆచరణవాద" కార్మికులలో మెజారిటీ ఈ అవసరాలు అనాచరణీయమని అంటారని, లేదా వాటిని అవహేళన చేస్తారని నాకు చాలా భయంగా వుంది. కానీ, 'కార్మిక కర్షక తనిఖీ' యొక్క ప్రస్తుత అధిపతులలో యెవరినైనా, లేక ఆ సంస్థతో సంబంధం గల ఎవరినైనా నేను అడుగుతాను, 'కార్మిక కర్షక తనిఖీ'లాంటి ప్రజా కమిస్సారియట్ వల్ల ప్రయోజనాన్ని చిత్తశుద్ధితో నాకు చెప్పగలరా అని. తమ యుక్తాయుక్త జ్ఞానాన్ని తిరిగి పొందడానికి వాళ్లకు ఈ ప్రశ్న తోడ్పడుతుందని అనుకుంటాను. 'కార్మిక కర్షక తనిఖీ' అనే ఈ నిరాశమయ వ్యవహారానికి మనం చేసిన అనేక పునర్నిర్మాణాలకు మరొకటి కలపడం నిష్ప్రయోజనం అవుతుంది. లేదా నిజంగా ఆదర్శప్రాయమైనదాన్ని, తన పేరు వలనా, పదవి వలనా కాక, తన యోగ్యతలవలన అందరి గౌరవాన్ని చూరగొనేదాన్ని, కష్టమైన, అసాధారణమైన, నిదానపు పద్ధతులద్వారా, ఈ పద్ధతులను పదేపదే పరీక్షించడం ద్వారా సృష్టించడానికి నిజంగా పూనుకోవాలి.

మనం ఓర్పు వహించకపోతే, మనం ఈ కర్తవ్యానికి కొన్ని సంవత్సరాలు వినియోగించకపోతే, దీనిని మనం అసలు చేపట్టక పోవడం మేలు.

మనం యెంతో తొందరపాటుతో నిర్మించిన శ్రమ పరిశోధనకు చెందిన ఉన్నత సంస్థలూ, వగైరాలను, నా అభిప్రాయంలో, కనీస సంఖ్యలో ఏరుకొని, అవి సక్రమంగా నిర్మించబడినాయా లేదా అని చూసి, అవి పనిచేయడం కొనసాగించనివ్వాలి -- కానీ ఆధునిక శాస్త్రపు ఉన్నత ప్రమాణాలకు అనుగుణంగానూ, దాని ప్రయోజనాల నన్నిటినీ మనకు యిచ్చేటట్లుగానూ. మనం ఆ పని చేస్తే, తన కర్తవ్యాలను సక్రమంగా నిర్వహించగలదీ, మన రాజ్య యంత్రాంగాన్ని మెరుగుపరచడానికి క్రమపద్ధతిగా, స్థిరంగా పనిచేయగలదీ అయిన సంస్థ, కార్మికవర్గం యొక్కా, రష్యన్ కమ్యూనిస్టు పార్టీ యొక్కా, మన రిపబ్లిక్ ప్రజానీకమంతటి యొక్కా విశ్వాసంచేత బలపరచబడిన సంస్థ, మనకు కొద్ది యేండ్లలో వుంటుందని ఆశించడం ఊహాస్వర్గం కాదు.

దీనికి సన్నాహక చర్యలు వెంటనే ప్రారంభించవచ్చు. 'కార్మిక కర్షక తనిఖీ' యొక్క ప్రజా కమిస్సారియట్ ప్రస్తుత పునర్నిర్మాణ పథకాన్ని అంగీకరిస్తే, అది వెంటనే సన్నాహక చర్యలు తీసుకొని, కర్తవ్యం పూర్తి అయిందాకా క్రమపద్ధతిగా పనిచేయవచ్చు, తొందరపాటు లేకుండా, యిప్పటికే చేసినదానిని మార్చడానికి వెనుకాడకుండా.

అర్ధ పరిష్కారం ఏదైనా ఈ విషయంలో అత్యంత హానికరంగా వుంటుంది.

‘కార్మిక కర్షక తనిఖీ’ సిబ్బంది పరిమాణానికి ఏ యితర పరిగణన మీదనైనా ఆధారపడిన చర్య, వాస్తవంలో, పాత బ్యూరాక్రటిక్ పరిగణనల మీదా, పాత దురభిప్రాయాల మీదా, యిప్పటికే అభిశంసింపబడినదీ, సార్వత్రికంగా అపహసింపబడినదీ, వగైరా అయినదాని మీదా ఆధారపడుతుంది.

విషయం యొక్క సారాంశం యిది:

రాజ్య నిర్మాణం గురించి మనం నిజంగా కొంత నేర్చుకున్నామనైనా యిప్పుడు రుజువు చేయాలి (అయిదేండ్లలో మనం ఏదో కొంత నేర్చుకొని వుండాలి), లేదా మనం దానికి తగినంత పరిణతి చెందలేదనైనా రుజువుచేయాలి. రెండవది నిజమైతే, ఆ కర్తవ్యానికి మనం పూనుకోకపోవడం మేలు.

లభ్యమైన మానవ సంపదతో కనీసం ఒక ప్రజా కమిస్సారియట్‌నైనా క్రమపద్ధతిగా పునర్నిర్మించగలగడానికి చాలినంత మనం నేర్చుకున్నామని అనుకోవడం అవినమ్రత కాదని అనుకుంటాను. నిజం, ఈ ఒక్క ప్రజా కమిస్సారియట్ మొత్తం మన రాజ్య యంత్రాంగానికి నమూనాగా వుండవలసి వుంటుంది.

సాధారణంగా శ్రమ నిర్మాణం మీదా, ప్రత్యేకంగా నిర్వహణ మీదా రెండు గానీ, ఎక్కువ గానీ టెక్స్టు బుక్కుల రచనలో మనం వెంటనే ఒక పోటీని ప్రకటించాలి. యెర్మాన్స్కి చేత యిప్పటికే ప్రచురింపబడిన పుస్తకాన్ని మనం ఆధారంగా తీసుకోవచ్చు-- అతను స్పష్టంగా మెన్షివిజంపట్ల సానుభూతి కలిగివున్నాడనీ, సోవియట్ వ్యవస్థకు టెక్స్టు బుక్కులు రచించడానికి తగడనీ చెప్పవలసి వున్నప్పటికీ. కేర్జెన్‌త్సెవ్‌యొక్క యిటీవలి పుస్తకాన్ని (శీర్షిక ‘వ్యవస్థీకరణ సూత్రాలు’) కూడా మనం ఆధారంగా తీసుకోవచ్చు; లభ్యమయ్యే యితర పాక్షిక టెక్స్టు బుక్కులలో కూడా కొన్ని ఉపయోగకరంగా వుండవచ్చు.

సాహిత్యాన్ని పోగుచేయడానికీ, ఈ సమస్యను అధ్యయనం చేయడానికీ మనం విద్యాయోగ్యతలూ, చిత్తశుద్ధీ గల కొంతమందిని జర్మనీకి గానీ, బ్రిటన్‌కు గానీ పంపాలి. నేను బ్రిటన్ అంటున్నది, అమెరికాకు గానీ, కెనడాకు గానీ మనుషులను పంపడానికి సాధ్యం కాని పక్షంలో.

‘కార్మిక కర్షక తనిఖీ’లో ఉద్యోగులుగా చేరేవాళ్లకు పరీక్షలు పెట్టడానికి ప్రాథమిక కార్యక్రమం తయారు చేయడానికి మనం ఒక కమీషన్‌ను నియమించాలి; కేంద్ర కంట్రోల్ కమీషన్ అభ్యర్థులకు కూడా అలాగే.

ఈ చర్యలూ, యిలాంటివీ, సహజంగానే, ‘కార్మిక కర్షక తనిఖీ’ యొక్క ప్రజా కమిస్సార్‌కు గానీ, కొలీజియంకు గానీ, కేంద్ర కంట్రోల్ కమీషన్ అధ్యక్షవర్గానికి గానీ ఏమీ కష్టాలు కలిగించవు.

అదే సమయంలో, కేంద్ర కంట్రోల్ కమీషన్ సభ్యత్వానికి అభ్యర్థులను యెన్నుకోడానికి ఒక సన్నాహక కమీషన్‌ను నియమించాలి. అన్ని ప్రభుత్వ శాఖలలోనూ అనుభవంగల కార్మికులనుండీ, అలాగే సోవియట్ ఉన్నత పాఠశాలల విద్యార్థులనుండీ ఈ సభ్యత్వానికి అవసరమైనంతకంటె ఎక్కువమందిని యిప్పుడు మనం కనుక్కోగలమని నేను ఆశిస్తున్నాను. పై రెండు వర్గాలలో ఏ వర్గాన్నైనా ముందుగానే మినహాయించడం ఉచితంగా వుండదు. బహుశా ఈ సంస్థలో సమ్మిళిత నిర్మాణానికి మొగ్గు చూపవలసి వుంటుంది; అందులో అనేక లక్షణాలూ, పోలికలేని యోగ్యతలూ కలిసివుండాలి. పర్యవసానంగా, అభ్యర్థుల పట్టీ తయారుచేయడానికి బోలెడు పని చేయవలసి వుంటుంది. ఉదాహరణకు, కొత్త ప్రజా కమిస్సారియట్ సిబ్బందిలో ఒకే రకం మనుషులు -- ప్రభుత్వోద్యోగులు మాత్రమే అనుకుందాం -- వుండడం గానీ, ప్రచారక రకానికి చెందినవాళ్లను, లేదా పదిమందిలో కలవడం, ఈ రంగంలో ప్రభుత్వోద్యోగులకు పూర్తిగా ఆనవాయితీ కాని బృందాలలోకి చొచ్చుకుపోయే సామర్థ్యం, వగైరా ప్రధాన గుణంగా గలవాళ్లను అందులోనుండి మినహాయించడం గానీ అన్నిటికంటె తక్కువ అభిలషణీయంగా వుంటుంది.

❊ ❊ ❊

నా పథకాన్ని అకడెమిక్ సంస్థల పథకంతో పోలిస్తే, నా భావాన్ని అత్యుత్తమంగా వ్యక్తం చేయగలననుకుంటాను. కేంద్ర కంట్రోల్ కమీషన్ సభ్యులు, తమ అధ్యక్షవర్గం యొక్క మార్గదర్శకత్వంకింద, పొలిటికల్ బ్యూరో కాగితాలనూ, పత్రాలనూ అన్నిటినీ క్రమపద్ధతిగా పరీక్షించాలి. అంతేగాక, వాళ్లు అతి చిన్న, సొంత యాజమాన్యపు ఆఫీసులు మొదలుకొని అత్యంత పెద్ద ప్రభుత్వ సంస్థల దాకా వున్న మన సంస్థల రోజువారీ పనిని పరిశీలన చేయడంలోని వివిధ పనుల మధ్య తమ కాలాన్ని సరిగా విభజించుకోవాలి. చివరి విషయం, వాళ్ల కర్తవ్యాలలో సిద్ధాంత అధ్యయనమూ -- అనగా, తాము అంకితం కాదలచుకొన్న పని యొక్క యేర్పాటుకు సంబంధించిన సిద్ధాంతపు అధ్యయనమూ -- పాత కామ్రేడ్ల యొక్క లేదా శ్రమ నిర్మాణపు ఉన్నత విద్యా సంస్థల అధ్యాపకుల యొక్క మార్గదర్శకత్వం కింద ఆచరణాత్మక పనీ యిమిడివుండాలి.

కానీ, యిలాంటి అకడెమిక్ పనికి వాళ్లు పరిమితం కాగలరని నేను అనుకోవడం లేదు. దీనికి తోడు, దొంగ వెధవలను అని అనను గానీ, అలాంటివాళ్లను పట్టుకోడానికీ, వాళ్ల చర్యలూ, ధోరణీ, వగైరాలనూ పరీక్షించడానికి ప్రత్యేకమైన పన్నాగాలు పన్నడానికీ తర్ఫీదు అని దేనిని పిలవడానికి నేను వెనుకాడనో ఆ పనికి వాళ్లు తయారుకావలసి వుంటుంది.

పశ్చిమ యూరోపియన్ ప్రభుత్వ సంస్థలలో యిలాంటి ప్రతిపాదనలు చేస్తే, అవి తీవ్రమైన నిరసనా, నైతిక ఆగ్రహమూ, వగైరాలను కలిగిస్తాయి; కానీ అలాంటివి చేతనయ్యేటంత బ్యురాక్రటిక్‌గా మనం తయారుకాలేదని నమ్ముతున్నాను. ఎవరినైనా పట్టుకోవడం అనే భావానికి మనలో ఎవరైనా నిర్ఘాంతపడేటంతగా నూతన ఆర్థిక విధానం యింకా గౌరవాన్ని పొందలేదు. మన సోవియట్ రిపబ్లిక్ ఎంత ఇటీవలి నిర్మాణమంటే, చుట్టూ ఇంకా పాత పనికిరాని సామాను గుట్టలు యెంతవి వున్నాయంటే, పన్నాగాల ద్వారానూ, ఒకోసారి సుదూరపు మూలాలకో, చుట్టుదారిలోనో ప్రయోగింపబడే దర్యాప్తుల ద్వారానూ మనం వాటిలోకి దూరవలసి వుంటుందనే భావానికి నిర్ఘాంతపడాలని యెవరికీ తోచదు. దీనికి నిర్ఘాంతపడాలని ఎవరికైనా తోస్తే కూడా, అలాంటివాడు నవ్వులపాలౌతాడని నిశ్చయంగా చెప్పవచ్చు.

ఫ్రెంచివాళ్లు pruderie అనేదాన్ని, అనగా అపహాస్యకరమైన పెద్దమనిషి భంగిమను, లేదా అపహాస్యకరమైన ఆడంబరాన్ని, మనల్ని పూర్తిగా సోవియట్ బ్యురాక్రసీ కిందికీ, పార్టీ బ్యురాక్రసీకిందికీ లాక్కుపోయేదాన్ని, మన కొత్త 'కార్మిక కర్షక తనిఖీ' విసర్జిస్తుందని ఆశిద్దాం. సోవియట్ సంస్థలలోనే కాక మన పార్టీ సంస్థలలో కూడా బ్యురాక్రట్లు వున్నారని చెప్పాలి.

ఉన్నత శ్రమ నిర్మాణపు విద్యా సంస్థల్లోనూ, వగైరాలలో మనం అధ్యయనం చేయాలనీ, కష్టపడి అధ్యయనం చేయాలనీ నేను పైన అన్నప్పుడు, పాఠశాల పద్ధతిలో "అధ్యయనం చేయాలని" నేను అనుకోనేలేదు, పాఠశాల పద్ధతిలో మాత్రమే చేసే అధ్యయనానికి నేను పరిమితం కాలేదు కూడా. "అధ్యయనం"లో ఏవైనా అర్ధ హాస్యకరమైన జిత్తులూ, కుయుక్తితో కూడిన పన్నాగాలూ, టక్కరితనమూ, లేదా అలాంటిదీ కలిసివుంటాయని గ్రహించడానికి ఈ సందర్భంలో నేను నిరాకరిస్తానని నిజమైన విప్లవకారుడొక్కడు కూడా అనుమానించడని నేను ఆశిస్తున్నాను. నిబ్బరపు, నిష్ఠాపూర్వక పశ్చిమ యూరప్ రాజ్యాలలో అలాంటి భావం మనుషులను నిర్ఘాంతపరుస్తుందనీ, మర్యాదస్తుడైన ప్రభుత్వోద్యోగి యెవ్వడూ దీనిని మనసులోకి కూడా రానివ్వడనీ నాకు తెలుసు. అయినప్పటికీ, మనమింకా అంత బ్యురాక్రటిక్‌గా తయారుకాలేదనీ, మన మధ్య దీనిమీద చర్చ వినోదాన్ని తప్ప, అంతకు మించిన దానిని కలిగించదనీ ఆశిస్తున్నాను.

నిజంగా, ఉపయోగంతో ఆహ్లాదాన్ని ఎందుకు కలపకూడదు? ఏదైనా అపహాస్యకరమైనదానిని, హానికరమైనదానిని, అర్ధ అపహాస్యకరమైనదానిని, అర్ధ హానికరమైనదానిని, వగైరాను గుట్టు కడగడానికి ఏదైనా హాస్యకరమైన, లేదా అర్ధ హాస్యకరమైన జిత్తుకు మనం ఎందుకు దిగకూడదు?

మన 'కార్మిక కర్షక తనిఖీ' ఈ భావాలను పరిశీలించడానికి పూనుకుంటే, అది ఎంతో లాభపడుతుందనీ, మన కేంద్ర కంట్రోల్ కమీషనూ, 'కార్మిక కర్షక తనిఖీ'లోని దాని సహోద్యోగులూ తమ అత్యంత ఉజ్వల విజయాలలో కొన్నిటిని సాధించిన సందర్భాల పట్టీ మన భావి 'కార్మిక కర్షక తనిఖీ' యొక్కా, కేంద్ర కంట్రోల్ కమీషన్ యొక్కా సభ్యులు పెద్ద మనిషి తరహాలో వున్న నిబ్బరమైన టెక్స్టు బుక్కులలో ప్రస్తావించరాని సందర్భాలలో సాధించే అనేక విజయాలచేత సంపన్నం చేయబడుతుందనీ నాకు అనిపిస్తుంది.

*    *    *

ఒక పార్టీ సంస్థ ఒక సోవియట్ సంస్థతో ఎలా సమ్మేళనం చేయబడగలదు? ఈ సూచనలో ఏదో అనుచితమైనది లేదా?

ఈ ప్రశ్నలు నేను నా తరపున అడగడం లేదు; మన పార్టీ సంస్థలలోనూ, అలాగే సోవియట్ సంస్థలలోనూ బ్యురాక్రట్లు వున్నారని నేను అన్నప్పుడు పైన నేను యెవరిని ఉద్దేశించినానో వాళ్ల తరపున అడుగుతున్నాను.

కానీ, నిజంగా, మన పనికి ప్రయోజనకరంగా వుంటే, ఆ రెంటినీ మనం ఎందుకు సమ్మేళనం చేయకూడదు? మొట్టమొదటనే అలాంటి సమ్మేళనం జరిగిన విదేశ వ్యవహారాల ప్రజా కమిస్సారియట్ విషయంలో అది చాలా ఉపయోగకరంగా వుండడం మన కందరికీ కనపడడం లేదా? విదేశాల "యెత్తు"లకు ప్రతిగా, వాళ్ల కుయుక్తిని (అంతకంటె తక్కువ మర్యాదకరమైన పదం మనం ఉపయోగించ రాదని అనుకుంటే) ముందుగానే అరికట్టడానికి, మనం వేయవలసిన "యెత్తు"లకు సంబంధించిన అనేక ముఖ్య, అముఖ్య సమస్యలను పొలిటికల్ బ్యూరో పార్టీ దృక్కోణంనుండి చర్చించదా? ఒక సోవియట్ సంస్థను ఒక పార్టీ సంస్థతో చేసిన ఈ పట్టువిడుపులు గల సమ్మేళనం మన రాజకీయాలలో గొప్ప బలం యివ్వడం లేదా? ఏదీ తన ఉపయోగకరత్వాన్ని రుజువుచేసుకున్నదో, ఏది మన విదేశ రాజకీయాలలో నిశ్చయంగా అవలంబించబడి, ఈ రంగంలో ఇక ఎంత మాత్రమూ సందేహం కలిగించనంతగా ఆనవాయితీ అయిందో, అది మొత్తం మన రాజ్య యంత్రాంగానికి కనీసం అంతే ఉచితంగా వుంటుందని అనుకుంటాను. (ఇంకా ఎక్కువ ఉచితంగా వుంటుందని, వాస్తవంలో నేను అనుకుంటాను.) 'కార్మిక కర్షక తనిఖీ' కర్తవ్యాలు మొత్తం మన రాజ్య యంత్రాంగానికి వర్తిస్తాయి; దాని కార్యకలాపాల ప్రభావానికి మినహాయింపు లేకుండా ప్రతి రాజ్య సంస్థా గురికావాలి: స్థానిక, కేంద్ర, వాణిజ్య, కేవల పరిపాలనాత్మక, విద్యావిషయిక, చారిత్రక పత్ర, నాటకశాల, వగైరా–ఒక్క మాటలో చెప్పాలంటే, మినహాయింపు లేకుండా అన్ని సంస్థలూ.

కనుక, దేని కార్యకలాపాలకు అంత విస్తృత పరిధి వుందో, అంతేగాక రూపాల

విషయంలో దేనికి అంత అసాధారణమైన పట్టు విడుపులు అవసరమో, అది ఒక పార్టీ కంట్రోల్ సంస్థను ఒక సోవియట్ కంట్రోల్ సంస్థతో కలిపే ఈ విశిష్టమైన సమ్మేళనాన్ని అవలంబించడానికి ఎందుకు అనుమతించకూడదు?

దీనికి అడ్డంకులేవీ నాకు కనపడడం లేదు. అంతేగాక, అలాంటి సమ్మేళనం ఒక్కటే మన పనిలో విజయానికి హామీ అనుకుంటాను. ఈ విషయంలో కలిగే సందేహాలన్నీ మన ప్రభుత్వ ఆఫీసులలో అన్నిటికంటె ఎక్కువగా బూజుపట్టిన మూలల్లో ఉత్పన్నమౌతున్నాయనీ, అపహాస్యానికి తప్ప మరి దేనికీ అవి తగవనీ నా భావన.

* * *

మరొక సందేహం: విద్యా కార్యకలాపాలను అధికారిక కార్యకలాపాలతో కలపడం ఉపయోగకరమా? అది ఉపయోగకరం మాత్రమే కాదు, అవసరం కూడా అనుకుంటాను. మొత్తంమీద, పశ్చిమ యూరోపియన్ రాజ్య రూపంపట్ల మనకు విప్లవకర వైఖరి వున్నప్పటికీ, వాటి అత్యంత హానికరమైన, అపహాస్యకరమైన దురభిప్రాయాలలో కొన్నిటిని మన రక్తంలోకి యెక్కనిచ్చినాము; వాటిని కొంతవరకు మన ప్రియమైన బ్యూరాక్రట్లు, ఈ దురభిప్రాయాలద్వారా పదేపదే లాభపడగలమని అంచనావేసుకున్న బ్యూరాక్రట్లు, ఉద్దేశ పూర్వకంగా మనలోకి యెక్కించినారు. ఈ దురభిప్రాయాల ద్వారా వాళ్లు లాభపడినారు కూడా; యెంత విస్తారంగా లాభపడినారంటే, మనలో గుడ్డివాళ్ళు మాత్రమే దానిని చూడలేరు.

యిది సహజమే; యెందుకంటే, అత్యంత ధైర్యపూరితమైన ముందడుగులు వేయబడింది చాలా కాలంగా సిద్ధాంత రంగంలో -- ఏది ప్రధానంగా సిద్ధాంతగతంగా, కేవలం సిద్ధాంతగతంగా కూడా, పెంపొందింపబడిందో ఆ రంగంలో. రష్యన్ వ్యక్తి, పనికి దూరంగా వున్నప్పుడు, నిరాశాకరమైన బ్యూరాక్రటిక్ వాస్తవాలను మరిచిపోడానికి అసాధారణ సాహసపూరిత సిద్ధాంత నిర్మాణాలలో ఊరట పొందేవాడు; అందువల్లనే మన దేశంలో ఈ అసాధారణ సాహసపూరిత నిర్మాణాలు అసాధారణమైనంత వంకరగా వుండినాయి. సాధారణ నిర్మాణాలలో సిద్దాంత సాహసమూ, రోజువారీ ఆఫీసు పనిలో అతిస్వల్ప సంస్కరణల విషయంలో అచ్చెరువు కలిగించేటంత పిరికితనమూ కలిసివుండినాయి. ఏ ఇతర దేశంలోనూ కనరాని సాటిలేని సాహసంతో ఒక గొప్ప సార్వత్రిక భూ విప్లవం రూపొందించబడింది; అదే సమయంలో, రోజువారీ ఆఫీసు పనిలో పదవ రకం సంస్కరణ రూపొందించవలసి వచ్చినప్పుడు ఊహాశక్తి విఫలమైంది. సాధారణ సమస్యలకు వర్తింపజేసినప్పుడు అంత "ఉజ్వలమైన" ఫలితాలు యిచ్చిన సాధారణ సూత్రాలను ఈ సంస్కరణకు వర్తింపజేయడానికి ఊహాశక్తి లేదా ఓర్పు లేకపోయింది.

అందువల్లనే, మన ప్రస్తుత జీవితంలో తెగించిన సాహసమూ, స్వల్ప మార్పుల విషయంలో కూడా ఆలోచనా రంగంలో పిరికితనమూ ఆశ్చర్యం కలిగించేటంతగా ఒకదానితో ఒకటి కలిసివున్నాయి.

నిజంగా గొప్ప విప్లవాలన్నిటిలోనూ యిది జరిగిందనుకుంటాను; ఎందుకంటే, ఒకవైపున పాతదానికీ, పాతదాని అభివృద్ధిని లక్షించేదానికీ, మరొకవైపున పాతదానిలోని అల్పాతి అల్ప అణువును కూడా కలిగివుండనంత కొత్తదిగా వుండవలసిన కొత్తదానికోసం చేసే మహా అభౌతికమైన ప్రయత్నానికీ మధ్య వుండే వైరుధ్యాలనుండి నిజంగా గొప్పవైన విప్లవాలన్నీ పెరుగుతాయి.

యిక, విప్లవం ఎంత తీవ్రంగా వుంటే, అంత దీర్ఘ కాలం వుంటాయి ఈ వైరుధ్యాలలో అనేకం.

* * *

మన ప్రస్తుత జీవితపు సాధారణ లక్షణం యిది: మనం పెట్టుబడిదారీ పరిశ్రమలను ధ్వంసం చేసి, మధ్యయుగ సంస్థలనూ, భూస్వాముల యాజమాన్యాన్నీ నేలమట్టం చేయడానికి మన శక్తి కొద్దీ కృషిచేసి, తద్వారా సన్నకారు, అతి సన్నకారు రైతాంగాన్ని సృష్టించినాము; ఈ రైతాంగం కార్మికవర్గ నాయకత్వాన్ని అనుసరిస్తున్నది, ఎందుకంటే దాని విప్లవ కృషి ఫలితాలలో దీనికి నమ్మకమున్నది. కానీ ఎక్కువ అభివృద్ధి అయిన దేశాలలో సోషలిస్టు విప్లవం జయించిందాకా కేవలం ఈ విశ్వాసం సహాయంతో నిలబడడం సులభం కాదు; ఎందుకంటే, ఆర్థిక అవశ్యకత, ముఖ్యంగా నూతన ఆర్థిక విధానంలో, సన్నకారు, అతి సన్నకారు రైతుల శ్రమయొక్క ఉత్పాదకతను అత్యంత హీన స్థాయిలో నిలిపివుంచుతుంది. అంతేగాక, అంతర్జాతీయ సన్నివేశం కూడా రష్యాను వెనక్కి తోసి, మొత్తంమీద ప్రజల శ్రమ ఉత్పాదకతను యుద్ధపూర్వంకంటె గణనీయంగా తక్కువ స్థాయికి తగ్గించింది. పశ్చిమ యూరోపియన్ పెట్టుబడిదారీ దేశాలు, కొంత ఉద్దేశపూర్వకంగానూ, కొంత తమకే తెలియకుండానూ, మనల్ని వెనక్కి తోయడానికీ, దేశంలో సాధ్యమైనంత వినాశనాన్ని వ్యాపింపజేయడానికి రష్యాలోని అంతర్యుద్ధ అంశాలను వినియోగించుకోడానికీ చేయవలసిందంతా చేసినాయి. సామ్రాజ్యవాద యుద్ధం నుండి బయటపడే ఈ మార్గానికే అనేక సౌకర్యాలు వుండినట్టు కనిపించింది. వాళ్లు కొంతమేరకు ఈ విధంగా తర్కించినారు; "రష్యాలోని సోషలిస్టు వ్యవస్థను మనం కూలదోయలేకపోతే, యేమైనప్పటికీ సోషలిజంవైపు దాని పురోగతిని అడ్డగిస్తాము." మరి, వాళ్ల దృక్పథంనుండి వాళ్లు మరేవిధంగానూ తర్కించజాలరు. చివరకు వాళ్ల సమస్యలు అర్ధపరిష్కృతమైనాయి. విప్లవం సృష్టించిన నూతన వ్యవస్థను వాళ్లు కూలదోయలేకపోయినారు; కానీ వాళ్లు ఏ

ముందడుగు సోషలిస్టుల జోస్యాలను రుజువుచేసి వుండేదో, ఏ ముందడుగు సోషలిస్టులు అపారమైన వేగంతో ఉత్పాదక శక్తులను అభివృద్ధి చేయడానికి, ఏవి మొత్తంగా కలిపితే సోషలిజంను ఉత్పత్తి చేసి వుండేవో ఆ గుప్తశక్తుల నన్నిటినీ అభివృద్ధి చేయడానికి వీలు కలిగించి వుండేదో ఆ ముందడుగు వెంటనే వేయకుండా ఆ నూతన వ్యవస్థను అడ్డగించినారు. ఆ గుప్తశక్తులు అభివృద్ధి అయివుంటే, సోషలిస్టులు అందరికీ రుజువు చేసివుండేవాళ్లు, బ్రహ్మాండమైన శక్తులను సోషలిజం తనలోనే కలిగివుందనీ, అసాధారణంగా ఉజ్వలమైన భవితవ్యం గల నూతన అభివృద్ధి దశలో మానవజాతి యిప్పుడు ప్రవేశించిందనీ.

యిప్పుడు ఏర్పడిన అంతర్జాతీయ సంబంధాల వ్యవస్థ ఎలాంటిదంటే, ఒక యూరోపియన్ రాజ్యమైన జర్మనీని విజేత రాజ్యాలు బానిసను చేసిన వ్యవస్థ యిది. అంతే కాక, అనేక రాజ్యాలు -- పశ్చిమ దేశాల్లో అత్యంత పురాతనమైనవి -- తమ విజయాన్ని వినియోగించుకొని తమ పీడిత వర్గాలకు అనేక చిల్లర సౌకర్యాలు కలిగించగల స్థితిలో వున్నాయి; ఆ సౌకర్యాలు చిల్లరవే అయినప్పటికీ, ఆ దేశాల్లో విప్లవోద్యమాన్ని మందగింపజేస్తాయి; "సామాజిక శాంతి" ఏర్పడిందన్న భ్రమను కొంత కలిగిస్తాయి.

అదే సమయంలో, సరిగ్గా గత సామ్రాజ్యవాద యుద్ధ ఫలితంగా, అనేక ప్రాచ్య దేశాలు - భారతదేశం, చైనా, వగైరాలు-తమ పాత గాడినుండి పూర్తిగా బయటికి నెట్టబడినాయి. వాటి అభివృద్ధి నిశ్చయంగా సాధారణ యూరోపియన్ పెట్టుబడిదారీ పద్ధతులకు మారింది, సాధారణ యూరోపియన్ అంతర్గత అస్తిమితం వాటికి అంటుకుంటున్నది. యావత్ ప్రపంచ పెట్టుబడిదారీ వ్యవస్థయొక్క సంక్షోభానికి విధిగా దారితీసి అభివృద్ధి ప్రక్రియలోకి అవి లాగబడినాయని యిప్పుడు సర్వ ప్రపంచానికీ స్పష్టమైంది.

కనుక, యిప్పుడు మనకొక ప్రశ్న ఎదురైంది: పశ్చిమ యూరోపియన్ పెట్టుబడిదారీ దేశాలు సోషలిజంవైపు తమ అభివృద్ధిని పూర్తి చేస్తూ వుండగా, మనం మన చిన్న రైతుల, అతి చిన్న రైతుల ఉత్పత్తిలో, అందులోనూ మన ప్రస్తుత సర్వనాశన స్థితిలో, నిలబడగలమా? కానీ ఆ దేశాలు మనం ముందు అనుకున్నట్లు తమ అభివృద్ధిని పూర్తి చేయడం లేదు. క్రమంగా సోషలిజం "పక్వం కావడం" ద్వారా అవి తమ అభివృద్ధిని పూర్తి చేయడం లేదు. కొన్ని దేశాలను మరికొన్ని దోపిడీ చేయడం ద్వారా, సామ్రాజ్యవాద యుద్ధంలో ఓడిపోయిన మొదటి దేశాన్నీ, మొత్తం ప్రాచ్య దేశాలనూ దోపిడీ చేయడం ద్వారా, అవి తమ అభివృద్ధిని పూర్తి చేస్తున్నాయి. మరోవైపున, సరిగ్గా మొదటి సామ్రాజ్యవాద యుద్ధ ఫలితంగానే, ప్రాచ్య దేశాలు నిశ్చయంగా విప్లవోద్యమంలో

కలిసినాయి, ప్రపంచ విప్లవోద్యమం అనే సార్వత్రిక సుడిగుండంలోకి నిశ్చయంగా లాక్కోబడినాయి.

ఈ సన్నివేశంలో మన దేశానికి తగిన ఎత్తుగడలు ఏమిటి? స్పష్టంగా యివి: మన కార్మిక ప్రభుత్వాన్ని నిలబెట్టుకోడానికీ, చిన్న రైతులమీదా, అతి చిన్న రైతులమీదా ఆ ప్రభుత్వం తన నాయకత్వాన్నీ, అర్హతనూ నిలుపుకునేటట్లు చేయడానికీ మనం అత్యంత జాగరూకత ప్రదర్శించాలి. మనకున్న సౌకర్యం ఏమిటంటే, యావత్ ప్రపంచమూ యిప్పటికే ప్రపంచ సోషలిస్టు విప్లవానికి దారితీయక తప్పని ఉద్యమంలోకి ప్రవేశిస్తున్నది. కానీ, మనకొక అసౌకర్యం కూడా వుంది. ఏమిటంటే: సామ్రాజ్యవాదులు మొత్తం ప్రపంచాన్ని రెండు శిబిరాలుగా చీల్చగలిగినారు; నిజంగా పురోగామి, సంస్కృతీ సంపన్న, పెట్టుబడిదారీ అభివృద్ధి గల దేశమైన జర్మనీకి మళ్లీ లేచి నిలబడడం అత్యంత కష్టంగా వుండడం అనే పరిస్థితి వల్ల ఈ చీలిక మరింత జటిలం చేయబడింది. పాశ్చాత్య పెట్టుబడిదారీ రాజ్యాలన్నీ దాన్ని పొడుచుకు తింటూ, లేవలేకుండా చేస్తున్నాయి. మరోవైపున, నరక యాతన అనుభవిస్తున్న కోటానుకోట్ల పీడిత శ్రమజీవులు గల ప్రాచ్య దేశాలు యావత్తూ ఎలాంటి స్థితిలోకి నెట్టబడినాయంటే, వాటి భౌతిక, పాదార్థిక శక్తి పశ్చిమ యూరోపియన్ రాజ్యాలలో చాలా చిన్నవాటిలో ఏ ఒక్కదాని భౌతిక, పాదార్థిక, సైనిక శక్తితోనూ పోల్చడానికి వీలులేదు.

ఈ సామ్రాజ్యవాద దేశాలతో రానున్న ఘర్షణను మనం నివారించగలమా? సంపన్నమౌతున్న ప్రాచ్య సామ్రాజ్యవాద దేశాలకూ సంపన్నమౌతున్న పాశ్చాత్య సామ్రాజ్యవాద దేశాలకూ మధ్యగల ఆంతరంగిక వైరుధ్యాలూ, ఘర్షణలూ మనకు రెండవసారి విరామం యిస్తాయని ఆశించవచ్చునా––ప్రాక్ పశ్చిమాల విప్లవ ప్రతీఘాతుల శిబిరంలో, ప్రాచ్య పాశ్చాత్య దోపిడీదారుల శిబిరంలో, జపాన్ అమెరికాల శిబిరంలో, అంతర్వైరుధ్యాల మూలంగా, రష్యన్ ప్రతీఘాత విప్లవానికి సహాయం యివ్వడానికి పశ్చిమ యూరోపియన్ ప్రతీఘాత విప్లవం చేసిన ప్రయత్నం భగ్నమైనప్పుడు మొదటిసారి విరామం లభించినట్లు?

దీనికి జవాబు చాలా చాలా విషయాలమీద ఆధారపడిందని చెప్పాలి. మొత్తం పోరాటం యొక్క పర్యవసానాన్ని ఎలా జోస్యం చెప్పగలుగుతున్నామంటే, దీర్ఘకాలం మీద భూమండలం మీది జనాభాలో అత్యధిక భాగానికి పెట్టుబడిదారీ వ్యవస్థే పోరాటానికి కావలసిన జ్ఞానమూ, శిక్షణా యిస్తున్నది గనుక.

రష్యా, ఇండియా, చైనా, వగైరా దేశాలలో ప్రపంచంలోని జనాభాలో అపారమైన మెజారిటీ వుందన్న విషయమే పోరాట ఫలితాన్ని నిర్ణయిస్తుంది, అంతిమ పరిశీలనలో. సరిగ్గా ఈ మెజారిటీయే గత కొద్ది సంవత్సరాలలో అసాధారణ వేగంతో విమోచన

పోరాటంలో ప్రవేశించింది; అందువల్ల ప్రపంచ పోరాటపు అంతిమ ఫలితం గురించి ఛాయా మాత్రమైన సందేహం కూడా వుండజాలదు. ఈ అర్థంలో, సోషలిజంయొక్క పరిపూర్ణ విజయం పూర్తిగా, నిర్నిబంధంగా నిశ్చితమౌతుంది.

కానీ మనకు ఆసక్తి గల విషయం సోషలిజంయొక్క విజయం అనివార్యమనేది కాదు. పశ్చిమ యూరోపియన్ విప్లవ ప్రతీఘాత రాజ్యాలు మనలను నలిపివేయకుండా వుండడానికి రష్యన్ కమ్యూనిస్టు పార్టీ అయిన మనం, రష్యా సోవియట్ ప్రభుత్వమైన మనం, అవలంబించవలసిన ఎత్తుగడలు ఏవీ అన్నదే. విప్లవ ప్రతీఘాత సామ్రాజ్యవాద పశ్చిమానికీ, విప్లవకర జాతీయవాద ప్రాచ్యానికీ మధ్య, ప్రపంచంలోకెల్ల అత్యంత నాగరికమైన దేశాలకూ, ప్రాచ్య ధోరణిలో వెనుకబడిన, కానీ మెజారిటీగా వున్న దేశాలకూ మధ్య జరుగనున్న సైనిక ఘర్షణ వరకూ మన ఉనికిని సందేహరహితం చేసుకోడానికి ఈ మెజారిటీ దేశాలు నాగరికం కావాలి. సోషలిజంలోకి నేరుగా పోవడానికి మనకు రాజకీయంగా అవసరమైనవన్నీ వున్నప్పటికీ, తగినంత నాగరికత లేదు. మనల్ని మనం రక్షించుకోవడానికి ఈ కింది విధానం అనుసరించాలి.

కార్మికులు రైతులమీద తమ నాయకత్వాన్ని నిలుపుకునే రాజ్యాన్ని, రైతుల విశ్వాసాన్ని నిలుపుకునే రాజ్యాన్ని, నిర్మించడానికి మనం కృషిచేయాలి; మిత వ్యయాన్ని అమలులో పెట్టడంద్వారా మన సాంఘిక సంబంధాలనుండి దుబారాను పూర్తిగా తొలగించివేయాలి.

మన రాజ్య యంత్రాంగాన్ని కనీస వ్యయం అయ్యేటట్లు కుదించాలి. జారిస్టు రష్యా నుండి, దాని బ్యూరాక్రటిక్ పెట్టుబడిదారీ యంత్రాంగంనుండి, మనకు దుబారా ఖర్చు చాలా వచ్చింది; ఆ లక్షణాలనన్నిటినీ మనం తొలగించాలి.

యిది రైతు సంకుచితత్వపు రాజ్యం కాబోదా?

కాదు; రైతాంగంమీద కార్మికవర్గం తన నాయకత్వాన్ని నిలుపుకునేటట్లు మనం జాగ్రత్తపడితే, మన దేశ ఆర్థిక జీవితంలో సాధ్యమైనంత ఎక్కువగా మితవ్యయం పాటించడంద్వారా, మనం మిగిలించే ప్రతి కోపెక్కునూ మన భారీ యంత్ర పరిశ్రమనూ, విద్యుదీకరణనూ అభివృద్ధి చేసుకోడానికీ, హైడ్రాలిక్ పద్ధతి ద్వారా పీటును తవ్వి తీయడానికీ, వొల్‌హొవ్‌స్త్రోయ్ (లెనిన్ గ్రాడ్ (ఇప్పుడు పీటర్స్‌బర్గ్) కి 120 కి.మీ దూరాన వున్న సోవియట్ యూనియన్‌లో మొదటి పెద్ద జల విద్యుచ్ఛక్తి స్టేషన్. దాని నిర్మాణం 1918లో ప్రారంభమై 1921లో అంతర్యుద్ధం ముగిసిన తరువాత పెద్ద ఎత్తున కొనసాగింది) నిర్మాణం పూర్తి చేయడానికీ, మొదలైన పనులకు వినియోగించగలం.

దీనిమీద, దీనిమీద మాత్రమే వుంది మన ఆశ. ఈ పని చేసినప్పుడు మాత్రమే

మనం, ఆలంకారికంగా చెప్పాలంటే, గుఱ్రాలు మార్చుకోగలం : రైతు బీదరికం అనే గుఱ్రాన్ని వదలి, ధ్వంసమైన వ్యవసాయ దేశానికి తగిన ఆర్థిక వ్యవస్థ అనే గుఱ్రాన్ని వదలి, కార్మిక వర్గం కోరుతున్న, కోరక తప్పని గుఱ్రానికి -- భారీ యంత్ర పరిశ్రమ, విద్యుదీకరణ, వొల్‌హొవ్‌స్త్రోయ్, వగైరాల గుఱ్రానికి -- మారగలం.

అదీ నేను పునర్నిర్మాణం చేయబడిన 'కార్మిక కర్షక తనిఖీ' యొక్క కర్తవ్యాలతో మన పని యొక్క, మన విధానం యొక్క, మన ఎత్తుగడల యొక్క, మన వ్యూహం యొక్క సాధారణ పథకాన్ని నా మనసులో ఎలా లంకె వేస్తున్నదీ. 'కార్మిక కర్షక తనిఖీ'ని అసాధారణమైన ఉన్నత స్థాయికి యెత్తడంలోనూ, కేంద్ర కమిటీ హక్కులతో దానికి నాయకత్వం యివ్వడంలోనూ, వగైరా, వగైరాలలోనూ మనం దానికి యివ్వవలసిన అసాధారణమైన జాగ్రత్తనూ, అసాధారణమైన శ్రద్ధనూ సమర్థించేది, నా అభిప్రాయంలో యిదే.

ఈ సమర్థన యేమిటంటే, మన ప్రభుత్వ యంత్రాంగాన్ని సమగ్రంగా ప్రక్షాళన చేయడం ద్వారా మాత్రమే, దానిలో పరమ అత్యవసరమైనది తప్ప ప్రతిదాన్నీ కనీస స్థాయికి కుదించడం ద్వారా మాత్రమే మనం నిలబడగలమని నిశ్చయంగా వుండడం. అంతేగాక, చిన్న రైతు దేశం స్థాయిలో కాక, సార్వత్రిక పరిమితి అనే స్థాయిలో కాక, భారీ యంత్ర పరిశ్రమలకు స్థిరంగా పురోగమించే స్థాయిలో మనం నిలబడగలం.

మన 'కార్మిక కర్షక తనిఖీ'ని గురించి నేను కనే ఉదాత్తమైన కలలు యివి. అందుకనే నేను దానికొరకు ఒక "మామూలు" ప్రజా కమిస్సారియట్‌తో అత్యంత అధికారయుత పార్టీ సంస్థ యొక్క సమ్మేళనం జరగడానికి పథకం వేస్తున్నాను.

మార్చి 2, 1923
'ప్రావ్దా' నం. 49
మార్చి 4, 1923
సంతకం: యన్. లెనిన్

# X

# పార్టీ మహాసభకు లేఖ

## I

యీ మహాసభలో మన రాజకీయ నిర్మాణంలో కొన్ని మార్పులు చేయాలని నేను గట్టిగా కోరుతున్నాను.

నేను అత్యంత ప్రాముఖ్యం యిచ్చే విషయాలు మీకు చెప్పాలనుకుంటున్నాను.

ప్రధానంగా, కొద్ది డజన్ల వరకు, వంద వరకు కూడా, కేంద్ర కమిటీ సభ్యుల సంఖ్యను పెంచడం. యీ సంస్కరణ లేకుండా, ఘటనల గతి మనకు అనుకూలంగా లేకపోతే (వుంటుందని మనం నమ్మకోలేము) కేంద్ర కమిటి గొప్ప ప్రమాదంలో పడుతుందని నా అభిప్రాయం.

తరువాత, నేను ప్రతిపాదించదలచుకొన్నది, కొన్ని షరతులమీద యీ మహాసభ ప్రభుత్వ ప్లానింగ్ కమిషన్ నిర్ణయాలకు శాసన బలం యివ్వాలని – యీ విషయంలో ట్రాట్స్కీ కోరికలను కొంత మేరకు, కొన్ని షరతులమీద తీరుస్తూ.

మొదటి అంశం గురించి, అనగా కేంద్ర కమిటీ సభ్యుల సంఖ్యను యెక్కువ చేయడం గురించి యేమిటంటే, కేంద్ర కమిటీ ప్రతిష్ఠను పెంచడానికీ, మన పరిపాలన యంత్రాంగాన్ని మెరుగుపరిచే పనిని కట్టుదిట్టంగా చేయడానికీ, కేంద్ర కమిటీలో చిన్న బృందాలమధ్య ఘర్షణలు పార్టీ భవిష్యత్తుకు హానికరమైనంత అమిత ప్రాముఖ్యం పొందకుండా అరికట్టడానికీ యీ పని తప్పక చేయాలని నేను అనుకుంటున్నాను.

కార్మికవర్గం నుండి 50 నుండి 100 దాకా కేంద్ర కమిటీ సభ్యులను డిమాండు చేసే హక్కు మన పార్టీకి వుందనీ, ఆ వర్గం యొక్క వనరులమీద మితిమీరిన భారం వేయకుండా ఆ వర్గం నుండి వాళ్లను మన పార్టీ పొందగలదనీ నాకు అనిపిస్తుంది.

అలాంటి సంస్కరణ మన పార్టీ యొక్క స్థిరత్వాన్ని గణనీయంగా పెంచి, శత్రు రాజ్యాల వలయంలో మన పార్టీ చేసే పోరాటాన్ని సులభం చేస్తుంది; నా అభిప్రాయంలో, యీ పోరాటం వచ్చే కొద్ది సంవత్సరాలలో యింకా యెంతో తీవ్రం అయ్యేటట్లు వుంది,

అయి తీరుతుంది. అలాంటి చర్య ద్వారా మన పార్టీ స్థిరత్వం వేయి రెట్లు పెరుగుతుందని నేను అనుకుంటున్నాను.

లెనిన్

డిసెంబర్ 23, 1922

యం.వి. చేత రాసుకోబడింది

II

నోట్సు కొనసాగింపు.

డిసెంబర్ 24, 1922

నేను పైన చెప్పిన కేంద్ర కమిటీ స్థిరత్వం అంటే నా అభిప్రాయం, చీలికకు వ్యతిరేకంగా చర్యలు, అసలు అలాంటి చర్యలు తీసుకోగలగడమంటూ వుంటే. యెందుకంటే 'రూస్కయ మీస్ల్' పత్రికలోని ఒక వైట్‌గార్డు (అతను యస్.యస్. ఓల్డెన్ బుర్గ్ అనుకుంటున్నాను), మొదటిది, సోవియట్ రష్యాకు వ్యతిరేకంగా వైట్‌గార్డులు ఆడిన ఆటలో అతను మన పార్టీలో చీలికను నమ్ముకోవడంలోనూ, రెండవది, ఆ చీలికను కలిగించడానికి మన పార్టీలో తీవ్ర విభేదాలను నమ్ముకోవడంలోనూ సరిగా వ్యవహరించినాడు.

మన పార్టీ రెండు వర్గాల మీద ఆధారపడుతున్నది; అందువలన, యీ రెండు వర్గాల మధ్యా అంగీకారం లేకపోతే, మన పార్టీ యొక్క అస్థిరత్వం సాధ్యమౌతుంది, దాని పతనం అనివార్యమౌతుంది. అలాంటి సందర్భంలో యే చర్య అయినా, సాధారణంగా మన కేంద్ర కమిటీ స్థిరత్వం గురించి మాట్లాడే మాటలన్నీ నిరర్థక మౌతాయి. అలాంటి సందర్భంలో యేవిధమైన చర్యలూ చీలికను నివారించలేవు. కానీ, యిప్పుడు దీనిని గురించి మాట్లాడడానికి యిది మరీ దూరాన వున్న భవిష్యత్తు అనీ, మరీ అప్రాయికమైన ఘటన అనీ ఆశిస్తున్నాను.

తక్షణ భవిష్యత్తులో చీలికకు వ్యతిరేకమైన హామీగా స్థిరత్వం నా మనసులో వున్నది; వ్యక్తిగత గుణాలను గురించి కొన్ని భావాలు యిక్కడ చెప్పాలనుకుంటున్నాను.

యీ దృష్ట్యా, స్టాలిన్, ట్రాట్స్కీ లాంటి కేంద్ర కమిటీ సభ్యులు స్థిరత్వ సమస్యలో ప్రధాన అంశాలు అనుకుంటున్నాను. వీళ్లిద్దరి మధ్య సంబంధాలు చీలిక ప్రమాదాన్ని కలిగించే కారణాలలో అధిక భాగంగా వున్నాయనుకుంటాను. యీ చీలికను నివారించవచ్చు; దీనిని నివారించడానికీ, యితర విషయాలతో పాటు, కేంద్ర కమిటీ సభ్యుల సంఖ్యను 50కి గానీ, 100కి గానీ పెంచడం ఉపయోగపడుతుందని నా అభిప్రాయం.

కామ్రేడ్ స్టాలిన్ జనరల్ సెక్రెటరీ అయినందువల్ల, అతని చేతుల్లో అపరిమితమైన అధికారం సాంద్రీకరింపబడివుంది. ఆ అధికారాన్ని తగినంత జాగ్రత్తతో. యెల్లప్పుడూ వినియోగించగల సామర్థ్యం అతనికి వుందని నాకు నమ్మకం లేదు. మరొకవైపున కామ్రేడ్ ట్రాట్స్కీ, వార్తా, రవాణాల ప్రజా కమిస్సారియట్ సమస్య మీద కేంద్ర కమిటీతో అతను చేసిన పోరాటంలో వ్యక్తమైనట్లు, విలక్షణుడైనది అసాధారణ సామర్థ్యంచేతనే కాదు. వ్యక్తిగతంగా అతను బహుశా ప్రస్తుత కేంద్ర కమిటీలో అందరికంటె సమర్థుడు; కానీ అతను మితిమీరిన ఆత్మవిశ్వాసం ప్రదర్శించినాడు, పనిలో కేవల పరిపాలన (administrative) పార్శ్వంపట్ల మితిమీరిన మగ్నత కనబరిచినాడు.

ప్రస్తుత కేంద్ర కమిటీలోని యిద్దరు ప్రముఖ నాయకుల యీ రెండు గుణాలు అనుద్దిష్టంగా చీలికకు దారితీయ గలవు; దీనిని నివారించడానికి మన పార్టీ చర్యలు తీసుకోకపోతే, చీలిక అకస్మాత్తుగా రావచ్చు.

కేంద్ర కమిటీలోని యితర సభ్యుల వ్యక్తిగత గుణాలమీద అంచనాలు యింతకు మించి నేను యివ్వను. ఒకటి మాత్రం జ్ఞాపకం చేస్తాను -- జినొవీవ్, కామెనెవ్‌ల అక్టోబరు ఘటన, సహజంగానే, యాదృచ్ఛిక ఘటన కాదు, కానీ దానికి వాళ్ళమీద వ్యక్తిగతంగా నేరం వేయలేము, ట్రాట్స్కీ మీద నాన్‌బోల్షివిజం అనే నేరం వేయలేనట్లే.

కేంద్ర కమిటీలోని యువ సభ్యుల విషయంలో, బుహారిన్‌ను గురించీ, ప్యతకోవ్‌ను గురించీ కొద్ది మాటలు చెప్పదలచుకున్నాను. నా అభిప్రాయంలో వాళ్ళు అత్యంత అసాధారణ వ్యక్తులు (అందరికంటె చిన్నవాళ్ళలో); వాళ్లను గురించి యీకింది విషయం జ్ఞాపకం వుంచుకోవాలి: బుహారిన్ పార్టీలో అత్యంత విలువైన, ప్రముఖ సిద్ధాంతవేత్త మాత్రమే కాదు, అతను సముచితంగానే మొత్తం పార్టీకి అభిమాన పాత్రుడుగా పరిగణింపబడుతున్నాడు, కానీ అతని సిద్ధాంత అభిప్రాయాలు పెద్ద పరిమితులతో మాత్రమే పూర్తి మార్క్సిస్టు అభిప్రాయాలుగా వర్గీకరింపబడగలవు; యెందుకంటే అతనిలో పండితుల తత్వం కొంత వుంది (అతను పరస్పరవాదం యెన్నడూ అధ్యయనం చేయలేదు; అది అతనికి యెన్నడూ పూర్తిగా అర్థం కాలేదనుకుంటాను).

డిసెంబర్ 25. ప్యతకోవ్ విషయం యేమంటే, నిస్సందేహంగా అతను అసాధారణమైన దృఢ సంకల్పమూ, అసాధారణమైన సామర్థ్యమూ గలవాడు, కానీ పరిపాలన చేయడానికీ, పనిలో పరిపాలన పార్శ్వంపట్లా యెంత ఉబలాటం చూపిస్తాడంటే, గురుతరమైన రాజకీయ వ్యవహారంలో అతనిమీద మనం ఆధారపడలేనంతగా.

యీ అభిప్రాయ ప్రకటనలు రెండూ, సహజంగానే, ప్రస్తుతానికి మాత్రమే చేయబడినాయి, కర్తవ్య నిష్ఠ గల యీ అసాధారణ కార్యకర్తలు యిద్దరూ తమ జ్ఞానాన్ని

వృద్ధిచేసుకోడానికీ, తమ ఏకముఖత్వాన్ని సవరించుకోడానికీ ప్రయత్నం చేస్తారనే ఊహతో.

లెనిన్

డిసెంబర్ 25, 1922

యం.వి.చేత రాసుకోబడింది

**1922 డిసెంబర్ 24 లేఖకు చేర్పు :**

స్టాలిన్ మరీ మొరటు; యీ లోపం మన మధ్యలోనూ, కమ్యూనిస్టులమైన మనతో జరిపే వ్యవహారాలలోనూ యెంతో సహించదగినది అయినప్పటికీ, జనరల్ సెక్రెటరీలో సహించరాని దవుతుంది. అందుకని ఆ పదవినుండి స్టాలిన్‌ను తొలగించి అతని బదులు మరొక వ్యక్తిని నియమించడం గురించి కామ్రేడ్లు ఆలోచించాలని నా సూచన; ఆ మరొక వ్యక్తి యెక్కువ సహనమూ, కామ్రేడ్లపట్ల యెక్కువ చిత్తశుద్ధీ, మర్యాదా, సుహృద్భావమూ, చపల చిత్తత లేకపోవడం వగైరాలు కలిగివుండడం అనే సౌకర్యంద్వారా స్టాలిన్‌కంటె భిన్నంగా వుండాలి. యీ విషయం తృణప్రాయమైన వివరంగా కనిపించవచ్చు. కానీ చీలికకు వ్యతిరేకంగా తీసుకునే రక్షణ చర్యల దృష్ట్యానూ, స్టాలిన్‌కూ, ట్రాట్స్కీకీ గల సంబంధం గురించి పైన నేను రాసినదాని దృష్ట్యానూ యిది స్వల్ప వివరం కాదు, లేదా నిర్ణయాత్మకమైన ప్రాముఖ్యం వహించగల స్వల్ప వివరం.

లెనిన్

యల్.యఫ్.చేత రాసుకోబడింది

జనవరి 4, 1923

## III

నోట్సు కొనసాగింపు.

డిసెంబర్ 26, 1922

కేంద్ర కమిటీ సభ్యుల సంఖ్యను 50కి గానీ, 100కి గానీ పెంచడం, నా అభిప్రాయంలో, రెండు ప్రయోజనాలు, మూడు ప్రయోజనాలు కూడా సాధిస్తుంది: కేంద్ర కమిటీలో యెక్కువమంది సభ్యులు వుండేకొద్దీ, కేంద్ర కమిటీ పనిలో యెక్కువమంది తర్ఫీదు పొంది, యేదైనా అనుచిత చర్య ద్వారా చీలిక వచ్చే ప్రమాదం తక్కువగా వుంటుంది. కేంద్ర కమిటీలో యెక్కువమంది కార్మికులను చేర్చుకోవడం యిప్పుడు చాలా అధ్వాన్నంగా వున్న మన పరిపాలన యంత్రాంగాన్ని కార్మికులు మెరుగుపరుచుకోడానికి

తోడ్పడుతుంది. వాస్తవంలో, యిది మనకు పాత వ్యవస్థనుండి సంక్రమించింది; యెందుకంటే, యింత స్వల్ప కాలంలో, ప్రత్యేకంగా యుద్ధమూ, కరువూ, వగైరాల పరిస్థితులలో, దీనిని పునర్నిర్మించడం పరమ అసాధ్యమైంది. అందుకనే, అపహాస్యంతో గానీ, ద్వేషంతో గానీ, మన పరిపాలనా యంత్రాంగంలోని లోపాలను చూపించే “విమర్శకు”లకు మనం ప్రశాంతంగా సమాధానం చెప్పవచ్చు, యీనాటి విప్లవ పరిస్థితులు వాళ్లకు యేమాత్రమూ అర్థం కాలేదని. యంత్రాంగాన్ని తగినంతగా పునర్నిర్మాణం చేయడం, ప్రత్యేకించి మన విప్లవం జరిగిన పరిస్థితులలో చేయడం, అయిదేండ్లలో కేవలం అసాధ్యం. బూర్జువా వర్గానికి వ్యతిరేకంగా రైతులను కార్మికులు నడిపించే కొత్త రకం రాజ్యాన్ని మనం అయిదేండ్లలో సృష్టించడం చాలు; వ్యతిరేక అంతర్జాతీయ పరిసరాలలో యిదే ఒక బ్రహ్మాండమైన విజయం. కానీ, యీ జ్ఞానంతో మన కన్నులు మూసుకుపోకూడదు, వాస్తవంలో మనం జారునుండీ, బూర్జువావర్గంనుండీ పాత రాజ్య యంత్రాంగాన్ని తీసుకున్నామనే విషయానికీ, యిప్పుడు శాంతి ప్రారంభమై, కరువుకు వ్యతిరేకంగా కనీస అవసరాలు తీరినాయి గనుక, పరిపాలనా యంత్రాంగాన్ని మెరుగుపరచడానికి మన కృషి అంతా మళ్లించాలనే విషయానికీ.

మన రాజ్య యంత్రాంగాన్ని తనిఖీ చేయడమూ, మెరుగుపరచడమూ, పునర్నిర్మించడమూ అనే పనిని కేంద్ర కమిటీ సభ్యులుగా వుండే కొద్ది డజన్ల కార్మికులు యితరులందరి కంటె బాగా చేయగలరని నా అభిప్రాయం. ప్రారంభంలో యీ బాధ్యత ‘కార్మిక కర్షక తనిఖీ’ మీద పడింది, కానీ అది యీ పనికి సరితూగలేక పోయింది; అది యీ కేంద్ర కమిటీ సభ్యులకు “అనుబంధంగా,” లేక, కొన్ని షరతుల మీద, సహాయకుడుగా, మాత్రం ఉపయోగించబడవచ్చు. నా అభిప్రాయంలో, కేంద్ర కమిటీలో చేర్చుకోబడే కార్మికులు సోవియట్ సంస్థలలో దీర్ఘ అనుభవం వున్నవాళ్లు కాకపోవడం మంచిది (నా యీ లేఖా భాగంలో కార్మికులనే పదం ప్రతిచోటా రైతులకు కూడా వర్తిస్తుంది); యెందుకంటే, యే సంప్రదాయాలతోనూ, దురభిప్రాయాలతోనూ పోరాడడం వాంఛనీయమో, అవే ఆ కార్మికులకు యిప్పటికే పట్టుపడినాయి.

కేంద్ర కమిటీలోని కార్మికవర్గ సభ్యులు, ప్రధానంగా, గత అయిదేండ్లలో సోవియట్ సంస్థలకు ప్రమోట్ చేయబడిన కార్మికులకంటె కింద పొరకు చెందిన వాళ్లుగా వుండాలి; వాళ్లు సాధారణ కార్మికులుగా, కర్షకులుగా -- ప్రత్యక్షంగా గానీ, పరోక్షంగా గానీ పీడకుల వర్గానికి చెందనివాళ్లుగా -- వుండే స్థితికి సన్నిహితంగా వుండాలి. నా అభిప్రాయంలో, కేంద్ర కమిటీ సమావేశాలూ, పొలిటికల్ బ్యూరో సమావేశాలూ అన్నిటికీ హాజరుకావడం ద్వారానూ, కేంద్ర కమిటీ పత్రాలు అన్నీ చదవడం

ద్వారానూ అలాంటి కార్మికులు సోవియట్ వ్యవస్థకు అంకితభావం కలిగిన మద్దతుదార్లుగా రూపొంది, మొదటిది, కేంద్ర కమిటీకే స్థిరత్వం యివ్వడానికీ, రెండవది, రాజ్య యంత్రాంగాన్ని సమర్థవంతంగా పునర్నవం చేయడానికీ, మెరుగుపరచడానికీ సమర్థులుగా వుంటారు.

లెనిన్

యల్. యఫ్. చేత రాసుకోబడింది
డిసెంబర్ 26, 1922
మొదటి ప్రచురణ:
'కమ్యూనిస్టు,' నం. 9, 1956

# XI

## 1923 మార్చి 10 తరువాత లెనిన్ అనారోగ్యంపై సమాచారం

శరీరంలో కుడిభాగానికి పక్షవాతం సోకింది. మాట పడిపోయింది. ఇదంతా మార్చి 10న జరిగింది. దీనితో అప్రమత్తమైన ప్రభుత్వం జబ్బు తీవ్రతను వెల్లడించాలనుకునే నిర్ణయానికి వచ్చింది. అప్పటినుండి ఇజ్వెస్తియా రోజువారీ ఆరోగ్య ప్రకటనల్ని వెలువరించసాగింది. మే 15న క్రెమ్లిన్‌లోని తన నివాసం నుండి గోర్కీలోని గ్రామీణ గృహానికి లెనిన్‌ని తరలించటం జరిగింది. రెండు మాసాల పిమ్మట జులైలో ఒక అద్భుతం జరిగింది : తిరిగి లెనిన్ ఆరోగ్యం కుదుటపడసాగింది. నడవసాగాడు. ఎడమ చేత్తో రాయటం సాధన చేయసాగాడు. ప్రాంతీయ సోవ్‌ఖోజ్‌ని సందర్శించి, మూడురోజులు దాని అధ్యక్షుడితో గడిపాడు.

దాదాపుగా ఆగస్టు 10 నాటికి ఆయనకు రాసుకునేందుకు అనుమతి లభించింది. ప్రతిరోజూ ప్రావ్దా వచ్చేది. తరువాత ఇజ్వెస్తియా, ఇతర ప్రచురణలు అందేవి. మరి కొద్ది రోజుల్లోనే ఆయన పుస్తకాలు చదవగలిగే స్థితికి వచ్చాడు. చదవవలసిన పుస్తకాల పట్టిక ఒకటి తయారుచేయబడింది. సాధారణంగా క్రూప్‌స్కయా ఆయనకు వార్తా పత్రికలలోని వ్యాసాలను, పుస్తకాలలోని ఆయన కోరిన భాగాలను చదివి వినిపించేవారు. జబ్బు పూర్తిగా తగ్గలేదు. మరింత ఆశ్చర్యపరిచే అంశమేమిటంటే అక్టోబరు 18న ప్రయాణించేందుకు అనుమతి పొందాడు. ఆయన మాస్కోకు, అక్కడినుండి క్రెమ్లిన్‌కి కారులో వెళ్ళాడు. అక్కడినుండి వీధుల్లో తిరిగాడు. వ్యవసాయ ప్రదర్శనను సందర్శించాడు. తిరిగి తన కార్యాలయానికి వెళ్ళాడు. చాలాసేపు మౌనం దాల్చాడు. తన గ్రంథాలయం నుండి కొన్ని గ్రంథాలను తీసుకుని, గోర్కీకి తిరిగి వచ్చాడు.

నవంబరు 24 నుండి డిసెంబరు 16 మధ్య కాలంలో బుఖారిన్, ప్రియోబ్రజన్‌స్కీ, స్క్వర్‌సూవ్ - స్టెపానొవ్, క్రెస్టిన్‌స్కీ, ప్యాట్నిటస్కీ, ఒరాన్‌స్కీ ఈయన్ని చూచేందుకు వచ్చారు. వాళ్ళు ఈయనతో అప్పటి విశేషాలను ముచ్చటించారు. లెనిన్

శ్రద్ధగా విన్నాడు. కాని మాట ఇంకా వచ్చినట్లు లేదు. సమగ్ర రచనల సంపుటం : XLV లోని క్రమ పరిణామం ప్రకారం మాట పడిపోయిన తర్వాత తిరిగి వచ్చిన దాఖలాలు లేవు.

1924 ప్రారంభంలో లెనిన్ సోవ్‌ఖోజ్‌లో నిర్వహింపబడిన క్రిస్టమస్ వేడుకలకు హాజరయ్యాడు. జనవరి 19న స్లెడ్జి బండిలో అడవిలో వేటాడేవాళ్ళ వెంట వెళ్ళాడు. జనవరి 17-20 తేదీల మధ్య ఈయన ప్రధానంగా పదమూడవ పార్టీ మహాసభ నివేదికను అధ్యయనం చేయటంలో నిమగ్నమయ్యాడు. లెనిన్ చాలా శ్రద్ధగా ఉన్నట్లు కన్పించాడు. కొన్ని పర్యాయాలు సైగలతో ప్రశ్నించేవాడు; కొన్ని విషయాలు ఈయనను చికాకు పరిచినట్లున్నాయి; అయితే ఏదో ఒకటి అప్పటికి సమాచారాన్ని కల్పించి చెప్పి క్రూప్‌స్కయా ఆయన్ని శాంతింపజేసేది.

1924 జనవరి 21న అకస్మాత్తుగా లెనిన్ ఆరోగ్యం క్షీణించింది. ఆయన సాయంత్రం గం. 6.50 నిమిషాలకు మరణించాడు.

# జీవన రేఖలు[1]

**బుఖారిన్, ఎన్.ఐ (1888–1938) :** బోల్షివిక్ పార్టీ ప్రముఖ నాయకుడు, సిద్ధాంతవేత్త. లెనిన్ మరణం నాటికి పార్టీ పొలిట్‌బ్యూరోలో క్యాండిడేట్ సభ్యుడు. తరువాతి కాలంలో పొలిట్‌బ్యూరో పూర్తి సభ్యుడు. 1928–29 మధ్య కాలంలో "మితవాద వ్యతిరేకపక్ష"ంగా పిలువబడిన వర్గ నాయకుడు. 1938లో మాస్కోలో జరిగిన మూడవ విచారణ తరువాత బుఖారిన్‌ను కాల్చి చంపారు..

**జెర్జిన్‌స్కీ, ఎఫ్.ఇ. (1877–1926) :** ప్రముఖ పార్టీ నాయకుడు, ఆంతరంగిక భద్రతా వ్యవహారాల శాఖకు చెందిన రాజకీయ పోలీసు విభాగానికి అధిపతి. రైల్వే, ప్రసార శాఖ మంత్రి.

**ఫతియెవా, ఎల్.ఎ. (1881– ? ) :** 1904 నుండి పార్టీ సభ్యురాలు. సొవ్నర్కోమ్ (సోవియట్ రష్యా మంత్రివర్గం) కార్యదర్శి. లెనిన్ ప్రైవేట్ కార్యదర్శి.

**గోర్బునొవ్, ఎస్.పి. (1892–1938) :** సొవ్నర్కోమ్ కార్యదర్శి వర్గపు అధిపతి. ఆ విధంగా లెనిన్‌కు పరిపాలనా సహాయకుడు. స్టాలిన్ ప్రక్షాళనలో మృత్యువాత పడ్డాడు.

**కామెనెవ్, ఎల్.బి. (1883–1936) :** పార్టీ ముఖ్య నాయకుడు. 1917లో లెనిన్ ప్రతిపాదించిన తిరుగుబాటుకి వ్యతిరేకి. కానీ వెంటనే లెనిన్ వైఖరిని అంగీకరించాడు. పార్టీ పొలిట్‌బ్యూరో సభ్యుడయ్యాడు. సోవ్నర్కోమ్‌లో లెనిన్‌కున్న ముగ్గురి సహాయకుల్లో ఒకడయ్యాడు. లెనిన్ మరణానంతరం, జినొవీవ్, స్టాలిన్‌లతో కలిసి పాలనాత్రయంలో ఒకడయ్యాడు. కానీ 1925లో స్టాలిన్‌కు ఎదురు తిరిగాడు. అనతికాలంలోనే నాయకత్వ స్థానాన్ని కోల్పోయాడు. 1936లో జరిగిన మాస్కో విచారణ తరువాత కాల్చి చంపబడ్డాడు.

**కప్సుకాస్ – మైస్‌కివిచియిస్, వి.ఎస్ :** లిథుయేనియాకు చెందిన పార్టీ సభ్యుడు. జెర్జిన్‌స్కీ నాయకత్వంలోని విచారణ కమిటీ సభ్యుడు. పొలిట్‌బ్యూరో ఇతన్ని జార్జియాకు పంపించింది.

---

1. *పుస్తకంలో ప్రస్తావనకు వచ్చి అంతగా తెలియని వ్యక్తులను గురించిన జీవనరేఖ లందించడానికి క్లుప్తమయిన ఈ జాబితా ఉద్దేశించబడింది. అందుకే లెనిన్, ట్రాట్స్కీ, స్టాలిన్‌ల గురించి ఈ జాబితాలో చేర్చలేదు. ఈ పుస్తకంలో చోటు చేసుకున్న ఘటనలతో ఆయా వ్యక్తులకు సంబంధమున్న మేరకు ఈ సమాచారం పరిమితం చేయబడింది.*

**క్రెస్టిన్‌స్కీ, ఎన్.ఎన్. (1883 - 1938) :** బోల్షివిక్. డిసెంబర్ 1919 నుండి మార్చి 1921 వరకు పార్టీ కేంద్ర కమిటీ కార్యదర్శి. తరువాతి కాలంలో జర్మనీలో సోవియట్ యూనియన్ రాయబారిగా వున్నాడు. 1930లో విదేశీ వ్యవహారాల సహాయ మంత్రిగా వున్నాడు. 1930ల నాటి ప్రక్షాళనలో ప్రాణాలు కోల్పోయాడు.

**క్రూప్‌స్కయా,ఎన్.కె. (1869-1939) :** లెనిన్ భార్య, సహచరి.

**కిర్జిజనోవ్‌స్కీ, జి.ఎమ్ (1872-1959) :** పార్టీ సభ్యుడు, ఇంజనీరు, పండితుడు. 1921-30 మధ్య కాలంలో గాస్‌ప్లాన్ (సోవియట్ యూనియన్ ప్రణాళికా సంఘం)కి అధిపతిగా వున్నాడు.

**క్యుబిషేవ్, వి.వి. (1888-1935) :** పార్టీ నాయకుడు. అంతర్యుద్ధ సమయంలో టర్కిస్తాన్‌లో సైనిక కమిస్సార్. 1922లో స్టాలిన్ పార్టీ కేంద్ర కార్యదర్శి వర్గ బాధ్యతను చేపట్టినప్పుడు ఇతను కేంద్ర కమిటీ కార్యదర్శిగా వున్నాడు. తరువాతి కాలంలో సి.సి.సి.- ఆర్.కె.ఐ.(CCC-RKI)*, వి.ఎస్.ఎన్.కె.హెచ్.(VSNKH)**, గాస్‌ప్లాన్, ఇతర బాధ్యతలను నిర్వహించాడు. 1927నుండి పొలిట్‌బ్యూరో సభ్యుడు.

**మాఖరాజ్, ఎఫ్.ఐ. (1886-1925) :** జార్జియాలో బోల్షివిక్ పార్టీ ప్రముఖ నాయకుడు. జార్జియా టిఎస్ఐకె (TSIK)*** అధ్యక్షుడు. కాకేసియన్ పార్టీ బ్యూరో సభ్యుడు.

**ఎందివని, పి.జి. (1887-1937) :** జార్జియా విప్లవకారుడు. మొదటి తరం బోల్షివిక్. అంతర్యుద్ధ కమిస్సార్. కేంద్ర కమిటీకి చెందిన కాకేసియన్ బ్యూరో సభ్యుడు. జాతుల సమస్యపై స్టాలిన్ వైఖరిని వ్యతిరేకిస్తూ జార్జియా కమ్యూనిస్టు పార్టీ కేంద్రకమిటీ సామూహికంగా రాజీనామా చేసేంతవరకు జార్జియా కమ్యూనిస్టు పార్టీ కేంద్రకమిటీ సభ్యుడు. 1924 నుండి ఫ్రాన్స్‌లో సోవియట్ ప్రభుత్వపు వాణిజ్య ప్రతినిధిగా వున్నాడు. 1931-36 మధ్య జార్జియా ప్రభుత్వపు ఉపాధ్యక్షుడుగా వున్నాడు. తరువాత ప్రక్షాళనలో భాగంగా చంపివేయబడ్డాడు.

**మిల్యుటిన్, వి.పి. (1884-1938) :** బోల్షివిక్ పార్టీ సభ్యుడు. వి.యస్.ఎన్.కె.హెచ్ (VSNKH) మొదటితరం నాయకుల్లో ఒకడు.

**మాలటోవ్, వి.ఎమ్. :** 1906 నుండి బోల్షివిక్ పార్టీ సభ్యుడు. కృశ్చేవ్ అతని పార్టీ నాయకత్వ స్థాయిని తగ్గించేంతవరకు పార్టీ ముఖ్య నాయకుడు. 1911లో కేంద్ర కమిటీకి ఎన్నికయ్యాడు. తరువాత కేంద్ర కమిటీ కార్యదర్శి అయ్యాడు. పొలిట్‌బ్యూరో సహాయ సభ్యుడయ్యాడు.

**ఆర్జోనికిజ్, జి.కె.(1886-1937) :** బోల్షివిక్. జార్జియాకు చెందినవాడు. అంతర్యుద్ధ

* CCC-RKI కేంద్ర నియంత్రణ సంఘం, కార్మిక-కర్షక తనిఖీల సంయుక్త వ్యవస్థ

** VSNKH జాతీయ ఆర్థిక వ్యవస్థ అత్యున్నత ప్రాధికార సంస్థ

*** TSIK సోవియట్ల కేంద్ర పరిపాలక మండలి.

సమయంలో కాకసస్‌లో పార్టీ సైనిక, ప్రభుత్వ నాయకుడు. 1926లో సి.సి.సి. - ఆర్.కె.ఐ. (CCC - RKI) బాధ్యత తీసుకునేంత వరకు కాకసస్ పార్టీలో పూర్తి అధికారం చెలాయించాడు. 1921లో కేంద్ర కమిటీ సభ్యుడయ్యాడు. 1930లో పొలిట్‌బ్యూరో సభ్యుడయ్యాడు. 1930 నుండి 1937లో ఆత్మహత్య చేసుకునేంత వరకు దేశ భారీ పరిశ్రమల విభాగానికి అధిపతిగా వున్నాడు.

**పెట్రోవ్‌స్కీ, జి.ఐ. (1878–1958) :** పార్టీ సీనియర్ సభ్యుడు. 1919 నుండి 1939 వరకు ఉక్రేనియన్ టి.యస్.ఐ.కె.(TSIK) కు అధ్యక్షుడిగా వున్నాడు. పార్టీ కేంద్ర కమిటీ సభ్యుడు.

**ప్రియోబ్రజన్‌స్కీ, ఇ.ఎ. (1886–1937) :** పార్టీ సీనియర్ సభ్యుడు, ఆర్థికవేత్త. 1920–21 మధ్య పార్టీ కేంద్ర కమిటీ కార్యదర్శి. ట్రాట్స్కీవాది అన్న కారణంగా 1927లో పార్టీ నుండి బహిష్కరించారు. తరువాత తిరిగి పార్టీలోకి తీసుకున్నారు. కానీ చివరిగా పార్టీ ప్రక్షాళనలో భాగంగా హత్య కావింపబడ్డాడు.

**పృతకోవ్, జి.ఎల్ (1890 – 1937) :** ముఖ్య నాయకుడు, ఆర్థికవేత్త. గాస్‌ప్లాన్ ఉపాధ్యక్షుడిగా ఇతడిని లెనిన్ సిఫారసు చేశాడు. ట్రాట్స్కీవాది అన్న కారణంగా 1927లో పార్టీ నుండి తప్పించారు. తిరిగి 1928లో పార్టీలో చేర్చుకున్నారు. దేశ భారీ పరిశ్రమల శాఖ అధిపతిగా పనిచేసిన ఆర్జోనికిజ్‌కి సహాయకునిగా పనిచేశాడు. పార్టీ ప్రక్షాళనలో హతుడయ్యాడు.

**రాడెక్, కె.బి. (1885–1939) :** జర్మనీ, పోలిష్ సోషల్ డెమొక్రటిక్ పార్టీ సభ్యుడు. 1917లో బోల్షివిక్ పార్టీలో చేరాడు. కొమింటర్న్‌లో ముఖ్య నాయకుడు. మంచి వక్త, రచయిత. ట్రాట్స్కీవాది అన్న కారణంగా 1927లో పార్టీనుండి బహిష్కరించారు. 1929లో తిరిగి పార్టీలో చేర్చుకున్నారు. 1936లో జైలు శిక్ష విధించారు.

**రకోవ్‌స్కీ, కె.జి. (1873–1941) :** బల్గేరియన్ సోషలిస్టు. 1917లో బోల్షివిక్ పార్టీలో చేరాడు. 1918 – 23 మధ్య ఉక్రేనియన్ సోవ్నర్కోమ్‌కు నాయకత్వం వహించాడు. ఫ్రాన్స్, ఇంగ్లండ్‌లలో సోవియట్ రాయబారిగా వున్నాడు. ట్రాట్స్కీవాది అన్న కారణంగా 1927లో పార్టీ నుండి బహిష్కరించారు. 1935లో తిరిగి పార్టీలో చేర్చుకున్నారు. కానీ అరెస్టు చేసి 1938లో క్యాంపుకు పంపించారు.

**రైకోవ్, ఏ.ఐ. (1881–1938) :** పార్టీ ముఖ్య నాయకుడు. 1918–21 మధ్య వి.యస్.ఎన్.కె.హెచ్.(VSNKH) అధిపతిగా వున్నాడు. తరువాత సోవ్నర్కోమ్‌లో లెనిన్ సహాయకుడిగా వున్నాడు. 1930 వరకు లెనిన్ వారసునిగా సోవ్నర్కోమ్ అధిపతిగా వున్నాడు. 1928లో "మితవాద వ్యతిరేక" పక్ష నాయకునిగా స్టాలిన్‌కు ఎదురు నిలిచాడు. 1938లో నామమాత్రపు విచారణ తరువాత కాల్చి చంపబడ్డాడు.

**స్క్వర్‌సూవ్ - స్టెపనోవ్, ఐ.ఐ. (1870-1928) :** పార్టీ పండితుడు. చిన్న నాయకుడు. మార్క్స్ పెట్టుబడి గ్రంథాన్ని రష్యన్ భాషలోకి అనువదించాడు. లెనిన్ మరణానంతరం లెనిన్ ఇన్‌స్టిట్యూట్‌కు నాయకత్వం వహించాడు.

**సకొల్నికవ్, జి.వైఐ (1888-1939) :** సుదీర్ఘకాలం పార్టీ సభ్యుడు. సోవియట్ దౌత్య విభాగంలోను, ఆర్థిక వ్యవహారాల నిర్వహణలోను ముఖ్యభూమిక పోషించాడు. 1922-26 మధ్య ఆర్థిక కమిస్సార్‌గా వున్నాడు. ప్రక్షాళన కార్యక్రమంలో ప్రాణాలు కోల్పోయాడు.

**సోల్జ్, ఏ.ఏ. (1872-1945) :** సుదీర్ఘకాలం పార్టీ సభ్యుడు. 1921 నుండి సిసిసి (CCC) నాయకత్వ బృందంలో సభ్యుడు. 1921 నుండి సుప్రీంకోర్టులోను సభ్యుడు.

**సెరెబ్రయకోవ్, ఎల్.పి. :** ట్రాట్‌స్కీవాద ధోరణివైపు మొగ్గున్న బోల్షివిక్. ప్రియోబ్రజన్‌స్కీ, క్రెస్టిన్‌స్కీలతో కలిసి 1919 -20లో కేంద్ర కమిటీ కార్యదర్శి.

**టామ్‌స్కీ, ఎమ్.పి. (1880-1936) :** 1904 నుండి పార్టీలో వున్నాడు. మితవాద నాయకుడనే నెపంతో 1928లో తొలగించబడేంతవరకు సోవియట్ ట్రేడ్ యూనియన్స్‌కు అధిపతిగా వున్నాడు. 1922 నుండి పార్టీ పోలిట్‌బ్యూరో సభ్యుడుగా వున్నాడు. 1936లో విచారణ తరువాత కాల్చి చంపారు.

**స్యురూప, ఎ.డి. (1870-1928) :** బోల్షివిక్. 1918-21ల మధ్య పౌర సరఫరాల కమిస్సార్. 1921 చివరి నుండి సోవ్నర్కోమ్‌లో లెనిన్ సహాయకునిగా పనిచేశాడు. పార్టీ కేంద్ర కమిటీ సభ్యుడు.

**ఉల్యనోవా, ఎమ్.ఐ. (1878-1937) :** లెనిన్ సోదరి. **ప్రావ్దా** బోర్డ్‌లో పనిచేశారు. కానీ ఇతరత్రా ఆమె స్పష్టమయిన పాత్రేమీ నిర్వహించలేదు.

**ఓలడిచేవా, ఎమ్.ఏ. :** లెనిన్ ప్రైవేట్ కార్యదర్శి. ఫతియెవా, గోర్బునొవ్‌లతో కలిసి జార్జియా వ్యవహారాల మీద రహస్యంగా విచారణ జరిపే బాధ్యతను లెనిన్ ఆమెకు అప్పగించాడు.

**జినొవీవ్, జి.ఇ.(1883-1936) :** బోల్షివిక్ పార్టీ ప్రముఖ నాయకుడు. కుట్ర ద్వారా ప్రభుత్వాన్ని కూలదోసి, ఒక్క బోల్షివిక్‌లతోనే ప్రభుత్వాన్ని ఏర్పరచాలన్న లెనిన్ ఉద్దేశ్యాన్ని కామెనెవ్‌తో కలిసి వ్యతిరేకించాడు. లెనిన్ నాయకత్వంలో పొలిట్‌బ్యూరో సభ్యుడు. కొమింటర్న్ నాయకుడు. లెనిన్ మరణానంతరం ట్రాట్‌స్కీకి వ్యతిరేకంగా కామెనెవ్, స్టాలిన్‌లతో చేతులు కలిపాడు. కానీ 1925లో ట్రాట్‌స్కీతో జతకట్టడం ద్వారా స్టాలిన్‌ని వ్యతిరేకించాడు.తరువాత కాలంలో అనేక మార్లు పార్టీ నుండి బహిష్కరణకు గురయ్యాడు. తిరిగి అనేక సార్లు పార్టీలో సభ్యత్వాన్ని పొందాడు. కానీ నాయకత్వం నుండి ఉద్వాసనకు గురయ్యాడు. 1936లో జరిగిన మాస్కో మొదటి విచారణ తర్వాత ఈయన్ని కాల్చి చంపారు.

# వివరణలు

**1. మెన్షివిక్కులు :** రష్యన్ సోషల్ డెమొక్రటిక్ ఉద్యమంలో ఒక ధోరణి. దీని ప్రధాన నాయకుడు జూలియస్ మార్టోవ్. 1903లో జరిగిన రష్యన్ సోషల్ డెమొక్రటిక్ లేబర్ పార్టీ రెండవ మహాసభలో పార్టీ కేంద్ర సంఘాలకు జరిగిన ఎన్నికల్లో లెనిన్ నాయకత్వంలో ఉన్న సోషల్ డెమొక్రాట్లకు మెజారిటీ రాగా వారిని బోల్షివిక్కులని, మైనారిటీలో పడ్డ మార్టోవ్ నాయకత్వంలోని సోషల్ డెమొక్రాట్లను మెన్షివిక్కులని పిలిచారు. రష్యన్ భాషలో మెన్షివిత్కో అంటే మైనారిటీ అని అర్థం. ఈ విభజనకు కారణం పార్టీ సభ్యుడికి లెనిన్, మార్టోవ్‌లు విభిన్నమైన నిర్వచనాలు ఇవ్వడం. ఈ రెండు వర్గాలు కలిసి పని చేయడానికి 1906లో అంగీకరించినప్పటికీ, ఇది వాస్తవ రూపం దాల్చలేదు. అంతిమంగా, ఈ రెండు వర్గాలు 1912లో పూర్తిగా చీలిపోయి రెండు వేర్వేరు పార్టీలుగా ఏర్పడ్డాయి. కాకసస్‌లో తప్ప మిగతా చోట్ల మెన్షివిక్కుల బలం క్రమేపీ క్షీణిస్తూ వచ్చింది. ఇందులో మళ్ళీ అతివాద (లెఫ్ట్), మితవాద (రైట్) ధోరణులు ఏర్పడ్డాయి. వీరిలో అంతర్జాతీయ వాదులు మొదటి ప్రపంచ యుద్ధాన్ని వ్యతిరేకించారు. అక్టోబరు 1917 విప్లవాన్ని ఈ పార్టీ వ్యతిరేకించింది. నవంబరు 1917లో జరిగిన రాజ్యాంగ సభ ఎన్నికల్లో ఈ పార్టీకి 3.2% ఓట్లు మాత్రమే లభించాయి. ట్రాన్స్ కాకసస్‌లో మాత్రం 30.2% ఓట్లు లభించాయి. అంతర్యుద్ధంలో ఈ పార్టీలో అనేకులు రెడ్ ఆర్మీతో కలిసి పోరాడారు. కొందరు విప్లవ వ్యతిరేకులతో చేతులు కలిపారు. 1921లో జరిగిన క్రాన్‌స్టట్ తిరుగుబాటు తర్వాత ఈ పార్టీ చట్ట విరుద్ధమైనదిగా ప్రకటించబడింది. అనేకమంది ప్రముఖ మెన్షివిక్కులు దేశం విడిచి వెళ్ళారు. మార్టోవ్ అనారోగ్యంతో 1923లో జర్మనీలో మరణించాడు.

**2. రష్యన్ అంతర్యుద్ధం :** రష్యాలో అక్టోబరు 1917లో జరిగిన విప్లవం ఫలితంగా బోల్షివిక్కుల నాయకత్వంలో ఏర్పడిన సోవియట్ ప్రభుత్వాన్ని కూలద్రోయడానికి మునుపటి జార్ రాచరికపు సైనికాధికారులు – అంతర్గత వ్యతిరేక శక్తుల సైన్యం, ఇంగ్లండ్ – ఫ్రాన్స్ దేశాల సైన్యాలు, కొన్నిచోట్ల జర్మన్ సైన్యాలు, ఇంకా ఇతర శక్తులు తీవ్ర ప్రయత్నం చేశాయి. సోవియట్ ప్రభుత్వానికి, ఈ శక్తులకు 1917 – 1920ల మధ్య అంతర్యుద్ధం

జరిగింది.  సోవియట్ ఎర్ర సైన్యం (రెడ్ ఆర్మీ) తో పాటు, ఉక్రెయిన్‌లో అనార్కిస్టుల నాయకత్వంలోని నల్ల సైన్యం (బ్లాక్ ఆర్మీ) కూడా కీలక పాత్ర వహించింది.  విప్లవ ప్రతీఘాత సైన్యం (వైట్ ఆర్మీ) కోల్చక్, కోర్నిలవ్, డెనికిన్, వ్రాంజెల్ తదితరుల నాయకత్వాన పోరాడింది. సోవియట్ సైన్యం వారందరినీ ఓడించింది. అపారమైన ప్రాణ నష్టం జరిగింది. ఎర్ర సైన్యం రష్యా, ఉక్రెయిన్, బెలారస్, దక్షిణ కాకసస్, మధ్య ఆసియా, తావ, మంగోలియాలలో విజయం సాధించింది.  ఈ క్రమంలో ఫిన్లాండ్, ఎస్తోనియా, లాట్వియా, లిథుయేనియా, పోలండ్‌లు తమ స్వాతంత్ర్యం కోసం పోరాడి స్వతంత్ర రాజ్యాలుగా ఆవిర్భవించాయి.

**3. అనార్కో – సిండికలిజం :** 19వ శతాబ్ది ఫ్రెంచి తత్వవేత్తలలో ఒకరైన పియర్ జోసఫ్ ప్రౌధోన్ అనార్కో – సిండికలిజానికి ఆద్యుడు.  ఈయన పెట్టుబడిదారీ విధానాన్ని, రాజ్యాన్ని రెండింటినీ తిరస్కరించాడు. మొదటి ఇంటర్నేషనల్ (1864–76) లో శ్రామిక వర్గ పార్టీల కార్యాచరణ ద్వారా విప్లవాన్ని సాధించి, శ్రామిక వర్గ నియంతృత్వం రూపంలో ఉండే రాజ్య యంత్రాంగం ద్వారా సోషలిజాన్ని సాధించాలనే సోషలిస్టు వాదానికి, తద్విరుద్ధంగా పార్టీని, రాజ్యాన్ని తిరస్కరించి శ్రామిక వర్గ ప్రత్యక్ష కార్యాచరణ ద్వారా సరాసరి రాజ్యరహిత, స్వీయ నిర్దేశిత సమ సమాజాన్ని సాధించవచ్చనే అనార్కిస్టు అవగాహనకు మధ్య ఘర్షణ జరిగింది.  మార్క్స్, బకునిన్‌లు ఈ రెండు వాదాలకు ప్రాతినిధ్యం వహించారు.  ఈ రెండింటి సమ్మిళితమైన ధోరణిగా అనార్కో – సిండికలిజం ఏర్పడింది. బకునిన్‌కి సన్నిహితుడైన జేమ్స్ గ్విల్లామ్ ఈ ధోరణికి ఆద్యులలో ఒకడుగా పరిగణింపబడుతున్నాడు. ఈ రెండు ధోరణులు కొనసాగుతూ వచ్చాయి.  19వ శతాబ్దం చివర్లో, 20వ శతాబ్దపు తొలిదశలో సోషల్ డెమొక్రటిక్ పార్టీలు, తదుపరి కమ్యూనిస్టు పార్టీలు పెరుగుతూ రాగా, అనార్కో – సిండికలిజం ఫ్రాన్స్, స్పెయిన్, స్వీడన్, ఇటలీ, ఇంగ్లండ్, అమెరికా తదితర దేశాలలో కొనసాగుతూ వచ్చింది.  ఈనాటికీ స్వీడన్, స్పెయిన్‌లలో అనార్కో – సిండికలిస్టు కార్మిక సంస్థలు పని చేస్తున్నాయి.  అయితే ఈ ధోరణిని అనుసరించేవారు దీనిని రివల్యూషనరీ సిండికలిజంగా పిలుస్తారు.

ఈ ధోరణి పెట్టుబడిదారీ విధానాన్ని పూర్తిగా వ్యతిరేకిస్తుంది. దానిని అధిగమించాలని కోరుకుంటుంది. కాని, కార్మిక వర్గ పార్టీ భావనను, కార్మిక వర్గ రాజ్య భావనను అంగీకరించదు. అవి తప్పనిసరిగా కార్మికవర్గ భవిష్యత్తుని ఒక శిష్ట వర్గం చేతుల్లో పెడతాయని, అది కార్మిక వర్గ ప్రయోజనాలకు భిన్నమైన ప్రయోజనాలను నెరవేర్చే యంత్రాంగంగా మారుతుందని అభిప్రాయపడుతుంది. ఈ ధోరణి ట్రేడ్ యూనియన్లు

విప్లవ స్వభావం పెంపొందించుకోవాలని కోరుకుంటుంది. వీటి ద్వారా కార్మిక వర్గం సాధారణ సమ్మె చేసే క్రమంలో అన్ని ఉత్పత్తి కేంద్రాల్ని తన అజమాయిషీలోకి తెచ్చుకుని, ప్రత్యక్ష కార్యాచరణ ద్వారా నూతన స్వయం చలిత సమాజాన్ని ఆవిష్కరించవచ్చుని భావిస్తుంది. ఈ ధోరణికి ప్రధాన సిద్ధాంతవేత్త అయిన రుడాల్ఫ్ రాకర్, కార్మికుల ప్రయోజనాల పరిరక్షణ, వారి జీవన ప్రమాణాల మెరుగుదలతో పాటు వారిని ఉత్పత్తి, సాంకేతికత, నిర్వహణలలో సుశిక్షితులుగా చేసి, వారు మొత్తం సమాజాన్ని సోషలిస్టు సూత్రాల మేరకు నడిపే దిశగా మార్గదర్శనం చేయడం ఈ ధోరణి లక్ష్యాలుగా పేర్కొన్నాడు. ప్రముఖ మేధావి నోమ్ చోమ్‌స్కీ తాను ఈ ధోరణికి చెందినవాడినని చెప్పుకున్నాడు. సిండికలిస్టు అవగాహనని ముర్రే బుక్‌చిన్ అనే అనార్కిస్టు రచయిత ఇలా పేర్కొన్నాడు :

"సిండికలిజం పెట్టుబడిదారీ విధానంపై .... ఒత్తిడి నిరంతరం పెంచుతూనే, అదే సమయంలో, పాత సమాజంలో నుండి నూతన సామాజిక వ్యవస్థని నిర్మించడానికి ప్రయత్నిస్తుంది. యూనియన్లు, లేబర్ కౌన్సిళ్ళు పోరాట సాధనాలు, విప్లవ పనిముట్లు మాత్రమే కాదు; వాటి చుట్టూనే స్వేచ్ఛా సమాజ నిర్మాణం జరగాలి. కార్మికులు (యూనియన్లలో తమ కార్యాచరణ ద్వారా) పాత ఆస్తి వ్యవస్థని నాశనం చేయడంతో పాటు రాజ్యరహిత స్వేచ్ఛా సమాజాన్ని నిర్మించడంలో సుశిక్షితులు కావాలి. ఈ రెండూ జమిలిగా జరగాలి."

అయితే, ఈ ధోరణి ఒక్క శ్రామికవర్గాన్ని మాత్రమే పరిగణనలోకి తీసుకుంటుందని, మిగతా సామాజిక వర్గాల పాత్ర గురించి పట్టించుకోకపోవడం వల్ల దీని ఆచరణీయత సందేహాస్పదమనే వాదన ఉంది. ప్రాతినిధ్య వ్యవస్థని అంగీకరించక పోవడం అవాస్తవిక, నిర్హేతుక అవగాహన అనే విమర్శ ఉంది. దాదాపు అభివృద్ధి చెందిన పెట్టుబడిదారీ దేశాలన్నిటా కార్మిక యూనియన్లు అణచివేతకి, స్తబ్ధతకి గురౌతున్న ప్రస్తుత పరిస్థితులలో, వాటికి ఈ ధోరణి ఆపాదించే విప్లవ కర్తవ్యాలు అవి ఏ మేరకు నెరవేర్చగలవనేది ఒక ప్రధాన ప్రశ్న.

**4. నూతన ఆర్థిక విధానం :** రష్యాలో అంతర్యుద్ధ కాలంలో అనుసరించిన కేంద్రీకృత ఆర్థిక విధానాల వలన, ప్రైవేట్ ఆస్తి వ్యవస్థ పూర్తిగా రద్దైంది. నిర్బంధ ధాన్య సేకరణ వల్ల ఉత్పాదకత పడిపోయింది. తీవ్ర ఆర్థిక సమస్యలు చోటు చేసుకున్నాయి. దీనికి పరిష్కారంగా లెనిన్ నూతన ఆర్థిక విధానాన్ని ప్రతిపాదించాడు. దీనిని ఆయన రాజ్య పెట్టుబడిదారీ విధానంగా పేర్కొన్నాడు. దీనిలో భాగంగా పెట్టుబడిదారీ పద్ధతులు కొంత మేరకు పునరుద్ధరించబడ్డాయి. ఉత్పాదకత పెంచడం ప్రధాన లక్ష్యం. పరిశ్రమల

జాతీయాకరణ స్థానే ప్రైవేటు వ్యక్తులకు చిన్న, మధ్యతరహా పరిశ్రమలు స్థాపించడానికి అవకాశం కల్పించబడింది. బాంకులు, విదేశీ వాణిజ్యం, భారీ పరిశ్రమల నిర్వహణ రాజ్యం ఆధీనంలో ఉంచబడ్డాయి. నిర్బంధ ధాన్య సేకరణ రద్దు చేయబడింది. దాని స్థానే రైతులు తమ ఉత్పత్తిలో కొంత భాగాన్ని రాజ్యానికి వస్తు రూపంలో పన్నుగా కట్టే పద్ధతి ప్రవేశపెట్టారు. తరువాత నగదు రూపంలో పన్ను చెల్లించే పద్ధతి ప్రారంభమైంది. మిగతా ఉత్పత్తిని మార్కెట్‌లో అమ్ముకోవడానికి రైతులకు అవకాశం కల్పించారు. ఈ విధానాన్ని రష్యన్ కమ్యూనిస్టు పార్టీ పదవ మహాసభలో అంగీకరించారు. మార్చి 21, 1921 నాటి డిక్రీ ద్వారా అమలులోకి వచ్చింది. దానిని మెరుగు పర్చడానికి అనేక డిక్రీలు జారీ చేశారు. ఈ విధానం ఆర్థిక మెరుగుదలకు దారి తీసింది. ప్రపంచ యుద్ధ కాలంలో, అంతర్యుద్ధ కాలంలో పడిపోయిన వ్యవసాయక ఉత్పత్తి, పారిశ్రామిక ఉత్పత్తి 1928 నాటికి తిరిగి 1913 స్థాయికి చేరుకున్నాయి. ఇది దీర్ఘ కాలం ఉండాలని లెనిన్ భావించాడు. కాని, స్టాలిన్ ఆధ్వర్యంలో ఈ విధానాన్ని రద్దు చేశారు. దాని స్థానే 1928లో మొదటి పంచవర్ష ప్రణాళికను ప్రవేశపెట్టారు.

**5. క్రాన్‌స్టట్ తిరుగుబాటు :** క్రాన్‌స్టట్ పెట్రోగ్రాడ్ సమీపంలో కొట్లిన్ దీవిలో వున్న నావికా కేంద్రం. ఇది రష్యన్ బాల్టిక్ నౌకాదళానికి ప్రధాన స్థావరం. పెట్రోపావ్లోవ్‌స్క్, సెవాస్టపోల్ అనే రెండు యుద్ధ నౌకలు ఈ కేంద్రంలో ఉండేవి. ఈ నౌకల సిబ్బందిలో అధిక భాగం అక్టోబరు 1917 విప్లవంలో క్రియాశీల పాత్ర నిర్వహించారు. వారిలో అనేకులు కమ్యూనిస్టులు. యుద్ధ కమ్యూనిజం (1918-21) చివరి దశలో పారిశ్రామిక, వ్యవసాయక ఉత్పాదకత ప్రపంచ యుద్ధం ముందు స్థాయి కంటే చాలా తక్కువ స్థాయికి పడిపోయింది. దానికి క్షామం తోడవడంతో విస్తృత ప్రజానీకం ఇక్కట్లకు గురయ్యారు. ఈ పరిస్థితికి స్పందనగా, ముఖ్యంగా రైతాంగం స్థితికి స్పందనగా, క్రాన్‌స్టట్ లోని రెండు యుద్ధనౌకల సిబ్బంది ఫిబ్రవరి 28, 1921న సమావేశమై సోవియట్లకు క్రొత్తగా ఎన్నికలు జరపడం, తదితర 15 డిమాండ్లు ప్రకటించారు. మార్చి 1, 2 తేదీలలో జరిగిన సమావేశాలలో ఈ డిమాండ్లను పురుద్ఘాటించారు. మార్చి 2న తమ సమావేశంలో ప్రసంగించిన బాల్టిక్ నౌకాదళ కమిస్సార్‌ని, మరొకరిని అరెస్టు చేశారు. విప్లవ ప్రతీఘాత శక్తులచే ప్రేరేపించబడిన చర్యలుగా వీటిని పేర్కొంటూ బోల్షివిక్ ప్రభుత్వం అల్టిమేటం జారీ చేసింది.

మార్చి 7, 1921న దాదాపు 45,000 మంది సైన్యంతో క్రాన్‌స్టట్‌పై మిలిటరీ చర్య ప్రారంభించి మార్చి 19 నాటికి క్రాన్‌స్టట్ పట్టణాన్ని బోల్షివిక్ ప్రభుత్వం పూర్తిగా

తన నియంత్రణలోకి తెచ్చుకుంది. ఇరువైపుల పెద్ద ఎత్తున ప్రాణ నష్టం జరిగింది. బోల్షివిక్ పాలన నియంతృత్వం దిశగా పయనిస్తోందనడానికి క్రాన్‌స్టట్ తిరుగుబాటు అణచివేతను ఒక ప్రస్ఫుటమైన తార్కాణంగా కొందరు విమర్శకులు పేర్కొన్నారు. నిజానికి, లెనిన్ క్రాన్‌స్టట్ "పిడుగుపాటుతో వచ్చే మెరుపులా వాస్తవ పరిస్థితిపై వెలుగు ప్రసరింప చేసిందని" పేర్కొన్నాడు. దీని తర్వాతనే బోల్షివిక్ పార్టీ, ప్రభుత్వం నూతన ఆర్థిక విధానాన్ని ప్రవేశపెట్టాయి. మొత్తం మీద విప్లవానంతర రష్యన్ చరిత్రలో అతి ముఖ్యమైన ఘటనలలో ఒకటిగా క్రాన్‌స్టట్ తిరుగుబాటు నిలిచిపోయింది.

**6. సోవ్నర్కోమ్ :** అక్టోబరు విప్లవం తర్వాత ఏర్పడిన రష్యన్ రిపబ్లిక్ ప్రభుత్వాన్ని ప్రజా కమిస్సార్ల మండలి (కౌన్సిల్ ఆఫ్ పీపుల్స్ కమిస్సార్స్) అని పిలిచేవారు. దాని రష్యన్ భాషా రూపానికి క్లుప్తీకరణ సోవ్నర్కోమ్. 1918లో రూపొందిన రష్యన్ సోవియట్ సోషలిస్టు రిపబ్లిక్ రాజ్యాంగం సోవ్నర్కోమ్ సోవియట్ల కాంగ్రెస్ (మహాసభ) కి బాధ్యత వహించాలని నిర్దేశించింది. కాంగ్రెస్ సమావేశంలో లేనప్పుడు రాజ్య వ్యవహారాలపై డిక్రీల ద్వారా నిర్ణయాలు చేసేందుకు సోవ్నర్కోమ్‌కి అధికారమిచ్చారు. ఈ డిక్రీలకు పూర్తి చట్టబద్ధత ఉండేది. ఈ డిక్రీలకు వచ్చే సోవియట్ల కాంగ్రెస్‌లో ఆమోదం పొందవలసి ఉంటుంది. 1922లో సోవియట్ సోషలిస్టు రిపబ్లిక్కుల యూనియన్ (యుఎస్ఎస్ఆర్) ఏర్పడినప్పుడు, దాని సోవ్నర్కోమ్‌ని రష్యన్ రిపబ్లిక్ సోవ్నర్కోమ్ పద్ధతిలో ఏర్పాటు చేశారు. 1946 నుండి దానిని మంత్రిమండలి (కౌన్సిల్ ఆఫ్ మినిస్టర్స్) గా వ్యవహరించేవారు.

**7. పారిస్ కమ్యూన్ :** ఫ్రాన్స్, ప్రష్యాల మధ్య జులై 1870లో ప్రారంభమై జరిగిన యుద్ధంలో ఫ్రాన్స్ ఓడిపోయింది. సెప్టెంబర్‌లో సిడాన్ వద్ద జరిగిన యుద్ధంలో అప్పటి ఫ్రెంచి చక్రవర్తి నెపోలియన్ – III ప్రష్యన్ సైన్యాలకు లొంగిపోయాడు. ప్రష్యన్ సైన్యం పారిస్‌ని చుట్టుముట్టింది. ఈ అవమానకర పరిస్థితులకు నిరసనగా పారిస్‌లోని కార్మికులు, సాధారణ పౌరులు, నేషనల్ గార్డు సైన్యాలు సెప్టెంబరు 4న పార్లమెంటుని చుట్టుముట్టి నెపోలియన్ – III ని పదవీచ్యుతుణ్ణి చేయడంలో విజయవంతమయ్యారు. అతని స్థానంలో లూయీ జూల్ ట్రోచ్చి నాయకత్వాన జాతీయ రక్షణ ప్రభుత్వం ఏర్పడింది. పారిస్ కార్మికులలో మొదటి ఇంటర్నేషనల్ (అంతర్జాతీయ కార్మిక సంస్థ) కు గణనీయమైన బలం ఉండేది. మొదటి ఇంటర్నేషనల్ ప్రోద్బలంతో పారిస్ కార్మికులు సెప్టెంబరు 4న క్రొత్త ప్రభుత్వం ముందు పెట్టిన డిమాండ్లు అన్నిటినీ అంగీకరించలేదు. దానితో పారిస్ అంతటా 20 ప్రాంతీయ విభాగాల్లో కార్మికుల ప్రధాన భాగస్వామ్యంతో పర్యవేక్షణ సంఘాలు ఏర్పడ్డాయి. ప్రతి సంఘం నుండి నలుగురు డెలిగేట్లతో పారిస్ అంతటికీ

కలిపి ఒక సెంట్రల్ కమిటీ ఏర్పడింది. దీనితో పారిస్‌లో రెండు సమాంతర పరిపాలనా కేంద్రాలు ఏర్పడ్డాయి. కార్మికుల ప్రాబల్యంలో సాయుధ నేషనల్ గార్డ్ ఏర్పడింది. దీనికి కూడా ఒక సెంట్రల్ కమిటీ ఏర్పడింది. జనవరి 1871లో జర్మన్ సైన్యాలు (ప్రష్యా ఇప్పుడు జర్మన్ సామ్రాజ్యంలో భాగమైంది) పారిస్‌లోకి విజేతగా ప్రవేశించి, నిష్క్రమించడానికి జాతీయ రక్షణ ప్రభుత్వం అంగీకరించడం పారిస్ ప్రజలలో తీవ్రమైన వ్యతిరేకతకు దారితీసింది. జర్మన్ సైన్యం ప్రవేశించేముందే, అవసరమైతే దానిని ఎదుర్కొనడానికి నేషనల్ గార్డ్స్, సాధారణ కార్మికులు కలిసి పెద్ద ఎత్తున ఫిరంగులను కీలక ప్రాంతాల్లో మోహరించారు. జర్మన్ సైన్యం ప్రవేశం, నిష్క్రమణ ఎటువంటి అవాంఛనీయ ఘటన జరగకుండా సాగిపోయింది. జాతీయ ప్రభుత్వానికి అధినేతగా ఎన్నికైన అడాల్ఫ్ తీర్స్, నేషనల్ గార్డ్స్ సెంట్రల్ కమిటీ ప్రత్యామ్నాయ అధికార కేంద్రంగా రూపొందిందని గుర్తించాడు. ముందు జాగ్రత్తగా రాచరికవాదుల మెజారిటీతో కొత్తగా ఎన్నికైన జాతీయ అసెంబ్లీ సమావేశాలను వెర్సైల్ నుండి పారిస్‌కి దూరంగా ఉన్న బోర్డాకి మార్చారు. నేషనల్ గార్డ్స్‌ని నిరాయుధం చేయడానికి, వారి వద్ద ఉన్న 400 ఫిరంగులను స్వాధీనం చేసుకోవటానికి మార్చి 18, 1871న ప్రభుత్వ సాయుధ దళాలను పంపించారు. కాని ఈ సాయుధ దళాలు నేషనల్ గార్డ్స్‌తో, స్థానిక ప్రజలతో ఏకమయ్యారు. ఇద్దరు జనరల్స్‌ని కాల్చి చంపారు. ఇతర సైనిక దళాలు కూడా ప్రజలతో మమేకమయ్యాయి. ప్రమాదాన్ని గ్రహించిన తీర్స్ వీలైనంతమంది సైన్యం, పోలీస్, పరిపాలనా సిబ్బంది, నిపుణులను కలుపుకుని పారిస్‌ని వదిలిపెట్టి వెర్సైల్‌కి వెళ్ళాడు.

ఇప్పుడు పారిస్‌లో అధికారం పూర్తిగా నేషనల్ గార్డ్స్ సెంట్రల్ కమిటీ చేతుల్లో వుంది. అది కమ్యూన్ (ఫ్రెంచి నగరాలను కమ్యూన్లుగా పిలుస్తారు) ప్రభుత్వం ఎంపికకి ఎన్నికలు జరిపింది. 92 మంది కమ్యూన్ కౌన్సిల్ సభ్యులలో ఎక్కువమంది నిపుణులైన కార్మికులు, వేర్వేరు వృత్తులకు చెందినవారున్నారు. వారిలో రిపబ్లికన్లు, సోషలిస్టులు, బ్లాంక్విస్టులు, అనార్కిస్టులు, మార్క్సిస్టులు లాంటి వివిధ ధోరణులకు చెందిన వారున్నారు. మార్చి 28, 1871న పారిస్ కమ్యూన్ ప్రకటించారు. ప్రగతిశీల, సెక్యులర్, అత్యంత ప్రజాస్వామ్యయుత కార్యక్రమంతో కమ్యూన్ పని చేసింది. రాజ్యం నుండి చర్చిని వేరు చేయడం, పారిశ్రామికవేత్తలు వదిలి వెళ్ళిన ఫాక్టరీలను కార్మికులకు నడిపే హక్కు కల్పించడం (అయితే, మునుపటి హక్కుదారుకి నష్టపరిహారం చెల్లించడానికి అవకాశం కల్పించబడింది) తదితర కొన్ని అంశాలపై తమకున్న తక్కువ వ్యవధిలో డిక్రీలు జారీచేసి అమలు చేశారు. యజమానులు కార్మికులపై అపరాధ రుసుము విధించడాన్ని నిషేధించారు. అయితే ఉచిత విద్య, శిక్షణలకై ఉద్దేశించిన విద్యా సంస్కరణలు ప్రతిపాదన

స్థాయిలో ఉండిపోయాయి. స్త్రీలు కమ్యూన్‌లో క్రియాశీల పాత్ర పోషించారు. వీరిలో కొందరు స్త్రీ విమోచనా అజెండాను చేపట్టారు. స్త్రీ పురుష సమానత్వం, సమాన వేతనాలు, స్త్రీలకు విడాకులు పొందే హక్కు, బాలికలకు సెక్యులర్ విద్య, సాంకేతిక విద్య పొందే హక్కు తదితర డిమాండ్ల సాధన కోసం కృషి చేశారు.

పారిస్‌లోని వివిధ ప్రాంతాల్లో ఏర్పడిన స్థానిక కమిటీలు కొనసాగాయి. కమ్యూన్‌తో ఇవి కలిసి పని చేసేవి. కమ్యూన్ కౌన్సిల్ సభ్యులు చట్టాల రూపకల్పన విధులతో పాటు పాలనాపరమైన, సైనికపరమైన విధులు కూడా నిర్వహించేవారు. సామాన్య కార్మికులు కూడా పాలనా బాధ్యతలు నిర్వహించే చొరవను కమ్యూన్ ప్రోత్సహించింది. అయితే కమ్యూన్ పారిస్‌లో ఏకాకి అయింది. లియాన్, గ్రెనోబుల్ లాంటి ప్రాంతాలలో కూడా కమ్యూన్‌లు ఏర్పడినప్పటికీ అవి వెంటనే అణచి వేయబడ్డాయి. కమ్యూన్ తాను చేపట్టిన కార్యక్రమాలు నెరవేర్చటంపై చూపిన శ్రద్ధ, వెర్సైల్‌లోని జాతీయ ప్రభుత్వంపై చర్యలు తీసుకోవడంలో చూపలేదు. ఫ్రెంచి జాతీయ బ్యాంకుని తన స్వాధీనంలోకి తెచ్చుకోలేదు. ఏప్రిల్ మొదటి వారంలో జాతీయ ప్రభుత్వ సైన్యాల ఎదురు దాడి ప్రారంభమయింది. కమ్యూన్‌కి కేంద్రీకృత అధికారం లేకపోవడం వల్ల విడి ప్రాంతాలలోని స్థానిక సంఘాలు వీరోచితంగా పోరాడినప్పటికీ, తీవ్రమైన వీధి పోరాటాలు సలిపినప్పటికీ, జాతీయ ప్రభుత్వ సైన్యాల విజయాన్ని ఆపలేకపోయాయి. మే 28తో కమ్యూన్ ఓటమి పూర్తయింది. విప్లవ వ్యతిరేక శక్తులు పూర్తి స్థాయిలో కమ్యూన్ సభ్యుల ఊచకోతకు ఒడికట్టాయి. దాదాపు 20,000 మంది ప్రాణాలు కోల్పోయినట్లు అంచనా వేయబడింది. అనేకమంది జైళ్ళకు, ప్రవాసాలకు పంపబడ్డారు. ఈ ఓటమి ఫ్రాన్స్‌లో మరో విప్లవాన్ని దీర్ఘకాలం వాయిదా వేసింది. పారిస్ కమ్యూన్ శ్రామిక వర్గ పోరాటాల చరిత్రలో అత్యున్నత స్థానాన్ని పొందింది. నూతన సోషలిస్టు సమాజ నిర్మాణానికి జరిగిన తొలియత్నంగా శాశ్వత ప్రతిష్ఠ సంపాదించుకుంది.

**8. యుద్ధ కమ్యూనిజం :** రష్యాలో అక్టోబరు విప్లవానంతరం చెలరేగిన అంతర్యుద్ధ కాలంలో, అంటే 1918-1921ల మధ్య అమలు చేయబడిన రాజకీయ, ఆర్థిక విధానాన్ని యుద్ధ కమ్యూనిజంగా పిలుస్తారు. పట్టణాలకు, రెడ్ ఆర్మీకి అవసరమైన ఆయుధాలను, ఆహారాన్ని ఎటువంటి అవాంతరాలు లేకుండా సమకూర్చడం ఈ విధాన లక్ష్యం. అంతర్యుద్ధం కారణంగా సాధారణ యంత్రాంగాలు, సంబంధాలు కుప్పకూలిపోవడంవల్ల ఈ విధానాన్ని అమలు చేశారు. ఉత్పత్తి, పంపిణీల కేంద్రీకరణ, ప్రైవేటు ఆస్తి రద్దు, స్వేచ్ఛా వాణిజ్యం రద్దు, రైతుల వద్దనుండి మిగులు ధాన్యాల నిర్బంధ సేకరణ ఈ

విధానపు ప్రధాన లక్షణాలు. అయితే ఈ విధానం పారిశ్రామిక, వ్యవసాయక ఉత్పాదకతను తీవ్రంగా దెబ్బ తీసింది. రైతాంగంలో తీవ్ర అసంతృప్తికి దారితీసింది. అందువలన దాని స్థానే కొంత మేరకు ప్రైవేటు ఆస్తిని, స్వేచ్ఛా వాణిజ్యాన్ని అంగీకరించే నూతన ఆర్థిక విధానాన్ని 1921 నుండి అమలు చేశారు. నిర్బంధ ధాన్య సేకరణకు బదులుగా రైతులు కొంత మొత్తం ప్రభుత్వానికి పన్నుగా కట్టి మిగతా ఉత్పత్తిని, తమ అవసరాలకు పోను, మార్కెట్‌లో అమ్ముకోవడానికి ఈ నూతన విధానంలో అవకాశాన్ని కల్పించారు.

**9. రష్యన్ రాజ్యాంగ సభ:** ఫిబ్రవరి 1917 విప్లవంలో జార్ పదవీచ్యుతుడైన పిమ్మట 1912లో ఏర్పడిన నాల్గవ డ్యూమా లోని బూర్జువా వర్గ ప్రతినిధుల ప్రాబల్యంతో తాత్కాలిక ప్రభుత్వం ఏర్పడింది. ఇందులో మెన్షివిక్కులు, సోషలిస్టు రివాల్యూషనరీలకు కూడా స్థానం ఉంది. రాచరిక వ్యవస్థ తదుపరి దేశ రాజకీయ వ్యవస్థ ఎలా ఉండాలనే విషయం ఎన్నిక కాబడిన రాజ్యాంగ సభ నిర్ణయించాలనే విషయంలో దాదాపు అన్ని పార్టీల మధ్య ఏకాభిప్రాయం ఉంది. అప్పటికే "సోవియట్లకే అధికారం' కోసం పిలుపు నిచ్చినప్పటికీ బోల్షివిక్కులు కూడా రాజ్యాంగ సభ ఏర్పాటుకి మద్దతునిచ్చారు.

రాజ్యాంగ సభ ఎన్నికలు జరిగే లోపే అక్టోబరు విప్లవం విజయవంతమయింది. దానిని సోవియట్ల రెండవ కాంగ్రెస్ ఆమోదించింది. కాంగ్రెస్ నుండి మెన్షివిక్కులు, మితవాద సోషలిస్టు రివల్యూషనరీలు బోల్షివిక్కుల తొందరపాటు చర్యకి నిరసనగా వెళ్ళిపోయారు. బోల్షివిక్కులు – అతివాద సోషలిస్టు రివల్యూషనరీల నాయకత్వాన సోవియట్లు అధికారం చేపట్టిన పిమ్మట కూడా నవంబరు 1917లో రాజ్యాంగ సభకి ఎన్నికలు జరిగాయి. ఫలితాలలో సోషలిస్టు రివల్యూషనరీలకు మొదటి స్థానం, బోల్షివిక్కులకి రెండవ స్థానం లభించాయి. ఎన్నికలు జరిగిన పిమ్మట సోషలిస్టు రివల్యూషనరీలలో చీలిక ఏర్పడింది. అతివాద పక్షం బోల్షివిక్కులతో జత కలిసింది. అయితే, ఫలితాలలో ఈ రెండు పక్షాలలో ఎవరికెన్ని అనేది లేకపోవడం వల్ల బోల్షివిక్ – అతివాద సోషలిస్టు రివల్యూషనరీల అలయన్స్, మితవాద సోషలిస్టు రివల్యూషనరీల బలాబలాలు ఖచ్చితంగా తేలలేదు. సోవియట్లలో వివిధ పార్టీల పరిస్థితి వేరుగా ఉంది. ఈ రెండింటికీ పొంతన కుదరని పరిస్థితి ఎదురైంది. ఈ సందిగ్ధ స్థితిలో, రాజ్యాంగ సభ పట్ల బోల్షివిక్కుల అవగాహనలో మార్పు చోటు చేసుకుంది. అక్టోబరు విప్లవం తరువాత ఏర్పడిన సోవియట్ల రాజ్యాధికారం రాజ్యాంగ సభ కంటే ఉన్నతమైన ప్రజాస్వామ్యం కావున, మారిన పరిస్థితులలో ప్రజాభీష్టాన్ని తెలుసుకునేందుకు రాజ్యాంగ సభకు తిరిగి ఎన్నికలు జరపడం, రాజ్యాంగ సభ సోవియట్ రాజ్యాధికారాన్ని ఎలాంటి షరతులు లేకుండా అంగీకరించడం

పరిష్కారంగా లెనిన్ పేర్కొన్నాడు. ఈ రెండూ జరగలేదు. సోషలిస్టు రివల్యూషనరీల నాయకుడు విక్టర్ చెర్నోవ్ రాజ్యాంగ సభకి అధ్యక్షుడిగా ఎన్నుకోబడ్డాడు. బోల్షివిక్కులు రెండవ అఖిల రష్యా సోవియట్ల కాంగ్రెస్ జారీ చేసిన డిక్రీలు రాజ్యాంగ సభ అంగీకారం కోసం సమర్పించగా అవి తిరస్కరించబడ్డాయి. ఈ రాజ్యాంగ సభ సోవియట్ల అధికారానికి సానుకూలంగా ఉండదని, రాజ్యాంగ సభకు మరల ఎన్నికలు జరపడానికి అందులో ఆధిపత్యంలో వున్నవారు అంగీకరించరని గ్రహించిన బోల్షివిక్ – అతివాద సోషలిస్టు రివల్యూషనరీల అలయన్స్ దానిని రద్దు చేయాలని నిర్ణయించింది. జనవరి 18, 1918 సాయంత్రం 4.00 గంటలకు తొలిసారిగా సమావేశమైన రాజ్యాంగ సభకు ఈ నిర్ణయం తెలియ చేయబడింది. బోల్షివిక్కుల, అతివాద సోషలిస్టు రివల్యూషనరీల సభ్యులు సభను బహిష్కరించారు. సమావేశం జరిగే తోరిడ్ పాలస్ చుట్టూ సోవియట్ ప్రభుత్వానికి మద్దతుగా ఉండే సైనిక దళాలు మోహరించబడ్డాయి. జనవరి 19 తెల్లవారు జాము 4.40 గం॥ల వరకు జరిగిన సమావేశంలో కొన్ని చట్టాలు ఆమోదించబడ్డాయి. తోరిడ్ పాలస్ సైనికాధికారి కోరిక మేరకు సమావేశం ముగించి తిరిగి 19 సాయంత్రం 5.00 గం॥లకు సమావేశమవ్వాలని నిర్ణయం తీసుకుని సభ ముగించారు. అయితే ఆ సమయానికి వచ్చిన సభ్యులకు పాలస్ తలుపులు తెరవబడలేదు. ప్రభుత్వం రాజ్యాంగ సభను రద్దుచేసినట్లుగా ప్రకటించింది. వెంటనే సమావేశపరచబడిన సోవియట్ల మూడవ కాంగ్రెస్‌లో బోల్షివిక్కులకు మెజారిటీ ఉంది. ఈ సమావేశపు కేంద్ర పాలక మండలి రాజ్యాంగ సభ రద్దుకి సంబంధించిన డిక్రీని ఖరారు చేసింది. అలా రద్దుచేయబడిన రాజ్యాంగ సభను పునరుజ్జీవింప చేయడానికి రష్యా అంతర్గత శక్తులు, బాహ్యశక్తులు అన్నీ ప్రయత్నం చేసినప్పటికీ ఫలించలేదు.)

**10. కులక్కులు :** జారిస్టు రష్యాలో ఇతరుల శ్రమపై ఆధారపడి జీవించే ధనిక రైతు. సోవియట్ యూనియన్‌లో కూడా వారి ఉనికి కొనసాగింది. వారిని వర్గ శత్రువులుగా పరిగణించేవారు. 1929లో మొదలు పెట్టి అమలు చేసిన సమష్టి వ్యవసాయ క్షేత్రాల కార్యక్రమంలో కులక్కులపై కఠిన చర్యలు తీసుకొన్నారు. కులక్కుల నిర్మూలన సోషలిజానికి దోహదం చేస్తుందని భావించారు.

**11. కాంబెడీ :** 1918లో గ్రామాలలో ప్రభుత్వ విధానాల అమలులో సహకరించేందుకు ఏర్పాటు చేయబడ్డ పేదరైతు సంఘాలు. వీటిని కాంబెడీ అని పిలిచేవారు. వీటి ప్రధాన కార్యక్రమం పట్టణాలు, సైన్యానికి అవసరమైన ధాన్యాన్ని గ్రామాల నుండి సేకరించడం, గ్రామాల్లో పారిశ్రామిక వస్తువుల పంపిణీని పర్యవేక్షించడం.

అయితే, ఈ సంఘాలు కొన్నిసార్లు వాటి పరిధి దాటి ప్రవర్తించడంతో విమర్శలకు గురయ్యాయి. రష్యన్ అంతర్యుద్ధంలో రైతాంగపు మద్దతు అవసరం కావడంతో, ఈ సంఘాలను 1918 చివరికి స్థానిక సోవియట్లలో కలిపివేశారు.

**12. చెకా :** అక్టోబరు విప్లవానంతరం డిసెంబరు 1917లో స్థాపించబడిన అంతర్గత భద్రతా వ్యవస్థ. మొదట రష్యన్ రిపబ్లిక్‌లోను, సోవియట్ యూనియన్ ఏర్పడిన పిమ్మట మిగతా అన్ని రిపబ్లిక్‌లలో అమలు చేశారు. నగరాలలో, పట్టణాలలో కూడా శాఖలు ఉండేవి. దీనిని అసాధారణమైన, అత్యవసరమైన కమీషన్‌గా పరిగణించేవారు. ఫిబ్రవరి 1922 నుండి చెకా స్థానంలో జిపియు అనే పేరుతో, తదుపరి ఎన్‌కెవిడి, కెజిబి పేర్లతో అంతర్గత భద్రతా వ్యవస్థ పని చేసింది. ఈ సంస్థ రహస్య పోలీస్ వ్యవస్థ విధులను, కొన్ని సందర్భాలలో మిలిటరీ విధులను కూడా నిర్వహించేది. దీని మూల లక్ష్యాలు విప్లవ పరిరక్షణ, ఇందు నిమిత్తం, విప్లవ ప్రతీఘాత శక్తులను అణచివేయడం. క్రమేపీ దాని విధులు విధ్వంసానికి, అక్రమ లాభార్జనకు, అవినీతికి వ్యతిరేకంగా కూడా విస్తరించబడ్డాయి. కాలక్రమంలో బోల్షివిక్కులతో విభేదించిన సోషలిస్టులకు, అనార్కిస్టులకు, చివరకు బోల్షివిక్ పార్టీలోని అధికారిక విధానాలతో విభేదించిన వారికి వ్యతిరేకంగా కూడా ఈ వ్యవస్థను ప్రయోగించారు. పారిస్ కమ్యూన్ అనుభవం దృష్ట్యా విప్లవ పరిరక్షణకు నిర్దాక్షిణ్యంగా పనిచేసే యంత్రాంగం అవసరమనే బోల్షివిక్ అవగాహన ప్రాతిపదికగా ఈ వ్యవస్థ రూపొందింది. దాని ప్రాథమిక కర్తవ్యాన్ని అది నెరవేర్చినప్పటికీ, దానిని ఉపయోగించిన విస్తృత స్థాయి, తీరు పట్ల భిన్నాభిప్రాయాలు ఉన్నాయి. ముఖ్యంగా చట్టబద్ధ పాలనకు ఈ వ్యవస్థకున్న అపరిమితమైన అధికారాలు హాని చేశాయన్నది ప్రధాన విమర్శ.

**13. మూడో ఇంటర్నేషనల్ :** 19వ శతాబ్దంలోని భిన్న సోషలిస్టు ధోరణులు సోషలిజాన్ని అంతర్జాతీయ వ్యవస్థగా చూశాయి. కార్మికులకు దేశం లేదని కమ్యూనిస్టు మేనిఫెస్టో పేర్కొంది. ప్రపంచ కార్మికులు ఏకం కావాలని పిలుపునిచ్చింది. పెట్టుబడిదారీ విధానం ప్రపంచ వ్యవస్థ కాబట్టి, దాని ప్రత్యామ్నాయమైన సోషలిజం కూడా ప్రపంచ వ్యవస్థగానే సాధ్యమౌతుందనేది ప్రబలమైన అవగాహన. ఈ అవగాహన కనుగుణంగా వివిధ దేశాలలోని కార్మికోద్యమాలను సమన్వయం చేయడానికి, అనుభవాలు, భావాలు చర్చించుకోవడానికి మొదటి అంతర్జాతీయ కార్మిక సంస్థ (ఇంటర్నేషనల్) 1864లో ఏర్పడింది. దేశ కాల పరిస్థితులకు అనుగుణంగా ఉమ్మడి లక్ష్య సాధనకు భిన్న మార్గాలు అనుసరించడానికి సభ్య యూనిట్లకు స్వేచ్ఛ ఉండేది. 1872లో దీని కార్యనిర్వాహక

కార్యాలయం న్యూయార్క్‌కి మార్చబడేంత వరకు ఇది క్రియాశీలంగా పనిచేసింది. 1876లో ఈ సంస్థ రద్దయింది. దీని కాలంలో అత్యంత ముఖ్యమైన ఘటన పారిస్ కమ్యూన్. రెండవ అంతర్జాతీయ కార్మిక సంస్థ 1889లో ఏర్పడి 1916వరకు కొనసాగింది. 20వ శతాబ్దపు తొలినాళ్ళలో బలపడిన పెట్టుబడిదారీ సామ్రాజ్యవాదం వినాశకరమైన యుద్ధం దిశగా ఐరోపాను నెడుతున్న వాస్తవాన్ని గమనించిన రెండో ఇంటర్నేషనల్, ఈ యుద్ధంలో పాలకవర్గాలకు మద్దతు పలకవద్దని కార్మిక వర్గానికి పిలుపునిచ్చింది. యుద్ధం సమయంలో కూడా వర్గ పోరాటం కొనసాగుతుందని స్పష్టం చేసింది. యుద్ధాన్ని ఆయా దేశాలలో పాలకవర్గాన్ని కూలద్రోయడానికి అవకాశంగా ఉపయోగించుకోవచ్చని పేర్కొంది. అయితే జులై 1914లో ప్రారంభమైన మొదటి ప్రపంచ యుద్ధం రెండో ఇంటర్నేషనల్‌ని తీవ్ర సంక్షోభానికి గురి చేసింది. రష్యాలో బోల్షివిక్కులు, మెన్షివిక్కులలోని మైనారిటీ వర్గం, లెఫ్ట్ సోషలిస్టు రివల్యూషనరీలు, జర్మనీలోని స్పార్టకస్ లీగ్, ఇలా అతి కొద్ది సోషలిస్టు పార్టీలు / బృందాలు మినహా రెండో ఇంటర్నేషనల్ సభ్యులైన మిగతా పార్టీలన్నీ, జర్మన్ సోషల్ డెమొక్రటిక్ పార్టీతో సహా, ఆయాదేశాల పాలకవర్గాల యుద్ధ అవసరాలకు మద్దతు పలికాయి. దానితో ఈ సంస్థ ప్రతిష్ట పూర్తిగా అడుగంటింది. దాని మరణ శాసనం అదే రాసుకొన్నట్లయింది. 1916లో ఈ సంస్థ రద్దయింది.

బోల్షివిక్ అంతర్జాతీయ వాదానికి అనుగుణంగా అక్టోబరు 1917 విప్లవం విజయవంతమైన పిమ్మట మాస్కో కేంద్రంగా మూడో అంతర్జాతీయ కార్మిక సంస్థ (కొమింటర్న్) ను మార్చి 1919లో స్థాపించారు. ఒక పాలకమండలి దాని కార్యకలాపాలు నిర్వహించేది. ఒక అధ్యక్షుడు ఉండేవాడు. మొదటి కాంగ్రెస్ మార్చి 2–6, 1919లో జరిగింది. 34 పార్టీల ప్రతినిధులు పాల్గొన్నారు. బోల్షివిక్ పార్టీకి చెందిన జినొవీవ్ మొదటి అధ్యక్షుడిగా ఎన్నికయ్యాడు. ప్రపంచ వ్యాప్తంగా కమ్యూనిస్టు పార్టీల స్థాపన, తద్వారా ప్రపంచ విప్లవాన్ని వేగిరపర్చడం ఈ సంస్థ ప్రధాన లక్ష్యం. కేంద్రీకృత ప్రజాస్వామ్యం కమ్యూనిస్టు పార్టీల నిర్మాణ సూత్రంగా నిర్దేశించబడింది. ఈ సంస్థ స్ఫూర్తితో అనేక దేశాలలో కమ్యూనిస్టు పార్టీలు ఏర్పడ్డాయి. ఆగస్టు 1920లో జరిగిన రెండో కాంగ్రెస్‌లో సభ్య పార్టీలు అనుసరించవలసిన 21 నిబంధనలను ఆమోదించారు. వలస దేశాలలో జాతీయ విప్లవోద్యమాలతో కార్మిక వర్గం కలిసి పని చేయాలని సూచించబడింది. మూడో కాంగ్రెస్ జూన్ – జులై 1921లో, నాల్గవ కాంగ్రెస్ నవంబరు 1922లో జరిగాయి. ఈ దశ వరకు ప్రపంచ విప్లవం కొమింటర్న్ ప్రధాన లక్ష్యంగా ఉండేది. 1924లో లెనిన్ మరణానంతరం, ఐరోపాలో విప్లవం విఫలం చెందడం

ఫలితంగా సోవియట్ యూనియన్‌లో 'ఒక దేశంలో సోషలిజం' అనే భావన ప్రాబల్యం సాధించింది. ఈ దశలో కొమింటర్న్ ఎక్కువగా సోవియట్ కమ్యూనిస్టు పార్టీ, సోవియట్ యూనియన్ ప్రయోజనాల కనుగుణంగా పని చేయడం జరిగింది. అయిదో కాంగ్రెస్ జులై 1924లో జరిగింది. కమ్యూనిస్టు పార్టీలకు 'బోల్షివిక్' నమూనా మరింతగా నొక్కి చెప్పబడింది. 1928లో జరిగిన ఆరో కాంగ్రెస్‌లో ఐరోపాలోని మిగతా సోషలిస్టు పార్టీలను 'సోషల్ ఫాసిస్టులు'గా పరిగణించడం, వారికి వ్యతిరేకంగా పోరాడవలసిందిగా పిలుపునివ్వడం జరిగింది. ఈ విధానం అన్ని సోషలిస్టు ధోరణులు సమన్వయంగా ఫాసిజాన్ని, నాజిజాన్ని ఎదుర్కొనే అవకాశం లేకుండా చేసింది. ఇది ఆత్మహత్యా సదృశంగా పరిణమించిందనేది చారిత్రక వాస్తవం. వలస దేశాలలోని ఉమ్మడి కార్యాచరణను కూడా ఆరో కాంగ్రెస్ వ్యతిరేకించింది. ఈ విధానం వల్ల కలిగిన నష్టాలు గమనించిన పిమ్మట 1935లో జరిగిన ఏడో కాంగ్రెస్‌లో ఫాసిజానికి వ్యతిరేకంగా ఐక్య సంఘటనకు కొమింటర్న్ పిలుపునిచ్చింది. ఈ విధాన ఫలితంగా 1936లో ఫ్రాన్స్, స్పెయిన్‌లలో ఐక్య సంఘటన ప్రభుత్వాలు ఏర్పడ్డాయి. 1936–38 కాలంలో సోవియట్ యూనియన్‌లో జరిగిన ప్రక్షాళన ప్రభావం కొమింటర్న్‌పై కూడా పడింది. కొందరు కొమింటర్న్ సభ్యులు కూడా ఈ ప్రక్షాళనలో ప్రాణాలు కోల్పోయారు. రెండవ ప్రపంచ యుద్ధం తొలి దశలో కొమింటర్న్ తటస్థ వైఖరిని అవలంబించింది. 1941లో సోవియట్ యూనియన్‌పై జర్మన్ దాడికి తదుపరి కొమింటర్న్ మిత్రరాజ్యాలకు క్రియాశీల మద్దతు పలికింది. 1943లో మారిన పరిస్థితులలో ఒక కేంద్రం నుండి ప్రపంచ కార్మికోద్యమానికి మార్గదర్శకత్వం వహించడం ఆచరణీయం కాదనే ప్రాతిపదికపై, సభ్యదేశాల అంగీకారంతో, కొమింటర్న్ రద్దు చేయబడింది. యుద్ధంలో మిత్ర పక్షాలైన అమెరికా, ఇంగ్లండ్‌ల విశ్వాసాన్ని సోవియట్ యూనియన్ చూరగొనడం కోసం ఈ రద్దు జరిగి ఉండవచ్చుననే అభిప్రాయం కూడా ఉంది.

**14. సోషలిస్టు (సోషల్) రివల్యూషనరీలు :** 1860–70 లలో రష్యాపై గణనీయమైన ప్రభావం నెరిపిన నరోద్నిక్ – పాప్యులిస్టు రాజకీయ ఆలోచనా స్రవంతి స్ఫూర్తితో రైతాంగ విముక్తి ప్రధాన ప్రాతిపదికగా 1902లో సోషలిస్టు రివల్యూషనరీ పార్టీ ఆవిర్భవించింది. ఈ పార్టీ రైతాంగంతోపాటు పారిశ్రామిక కార్మికవర్గ సమస్యలను కూడా పట్టించుకోసాగింది. ఈ పార్టీ ప్రధాన పత్రిక 'రివల్యూషనరీ రష్యా.' ప్రధాన సిద్ధాంత కర్త, నాయకుడు విక్టర్ చెర్నోవ్. బోల్షివిక్కుల సమష్టి వ్యవసాయ కార్యక్రమానికి విరుద్ధంగా ఈ పార్టీ రైతులకు భూమి పంపిణీ వాగ్దానం చేసింది. చిన్న రైతులను పెట్టీ బూర్జువాలుగా కాక శ్రామికులలో భాగంగా పరిగణించేది. చెర్నోవ్ పారిశ్రామిక కార్మిక

వర్గాన్ని అగ్రగామిగా అంగీకరించినప్పటికీ, విప్లవ విజయానికి రైతాంగం కీలకమని భావించేవాడు. తొలి దశలో ఈ పార్టీ కార్యకలాపాలలో ప్రభుత్వ అధికారులను హత్య చేయడం ఒకటిగా ఉండేది. ఇది నరోద్నిక్ వారసత్వం నుండి వచ్చింది. ఈ చర్యల ద్వారా ప్రజలను ధైర్యవంతులుగా చేయవచ్చని, జారిస్టు ప్రభుతాన్ని కొన్ని రాజకీయ రాయితీలు ఇచ్చే దిశగా ఒత్తిడి చేయవచ్చని భావించేవారు. అయితే, వారిలో ఈ పద్ధతులను పూర్తిగా వ్యతిరేకించేవారు కూడా ఉండేవారు. మొదటి ప్రపంచ యుద్ధంలో ఈ పార్టీలో ఎక్కువమంది జారిస్టు ప్రభుత్వానికి మద్దతునిచ్చారు. చెర్నోవ్ నాయకత్వంలోని చిన్న బృందం అంతర్జాతీయ దృక్పథం అవలంబించింది.

ఫిబ్రవరి 1917 విప్లవానంతరం ఈ పార్టీ సోవియట్లలో చురుకుగా పనిచేసింది. ఏప్రిల్ 1917లో లిబరల్ రాజకీయవాదులు, మెన్షివిక్కులు, సోషలిస్టు రివల్యూషనరీల భాగస్వామ్యంతో ఏర్పడిన తాత్కాలిక ప్రభుత్వంలో చెర్నోవ్ వ్యవసాయశాఖా మంత్రిగా ఉన్నాడు. ఆయన ప్రతిపాదించిన రాడికల్ వ్యవసాయ సంస్కరణలు అంగీకరించబడలేదు. జులై 1917లో బోల్షివిక్ తిరుగుబాటు విఫలమైన పిదప చెర్నోవ్ బోల్షివిక్కుల వైపు మొగ్గు చూపాడు. ప్రపంచ యుద్ధం నుండి వెంటనే ఉపసంహరించుకోవడం, భూమి సమస్యను వెంటనే పరిష్కరించడం (భూ పంపిణీ) అనే డిమాండ్లతో ఒక వామపక్ష బృందం ఈ పార్టీలో ఏర్పడింది. అక్టోబరు 25, 1917 (కొత్త కాలండర్ ప్రకారం నవంబరు 7, 1917) విప్లవంలో ఈ వామపక్ష బృందం బోల్షివిక్కులకు మద్దతునిచ్చింది. నవంబరు చివరిలో ఈ వామపక్ష సోషలిస్టు రివల్యూషనరీలు బోల్షివిక్ ప్రభుత్వంలో చేరారు. వారి తరఫున ముగ్గురు కమిస్సార్లు ప్రభుత్వంలో ఉండేవారు. నవంబరులో జరిగిన రాజ్యాంగ సభ ఎన్నికలలో సోషలిస్టు రివల్యూషనరీ పార్టీకి అత్యధిక (58%) ఓట్లు వచ్చాయి. అయితే, వాటిలో ఎన్ని మితవాదులవి, ఎన్ని వామపక్షవాదులవి తెలియదు. ఈ ఎన్నికల పిమ్మట ఈ పార్టీలోని వామపక్ష బృందం బోల్షివిక్కుల ప్రభుత్వంలో చేరడం, సోవియట్లలో బలాబలాలు భిన్నంగా ఉండడంతో, బోల్షివిక్కులు – వామపక్ష సోషలిస్టు రివల్యూషనరీల ప్రభుత్వం ఈ రాజ్యాంగ సభను రద్దు చేసి, ఈ చర్యకు సోవియట్ల మూడవ కాంగ్రెస్ ఆమోదం పొందింది. దాని తరువాత ఈ పార్టీ ప్రాబల్యం తగ్గుముఖం పట్టింది. అయితే, బోల్షివిక్ ప్రభుత్వం జర్మనీతో బ్రెస్ట్ లిటోవ్స్క్ ఒప్పందం కుదుర్చుకోవడానికి, ట్రేడ్ యూనియన్లకు స్వేచ్ఛ లేకపోవడానికి, ఫాక్టరీలపై కార్మికుల నియంత్రణ అమలు చేయకపోవడానికి నిరసనగా ప్రభుత్వం నుండి వామపక్ష సోషలిస్టు రివల్యూషరీలు నిష్క్రమించారు. అంతేకాక, రష్యాలో జర్మన్ రాయబారిని హత్య చేశారు. బోల్షివిక్కులకు వ్యతిరేకంగా మరో విప్లవం తేవడానికి ప్రయత్నించి విఫలమయ్యారు.

ప్రభుత్వం అరెస్టులు, ప్రవాసం, మరణశిక్ష విధించడం లాంటి చర్యలతో ప్రతిస్పందించింది. వీటన్నిటి కారణంగా గతంలోని హింసాయుత పద్ధతులకు వీరిలో కొందరు మళ్ళారు. మితవాద సోషలిస్టు రివల్యూషనరీ పార్టీకి చెందిన ఫాన్ని కాప్లన్ ఆగస్టు 30, 1918న లెనిన్‌పై హత్యాప్రయత్నం చేసింది. ఈ పరిణామాల నేపధ్యంలో సోషలిస్ట రివల్యూషనరీలలో కొందరు విప్లవ ప్రతీఘాత శక్తులతో కలిసి బోల్షివిక్ ప్రభుత్వానికి వ్యతిరేకంగా పోరాడగా, మరికొందరు రెడ్ గార్డ్స్‌తో కలసి విప్లవ ప్రతీఘాత సైన్యానికి వ్యతిరేకంగా పోరాడారు. అనేకమంది వామపక్ష సోషలిస్టు రివల్యూషనరీలు కమ్యూనిస్టు పార్టీలో చేరారు. పార్టీలపై నిషేధం విధించిన పిదప అనేకులు దేశం విడిచి వెళ్ళారు. క్రమేపీ ఈ పార్టీ కనుమరుగయింది. ప్రవాసంలో కొన్ని రాజకీయ ప్రయత్నాలు జరిపినప్పటికీ అవి సఫలీకృతం కాలేదు.

**15. అక్టోబరు సంఘటన :** జినొవీవ్ – కామెనెవ్‌లు మాత్రమే అక్టోబరు 10, 1917న జరిగిన బోల్షివిక్ పార్టీ సెంట్రల్ కమిటీ సమావేశంలో సాయుధ తిరుగుబాటుకి వ్యతిరేకంగా ఓటు చేశారు. అంతేకాక, ఈ నిర్ణయాన్ని బహిర్గతపరుస్తూ బహిరంగ లేఖ అచ్చు వేశారు. లెనిన్ తన "వీలునామా"లో జినొవీవ్, కామెనెవ్‌లపై తన అంచనా తెలియచేసే సందర్భంలో ఈ సంఘటనను ఉల్లేఖించాడు.

**16. నాన్ – బోల్షివిజం (ట్రాట్‌స్కీ) :** 1903లో రష్యన్ సోషల్ డెమొక్రటిక్ పార్టీలో వచ్చిన చీలికలో ట్రాట్‌స్కీ మెన్షివిక్కులవైపు మొగ్గు చూపాడు. లెనిన్‌ని, బోల్షివిక్కులని విమర్శిస్తూ వ్యాసాలు రాశాడు. ఎక్కువ భాగం స్వతంత్ర ధోరణితో ఉన్నప్పటికీ మెన్షివిక్కులకి సన్నిహితంగా ఉండేవాడు. ఈ పరిస్థితి 1917 వరకు సాగింది. ఆగస్టు 1917లో కాని ట్రాట్‌స్కీ బోల్షివిక్ పార్టీలో చేరలేదు. చేరిన వెంటనే ట్రాట్‌స్కీకి పార్టీలో అత్యున్నత స్థాయి కల్పించబడింది. లెనిన్ తన "వీలునామా"లో ట్రాట్‌స్కీని గురించి సరాసరి రాసిన చోట ఈ ప్రస్తావన తీసుకురాకుండా, జినొవీవ్, కామెనెవ్‌ల గురించి రాస్తూ ట్రాట్‌స్కీ నాన్ – బోల్షివిజం గురించి పేర్కొన్నాడు. అది యాదృచ్ఛికం కాదని పేర్కొంటూనే, అదే సమయంలో ఈ నాన్ – బోల్షివిజానికి బాధ్యత వ్యక్తిగతంగా ట్రాట్‌స్కీపై మోపరాదని సూచించాడు.

**17. ప్లెఖనోవ్ :** ప్లెఖనోవ్ రష్యన్ తొలితరం మార్క్సిస్టులలో ప్రముఖులు. 1875లో రైతాంగం, భూ పంపిణీ కేంద్రంగా సోషలిజాన్ని ప్రతిపాదించిన పాప్యులిస్టు ఉద్యమంలో చేరాడు. 1876లో రష్యాలో మొట్టమొదటి రాజకీయ ప్రదర్శన నిర్వాహకులలో ఆయన ఒకడు. పాప్యులిస్టు ఉద్యమంలో ప్రబలంగా ఉన్న రాజకీయ హత్యలు చేసే ధోరణిని

ఆయన వ్యతిరేకించాడు. ఈ అవగాహనను పెంపొందించడానికి ఉద్యమంలో తానొక చీలిక బృందాన్ని ఏర్పాటు చేసి నరోద్నయా ఓల్యా అనే ప్రధాన పాప్యులిస్టు ఉద్యమ సంస్థతో భావ సంఘర్షణ జరిపాడు. ఈ ప్రయత్నంలో విఫలమై 1880లో స్విట్జర్లండ్‌కి ప్రవాసం వెళ్ళాడు. తిరిగి 37 సంవత్సరాల పిమ్మట మాత్రమే రష్యాకు రాగలిగాడు. 1883 నాటికి నిబద్ధ మార్క్సిస్టుగా మారాడు. గ్రామ సమష్టి వ్యవస్థ ఆధారంగా విప్లవాత్మక మార్పు సాధ్యమనే అవగాహనను తిరస్కరించాడు. 1880ల చివరిలో ఏంగిల్స్‌తో వ్యక్తిగత పరిచయం ఏర్పాటు చేసుకున్నాడు. కొందరు మిత్రులతో కలిసి 1883లో ఎమాన్సిపేషన్ ఆఫ్ లేబర్ అనే మార్క్సిస్టు అవగాహననుసరించే రాజకీయ బృందాన్ని ఏర్పాటు చేశాడు. రష్యాలో పెట్టుబడిదారీ విధానం ఆరంభమయిందని, దీని అభివృద్ధి వైరుధ్యాలలోనుంచి సోషలిజం సాధ్యమౌతుందని ఈ బృందం అభిప్రాయ పడింది. స్ట్రువ్, లెనిన్, మార్టోవ్, పొట్రెసవ్ లాంటి మేధావులు ఈ బృందంలో సభ్యులయ్యారు.

ప్లెఖనోవ్ విస్తృతంగా రచనలు చేశాడు. ఆయన రచనలన్నింటిలోకి ప్రధానమైనది 'డెవలప్‌మెంట్ ఆఫ్ మోనిస్ట్ వ్యూ ఆఫ్ హిస్టరీ' (చరిత్ర పట్ల ఏకసత్తావాద అభివృద్ధి). ఈ రచన చరిత్ర పట్ల భౌతికవాద దృష్టిని బలంగా ప్రతిపాదించింది. ఏంగెల్స్ ఈ పుస్తకాన్ని సరైన సమయంలో వచ్చిన రచన అని ప్రశంసించాడు. లెనిన్ ఈ పుస్తకం "ఒకతరం రష్యన్ మార్క్సిస్టులు యావన్మందిని విజ్ఞానవంతుల్ని చేయడంలో తోడ్పడిందని" పేర్కొన్నాడు. 1900లో ప్లెఖనోవ్, ఆక్సెల్‌రాడ్, జాసూలిచ్, లెనిన్, పొట్రెసవ్, మార్టోవ్‌లు కలిసి 'ఇస్క్రా' అనే మార్క్సిస్టు పత్రికను ప్రారంభించారు. ఈ ప్రయత్నం కేంద్ర బిందువుగా వివిధ స్వతంత్ర మార్క్సిస్టు బృందాల కలయికతో రష్యన్ సోషల్ డెమోక్రటిక్ లేబర్ పార్టీ ఏర్పడింది. అయితే, 1903లో జరిగిన దీని రెండవ కాంగ్రెస్‌లోనే ఈ పార్టీ బోల్షివిక్కులు, మెన్షివిక్కులుగా చీలికకు గురయ్యింది. తొలి దశలో ప్లెఖనోవ్ లెనిన్ వాదనలకు మద్దతు పలికినప్పటికీ, వెంటనే సవరించుకున్నాడు. శ్రామిక వర్గ నియంతృత్వానికి ప్రజాస్వామ్యాన్ని లోబరచాలని తాను మొదట వెలిబుచ్చిన అభిప్రాయానికి తరువాత విచారం వ్యక్తం చేశాడు. చివరి వరకు బోల్షివిక్కులను వ్యతిరేకించాడు. చరిత్ర గతి సూత్రాలకు విరుద్ధమైన అవగాహన కలిగి ఉన్నందుకు, వెనుకబడిన రష్యాలో సోషలిస్టు విప్లవం సాధ్యమన్న భావనను ప్రతిపాదిస్తున్నందుకు లెనిన్‌ని తప్పు పట్టాడు. రష్యాలో పెట్టుబడిదారీ అభివృద్ధి దశ ముగిసిన పిదప మాత్రమే సోషలిజం సాధ్యమని నమ్మాడు. మొదటి ప్రపంచ యుద్ధంలో రష్యన్ ప్రభుత్వాన్ని సమర్థించాడు. అందుకు లెనిన్ ఈయనను 'సోషల్ పేట్రియట్' అని విమర్శించాడు. 1917 ఫిబ్రవరి విప్లవం పిమ్మట యెదిన్‌స్త్వ అనే చిన్న బృందానికి నాయకత్వం వహించాడు. అదే పేరుతో ఒక పత్రిక కూడా నడిపాడు. లెనిన్

ఏప్రిల్ ప్రతిపాదనలని (ఏప్రిల్ థీసెస్) 'సంధి ప్రేలాపన'లని పిలిచాడు. లెనిన్‌ని 'విప్లవ పరుసవేది' అని విమర్శించాడు. అక్టోబరు విప్లవం విజయవంతమైన పిమ్మట దాని పట్ల వ్యతిరేకత మూలంగా దేశం విడిచిపెట్టి వెళ్ళిపోయాడు. ఫిన్లాండ్‌లో మే 30, 1918న మరణించాడు. లెనిన్‌తో ఆయన తీవ్రంగా విభేదించినప్పటికీ, లెనిన్ ఆయన రచనల ప్రచురణను ప్రోత్సహించాడు. కమ్యూనిస్టులు ఆయన రచనలు చదివి తీరాలన్నాడు.



# లెనిన్ అంతిమ పోరాటం

లెనిన్ తన జీవితపు చివరి రెండు సంవత్సరాలలో చేసిన ఆలోచనలు, రూపొందించిన ప్రణాళికలు, వాటి అమలుకై చేసిన కృషిని సానుకూల విమర్శనాత్మక దృష్టితో ఈ పుస్తకంలో మోషే లెవిన్ పరిశీలించాడు. 1968లో మొదటి ఆంగ్ల ప్రచురణ వెలువడిన వెంటనే ఈ రచనను సప్రమాణ గ్రంథం (classic)గా పరిగణించారు. తన అంత్యదశలో లెనిన్ చేసిన అంతర్, బహిర్ యుద్ధారావాన్ని ఈ పుస్తకం ఆవిష్కరిస్తుంది. తీవ్ర సంక్షోభంలో కూరుకుపోయిన విప్లవాన్ని, పార్టీని, సోవియట్ రాజ్యాన్ని కాపాడుకోవడానికి లెనిన్ చేసిన పోరాటాన్ని ఈ రచన కళ్ళకు కట్టినట్లు చూపిస్తుంది. చరిత్ర క్రమానుగతిని అర్థం చేసుకోవడంలో ఈ పుస్తకం తోడ్పడుతుంది.

సోషలిజం భవిష్యత్తు కోసం రష్యన్ విప్లవం తీరుతెన్నులను, దాని వైఫల్యానికి గల కారణాలను లోతుగా అర్థం చేసుకోవడం అవసరం. అందుకు ఈ పుస్తకం దోహదం చేస్తుంది. లెనిన్‌ని నూతన కోణంలో అధ్యయనం చేయడానికి ఈ ప్రచురణ ఒక సందర్భంగా ఉపయోగపడవచ్చు. ఈ అధ్యయనం లెనిన్ ఆలోచనలను, కృషిని, వారసత్వాన్ని పునః సమీక్ష చేసే దిశగా సాగాల్సిన అవసరం ఉంది. లెనిన్ భావాలు, కృషికి ఉన్న వర్తమాన అనుగుణ్యతను మదింపు వేయాలి. భవిష్యత్ సోషలిజానికి లెనిన్ ప్రాసంగికత ఏ మేరకు అనే అంశంపై కూడా ఆలోచన సాగాలి. ఈ కృషికి తెలుగు సమాజంలో ఈ పుస్తకం ఒక సందర్భం కావచ్చు.

ఫ్రెంచి నుండి ఎ.యం. షెరిడాన్ స్మిత్ చేసిన ఆంగ్లానువాదాన్ని రావెల సాంబశివరావు గారు తెలుగులోకి అనువదించారు. ఆచార్య శోభన్ లాల్ దత్తా గుప్తా ఈ రచనకు “పరిచయం” రాశారు.




LENIN'S LAST STRUGGLE

*Moshe Lewin*